శైవప్రచారిణీ గ్రంథమాల. ౧౫.

# ధర్మ సంగ్రహే

# ఆహ్నిక కాండః



ఇది

బ్ర॥ శ్రీ॥ ముదిగొండ నాగలింగ శాస్త్రి గారిచే

రచింపఁబడి

బ్ర॥ శ్రీ॥ విద్వాన్. ముదిగొండ వీరేశలింగ శాస్త్రి గారిచే

ముద్రాక్షర స్ఖాలిత్య రహితముగాఁబరిశోధింపఁబడి

బ్ర॥ శ్రీ॥ కోడిమేల రాజలింగారాధ్యుల వారిచే

శైవప్రచారిణీ ముద్రాక్షరశాల యందు

ముద్రింపఁ బడినది.

౫౦౦

1928

వెల. 1-4-0

## విషయసూచిక.



### ధర్మసంగ్రహే,
### ఆహ్నిక కాండే, ప్రథమభాగః.

| విషయములు. | పుట. |
|---|---|


ప్రథమ భాగః.

సమాప్తః.





శ్రీ

శివాయ గురవేనమః

## శ్రీనాగలింగారాధ్యయే ధర్మసంగ్రహే, ఆహ్నిక కాండః. ప్రారభ్యతే.

శ్లో. మంగళం దిశతు విఘ్ననాయకో మంగళం దిశతు శక్తి నాయకః।
మంగళం దిశతు మే సదాశివా మంగళం దిశతు మే సదాశివః.

శ్లో. యోవిశ్వప్రభవో యమేతినిఖిలం యేనేద మారక్షితం
యస్మై చ ప్రణత యోనమోవిదధతే యస్మాత్పరం నేష్యతే।
భూమ్నాయస్య పరిభ్రిమత్యనుకలం బ్రహ్మాండ భాండావళి
ర్యస్మిం త్సర్వమపి ప్రతిష్ఠితమిదం తస్మై నమశ్శంభవే.

శ్లో. భారద్వాజ కులోద్భూత శ్రీమదుద్భటవంశజః।
జ్వాలాంబికా ఘోర నాథదాం పత్యా కలితోదయః॥
శ్రీమద్వీరేశ్వ రారాధ్య చరణాబ్జ మధువ్రతః॥
త్రైలింగో నాగలింగాఖ్యస్స్వకృతౌ ధర్మ సంగ్రహే॥
కాండమాహ్నిక నామానం ఏక్తి శ్రుత్యాగ మోక్తిభిః
శైవదీక్షా విశిష్టానా మిష్టలింగ భృతాంముదే.

కారణోత్తరే॥ బ్రాహ్మేముహూర్తే ఉత్థితం బుధ్య మానేన గాత్మజే నేత్రయోః స్పర్శయన్నిష్టలింగం మామనుసం స్మరేదితి ॥ త

---

ఈశ్వర ప్రార్థనము.

ప్రతిదినము బ్రాహ్మ ముహూర్తమున మేల్కొనగనే యిష్టలింగమును కనుల కద్దుకొనుచు నీశ్వరు స్మరింప వలయునని కారణోత్తరమున జెప్పబడెను. బ్రాహ్మ

థామను॥ బ్రాహ్మేముహూర్తే బుధ్యేత ధర్మార్థా వనుచిన్తయేత్। కా
యక్లేశాంశ్చతన్మూలాన్వేద తత్త్వార్థ మేవచ॥ అత్ర వేద తత్త్వార్థః పర
మాత్మా। సచవ్యాసే నస్ఫుటీకృతః। బ్రాహ్మేముహూర్తే ఉత్థాయ ధ
ర్మమర్థంచ చింతయేత్। కాయక్లేశం తదుద్భూతం ధ్యాయీత మనసే
శ్వరమితి॥ ఈశ్వరస్సర్వ ఈశానఇతి కోశతస్సైనైకరూఢా దీశ్వరశబ్దాత్
తథా- స్మృత్యర్థ సారేపి॥ ప్రభాత ఉత్థాయేష్ట దైవతం మనసా నత్వా
తదహః కృత్యం స్మరేదితి॥ ఇష్టదైవతం॥ ఇష్టస్యయాగాదేః, దైవతం॥ అ
ధిదైవతం, ఈశానం, శ్రు॥ ఆవో రాజాన మధ్వరస్యరుద్రం, రుద్రో౽గ్ని
స్విష్టకృత్ ఇత్యాది శ్రుతిభ్యః.

అత్ర బ్రాహ్మో నామ సూర్యోద యాత్ప్రాక్ అర్ధ ప్రహరే
ద్వౌముహూర్తౌ, తత్రాద్యో బ్రహ్మః, ద్వితీయో రౌద్రః, బ్రాహ్మే
ముహూర్తే వర్జ్యానప్యాహ॥ బృహన్మనుః॥ చత్వారి మాని కర్మాణి సం
ధ్యాయాం పరివర్జయేత్॥ ఆహారం మైథునం నిద్రాం స్వాధ్యాయంచ
తథైవచ। ఆహారాజ్జాయతే వ్యాధిః గర్భవేధశ్చ మైథునాత్। నిద్రాత్రో
జాయతే౽లక్ష్మీ స్స్వాధ్యాయా దాయుషః క్షయః। ఇతి. అథమను

---

ముహూర్తమున నిదురలేచి ధర్మార్థములను వానిమూలముగ గలుగు కాయక్లేశములను నా
లోచించుచు వేదతత్త్వార్థము ధ్యానింప వలయునని మనువు వచించెను. వేదతత్త్వార్థమ
నీశ్వరుండేయని వ్యాసుండు స్పష్టీకరించెను. స్మృత్యర్థసారమునందును ప్రాతఃకాల
మున నిదురలేచి యిష్టదైవతమును మనసున దలచికొని నాటిపవలి కృత్యము నాలోచింప
వలయు, నని యున్నది. ఇష్టమన యాగాదులు వానికి దైవతము పరమేశ్వరుండు గాన ఇ
ష్టదైవత మన పరమేశ్వరుండే గాని వారివారి కిష్టమైన దైవతమని యర్థము కాదు. య
జ్ఞమునకు రుద్రుండే యధిపతియని శ్రుతులు చెప్పుచున్నవి.

సూర్యు డుదయించుటకు ముందటి యర్ధయామమున రెండుముహూర్తము
లు గలవు. వానిలో మొదటిది బ్రాహ్మముహూర్తమనియు, రెండవది రౌద్రముహూ
ర్తమనియుం జెప్పబడు. అట్టి బ్రాహ్మముహూర్తమున, ఆహారము, స్త్రీసంగమము
నిద్ర, వేదము చదువుట [illegible] పనులు చేయఁగూడదు. అప్పుడాహారముచే,

గపి॥ తంచేదభ్యుది యాత్సూర్యశ్శయానం కామకారతః। నిర్మోచేజ్జా భ్యను జ్ఞానాజ్జ పన్నుపవసేద్దినం। సూక్త్యేణ హ్యాభినిర్ముక్తశ్శయానో భ్యుది తశ్చయః॥ ప్రాయశ్చిత్తమ కుర్వాణో యుక్తస్స్యాన్మహాతైనసా ఇతి॥ అత్ర కామకారతః, నతురోగాదినా అవశః॥ అభ్యనుజ్ఞానాత్ జ్ఞాత్వా ఉపేక్షణాత్, ఏవం వచనా దశక్త్యజ్ఞానాదిషు ప్రాయశ్చిత్తాభా వస్సూచితః। అన్యదాతు ప్రాయశ్చిత్తాకరణే మహాన్ ప్రత్యవాయ ఇత్యర్థః.

అథ దర్శనీ యాన్య దర్శనీ యానిచ దర్శయతి, కాత్యాయనః॥ శ్రోత్రియం సుభ గంగాంచ హ్యాగ్ని మగ్నిచితం తథా। ప్రాతరుత్థాయయః పశ్యేదా పద్భ్యస్స ప్రముచ్యతే॥ పాపిష్ఠం దుర్భగం మర్త్యం నగ్నముత్కృత్త నాసికం। ప్రాతరుత్థాయ యః పశ్యేత్తత్కలేరుపలక్షణం॥ ఇతి, అత్ర నగ్నపదం బాలవ్యతిరిక్తవిషయం॥ తథా॥ కారణాన్తరే॥ వ్రతినం స్త్రిణం దాంతం భక్తం లింగాంగ సంగినం। ప్రాతః కాలేతు యః పశ్యేత్స ఈప్సితమ వాప్నుయాత్॥ పాషణ్డం పతితం క్రూరమ భక్తం దేవనిందకం॥ ప్రాతరుత్థాయ యః పశ్యేత్సోని ష్టం సమవాప్నుయాత్॥ ఇతి.

## అథబహిర్వ్యహారః.

అత్రవ్యాసః॥ ప్రతిశ్రయా ద్దక్షిణ పశ్చిమేన. క్షిప్రంగత్వా

---

సినవ్యాధిసంభవించు. స్త్రీసంగమువలన గర్భపాతము గలుగు.నిదురించిన శ్వోతా దేవిపతించు. వేదము జదివిన నాయువు క్షీణించునని బృహస్పతివు వచించెను.

అట్టిసమయమున నారోగ్యవంతుడయ్యు దెలిసియుండి నిదురలేవకుండినయెడపాపము వచ్చునుగాన ప్రాయశ్చిత్తము చేసికొనవలయునని మనువు పలికెను. ఇట్లనుటచే రోగాదులవలనగాని దెలియమినిగాని యపుడు నిదుర లేవకుండినను దోషములేదని గ్రహింపవలయు.

ప్రాతఃకాలమున నిదురలేవగానె వేదము జదివిన వారినిని, సుందరిని, గోవును. అగ్నిని, అగ్నిచయనము చేసిన వానిని చూచిన వాని కేయాపదయు గలుగనేరదు. అట్లుగాక, పాపాత్ముని, కురూపిని, దిగంబరుని, ముక్కుడి పానిని గాందుసెడ నాకు కలహ

క్షేప మాత్రంశరస్య। కుర్యాత్పురీషం హిశిరోఽవకుంఠ్య నచ స్పృశే జ్జాతుశిఖః కరేణ॥ ప్రతిశ్రయోగృహం॥ మనురపి॥ దూరాదావస థాన్మూత్రందూరాత్పాదావనే జనం। ఉచ్ఛిష్టాంబు నిషేకంచ దూరాదే వస మాచరేత్॥ ఇతి. కాత్యాయనః॥ శిరఃప్రావృత్య కుర్వీత శకృన్మూత్ర విసర్జనం। అయజ్ఞియై రనార్ద్రైశ్చ తృణై రాచ్ఛాద్య మేదినీమితి: తృణగ్రహణం కాష్ఠాదేరప్యు పలక్షణం॥ మనుః॥ మూత్రోచ్చార స ముత్సర్గం దివాకుర్యాదు దఙ్ముఖః। దక్షిణాభి ముఖోరాత్రౌ పూర్వసం ధ్యయథాదివా॥ ఛాయాయామంధ కారేవా రాత్రావహని వాద్విజః। యథాసుఖ ముఖఃకుర్యాత్ప్రాణ బాధా భయేషుచ॥ ఇతి॥ అంగిరాః॥ యజ్ఞోపవీతం కర్ణేచ దక్షిణేతు నిధాయచ॥ కుర్యాన్మూత్ర పురీషేతు శౌచదేశే సమాహితః॥ ఇతిదక్షిణే కర్ణేనిధాన మేకవస్త్ర విషయం॥ యద్యేకవస్త్ర స్స్యాద్విప్రః కర్ణేకృత్వో పవీతకం। మూత్రోత్సర్గం స దాకుర్యాదితిసాంఖ్యాయనోఽబ్రవీత్॥అంగిరాఃకృత్వాయజ్ఞోపవీతంతు

---

ము వచ్చునని కాత్యాయనుఁడు పలికెను. దిగంబరులవ బాలుర కంటె నితరులని యొఱుంగునది. వృత్తస్థుని, అన్నపత్రము పెట్టు వానిని, ఇంద్రియ నిగ్రహము గలవానిని, భక్తుని, లింగాంగ సంయోగము గలవానిని ప్రాతః కాలమునఁ జూచిన వాడు ఇష్టసిద్ధి నొందును. వేదబాహ్యుని, పతితుని, క్రూరుని, భక్తి రహితుని, దేవనిందాపరుని జూచినవాఁడు తప్ప కయనిష్టమును పొందునని కారణోత్తరమున గలదు.

మలవ్యాయమున కేగుట.

ఇలువిడిచి బాణము పోవు నంతదూరము నైరృతి దిశకరిగి, తలకు గుడ్డచుట్టుకొని పురీషము విడువవలయు. అపుడు చేతితో తల తడవగాదు. అనివ్యాసుఁడు వచించెను. మల మూత్రములు విడుచుట, కాళ్లు కడుగుట, ఎంగిలినీరు పోయుట యనునది యింటికి దూరముగా చేయవలయునని మనువు పలికెను.

తలకు గుడ్డ చుట్టుకొని, యజ్ఞమున కుపయోగపడని పొడిగడ్డి, పుడకలు మొన్నగు వానిచే నేలగప్పి మలమూత్రముల విడువ వలయునని కాత్యాయనుఁడు చెప్పెను. పగటియందు నుత్తరాభి ముఖుఁడును, రాత్రియందు దక్షిణాభి ముఖుఁడును, రెండుసంధ్య

పృష్ఠతః కంఠలంబితం। విణ్మూత్రంతు గృహీ కుర్యాద్య ద్వాకర్ణే స
మాహితః॥ ఇతి, ఆపస్తంబః॥ శిరః ప్రావృత్యమూత్రపురీషే కుర్యా ది
తి, శాంఖాయనీయ గృహ్యపరిశిష్టేపి॥ యజ్ఞోపవీత శివ సూత్రే పృష్ఠతః
కంఠలంబితే। కృత్వాప్రావృత్య చశిరో విణ్మూత్రోత్సర్గం కుర్యా దితి॥
వైఖానసః॥ అనుదకమూత్ర పురీష కరణే సచేలస్నానమితి. భారద్వాజ
మలమూత్రం చరేద్యస్తు విస్మృత్యై వోపవీతధృక్। తత్సూత్రంతు పరి
త్యజ్య దద్యాదన్యత్తు నర్పణం॥ అంగిరాః॥ స్నానంకృత్వార్ద్రవాసా
స్తు విణ్మూత్రం కురుతే యది। ప్రాణాయామత్రయం కృత్వా పునస్స్నా
నేన శుధ్యతీతి॥ మనుః॥ నమూత్రం పథికుర్వీత నభస్మని నగోవ్రజే। వాయ్వ
గ్ని విప్రమాదిత్య మపః పశ్యంస్తథైవగాః। నకదాచన కుర్వీత విణ్మూ
త్రస్యవిసర్జనం।నపాలకృష్టేనజలేనబిలేనచపర్వతే।నజీర్ణదేవాయతనేనవ
ల్మీకే కదాచన। నసత్త్వేషు నగర్తేషు నగచ్ఛన్నచ సంస్థితః। నన దీతీర
మాసాద్య నచపర్వత మస్తకే। ప్రత్యగ్నిం ప్రతి సూర్యంచ ప్రతి సో

---

లయందు నుత్తరాభి ముఖుఁడునై మలమూత్రముల విడువ వలయు. నీడయందును, చీక
యందును, ప్రాణసంకటము నందును, భయము కలిగి యున్న పుడును ఏది శకుమరలినను
దోషము లేదని మనువు వచించెను. ఒంటివస్త్రము నుధరించి యున్నపుడు జందెమును కు
డిచెవి యందుంచికొని మలమూత్రముల విడువ వలయు. యజ్ఞోపవీతమును మెడకు వెను
కవైపున వ్రేలు నట్లు నుంచికొని మలమూత్రముల విడువ వలయునని యంగిరుఁడు చెప్పెను.
యజ్ఞోపవీతమును, శివసూత్రము ను మెడకు వెనుక వైపున వ్రేలు నట్లు ధరించి మలమూ
త్రముల విడువ నగునని శాంఖ్య నీయగృహ్య పరిశిష్టమునఁ జెప్పఁ బడియున్నది. ఉదక
పాత్రలేక మలమూత్రముల విడుచు నెడ సచేల స్నానము చేయ వలయునని వైఖానసి ప
లికెను. జందెమును నివీతము గా తీసికొనక యుపవీతము గానే యునిచికొని మలమూత్రము
ల విడుచు నెడ నా జందెమును తీసివైచి క్రొత్త జందెమును ధరించవలయును. స్నానముచే
సి తడివస్త్రముతో మలమూత్రముల విడుచు నెడ తిరుగ స్నానముచేసి మూమ్మారు ప్రా
ణాయామము చేయు నెడ పరిశుద్ధుడగునని యంగిరుఁడు చెప్పెను. మార్గమునందు గాని,
భస్మమునందు గాని, గోవుల నడుమ గాని మలమూత్రముల విడువఁ జనదు. వాయువున క
గ్నికి, సూర్యునకు, గోవునకు, జలమునకు నెదురుగ గాని, దున్నిన నేలయందు గాని, జ

మాదితం ద్విజః। ప్రతిగాం ప్రతిసంధ్యాంచ ప్రజ్ఞానశ్యతి మేహతః॥ ఇతి.

### అథశౌచవిధిః.

దక్షః॥ తీర్థేశౌచం నకుర్వీత కుర్వీతోద్ధృత్య వారిణా। మృత్తికా వారిచై వాస్య శౌచాయ పరిచారకా ఇతి॥ సిద్ధమృత్తికా మాహాశ్వలాయనః॥ శౌచదేశేతు సాగ్రాహ్యా శర్కరాశ్మ వివర్జితా। నకృష్టాన్నచ వల్మీకాత్పాం సుత్రోనచ కర్దమాత్। నమార్గాన్నో షరాచ్చైవ శౌచశిష్టాత్పరస్యచ। ఏతాంస్తు వర్జయే న్నిత్యాం వృథాశౌచంహితత్కృతమితి॥ గ్రాహ్యా మృత్తికా ఆహ॥ ఆహాజ్జల మధ్యాత్తు పరత్రాంమణిబంధనాదితి॥ యత్ర ఉక్తలక్షణా మృత్తికా నలభ్యతే తత్రశౌచం మనురాహ॥ యస్మిన్దేశేచ యత్తోయం యాచయత్రైవ మృత్తికా। సైవ తత్ర ప్రశస్తాస్యా త్తథాశౌచం విధీయత ఇతి॥

---

లము నందుగాని, బిలము నందుగాని పర్వతము మీదగాని, పాడు గుడియందు గాని, పుట్టయందుగాని, మృగములలో గాని, గుంటలలో గాని, నడచుచుగాని, నిలుచుండి గాని, నదియొద్దున గాని, పర్వతాగ్రమున గాని, సూర్యచంద్రాదులకు విప్రులకు నెదురుగ గానిమలమూత్రముల విడువఁగూడదు. అట్లు విడుచునెడ బుద్ధి నశించునని మనువు వచించెను.

### శౌచవిధి.

పాత్రముతో జలము గ్రహించి శుద్ధిచేసి కొనవలయును గాని తటాకాదులయందేప్రవేశించి నాదుల జరుపుకొనరాదు. మృత్తిక, జలము ఈరెండును శౌచము నకు సాధకములైయున్నవి. పరిశుద్ధమగు చోట పలుగు రాళ్లు మున్నగునవి లేని మృత్తికను గ్రహించవలయు దున్నిననేల నుండిగాని, పుట్టనుండిగాని, దువ్వనుండి గాని,బురదనుండిగాని,దారిలోనగాని, చౌటనేలనుగాని వేఱొకఁడు శుద్ధిచేసి కొనగా మిగిలినదానినుండిగాని మృత్తికను గ్రహింపఁ గూడదు. మణికట్టు కన్నలోతుగల నీటినడుమనుండి మృత్తిక గ్రహింప వలయు. విధ్యుక్తమగు మృత్తిక దొరకని యెడ ఏదేశము నందే విధమగు మృత్తిక, జలముల భించునో అవియే ప్రశస్తమైనవి గాన వానితోడనే శుద్ధి చేసికొన వగునని మనువు వచించెను.

### మృత్సంఖ్యా.

మృత్సంఖ్యా మాహవసిష్ఠః॥ పంచాపానే దశైకస్మిన్నుభయోస్సప్త మృత్తికాః। ఉభయోః పాదయోస్సప్త లింగే ద్వేపరి కీర్తితాః॥ ఇతి. ఏవముక్త శౌచేపి గంధలేపోన నశ్యతి చేత్తత్రి ఉక్తసంఖ్యాతోప్యధిక సంఖ్యాయా అపినవిరోధ ఇత్యాహ॥ మనుః॥ విణ్మూత్రయోస్సముత్సర్గే మృద్వార్యాద్యైవ మర్థవత్। యావన్న సిద్ధాభూయాస్తాం గంధలేపశ్చ తత్కృతః॥ తావన్మృద్వారి చాదేయం సర్వాసు ద్రవ్యశుద్ధిషు॥ దేవలోఽపి॥ యావత్తు శుద్ధిర్మన్యేత తావచ్ఛుద్ధిర్విధీయతాం। ప్రమాణాం శౌచ సంఖ్యాయా నశిష్టైరుపదిశ్యత ఇతి॥ శౌచక్రమమాహ వ్యాసః॥ విడ్సా చం ప్రథమం కుర్యాన్మూత్రశౌచమతః పరం। పాదశౌచం తతః కుర్యాత్కరశౌచమతః పరమితి॥ ఆపస్తంబః॥ అహ్నిశౌచంతు యత్ప్రోక్తం నిశ్యర్ధం తత ఉచ్యతే। పథిపాదంతు విజ్ఞేయ మార్తా కుర్యాద్యథా బలమితి॥ బోధాయనః॥ దేశకాలౌ తథాత్మానం ద్రవ్యం ద్రవ్యప్రయోజనం। ఉపపత్తి మవస్థాంచ జ్ఞాత్వాశౌచం ప్రకల్పయేత్॥ ఇతి॥ శరీరమల శౌచంచ వక్తుం శరీరమల మాహ మనుః॥ ఊర్ధ్వం నాభేర్యాని ఖాని తాని మేధ్యాని సర్వశః। యాన్యధస్తాన్యమేధ్యాని దేహాచ్చైవ మలోద్ధృతాః॥ వసాశుక్రమసృఙ్మజ్జామూత్ర విట్కర్ణ విణ్ణఖాః। శ్లేష్మాశ్రు పూతికా స్వేదో ద్వాదశైతే నృణాం

---

### మృత్తికాసంఖ్య.

మృత్తికతో నైదుమార్లు గుదమును, పదిమారు లెడమచేతిని, నేడుమార్లు రెండు చేతులను, ఏడుమార్లు పాదములను, రెండుమార్లు శేఫమ్మును తోమి కడుగ వలయుననిమనువు వక్కాణించెను. ఇట్లు చేసికొనియును వాసన పోనియెడ నింకన్ను నెక్కుడుగఁజేసికొనినను బాధకములేదు. వాసనపోవు వఱకు శుద్ధిచేసికొనవలయుననియే శాస్త్రకర్తల యభిప్రాయము. మొదట మలశుద్ధియు, పిమ్మట మూత్రశుద్ధియు, నవ్వల పాదశుద్ధియు, పదంపడి కరశుద్ధియు చేసికొన వలయునని వ్యాసుఁడు వచించెను. శౌచవిధి పగలుచెప్పినదానిలో రాత్రిపూట సగమే చాలును. దారిలో నాలవ పాలును రోగమువచ్చినపుడు

మలా ఇతి. శ్రుతిరపి॥ ఊర్ధ్వం వై పురుషస్య నాభ్యా మేధ్య మవాచీనమ
మేధ్యమితి॥ స్వీయానా మేతేషాం మలానాం స్పర్శేసతి యథా యో
గ్యా మృజ్జలాభ్యాం శుద్ధి రిత్యాహ మనుః॥ పరకీయ మల స్పర్శ నేవి
శేష మాహ దేవలః॥ మానుషాస్థి వసావిష్టా స్వేదం విణ్మూత్ర రేతసీ।
మజ్జాంచ శోణితం వాపి పరస్యయది సంస్పృశేత్। స్నాత్వా విమృజ్య
లే పాదౌ నాచమ్య సశుచిర్భవేత్। తాన్యేవం స్వాని సంస్పృశ్య పూత
స్స్యాత్పరి మార్జనాదితి. ఏవముక్త శౌచేపి యస్య భావ శుద్ధిర్నాస్తిత
స్యా శుద్ధిరే వేత్యాహ దక్షః॥ శౌచంతు ద్వివిధం ప్రోక్తం బాహ్యమా
భ్యంతరం తథా। మృజ్జలాభ్యాం స్మృతం బాహ్యం భావ శుద్ధిస్తథాం
తరం॥ శౌచంతు పరమం బాహ్యాంతరాశ్చాభ్యంతరం పరం। ఉభాభ్యాం
చ శుచిర్యస్తు సశుచిర్నేత రస్స్మృతః॥ ఇతి. వ్యాఘ్రపాదః॥ గంగా తో
యేన కృత్స్నేన మృద్భారైశ్చన గోపమైః॥ ఆమృత్యోరాచ రేచ్ఛౌచం
భావదుష్టోన శుధ్యతీతి.

---

యథాశక్తిగను నాచరింప వలయు. దేశము, కాలము, పాత్రము, ద్రవ్యము, దానిప్రయో
జనము, వీలు, దశయును వానినాలోచించి శౌచవిధి నాచరించు కొనవలయునని బోధాయ
నుడు పలికెను. శరీర మలశుద్ధి చెప్పుటకు మొదట శరీర మలములను మనువు వచించె
ను. నాభిస్థాన మునకు పైభాగమున నున్నయింద్రియ ములుపరిశుద్ధములైనవి. దానిదిగువ
నున్నవి యపరిశుద్ధములు. మలమువిడిచిన యింద్రియములును నపరిశుద్ధములు. వసశుక్ర
ము, నెత్తురు, మజ్జ, మూత్రము, మలము, గుబిలి, గోళ్లు, కఫము, కన్నీరు, పుసి, చెమ
ట అను పన్నెండు మలములని చెప్పబడును తనసంబంధములైన యీమలములనుస్పృశించునె
డ తగునట్లు మృజ్జలము తో శుద్ధిచేసి కొనవలెను. పరకీయ మలములను తాకినను వా
ని గడిగికొని స్నానముచేసి యాచమనము చేసిన గాని శుద్ధిపొంద నేరడు చెప్పినట్లు
శుద్ధిచేసికొనినను చాలునని మనసున తృప్తి లేనివాని కెన్నటికి శుద్ధి కలుగనేరదని దక్షు
డు వచించెను. పర్వత తుల్యమగు మృత్తికతోడను, సమస్తమగు గంగోదకము తో
డను చనిపోవువరకు శుద్ధిచేసికొనినను చిత్తశుద్ధి లేనివాడు శుద్ధిపొంద నేరడని వ్యా
ఘ్రపాదుడు పలికెను.

### శౌచాకరణే ప్రత్యవాయః.

శౌచాకరణే ప్రత్యవాయో హారీతేనదర్శితః॥ స్నానందానం తథాధ్యానం మంత్రకర్మ విధిక్రియాః। మంగళాచార శాస్త్రాణి శౌచభ్రష్టస్య నిష్ఫలాః॥ ఇతి. బోధాయనః॥ శౌచే యత్నస్సదా కార్యశ్శౌచమూలాద్విజస్మృతాః శౌచాచార విహీనస్య సమస్తా నిష్ఫలాః క్రియాః॥ అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోపివా। యస్స్మరేద్వై విరూపాక్షం సబాహ్యాభ్యంతర శ్శుచిరితి.

### అథగండూష విధిః.

అత్రపరాశరః॥ కృత్వాశౌచం చ ప్రక్షాళ్య పాదౌహస్తౌచ మృజ్జలైః। సుబద్ధ శిఖకచ్ఛస్తు గండూషాచమనంచరేత్॥ విప్రస్య దక్షిణేభాగే దేవాస్తిష్ఠన్తి సర్వదా। ఆసీనశ్చైవ గండూషాన్వామ పార్శ్వే విసర్జయేత్। మూత్రేపురీషే భుక్త్యన్తే తదైవాన్యస్య భక్షణే॥ ఇతి. స్మృత్యంతరే॥ మూత్రేపురీషే భుక్తాన్తే తథైవద్విజ ధావనే।చ

---

### శుద్ధిచేసికొననిచో ప్రత్యవాయము.

శౌచము లేనివానికి, స్నానము దానము, ధ్యానము, మంత్రము, విహితకర్మములు, మంగళాచారము, శాస్త్రములు సర్వము నిష్ఫలములగు నని హారీతుఁడు చెప్పెను. శౌచాచారము లేనివానికి సమస్తక్రియలు నిష్ఫలములుగాన యత్నముతో శుద్ధిచేసికొనవలయు. అపవిత్రుఁడు గాని, పవిత్రుఁడుగాని ఏవిధమగు దశయందున్న వాఁడు గాని పరమేశ్వరుని స్మరించు నెడ లోనను వెలుపలను పరిశుద్ధుఁ డగు నని బోధాయనుఁడు వచించెను.

### గండూషవిధి.

మృత్తికచేతను,జలముచేతను కాళ్లుచేతులు గడిగికొని సిగముడి వైచుకొని జలమును పుక్కిలించి వేయవలయు. విప్రుని కుడివైపున దేవతలుందురుగాన గూర్చుండి ఎడమవైపున జలము పుక్కిలించి వేయవలయు. మూత్రమున కేగునపుడు నాలుగుమార్లును, పురీషమున కరిగినపు డెనిమిది మార్లును, భోజనాంతమున పండ్రెండు మార్లును, దంతధావనము చేసికొనినప్పుడు పదునారు మార్లును జలము పుక్కిలించి వేయవలయు. నీరుపుక్కి

తురప్త ద్విపద్ద్వస్త్వ దూషై శ్శుద్ధి ష్యతే॥ శాతప॥ ౧దూష స్యార్ధ సమమే తర్జన్యా వక్త్ర చాలనం। కరోతి యదిమూఢాత్మా రౌరవాస రకంవ్రజేదితి.

## అథాచమన విధిః.

ఆచమనవిధౌ పరాశరః॥ కృత్వాథ శౌచం ప్రక్షాళ్యపాదౌ హ స్తౌచ మృజ్జలైః। కృత్వోపవీతం సవ్యాంసే వాఙ్మనః కాయసంయుతః నిబద్ధశిఖ కచ్ఛస్తు ద్విజఆచ మసంచ రేదితి॥ యాజ్ఞవల్క్యః॥ అంత ర్జాను శ్శుచౌదేశే ఉపవిష్ట ఉదఙ్ముఖః। ప్రాగ్వాబ్రాహ్మేణ తీర్థేనద్విజో నిత్యముప స్పృశేదితి॥ వ్యాసః॥ గోకర్ణా కృతి హస్తేన మాష మగ్నజ లంపిబేత్। తన్న్యూనమధికం పీత్వాసురాపాన సమంభవేదితి॥ విప్రా దీనాం విశేషమాహయాజ్ఞ వల్క్యః॥ హృత్కంఠతాలుగాభిస్తు యథా సంఖ్యం ద్విజాతయః॥ శుద్ధ్యేరన్ స్త్రీచశూద్రాశ్చ సకృత్స్పృష్టాభి రం తతః॥ సకృదేవ తాల్వంతేన స్పృష్టాభిరద్భి రిత్యర్థః॥ మనుః॥ అనుష్ణాభి రఫేనాభి రద్భి స్తీర్థై స్తుధర్మవిత్। శౌచేప్సు స్సర్వదాచామేదేకాన్తే

---

లించి వేయునప్పుడు చూపుడు వ్రేలితో నోరు శోధించుకొన గూడదు.

### ఆచమనవిధి.

కాళ్లు చేతులు గడిగి కొని జందెము నుపవీతముగా ధరించి వాఙ్మనః కాయ ములనియమించి సిగముడి వైచుకొని యాచమనము చేయవలయు. పవిత్రమగుచోటతూ ర్పుదిక్కునకు గాని యుత్తరపుదిక్కునకుగాని యభిముఖుడై గూర్చుండి చేతులు మో కాళ్ల లోపల నునిచికొని బ్రాహ్మ తీర్థమున నాచమనము చేయవలయు. చేతినావు చెవి వలె ముడిచి మినుపగింజ మునుగు నంత జలము నాచమనము చేయవలయు. అంతకెక్కు వగాని తక్కువ గాని జలమును గ్రహింపగూడదు. బ్రాహ్మణు లాచమనము చేయున పుడు జలము హృదయము వఱకు పోవలయును, క్షత్రియులు కుత్తుక వఱకు పోవునట్లు వైశ్యులు దవడలకు దగులునట్లు నాచమనము చేయవలయు. స్త్రీశూద్రులు పెదవులంత గులు నంత మాత్రము జలమును ఆచమనము చేసిన జాలును. కాచనిది, నురుగు లేనివిన గు జలముతో నాచమనము చేయునది. రోగులకు కాచినదియు నుపయోగించును. కా ళ్లు కడిగి కొనక గాని, నిలువబడి గాని, సిగముడి వైచుకొనక గాని, యుపవీతమునుధరిం

పాంగుదఙ్ముఖః॥ ఇతి, అనష్టాభి రిత్యనాతుర విషయం ॥ సంవర్తః॥ అకృత్వాపాద శౌచంతు తిష్ఠన్ముక్త శిఖోపివా వినాయజ్ఞోపవీతేన హ్యాచామన్న శుచిర్భ వేదితి.

## బ్రాహ్మాది తీర్థం.

మనుః॥ బ్రాహ్మేణ విప్రస్తీర్థేన నిత్యకాల ముపస్పృశేత్ పక్షేత్రైదశికాయాభ్యాం నపిత్ర్యేణకదాచన॥ బ్రాహ్మం॥ ఈశ్వరదైవత్యం. కాయం॥ ప్రజాపతి దైవత్యం. త్రైదశికం॥ దైవం. అత్రిదేవ తాతార తమ్యానుసారేణ తీర్థతార తమ్యమపి ॥ తాని పునస్తీర్థాని కుత్రస్యానీతి చేదాహ॥ సఏవ॥ అంగుష్ఠమూలస్య తలేబ్రాహ్మం తీర్థంప్రచక్షతే॥ కాయమంగుళి మూలేఽగ్రే దైవం పిత్ర్యంతయోరధః ॥ పాణితలమధ్యయా రేఖా తస్యామూలే బ్రాహ్మం- అంగుళి మూలం॥ కనిష్ఠికామూలం- తన్మధ్య ప్రదేశః- తత్ కాయంతీర్థం. అంగుళీనాంచతస్రూణామగ్రే దైవతీర్థం. తథాచయాజ్ఞ వల్క్యః॥ కనిష్ఠాప్రదేశిన్యం గుష్ఠమూలాన్యగ్రం కరస్యచ । ప్రజాపతి పితృబ్రహ్మ దేవ తీర్థాన్య నుక్రమాదితి॥ భరద్వాజః॥ తర్పణం దేవ తాదిభ్యస్స్వస్వతీర్థేన తర్పయేత్। పిబేదాచ మనేవారి వీక్షితం బ్రహ్మతీర్థతః॥ ఆచమనే విశేషా స్సంధ్యాప్రకరణే భవిష్యన్తి.

పక గాని యాచమనము చేసినను పవిత్రుండు కానేరడు.

### బ్రాహ్మాది తీర్థములు.

చిటికెన వ్రేలి మొదట ప్రజాపతి తీర్థంబును, చూపుడు వ్రేలి మొదట పితృతీర్థంబు, బొటన వ్రేలి మొదట బ్రాహ్మ తీర్థంబును, చేతికొన దేవతీర్థంబు కలవుగాన నాయా దేవతలకు దర్పణాదుల నాయాతీర్థములతోఁ జేయవలయు. బ్రాహ్మ తీర్థమునవాచమనము చేయవలయును. ప్రజాపతి తీర్థము చతుర్ముఖ దైవత్యంబును, బ్రాహ్మ తీర్థమీశ్వర దైవత్యంబనియు గ్రహింపవలయును.

### కుశప్రశంస.

దర్భలతో స్నానము చేసిన పవిత్రుండగు. దర్భలతో నాచమనము చేయవలయు

## కుశ ప్రశంసా.

వ్యాసః॥ కుశైః పూతం భవేత్ స్నానం కుశేనోపస్పృశే ద్ద్విజః। కుశేనైవోద్ధృతం తోయం సోమపానేన సమ్మితం॥ కుశమూలే స్థితో బ్రహ్మాకుశ మధ్యేతు కేశవః। కుశాగ్రే శంకరం విద్యాత్సర్వే దేవాస్సమంతతః॥ ఇతి॥ గోభిలః॥ వజ్రం యథా సురేంద్రస్య శూలం హస్తే హరస్యచ। చక్రాయుధం యథావిష్ణో రేవం విప్రకరేకుశః॥ భూతప్రేత పిశాచాశ్చ యేచాన్యే బ్రహ్మరక్షసః। విప్రాంగులి కుశాన్దృష్ట్వా దూరంగచ్ఛన్త్యధోముఖాః॥ ఇతి- శాతాతపః॥ జపే హోమే తథాదానే స్వాధ్యాయే పితృతర్పణే। అశూన్యం తత్కరం కుర్యాత్ సువర్ణరజతైః కుశైః॥ ఉభాభ్యామేవ పాణిభ్యాం విప్రైర్దర్భ పవిత్రకే। ధారణీయే ప్రయత్నేన దర్భగ్రంధి సమన్వితే ఇతి॥ పితృతర్పణ ఇత్యశాంభవ దీక్షితవిషయం। శైవానధికృత్య పైతృకే దర్భగ్రహణస్య నిషిద్ధత్వాత్తథాహి॥ కారణోత్తరే॥ అపసవ్యం తిలాన్దర్భానగ్నౌ కరణమేవచ। వికిరం పిండదానంచ శైవేషత్పరి వర్జయేదితి॥ తథాచంద్రజ్ఞానోత్తరే॥ ఇష్టలింగధరః పిత్ర్యే బిభృయాన్న పవిత్రకం।యదిమోహేన గృహ్ణీయాత్కృతం కర్మ

---

దర్భతో గ్రహించిన జలము త్రావుటవలన సోమపానముతో తుల్యమగు. దర్భయొక్క మొదట బ్రహ్మయు, నడుమ విష్ణువు, అగ్రమున ఈశ్వరుండును కడమ దేవతలు తక్కు భాగములయందు నుండుదురు. ఇంద్రుని చేతికి వజ్రాయుధ మెట్లో, ఈశ్వరుని చేతికి త్రిశూలమెట్లో, విష్ణుని చేతికి చక్రాయుధ మెట్లో బ్రాహ్మణుని చేతికి దర్భయునట్లే యలంకారమగు. భూతప్రేత పిశాచంబులు, బ్రహ్మరక్షస్సులును, బ్రాహ్మణుని చేతిలోని దర్భలను చూచి తలలు వంచుకొని గూరముకు బోవుదురు. జపమునందు, హోమమునందు, దానమునందు, స్వాధ్యాయము నందు, పితృ తర్పణము నందును కరమును సువర్ణముతోగాని, వెండితోగాని చేసిన పవిత్రమును ధరింప వలయు. రెండుచేతుల యందుదర్భ ముడిగల పవిత్రముల ధరింప వలయు. పితృ తర్పణము నందు దర్భముడి ధరింప వలయునను వచనము శాంభవ దీక్షలేని వారలకే ప్రవర్తించి నది. కారణోత్తర మను శివాగమమునందు, అపసవ్యమును, తిలలను, దర్భలను, అగ్నౌకరణము, వికిరమును, పిండదానమును పైతృక మునందు [illegible] చంద్రజ్ఞానోత్తరమును ఇష్టలింగ ధారియగు

పృథాధ వేదితి॥ నన్వేద మనుచితం స్మృతికల్పాది విహితస్య శైవైశ్చ దాగ
మవచనైర్నిషేద్ధు మశక్యత్వాత్ - సర్వేష్వపి కర్మసు కుశగ్రహణమూ
రీకృత్య పైత్రుకే తన్నిషేధస్య అయుక్తి యుక్తత్వాచ్చ ఇతి చేన్నైవం. శి
వాగమ కాండస్య స్మృతికల్పాధిక ప్రామాణ్య సంప్రతిపత్త్యా శ్రుతి తౌ
ల్యస్య విద్యాస్థాన వినిర్ణయే సిద్ధాంతిత త్వేన ప్రబలేనాగమవచనే నస్మృ
తికల్పాది విహిత పైత్రుకాంగ కుశగ్రహణ విధిసంకోచస్య న్యాయ్యత్వా
త్। కర్మాంతరేషు తదూరీ కరణస్య పితృకర్మణే తన్నిషేధస్యచ శాస్త్ర
సిద్ధ త్వేన వచనాత్ప్రవృత్తిర్వచ నాన్ని వృత్తిరితి న్యాయే నసర్దోష
త్వాచ్చ.

## దర్భాహరణ కాలః.

దర్భాహరణే కాలనియ మమాహ హారీతః॥ అయూ తయా
మాస్తే దర్భాని యోజ్యాస్స్యుః పునఃపునః॥ కాలాంతరా నీతాస్తు యాంత
యామాః॥ అతఃపునః పునర్వినియోగ యోగ్యాన భవన్తీత్యర్థః ॥ ఆహ
రణ ప్రకార మాహగోభిలః॥ శుచౌదేశేశు చిర్భూత్వా స్థిత్వా పూర్వో
త్తరాముఖః। ఓంకారేణైవ మంత్రేణ కుశాన్ స్పృష్ట్వాద్విజోత్తమః॥

---

విప్రుడు పైతృకమున దర్భపవిత్రమును ధరింపగూడదు. అట్లు ధరించు వాడచే సిన కర్మ
ము విఫలమగు ననియు శైవులకు పైతృకమున దర్భగ్రహణము నిషేధింప బడి యున్న
దిగాన నట్లు నిర్ణయింప వలసివచ్చెను.

ప్ర॥ పెక్కు స్మృతుల యందును, కల్పసూత్రముల యందును పైతృకమున దర్భగ్రహణ
ము విధింప బడియున్నది. ఇట్టి దీనిని కొన్ని యాగమ వచనములచే నిషేధింప నె
ట్లు శక్యమగు? అన్ని కర్మలయందు దీనినంగీకరించి పైతృకమున దీనిం ద్యజించుటయె
ట్లు యుక్తి యుక్తమగు. నందురేని వినుడు. (ఉత్తరము.) శివాగమ కాండము స్మృ
తి కల్పముల కంటె నెక్కుడు ప్రామాణ్యము కలదియనియు వేదముతో సమమనియు
విద్యాస్థాన నిర్ణయమను గ్రంథమున సిద్ధాంతీకరింపబడి యున్నది. కావున ప్రబలమైన
యాగమవచనము అప్రామాణ మనుటకంటె దానిం బట్టి స్మృతి కల్పాదుల యందు విధిం
పబడిన పైతృ కాంగమైన దర్భ గ్రహణము శైవదీక్షితులని వారలకని వచించుట న్యా
య్యము. మఱియు వచనాత్ప్రవృత్తిః వచనాన్నివృత్తిః అను ప్రమాణము వలన కర్మాం

ఉత్పాటన మాత్రమాహ॥ విరించినా సహోత్పన్న పరమేష్ఠి నిసర్గ
జ। నుదపాపాని సర్వాణి దర్భస్వస్తి కరోమమ. ఇతి.

వర్జనీయ దర్భాః.

వర్జ్యానాహ హారీతః॥ అపూతా గర్హితాదర్భా యేచభిన్నా
నఖైస్తు థాః క్వథితానగ్ని దగ్ధాంశ్చ కుశాన్యత్నేన వర్జయేదితి.

ఆచమన నిమిత్తాని.

తత్రమనుః॥ కృత్వామూత్రం పురీషంతు శౌచార్థంతు ఉపస్పృశేత్। వే
దమధ్యేష్య మాణశ్చ అన్నపానేచ సర్వదా। శూద్రమాభాష్యయత్నే
న హ్యాచాన్త శ్శుచితామియాత్॥ ఆచాన్త స్త్రిరపః పీత్వేత్యర్థః॥ త
థా॥ ఆచమ్యప్రయతో నిత్యం జపేదశుచి దర్శనే॥ ఇతి.

వసిష్ఠః॥ క్షుతేనిష్ఠీవితే సుప్తే పరిధానేఽశ్రుపాతనే। పంచస్వే
తేషు చాచామేత్ శ్రోత్రం వాదక్షిణం స్పృశేదితి॥ పరాశరః॥ ప్రభా
సాదీని తీర్థాని గంగాద్యాస్సరి తస్తథా। విప్రస్య దక్షిణే కర్ణేసంతీతిమ
నురబ్రవీత్. ఇతి.

ద్విరాచమన నిమిత్తాని.

యాజ్ఞవల్క్యః। స్నాత్వాపీత్వా క్షుతేసుప్తే భుక్త్వారథ్యోపస
ర్పణే। ఆచాన్తః పునరాచామే ద్వాసోపి పరిధాయచ. ఇతి. మనుః. క్షు

---

తరముల యందు దర్భగ్రహణము విధింపబడి యున్నది గాన గ్రహించుటయు. పైత్రక
మునని షేధింపబడియున్నదిగాన నిచటమాత్రముద్వర్జించుటయు సంభవించినదిగాపునక
దమయన్ని కర్మముల యందు గ్రహించి యిదుమాత్రము త్యజించుట యుక్తమేయ
యి యున్నది.

దర్భాహరణ కాలము.

వలయు నప్పుడు తీసికొని రాబడిన దర్భలనే గ్రహింప వలయుగాని కాలాంతర
మునతీసికొని రాబడిన వానిని గాని, ఒకసారి వినియోగింపబడిన వానింగాని వాడు
కొనగూడదు. పవిత్రుడు ఐశాన్యమున కభిముఖుండై ప్రణవమునుచ్చరించుచు పవిత్రస్థలము
ననున్న దర్భలనుదాకి బ్రహ్మదేవునితోగూడ సహజముగా నుద్భవించిన యోకుశమా-పా
షములన్నిటిని బోనణచి, శుభము లొసగుము అనుమంత్రము చే గ్రహింపవలయు.

త్వా సుప్త్వా చ భుక్త్వా చ క్షీవిత్వా స్నాత్వానృతం వచః। పీత్వాపో౽ధ్యేష్యమాణశ్చ ద్వ్యాచామేత్ప్రయతో౽పినా. ఇతి-

ఆచమనాప వాదః.

అత్రయాజ్ఞ వల్క్యః॥ ముఖజావిప్రుషో మేధ్యాస్తథాచమనబిందవః। శ్మశ్రు చాస్యగతం దంత సక్తం త్యక్త్వాత తశ్శుచిః ॥ అస్యార్థః. ముఖనిస్సృతా లాలాబిందవో నామేధ్యాః। నోచ్ఛిష్టం కుర్వన్తి అంగే నిపతి తాశ్చ చ్యుతేహ్యాచ మనబిందవః పాదాస్స్పృశన్తి. తేమేధ్యాః, శ్మశ్రుచాస్య ప్రవిష్టముచ్ఛిష్టం నకరోతి. దంతసక్తం చాన్నాదికం స్వయమేవచ్యుతం దంతాత్త్యక్త్వాను శుచిర్భవతి. అచ్యుతంతు దంతసమమితి. అతో౽త్ర నత్వాచామేదితి భావః॥ స్మృత్యర్థసారే॥ ఆస్య లగ్నే వ దంతే చైవ తథైవాం గోపలేపనే। తాంబూలక్రము కేచైవ భుక్తస్నేహాను లేపనే। ఇత్తుఖండేతి లేమూలే పత్రపుష్ప ఫలేషుచ। తథోక్తతృణకాష్ఠేషు నాచామేదామ భక్షణే। మధుపర్కేషు సోమేషు ప్రాణాహుతి

---

విడువదగిన దర్భలు.

గోటితో తుంచఁ బడినవి యపవిత్రములైనవి కాచినట్టివి-కాలినవియును గుదర్భలను విడువ వలయు.

ఆచమనని మిత్తములు.

మూత్రరీవములను విడిచి పాదప్రక్షాళనము చేసికొని శుద్ధికై యాచమనము చే యవలయు. వేదము జదువఁ బోవునప్పుడును- అన్నమును భుజింపఁ బోవునపుడు- జలముద్రావఁ బోవునపుడును- శూద్రునితో మాటలాడిన పిమ్మటను నాచమనము చే యవలయు అపవిత్ర వస్తువును జూచిన మీదట నాచమనము చేసిన శుద్ధుఁడగు. తుమ్మినప్పుడును- ఉమ్మి వేసినప్పుడును- నిద్రించిన యనంతరమును- వస్త్రము ధరించు నప్పుడు- కన్నీరు గారినప్పుడును- ఆచమనము చేయవలయు లేకున్న కుడిచెవినైన దాకవలయు. ప్రభాసము మొదలగు తీర్థములు- గంగాదినదులును విప్రుని కుడిచెవి యందుండు నని మనువు వచించెను.

రెండుమార్లాచమనము చేయవలసిన సమయములు.

స్నానము-జలపానము-తుమ్ము- నిద్ర-భోజనము- వీధికిబోవుట- వస్త్రముధరించుట

షుచాప్యుచ। ఆస్యహోమేషు సర్వేషు నోచ్ఛిష్టో భవతిద్విజః ఇతి॥ ఆచ మనాకరణే పత్యవాయోదర్శితః॥ స్మృతిచంద్రికాయాం॥ యఃక్రియాః కురుతేమోహాద నాచమ్యైవ నాస్తికః। భవన్తిహివృథాతస్య క్రియాస్స ర్వాన సంశయఇతి.

దంత ధావనం.

అథదన్త ధావనవిధిః భరద్వాజః॥ పక్షాళ్య చరణౌ హస్తౌ ముఖంచాథయ థావిధి। ఆచమ్య ప్రాఙ్ముఖః స్థిత్వాదం తధావన మా చరేత్। మధురిత్యాది మంత్రోఽయం ముఖ్యశ్శాఖాభి మంత్రణే। త్య క్త్వాభి మంత్రణంతూష్ణీం వృథాస్యాద్దంత ధావనం। మంత్రః। ఆయుర్బ లం యశోవర్చః ప్రజాః పశువసూనిచ। బ్రహ్మప్రజ్ఞాంచ మేధాంచత్వా నోదేహివనస్పతే। ఇత్యభిమంత్ర్య హృతాంశాఖాం మంత్రేణానేన వై ద్విజః। అథఊర్ధ్వంక్ర మేణైవ థావయేచ్ఛాఖ యాతథా। వామభాగం సమారభ్య ప్రాదక్షిణ్య క్రమేణతు।ఇతి। దంతిధావన కాష్ఠాని। హారీతః। సర్వేకంటకినః పుణ్యాః క్షీరిణశ్చ యశస్కరాఇతి. శౌనకః। విజ్ఞాతవృ క్షం త్వక్షాగ్ర మృజుదుర్గంధ వర్జితం। సత్వక్తుదంత కాష్ఠం స్యాత్త దగ్రేణ ప్రధావయేదితి. విష్ణుః॥ ద్వాదశాంగుళికం విప్రేకాష్ఠ మాహు ర్మనీషిణః। క్షత్రవిట్ శూద్రజాతానాం నవమశ్చతురంగుళ మితి। కా

---

తుమ్మువేయుట- అసత్యముపలుకుట- చదువఁ బోవుట యీసమయములయందు రెం డుమారులే యాచమనముచేయవలయు.

ఆచమనము పనిలేని సమయములు.

నోటి తుంపురులు పడినను- ఆచమనము చేయునప్పుడు శరీరమున జలబిందువు లు బడినను- నోటి లోనికి మీసపు వెండ్రుకలు- వచ్చినను పండ్లసందున నిలిచి కొనిన ఆ హారవస్తువు దానియంతన క్రిందఁబడినను ఆచమనముచేయవలసిన పనిలేదు. సోమ.రసము- తాంబూలము- చెఱకుగడ- నువ్వులు- ఆకులు-పువ్వులు-పండ్లు- అపక్వవస్తువులు మున్న గు వానిని భుజించి నప్పుడును- ప్రాణాహుతులు చేసినప్పుడును- నుచ్ఛిష్ట దోషము లే దు. ఆచమనముపనిలేదనుట మొదట నాచమనముచేయక యేకర్మమును చేసినవ్యర్థ మగును.

ష్టఫలమాహ గర్గః॥ సర్జేస్థైర్యం వటేదీప్తిః కరంజేవిజయో భవేత్। ప్ల క్షేచైవార్థ సంపత్తిర్బదర్యాం మధురస్వరః। ఖదిరేచైవ సౌగంధ్యం బిల్వేతు విపులంధనం। ఔదుంబరేణ వాక్సిద్ధిర్బృం ధూకేచ తథా శ్రుతిః। వంశేచ కీర్తిస్సౌభాగ్యం పాలాశేసిద్ధిరుత్తమా। కదంబేచ సదా లక్ష్మీ రామ్రేచారోగ్య మేవచ। అపామార్గే ధృతిర్మేధా ప్రజ్ఞా శక్తిర్వ పుశ్శుచిః। ఆయుశ్శీలం యశోలక్ష్మీ స్సౌభాగ్యం చోపజాయతే। అర్కే ణదంతరోగాంస్తు బీజపూరేణతువ్యథా మితి॥ బిల్వంతు నిషిద్ధమన్యత్ర.

వర్జనీయ కాష్ఠాని

వర్జనీయాన్యాహ హారీతః॥ కాలేయ పాలాశ కోవిదార శ్లేష్మా తకబిల్వ కోశాతకవృక్ష నిర్గుండీశిరీషమాలతీ కరవీర బదరీ కరంజ వేణువర్జ్యమితి వసిష్ఠః॥ అజ్ఞాత పూర్వాణిచ దంతకాష్ఠాన్య థాన్యపత్రైశ్చసమన్వితాని। నయుగ్మ పర్ణాని నపాటితాని నచార్ద్ర శుష్కాణివినా

---

దంతధావనము.

కాలు నేతులు కడిగికొని- గండూషముచేసి- ఆచమనము నాచరించిదంతధావనము చేయవలయు. ఆయుర్బలం యశోవర్చః- అనుమంత్రము శాఖను మంత్రించుటకు ముఖ్యమైనది. మంత్రింపక దంతధావనము చేసిన వ్యర్థమగు. ఆయుర్బలంఅనుమంత్రముచే కాష్ఠమునుమంత్రింపవలయు."ఓవనస్పతీ-ఆయువునుబలమును- కీర్తిని-తేజమును-సంతానమును-ధనమును-వేదమును- ప్రతిభను-జ్ఞాపకశక్తిని నాకొసగుమని దీనికర్థము ఈమంత్రముతో మంత్రించి విరువఁబడిన పుడకతో నెడమవైపున మొదలు పెట్టి ప్రదక్షిణ క్రమముగా దిగువను- మీదను గూడ- దంతములను తోముకొన వలయు. మండ్ల చెట్లును- పాలచెట్లును దంతధావనమునకు ప్రశస్తములు. ఎదిఁగిన చెట్టుదియు-నలగ గొట్టబడినకొనగలదియు- సరియైనదియు- దుర్వాసన లేనిదియు, చర్మముతో గూడి నదియునగు దంతకాష్ఠము గ్రహించి దానితో దంతధావనము చేయవలయు. పండ్రెండు- తొమ్మిది, ఆరు, నాలుగు అంగులముల పొడవుగల దంత. కాష్ఠములతో క్రమముగా, బ్రాహ్మణులు,క్షత్రియులు, వైశ్యులు, శూద్రులును దంతధావనము చేసికొన వలయు, సర్జవృక్షపు పుడకతో దంతధావనము చేసికొనిన ధైర్యంబును,వటవృక్షపుడకతో, చేసికొనిన కాంతియు, కా

త్యచావా॥ కాలవిశేషే. కాష్ఠనిషేధఉక్తః॥ చంద్రికాయాం॥ అష్టమ్యాం చ చతుర్దశ్యాం పంచదశ్యాం త్రి జన్మని। తైలం మాంసం వ్యవాయంచ దంతకాష్ఠంచ వర్జయేదితి. గార్గ్యః॥ దంతకాష్ఠేత్వ మావాస్యా తైలాభ్యంగేచతుర్దశీ। అష్టమీగ్రామ్య ధర్మేచ జ్వలంతమపి పాతయేత్। ఇతి, తథాస్త్రీసంగం ఖాదనం పానం స్వాధ్యాయం క్షురకర్మచ। నకుర్యాద్దంత కాష్ఠంచ తైలేచ శిరసిస్థితే॥ వ్యాసః॥ నద్యాం దేవాలయే గోష్ఠేశ్మశానే జలమధ్యకే। యాగస్థానే శుచౌదేశే నాచరేద్దంత ధావనం శౌనకః॥ అలాభేదంత కాష్ఠానాం ప్రతిషిద్ధ దినేష్వపి। తస్యత్వ పాంతు

---

నుగ పుడకతో విజయంబును, జువ్విపుడకతో ఐశ్వర్యంబును, రేగుపుడకతో సుస్వరంబును, చంద్రపుడకతో సువాసనయు, మారేడు పుడకతో నధికధనంబును, అత్తి పుడకతో వాక్సిద్ధియు, జువ్విచెట్టుపుడకతో వేదంబును, వజ్రపు పుడకతో కీర్తి సౌభాగ్యంబులును, మోదుగు పుడకతో నుత్తమ సిద్ధియు, కడిమె చెట్టు పుడకతో లక్ష్మియు, మామిడి పుడకతో నారోగ్యంబును, ఉత్తరేణు వేపతో దంతధావనము చేసికొనిన యెడ ధైర్యము, జ్ఞాపకశక్తి, ప్రతిభ, పావిత్ర్యము, ఆయువు, శీలము, కీర్తి లక్ష్మి, సౌభాగ్యము, ఇవన్నియుఁ గలుగు జిల్లేడు పుడకతో దంతరోగములు కలుగును. మాదీఫలపు కట్టెతో దుఃఖము కలుగు. బిల్వము కూడదని యింకొకచో నిషేధము కలదు.

## పనికిరాని పుడకలు.

ఎఱుఁగని చెట్లవియు- బదనికెలు గలవియు- జమిలియాకులు గలవియు- చీల్పంబడినవియు- తడిగలవియు- ఎండినవియు చర్మము లేనివియు నగు కాష్ఠముల నుపయోగింపఁ గూడదు.అష్టమి- చతుర్దశి- పూర్ణిమ- తనజన్మతిథి వారనక్షత్రయులు మూడును కలిసి వచ్చినదినమును- ఈదినములయందు తైలాభ్యంజనము- మాంసాహారము- సంగమము-దంతధావనము కూడవు. అమావాస్యనాడు దంతధావనము చేసినను- చతుర్దశినాడు తైలాభ్యంగము చేసికొనినను- అష్టమినాడు సంగమము చేసినను పతితుడగును. తలయంటుకొని యున్నపుడు స్త్రీసంగము- భుజించుట- జలముద్రావుట- వేదము చదువుట- దంతధావనము- క్షౌరము కూడవు. నదియందు- దేవాలయమున- గోవుల కొట్టమునను- శ్మశానమునను- జలమధ్యమునను- యాగ స్థానమునను దంతధావనము చేయఁగూడదు. దంతకాష్ఠము దొరకని యప్పుడును నిషిద్ధ దినములయందును పండ్రెండు మార్లు జలము పుక్కిలించి పై

గండూషైర్ముఖ శుద్ధిర్భవిష్యతి॥ స్మృత్యర్థసారే॥ అంగుళ్యా ధావయేద్దం తాన్ సర్జయేత్తు ప్రదేశినీం। మధ్యమానామి కాంగుష్ఠైః దంత ధావో భవత్యపి॥ భరద్వాజః॥ యావంతో నియమాః ప్రోక్తాద్విజ శ్రేష్ఠస్య భుంజతః। తావంతః పేక్ష్య కర్తవ్యో దంతిధావనకర్మణీతి.

స్నానవిధిః.

కూర్మపురాణే॥ ప్రక్షాళ్య దాతకాష్ఠం వై భక్షయిత్వా విధానతః। ఆచమ్య ప్రయతోనిత్యం ప్రాతస్స్నానం సమాచరేదితి॥ స్నానం ప్రశంసతి యోగయాజ్ఞవల్క్యః॥ అగమ్యాగమనాత్ స్నాయాత్పాపేభ్యశ్చ ప్రతిగ్రహాత్। రహస్యాచరితాత్పాపాన్ముచ్యతే స్నానమాచరన్॥ ఇతి॥ దక్షః॥ క్షుభ్యన్తి హి సుషుప్తస్య ఇంద్రియాణి స్రవన్తి చ। అంగానిసమతాం యాన్తి ఉత్తమాశ్చ సిరాస్తథా॥ అత్యంత మలినః కాయో ఽయోగ్యశ్చ పరికీర్తితః। స్రవత్యేవది వారాత్రం ప్రాతస్స్నానం విశోధనమితి॥ స్కాందే॥ అస్నాత్వా నాచరేత్కర్మ జపహోమాదికించన। సర్వం హన్తివి శుద్ధాత్మా ప్రాతస్స్నానేనదుష్కృతం॥ గుణా

---

చిన ముఖశుద్ధి కలుగును. చూపుడు వ్రేలువిడిచి తక్కిన వేళ్లతో పండ్లు తోముకొన వలెను. ద్విజులకు భోజనము చేయు నపుడున్న నియమము లన్నియు దంతధావనము చేయునప్పుడును గలవు.

స్నానవిధి.

దంతధావనము చేసికొని, యాచమనము చేసి స్నానము చేయవలయును. అగమ్యాగమనము- పాపాత్ముల వలన ప్రతిగ్రహము, వీనివలన గల్గునవియు, రహస్య కృతములైన నగు పాతకములు స్నానమువలన నశించును. నిద్రించినవాని యింద్రియములనుండి మలములు స్రవించును గాన శరీరము మలినమై యుండును. దానంజేసి ప్రాతః కాలమున స్నానముచేయ వలయును. స్నానముచేయక జపహోమాదుల నాచరింపఁ గూడదు. రూపము, తేజము, బలము, శుద్ధి- ఆయువు- ఆరోగ్యము- స్థిరచిత్తత- దుస్స్వప్న నాశము, ధైర్యము- మేధ అనునీ పదిగుణంబులు స్నానముచేయు వారలకు గలుగును. వానప్రస్థుఁడు గృహస్థుఁడును ప్రాతః కాలమునను- మధ్యాహ్నమునను స్నానము చేయవలయు

దశస్నాన పరస్య పుంసో రూపంచ తేజశ్చ బలంచ శౌచం। ఆయుష్య మారోగ్య మలోలుపత్వం దుస్స్వప్ననాశశ్చ ధృతిశ్చమేధా॥ ఇతి॥ అస్నాతా శీర్మలం భుంక్తేహ్యజపః పూయశోణితం।అహుతాశీః క్రిమిం భుంక్తే అదాతా విష్ట మశ్నుతే॥ ఇతి॥ స్మృత్యర్థసారే ॥ ప్రాతర్మధ్యాహ్నయోః స్నానంవానప్రస్థగృహస్థయోః। యతేస్త్రిషవణం స్నానం॥ సకృచ్చబ్రహ్మచారిణాం। సర్వేవాపి సకృత్కుర్యు రశక్తౌచోదకం వినా కాత్యాయనోపి॥ యథాహని తథా ప్రాతర్నిత్యం స్నాయాద తంద్రితః॥ దంతాన్ ప్రక్షాళ్య నద్యాదౌ గృహేచేత్తద మంత్రకమితి॥ స్నానప్రకారశ్చ క్రియాసారేఽభిహితో యథా॥ఆచాంతః కృతకరన్యాసః ప్రాణానాయమ్య దర్భాన్ ధారయన్ అముకే వర్షే అముకేమాసి అముకే వారే శివప్రీత్యర్థం స్నానం కరిష్యఇతిసంకల్ప్య శుద్ధభూమించ తురంగుళ పర్యంతం హుంఫడిత్యస్త్ర మంత్రేణోద్ధృత్య తపదస్తనీం మృదం

---

యతి మూడుకాలముల యందు స్నానము చేయవలయు. బ్రహ్మచారి ఒక్కమారు స్నానము చేయవలయు.

స్నానవిధానము క్రియాసారమున నిట్లు చెప్పబడి యున్నది. ఆచమనముచేసి- కరన్యాసము చేసికొని- ప్రాణాయామముచేసి దర్భలను గ్రహించి- దేశకాలముల నుచ్చరించి- శివప్రీత్యర్థము స్నానము చేయుదునని సంకల్పముచేసి పరిశుద్ధమగు నేలను నస్త్రమంత్రముచే త్రవ్వి లోనున్న మృత్తికను మూలమంత్రముచే తీసికొని- హృదయాయనమః అను మంత్రముచే మొదట మృత్తికచే పూడ్చి తాను గ్రహించిన మృత్తికను ఏరు- చెరువు మున్నగు వానియొడ్డున నుంచవలయును. ఏరు మున్నగు వాని దక్షిణతీరము స్నానమునకు ప్రశస్తమైనది. అంతట- అస్త్రాయ హుంఫట్ అనుమంత్రముచే నామృత్తికలో జలము నునిచి- శిరసేనమః అనుమంత్రముచే నందలి గడ్డిపేళ్లను తీసివైచి- కవచాయనమః అనుమంత్రముచే నామృత్తికను మూడు భాగములుచేసి- దానిలో నొక భాగముచే నాభిమొదలుకొని పాదముల వరకు రాచికొనవలయు. రెండవ భాగమును ఏడుమారు లస్త్రమంత్రముచే జపించి ప్రజ్వలించుచున్న దానిగా భావించి మూలమంత్రముచే సర్వాంగము లేపనము చేసికొని- జలమున ప్రవేశించి, అస్త్రమంత్రముచే జలమును దలించి, కొట

మూలమన్త్రేణ నమోంత హృదయేన వాదాయ నమోన్త హృదయే
నైవ ప్రథమ ముద్ధృతయా మృదా ఖాతమా పూర్య నమోన్తం సరిత్స
రస్తటాకాదితీరే విశుద్ధే సిక్షేపేత్॥ సరిదాదీనాం దక్షిణతీరం స్నానా
ర్థమతిప్రశస్తం॥ తత్రో హుంఫడంతాస్త్రేణ మృదమభ్యుక్ష్య నమోన్త శి
రసా మృదిస్త్రేణ మూలాదీన్యుద్ధృత్య నమోన్త కవచేన త్రిధా వి
భజ్య నాభ్యాది పాదాన్తమేకాం శేనప్రక్షాళ్య- ద్వితీయం సప్తవార
మస్త్రమంత్ర జప్తమస్త్ర రశ్మిసం పర్కా ద్దీప్తం విభావ్య సర్వమంగం
మంత్రేణ లిప్త్వా జలం ప్రవిశ్య జలమస్త్రేణాలోడ్య- అంగుష్ఠాభ్యాం క
ర్ణౌ తర్జనీభ్యామక్షిణీ మధ్యమాభ్యాం నాసికే చ ధృత్వా విధాయ ప్రణవం
మూలసంహితం వాజపన్ హృదయే జ్వలదస్త్రం దేహం తత్తేజః పూ

---

ని వ్రేళ్లతో చెవులను, చూపుడు వ్రేళ్లతో కన్నులను, నడిమివ్రేళ్లతో నాసికలను గట్టిగా
మూసికొని, మూలమంత్రమును జపించుచు- ప్రజ్వలించు నస్త్రముగల దేహము నస్త్ర తే
జముచే వ్యాప్తమైన దానిగా భావించి జలమున మునిగి శక్తి కొలది యుండవలయు. ఇ
ది మలస్నానము, మఱియు- మృత్తికను విధి స్నానమునకై యుంచికొని, మార్ద్రామల
కాదులచేతనే మలస్నానము నొనరింపవలయు. విణ్మూత్రాది శారీర మలములకు, మృ
త్తు, దంతకాష్ఠము, మార్ద్రామలకాదులు మున్నగు వానిచే ఘర్షణము చేయుటచే శు
ద్ధియగు. వాచిక మలములకు ప్రణవాది జపములచే శుద్ధియగు. మానస మలములకు ధ్యా
నాదులచే శుద్ధియగు.

అనంతరము విధిస్నానమునకై యునిచిన మృత్తికను తీసికొని, బొడ్డులోతు
నీరిలో ప్రవేశించి, నగులయందైన యొడ, ప్రవాహాభిముఖుండును, చెఱువులు మున్నగు
వానియందు ప్రాఙ్ముఖుండు నుత్తరాభిముఖుండు గానియగుచు, మత్స్యమండూకాదిహిం
సలేని పరిహారమునకై హస్తమాత్రము నలు చదరముగా శివతీర్థమును కల్పింపవలయు.

అదియెట్లన, మృత్తిక నెడమ చేతిలో నిడికొని, దానిని తూర్పున, దక్షిణమున
ఉత్తరమున మూడు భాగములు చేసి మూలమంత్రముచే నేడుమార్లు మంత్రించి, తూర్పు
న నున్నదానిలో సగము తీసికొని అస్త్రాయహుంఫట్ అనుమంత్రముచే తూర్పు మొదలగు
గన్ని దిక్కులను చల్లవలయు. దీనిచే దిగ్గతములగు విఘ్నములన్నియు నశించును. కడమ
మృత్తికలో కొంత శివతీర్థమగుటకై కొంత జలములో నుంచవలయు. కొంత శివతీర్థ సీ

జపిత్వాచ విధాన్యజలేనిమగ్నో యావచ్ఛక్త్యా వతిష్ఠేత॥ తదేతన్మల స్నానం॥ యద్వా- వక్ష్యమాణ విధి స్నానార్థమేవ మృదా హరణం మలస్నానంతు హరిద్రామలకాది పిష్టైరేవ కార్యం॥ అత్ర రేతో విణ్మూత్ర చక్షుశ్శ్రోత్ర నాసికాముఖ నఖపాదమల రూపాణాం శారీరమలానాం శోధనాది మలస్నానాం తత్కర్మాం తద్గతైర్మృద్దంత కాష్ఠహరిద్రామల కాది ఘర్షణైశ్శుద్ధిః॥ వాచికమలానాం స్నానకారకైః ప్రణవాది జపైర్మానస మలానాం మంత్రధ్యానాదిభిః॥

తదను విధిస్నానార్థం స్థాపితం మృద్భాగమాదాయ నాభిదఘ్నం జలం ప్రవిశ్య నదీషు ప్రవాహాభిముఖోఽన్యత్ర ప్రాఙ్ముఖ ఉదఙ్ముఖో వా మత్స్య మండూకాది వాసభూత జలదోష పరిహారార్థం హస్తమాత్రం చతురశ్రం శివతీర్థం పురతః కల్పయేత్। తత్రాయం క్రమః॥ మృద్భాగం

---

మా సిద్ధికై జలమున చేతిలో చుట్టును త్రిప్పవలయు ఉత్తరపు దిశనున్న దానిని మూలమంత్రముచే సమృతమయముగా భావించి సగము జలమున నునిచి, కడమ సగము శరీరమునకు లేపనము చేసికొనవలయు. దక్షిణపు దిశ నునిచినమృత్తికను లేపనము చేసికొనగా సకల పాపములు నాశమొందును. ఇట్లు షణ్ముఖీ ముద్రచే చెవులు మున్నగు వానిమూసికొని, శివతీర్థమున మునిగి, శివమంత్రమును జపించుచు నీరిలో శక్తి కొలదియుండవలయు. అంతట జలమునుండి లేచి శక్తి శివమంత్రములచే కుంభక ముద్రచేయుట వలన, వామదక్షిణ హస్తములను సోమసూర్య రూపములనుగా భావించి, వామదంత మంత్రముచే మంత్రించిన జలములను శిరమున చల్లుకొని సంహార ముద్రచే శివతీర్థము నుపసంహరింప వలయు, నని యున్నది. అబ్లింగములును, వారుణములును, వ్యాహృతులు, యశ్చాంచ ద్ధునితం మయ్యః ద్రుపదా దివముంచత్ ఈమున్నగు మంత్రముల చేతను మృత్తికచేతను స్నానము చేయవలయు. స్నానకాలమున పుణ్యతీర్థముల స్మరింపవలయు. సంకల్పము, వారుణాది సూక్త పఠనము, మార్జనము, అఘమర్షణము, దేవతా తర్పణము నని స్నానమై దంగములు గలిగి యున్నది. పాదములను, ముఖమును కడిగికొని సావిత్రిని, ప్రణవమును స్మరించి, సిగముడి వేసికొని, ఆచమనము చేసి రేవున జలము పోసియటు దర్భాదుల నునిచి, దర్భపాణియై జలమును నమస్కరించి, ప్రాఙ్ముఖుడై జలమున ప్రవే

వామకరే పూర్వయామ్య సౌమ్యేషు త్రిధావిభజ్య సర్వాం సప్తవారా
వృత్తేన శివేన చాభిమంత్ర్యతత్రాస్త్రిపాతః హూఫండాం తాస్త్రేణ నా
రాచముద్రయా పూర్వాదిషు సర్వాసు దిక్షుక్షిపేత్। ఏవందివి విఘ్నా
నామధిపస్య ఇంద్రదిశిస్థితస్య మృద్భాగస్య దిక్షుక్షేపేణ దిగంతస్థితాస్స
ర్వే విఘ్నాశ్శమంయాన్తి॥ తదనుశివజప్త మృద్భాగార్ధం మూలేన జ
లేశివతీర్థ సీమాసిద్ధ్యర్థం మూలమంత్ర కృతేజలే నిక్షిప్యత దపరార్ధం
శివతీర్థం బాహుపరిభ్రమ ణేన సమంతాన్ని క్షిపేత్॥ ఏవం సోమది శి
స్థాపితం మృద్భాగం కేవలమమృత మయశివ మంత్రేణ లాలనాత్ క్షీ
రం తీర్థమమృతమయం భవతీతి శివతీర్థం పరికల్ప్య విధినా స్నానాయ
తదర్థం ప్రథమం బ్రహ్మాంగజప్తేన మృద్భాగేన సర్వమంగంలిపేత్॥ అథ
యామ్య దిశిస్థితస్య మృద్భాగస్య సంస్పర్శనాత్సర్వ పాపక్షయో భవ
తి॥ ఏవంషణ్ముఖీ కరణముద్రయాశ్రోత్రాదిద్వారాణి పిధాయ శివతీ
ర్థమధ్యే నిమజ్జ్య శివమంత్రం ధ్యాయన్ అంతర్జలేయావచ్ఛక్త్యా వతి
ష్ఠేత్॥తతోజలాదుత్థాయ వామదక్షిణ హస్తాసోమ సూర్యాకృతీశక్తి
శివాభ్యాం కృతయాకుంభక ముద్రయా వౌషడంత సహితాభి మంత్రి

---

శించి శరీరము తోమి కొనుచు స్నానముచేసి రెండు మారులాచమనముచేసి, దర్భపాణి
యై ఆపోహిష్ఠాది మంత్రములచే మార్జనముఁజేసికొని యఘమర్షణ స్నానముఁ జేయవల
యు. తిరిగి స్నానముఁజేసియాచమనముఁ జేసి తర్పణముఁజేయవలయు ననిస్మృత్యర్థసార
మునఁ గలదు. ప్రవాహము కాని యుదకమున స్నానముఁజేయుట, విప్రపాదముల గడు
గుట, గాయత్రీజపము, అర్ఘ్యమును సూర్యున కభిముఖుఁడై చేయవలయు. సూర్యోదయ
మునకు పూర్వము నాలుగు గడియల కాలమున కరుణోదయమని పేరు. అప్పుడు స్నా
నముఁజేయుట ప్రశస్తమైనది. నిత్యము, నైమిత్తికము, కామ్యమునని స్నానము మూడు
విధములగు. దానింబట్టి యందగు తర్పణంబును మూడువిధములై యుండును. స్నానముఁజే
సి తడిపంచతోన నీరిలోనుండియే దేవర్షి పితృతర్పణముల జేయవలయు. మనుజులకు త
ర్పణముఁజేయునప్పుడు, స్నానవస్త్రము నదుకునప్పుడు, మూత్ర పురీషములవిడుచునప్పు
డును నివీతిరై యుండవలయు. మనుష్య కర్మముల యందు జందెమును బుజముపై నిడి
కొనియు, సంగమ సమయమున మెడనె నునిచి కొనియు, తర్పణ సమయమున ప్రేలిపై

తజ్జలైశ్శిరస్యభిషిచ్య హుంఫడంతాస్త్రేణ విఘ్ననాశన తీర్థజలాం దిక్షు వినిక్షిప్య తీర్థం సంహారముద్రయా ఉపసంహరేత్। ఇతి॥ చతుర్వింశతిమతే॥ స్నానమబ్దైవతైర్మంత్రైర్వారుణైశ్చ మృదాసహ। కుర్యాద్వ్యాహృతిభిర్వాథ యత్కించేదితి మంత్రతః। ద్రుపదాదివేతి చస్నాయాజ్జంబు కామేతి వాపునః॥ పుణ్యాని చస్మరేత్తీర్థాన్యశనా ముసిర బ్రవీదితి. స్మృత్యర్థసారే॥ సంకల్పసూక్తపఠనం మార్జనంచాఘమర్షణం। దేవతాతర్పణం చైవస్నానం పంచాంగముచ్యత ఇతి॥ తత్రైవ॥ పాదాముఖంచ ప్రక్షాళ్య సావిత్రీం ప్రణవం స్మరేత్॥ శిఖాంబద్ధ్వాచమ్య తటం ప్రక్షాళ్య దర్భాదీన్నిధాయ దర్భపాణిర్జలం నత్వా ప్రపత తాంజలిః ప్రాఙ్ముఖోఽవగాహ్య కక్షాది సిమృజ్య స్నాత్వాద్వి రాచమ్య దర్భపాణి రాపోహిష్ఠాద్యైరబ్దైవతైర్మార్జనం కృత్వాఽఘమర్షణం కుర్యాత్. పునస్నాత్వాద్వి రాచమ్య తర్పణం కుర్యాదితి॥ అత్ర వా హాబాదకస్నానంవిప్రపాదావనేజనం। గాయత్ర్యాజపమర్ఘ్యంచ ఆదిత్యాభిముఖశ్చరేత్॥ స్కాందేపి॥ ఉదయాత్ప్రాక్చతస్రస్తు నాడికాహ్యరుణోదయః తత్రస్నానం ప్రశస్తం స్యాత్సహి పుణ్యతమస్స్మృత ఇతి॥ స్నానాంగ తర్పణముక్తం। వాధూలోక్తే॥ నిత్యం నైమిత్తికం కామ్యం త్రివిధం స్నానముచ్యతే। తర్పణంతు భవేత్తస్య తత్త్వేన పరికీర్తితమితి॥ విష్ణుః॥ స్నా

---

నిడికొనినను సంకేవలయును. నివీతమిట్లు మూడువిధములు. ఇట్లు దేవర్షి తర్పణములను జేసి యొడ్డున యక్ష్మ తర్పణముం జేయవలయును. శారీరమల విసర్జనము వలన జలమును దోషయుక్తముగాఁ జేసితిగాన నాదోషము శమించుటకై యక్ష్మను గూర్చి తర్పణము జేయుచున్నానని చేయవలయును. దేవర్షి పితృ తర్పణములు చేయుదనుక స్నానవస్త్రమును దుక గూడదు. మనుజుడు స్నానమునకై పోవుచుండ దేవతలు, పితృ గణంబులును వాయురూపులై దప్పిగొని కూడనరుదెంతురు. వారికితర్పణము చేయకయే స్నానవస్త్రము నదుకుచోవ వారలు నిరాశులై పోవుదురు. యేకే చాస్మత్కులే జాతా అనుమంత్రము నుచ్చరించుచు వస్త్రనిష్పీడనోదకము నొసగవలయును. స్నానముచేసిన వస్త్రముతో శిరస్సు తుడిచికొను నెడస్నానము వ్యర్థము. తిరిగి స్నానము చేసినగాని శుద్ధుడుగా నేరడు.

తశ్చార్ద్రవాససాదేవర్షి పితృతర్పణమాభస్థఏవ కుర్వీతేతి॥ వృద్ధమనుః॥ మనుష్య తర్పణే స్నానవస్త్ర నిష్పీడనే తథా। నివీతీతు భవేద్విప్రస్తదా మూత్ర పురీషయోః॥ మానుషేష్వంస యోస్సక్తం మైథునేతూర్ధ్వభాగికం। తర్పణేంగుళ యోస్సక్తం నివీతం త్రివిధం స్మృతమితి॥ స్మృత్యంతరే॥ దేవర్షి తర్పణం కృత్వా యక్ష్మాణాం తర్పయేత్తతః। యన్మయాదూషితం తోయం శారీరమల సంశ్రయాత్। తద్దోష పరిహారాయ యక్ష్మాణాం తర్పయామ్యహ మితి॥ యోగయాజ్ఞవల్క్యః॥ యావద్దేవానృషీంశ్చైవ పితౄంశ్చైవ యోన తర్పయేత్। తావన్నపీడయేద్వస్త్రం యేన స్నాతోభవేన్నరః॥ నిరాశాః పితరోయాంతి స్నానవస్త్రేని పీడితే॥ ఇతి॥ వృద్ధవసిష్ఠః॥ స్నానార్థ మభిగచ్ఛంతం దేవాః పితృగణాస్తథా। వాయుభూతాస్స మాయాన్తి తృషార్తాస్సలి లార్థినః। నిరాశాస్తే నివర్తన్తే వస్త్ర నిష్పీడనే కృత ఇతి॥ వస్త్రనిష్పీడ నమంత్రస్తు॥ యేకేచాస్మత్కులేజాతా అపుత్రా గోత్రిణో మృతాః। తేగృహ్ణంతు మయాదత్తం వస్త్ర నిష్పీడ నోదకమితి॥ శౌనకః॥ స్నానవస్త్రేణ యోవిప్రః శరీరం పరిమార్జతి। స్నానం వృథైవభవతి పునస్నానే నశుధ్యతీతి॥ స్నానానంతరం వాససీప రిదధ్యాత్॥ మత్స్యపురాణే॥ ఏవం స్నాత్వాతతః పశ్చాదాచమ్యతువిధానతః। ఉత్థాయవాససీ శుక్లేశుద్ధేతు పరిధాయవై। ద్విరాచామేదితి శేషః ఆర్ద్రవస్త్ర విసర్జనే విశేష ఉక్తః॥ స్నానం కృత్వార్ద్ర వస్త్రంతు ఊర్ధ్వ ముద్ధృత్య నిక్షిపేత్। స్నానవస్త్ర మధస్తాచ్చేత్పున స్నానేనశుధ్యతీతి॥

## వస్త్ర ధారణం.

వస్త్రవిషయే విశేష మాహభృగుః॥ బ్రాహ్మణస్యసితం వస్త్రం

---

### వస్త్రధారణము.

బ్రాహ్మణుడు తెల్లని వస్త్రమును, క్షత్రియుఁడు ఎఱ్ఱనిదానిని, వైశ్యుఁడు పచ్చని దానిని శూద్రుఁడు నల్లనిదానిని ధరింపవలయును. సంపదగలవాఁడు వస్త్రమును చినిగిన దాని గాని, మాసిన దానిగాని ధరింపఁగూడదు. రంగుబట్టలను, నల్లనిదానిని ధరింప

నృపతేరక్త ముల్బణం। పీతంవైశ్యస్య శూద్రస్య నీలంమల వదిష్యతే॥ ఇ
తి॥ మను॥ నజీర్ణం మలవద్వాసోభవేచ్చ విభవేసతీతి॥ ఆపస్తంబః॥ స
ర్వరాగ వాసాం సివర్జ యేత్కృష్ణంచ స్వాభావికమితి॥ ఉశనాః॥ నా
వేష్టితశిరాః కృష్ణకాషాయ వాససావా దేవపితృకార్యాణి కుర్యాదితి-
దేవలః॥ స్వయం, ధౌతేన కర్తవ్యాః క్రియాధర్మ్యావిపశ్చితా। నతు నేజ
కధౌతేనవహతేన నకుత్రచిదితి- అహతలక్షణ మాహపులస్త్యః॥ ఈష
ద్ధౌతం నవం శ్వేతం సదశం యన్నధారితం। అహతం తద్విజానీయాత్స
ర్వకర్మసు పావనమితి॥ ధౌతం ప్రక్షాళితం॥ అధౌతం కారుధౌతంచ క
ర్మకాలేవి వర్జయేత్ చండాలనిర్మితం వస్త్రం సర్వదాపరి వర్జయేత్।
చంద్రికాయాం॥ అన్యదేవ భవేద్వాస శ్శయనాయ నరాధిప। అన్యద్ర
థ్యాసుదేవానా మర్చాయా మన్యదేవహి। అన్యచ్చ లోకయాత్రా యా
మన్యదీశ్వర దర్శనే॥ కటిసూత్రం వినాశ్రౌతం స్మార్తం కర్మకరోతియః॥
సర్వంతన్నిష్ఫలం వింద్యాత్సోపినగ్న ఇతిస్మృతః। నగ్నోమలినవస్త్రస్స్యా
న్నగ్న శ్చార్ద్రపటస్స్మృతః। నగ్నస్తుదగ్ధవస్త్రస్స్యాన్నగ్న స్స్యూతపట
స్తథేతి॥ స్మృతిరత్నావళ్యాం॥ సప్తవాతాహతం వస్త్రం శుష్క వత్ప్ర
తిపాదితం। ఆర్ద్రంవాపిద్విజాతీ నామాదృతం గౌతమాదిభిరితి॥ స్మృత్యే

---

రాదు. తలకువస్త్రము చుట్టుకొనిగాని, నల్లనిది, కషాయ వర్ణము కలవియగు వస్త్రము
ల ధరించిగాని దేవపితృ కార్యముల నాచరింపఁ గూడదు. ఉతికిన వస్త్రములను ధరించి
కర్మముల నాచరింప వలయు. చినుగనిదియు, అంచుగలదియు, ఇతరులు ధరింప నిదియు
నుదికినదియునగు వస్త్రమును ధరింప వలయు అన్త్యజులు నేసినవస్త్రము ధరింపరాదు
పండుకొను నప్పుడు, బజారున కేగునప్పుడు, పూజించునప్పుడు, శారీర కృత్యముల దీర్చి
కొను నప్పుడు, ఈశ్వరుని దర్శించు నప్పుడును వేరువేరు వస్త్రముల ధరింపవలయు. మొ
లత్రాడులేక శ్రౌత స్మార్త కర్మముల నాచరింప గూడదు. మాసినవస్త్రము ధరించినవా
డును, తడిబట్ట గట్టుకొనిన వాఁడును, కాలినగుడ్డను ధరించిన వాఁడును, వలను లోలే
వస్త్రము ధరించిన వాఁడును దిగంబరులని చెప్పఁబడుదురు. ఏడుమార్లు గాలికి బట్టినచో
వస్త్రము పొడి బట్టతో తుల్యమైనది గాన జపహోమాదులయందు నుపయోగింప వచ్చు

ర్ధసాహే॥ శుచీవో హవ్యామరుత ఇత్యుక్త్వా శుద్ధమంబరం। సంప్రోక్ష్య
దేవస్య త్వేతిగృహీత్వా చావధూనయేత్। అవధూతగ్ం రక్ష ఇత్యవ
ధూయ— ఉదుత్యం జాతవేద సమితి వస్త్రమాదిత్యం దర్శయిత్వా- ఆ
వహన్తీతి వాసః పరిధాయ ద్విరాచామేదితి॥ స్నానం దానం జపం
హోమం స్వాధ్యాయం పితృతర్పణం। నైకవస్త్రోద్విజః కుర్యాచ్ఛ్రా
ద్ధ భోజన సత్క్రియాః॥ గోభిలోపి॥ ఏకవస్త్రోన భుంజీత నకుర్యాద్దేవ
తార్చనం। నచార్చయేద్ద్విజా నగ్నౌ కుర్యాదేవం విధం బుధ ఇతి॥ ఏకవ
స్త్రస్యలక్షణమాహ॥ స ఏవ॥ సవ్యాదంసాత్పరిభ్రష్టః కటిదేశధృతాం
బరం। ఏకవస్త్రంతు తంవిద్యాద్దైవే పిత్ర్యేచ వర్జయేదితి॥ చంద్రికా
యాం॥ యజ్ఞోపవీతే ద్వేధార్యే శ్రౌతే స్మార్తేచ కర్మణి తృతీయ ముత్త
రీయంచ వస్త్రాభావే తదిష్యత ఇతి॥

## అథ స్నాన భేదః.

ప్రాతస్స్నాన ప్రసంగేన స్నానాంతరాణ్యుచ్యంతే। తత్ర శంఖః॥
స్నానంతు ద్వివిధం ప్రోక్తం గౌణముఖ్య ప్రభేదతః। తయోస్తు వారు
ణంముఖ్యం తత్పునష్షడ్విధం భవేత్। నిత్యం నైమిత్తికం కామ్యం క్రి

---

టీ. ధరింపబోవు వస్త్రమును, శుచీవో హవ్యా అనుమంత్రముచే ప్రోక్షించి, దేవస్యత్వా
అనుమంత్రముచే గ్రహించి, అవధూతగ్ం రక్ష అనుమంత్రమున విదలించి- ఉదుత్యం జా
తవేదసం అనుమంత్రమున సూర్యునకు గనబరిచి, ఆవహన్తీ అను మంత్రమున ధరింప వ
లయు. స్నానము, దానము, జపము, హోమము, స్వాధ్యాయము, పితృతర్పణము - శ్రా
ద్ధము- భోజనము, మున్నగు సత్కర్మములను ఒంటి బట్టతో నాచరింప రాదు. శ్రౌత
స్మార్త కర్మములయందు రెండు యజ్ఞోపవీతముల ధరింపవలయును. మూడవది యుత్తరీ
యార్థమై ధరింపవలయు.

## స్నానభేదములు.

ప్రాతస్స్నాన ప్రసంగవశమున స్నానాంతరములను చెప్పుచున్నవి. గౌ
ణ మనియు' ముఖ్యమనియు స్నానము రెండువిధములు. వానిలో జలస్నానము ముఖ్యమై
నది. అది' నిత్యము' నైమిత్తికము' కామ్యము' క్రియాంగము మలాపకర్షణము, క్రియా

యాంగం మలకర్షణం। క్రియాస్నానం తథాష్టమం షోఢా స్నానం ప్రకీర్తితం॥ ఏతేషాం లక్షణమాహ సఏవ॥ అస్నాతిస్తు పుమాన్ స్నాత్వా జప్యాద్గృహ వనాదిషు। ప్రాతస్స్నానంత దర్థంతు నిత్య స్నానం ప్రకీర్తితం। చండాల శవధూపాది స్పృష్ట్వాస్నానం రజస్వలాం। స్నానార్హాస్తు యదాస్నాతి స్నానం నైమిత్తికం హితత్। పుష్యస్నానాదికం యత్తుదైవజ్ఞ విధిచోదితం। తద్ధికామ్యం సముద్దిష్టం సకామస్తత్ర్ప యోజయేత్। జప్తుకామః పవిత్రాణి హ్యార్చ్యర్త్యః దేవతాః పితౄన్। స్నానం సమాచరేద్యస్తు క్రియాంగం తత్ప్రకీర్తితం। మలాపకర్షణం నామస్నాన మభ్యంగపూర్వకం। మలాపకర్షణార్థాయ ప్రవృత్తిస్తస్య నాన్యథా। సరస్సుదేవ ఖాతేషు తీర్థేషు చనదీషుచ। క్రియాస్నానం సముద్దిష్టం స్నానంతత్రమతా క్రియేతి॥ నాన మేవ తత్రక్రియా॥ కార్యతయా విహితేత్యర్థః॥ మధ్యందిన స్నానమపి నిత్యమేవ॥ తథాచ– విష్ణుః॥ ప్రాతస్స్నాతోపి విధివత్స్నానం మధ్యందినే చరేత్। శక్తశ్చేదన్యథా రోగీకాట్యాస మ్మార్జనంచ రేదితి॥ మంత్రవదేవస్నానం సఫల మిత్యాహ యాజ్ఞవల్క్యః॥ మత్స్యకచ్ఛప మండూకాస్తో యేమగ్నా దివానిశం।న

---

స్నానము నని యారువిధములు. అనుదినము ప్రాతః కాలమున జేయునది నిత్య స్నానము, చండాలాదుల స్పృశించి నందున జేయునది నైమిత్తికము. పుష్య స్నానము మున్నగునది కామ్య స్నానము' జపహోమాదులను జేయుటకై జేయునది క్రియాంగస్నానము' అభ్యంగము మున్నగునది మలాపకర్షణము' పుణ్యతీర్థములు'నదులు మున్నగు వానియందు 'స్నానమే ముఖ్యముగా జేయఁబడునది క్రియాస్నానము' మాధ్యాహ్నిక స్నానంబును నిత్యమే యగు. ప్రాతః కాలమున స్నానము చేసినను శక్తుఁడగునేని మధ్యాహ్నమునను స్నానము చేయవలయు. అశక్తుఁడగునేని తడిబట్టతో తుడిచికొన వలయు. మంత్రములతో స్నానము చేసిననే సఫలమగు. అట్లుగానిచో చేపలు, తాబేళ్లు, కప్పలును రేయిం బవళ్లు నీరిలో నున్నను వానికి స్నానఫలము లేనట్లే యూరక మునిగిన వారికిని లేదు. బ్రహ్మక్షత్రియ వైశ్యులుమాత్రము మంత్రములతో స్నానము చేయవలయు. స్త్రీలకు శూద్రులకును సమంత్రకమగు స్నానములేదు.

తేషాం హిస్నానఫలం తత్రైవ విధినర్జితమితి॥ విష్ణుః। బ్రహ్మక్షత్ర విశాం చైవ మంత్రవత్స్నాన మిష్యతే। తూష్ణీమేవహి శూద్రస్య స్త్రీణాంచ కురునందన॥ ఇతి॥ అథస్నానార్హా జలాని.

నదీషు దేవఖాతేషు తటాకేషు సరస్సుచ। స్నానం సమాచరే న్నిత్యం గర్తప్రస్రవణేషుచ। మనుష్యైర ఖాతో జలాశయో దేవఖాతః॥ భరద్వాజః॥ మహానదీన దస్స్రోతస్సర స్త్రిదశఖాతకాః। నాళస్తటాకః కుండంచ ధారాకూపస్త్విమేదశ। చాంద్రాయణత్రయం కృచ్ఛ్రంగాయత్ర్యా అయుతత్రయం। ఆప్లావనం మహానద్యాం తుల్యమేతచ్చ తుష్టయం॥ ఉద్భూతా భూధరాదబ్ధిం ప్రవిశత్యంబు సంతతిః।యాసామహానదీ జ్ఞేయా సర్వపాపప్రణాశనీ। ఉద్భూతాపూర్వదిగ్భాగశైలేసలిలసంతతిః। యాప్రత్యక్సాగరం యాతిసానదస్స్వితి గద్యతే॥ భూధరాదుద్భూమి భాగో త్థాయామేవ జలసంతతిః। నదీంవిశతిసాస్రోతః స్వయం వాయత్ర లీయతే॥ పర్వతస్యతటేవాగ్రె వృత్తాకార జలాస్పదం। అశోష్యం యత్సరస్తత్స్యాత్త్రివిశాలంసుపంకజః॥ భువ్యద్రౌచాతటస్పర్శమశోష్యంయజ్జలాశయం। విశాలమవిశాలం వాదేవఖాతఇతిస్మృతః॥ గ్రామార్థంవాథసస్యార్థంనృభిః స్వప్రష్టాంబుపద్ధతిః। యానద్యాద్యంబు ధామభ్యః తాం నాళా

---

స్నానార్హజలములు.

నదులయందు, దేవఖాతముల యందు, కొలనుల యందు' కుంటల యందు' నిర్ఝరముల యందును స్నానముచేయవలయును. మనుజులు త్రవ్వని మడుగునకు దేవఖాతమని పేరు. మహానది' నదము' స్రోతస్సు' సరస్సు' దేవఖాతము' నాళము'తటాకము' కుండము' ధార' కూపమునని జలాశయములుపదివిధములు. మూడు చాంద్రాయణములు, ఒక కృచ్ఛ్రము, ముప్పది వేలు గాయత్రి జపము' మహానదియందు స్నానము' చేయుట ఈనాల్గును సమానములగును. పర్వతము నందు బుట్టి సముద్రమున గలయు ప్రవాహమునకు మహానదియని పేరు. ఇదిసకల పాపములఁ బోగొట్టును. తూర్పుదిక్కున నున్న పర్వతమునఁ బుట్టి పశ్చిమ సముద్రమున గలియు ప్రవాహమునకు నదమని పేరు. పర్వతమునందు బుట్టి మహానది యందు గలియుప్రవాహమునకు స్రోతస్సని పేరు. పర్వతము

ఖ్యా ప్రచక్షతే॥ అర్ధచంద్రా కృతిర్యస్య సంస్థానస్య తువారిణః। గ్రా మేవసేపి వా శైలే తత్తటాక ఇతి స్మృతః॥ చతురశ్రం శిలాబద్ధం ససో పానమ థోజలః। దార్వ్యష్టకాది ఘటితం యత్తత్కుండ మితిస్మృతం॥ గి రిశృంగాద్వినిర్గత్య యాపతత్యంబు సంతతిః॥ అనాధార మధోభూమా సాధారేత్యభిధీయతే। పంచహస్త విశాలం యత్ ఖాతం వృత్తమ థోజలం। దార్వ్యష్టకాది ఘటితం యత్తత్కూప మితిస్మృతమితి॥ నద్యా ద్యలాభే మనురాహ॥ అలాభే దేవఖాతానాం సరసాం సరితాంతథా। ఉద్ధృత్య చతురః పిండాన్పారక్యే స్నానమాచరేదితి॥ మృణ్మయాను ఘటాన్వర్జి త్వైరై స్నానం నిషిద్ధం॥ తథాహి॥ ఖంజాదర్శే॥ శూర్పవాయు ర్నఖాగ్రాంబు స్నానవస్త్రం ఘటోదకం। మార్జనా రేణుకేశాంబుహ న్తిపుణ్యాం పురాకృత మితి॥ చంద్రికాయాం॥ నద్యాంతు విద్యమానా యాం నస్నాయాదన్య వారిషు। నస్నాయా దల్పతో యెచవిద్యమానే బహూదకే॥ సముద్రస్నానంతు పర్వకాలేవి హితం॥ మహాభారతే॥ అ శ్వత్థసాగరౌసేవ్యౌ నస్ప్రష్టవ్యౌ కదాచన। అశ్వత్థం మందవారేషు సాగరం పర్వణి స్పృశేత్॥ అన్యదాతుకురుశ్రేష్ఠ శవ యోనిర పాం

---

మీదగాని దరిని గాని గుండ్రముగా నుండి విశాలమై తామరలతో గూడి యెండిపోని జలముగలది సరస్సని పేరు. భూమియందుగాని కొండమీదగాని గట్టులేనిదై నీరెండిపోని దానికి దేవఖాతమని పేరు. నదులు మొదలగు జలాశయముల వద్దనుండి గ్రామములవద్ద కు గాని చేలవద్దకుగాని మనుజులు త్రవ్విన కాలువకు నాళమని పేరు. గ్రామము సం దుగాని వనమునందుగాని అర్ధచంద్రాకారముగా నున్న జలసంస్థానము నకు తటాకమని పేరు. నలుచదరముగా రాళ్లచే మెట్లు గట్టబడిన దానికి కుండమని పేరు. పర్వత శిఖ రమునుండి దిగువబడు జలధారకు ధార అనిపేరు. అయిదు చేతులు పొడవలుగా వెడల్పుగలిగి మెట్లు లేకుండ రాళ్లచే గట్టబడి యున్న దానికి కూపమని పేరు. ఇదియే జేదుడుబావి.

దేవఖాతములు సరస్సులు నదులుసంభవింప కున్నయెడ ఇతరులు త్రవ్వించిన చెరువు నందు నాలుగు మంటి ముద్దలు తీసివేయుచున్నవైచి యందు స్నానము చేయనగును. మంటికు డవలతో తెచ్చిన నీరు స్నానమునకు పనికిరాదు. చేట గాలి... వచ్చినగాలి, గోటి

పతిః। కుశాగ్రేణాపి కౌంతేయ న స్ప్రష్టవ్యో మహోదధిః॥ అజన్మ శ
తసాహస్రే యత్పాపం కురుతే క్వచిత్। ముచ్యతే సర్వపాపేభ్యః స్నా
వలవణాంభసి॥ గర్భిణీ గృహిణీ యస్య దూరయాత్రాం స వర్జయేత్।
వపనం సాగరస్నానం శవవాహాంచ వర్జయేదితి॥ జైమినిః॥ సేతుర్నా
పేక్షతే కాలం నిత్యం స్నానం ప్రశస్యతే॥ నిషిద్ధకాల భేదస్తు సేతోరస్య
త్ర కశ్చిత్॥ ఇతి॥ అత్రోదకాంతరేణాచమనం కర్తవ్యం॥ అపో రాభి
రాచామేదితి స్మరణాత్॥ తైత్తిరీయ శ్రుతౌ॥ తస్మాత్స ముద్రస్య నపి
బంతీతి॥ తర్పణాదికంతు తేనైవ కార్యం॥ నిషేధాభావాదితి కేచిత్॥
తచ్చింత్యం॥ తర్పణస్యాపి పిత్రాదీనాం పిపాసా నివృత్త్యర్థమేవ దీయ
మానత్వాత్॥ అన్యేనైవేతి జ్ఞేయం॥ యోగయాజ్ఞవల్క్యః॥ నద్యా
మస్తమితే స్నానం వర్జయేత్తు సదా బుధః। నద్యాం స్నాత్వా నదీమన్యాం
న ప్రశంసేత ధర్మవిత్॥ శౌనకోపి॥ న నదీషు నదీం బ్రూయాత్ పర్వ
తేషు స పర్వతం। నాన్యత్ప్రశంసేత్తత్రస్థో తీర్థేష్వాయతనేషు చేతి॥ వ్యా

---

కొన యందగు నీరు, స్నానము చేసిన వస్త్రము- కుండతో తెచ్చిననీరు- చీపురుత్రోచి
మ్మగా వచ్చినదుమ్ము- వెండ్రుకల మీదినుండి పడిన జలము ఇవి పూర్వపుణ్యమును నా
శము చేయును.

నదియుండగా నితరజలముల యందు స్నానము చేయఁ గూడదు. ఎక్కువజలము
గల మడుగు లుండగా కొద్దిజలముగల కూపాదుల యందు స్నానము చేయఁ గూడదు.

సముద్ర స్నానము పర్వకాలముల యందె చేయవలయు. రావిచెట్టును- స
ముద్రమును గూర్చి వందనము చేయవలయు గాని వానిని తాకఁ గూడదు. శనివారమునా
డు రావిచెట్టును- అమావాస్యాది పర్వముల యందు సముద్రమును తాకవలయును. కడ
మ సమయముల యందు సముద్రము పవిత్రమైనది కాదు. కావున దర్భకొనచేనైన దా
నిని తాకగూడదు. పెక్కువేల జన్మముల యందుఁ జేసిన పాపమంతయు సముద్రమున
కు వందనము చేయగానె తొలంగును.

తనభార్య గర్భవతిగా నుండునెడ దూరదేశ గమనమును- వపనమును- సముద్రస్నా
నమును- పీనుగును మోయుటను విడిచిపెట్టవలయు. పర్వకాలము కానప్పుడు స్నానము
చేయఁ గూడదను నిషేధము సేతువునకు లేదు. కావున అందు ప్రతిదినము స్నానము [illegible]

సః॥ కురుక్షేత్రం గయాం గంగాం ప్రభాసం నైమిశం తథా। తీర్థాన్యే
తాని సర్వాణి స్నానకాలేస్మరేద్బుధ ఇతి॥

వర్జ్యోదకాని.

వర్జ్యోదక మాహ వ్యాసః॥ నద్యాయచ్చ పరిభ్రష్టం నద్యాయ
చ్చవినిస్సృతం। గతప్రత్యాగతం యచ్చ తత్తోయంపరి వర్జయేత్ ॥ ప
రిభ్రష్టం= విచ్ఛిన్నం। బోధాయనోపి॥ స్నానం రజకతీర్థేతు భోజనం గ
ణికాగృహే। పశ్చిమోత్తరశాయిత్వం శక్రాదపి హరేచ్ఛ్రియ మితి॥
శాండిల్యః॥ నస్నాయాత్సహ శూద్రేణ నస్త్రీభిర్నచ నాస్తికైః। నపా
పైశ్చన బాలైశ్చన రోగాశుచి భిర్నరైః॥ కాత్యాయనః॥ యాశ్చోష
ము పగచ్ఛంతి గ్రీష్మేకు సరిత్సో భువి। తాసు ప్రావృషి నస్నాయాద పూ
ర్ణే దశవాసరే॥ ఉష్ణోదకం నిషేధతి యాజ్ఞవల్క్యః॥ వృథాతూష్ణోదక
స్నానం వృథా జప్యమ వైదికం। వృథాత్వ శ్రోత్రియేదానం వృథాభు
క్తమ సాక్షిక మితి॥ యత్తూష్ణోదక స్నానవిధానం॥ ఆపస్స్వ భావతో
మేధ్యాః కింపునర్వహ్ని సంయుతా ఇతి॥తదాతురస్నాన విషయ మితి
కేచిత్। అనాతురస్యాప్యుష్ణోదక మనిషిద్ధ మిత్యాహ-యమః॥ నిత్యం నై

---

ష్ణమే యగును. ఉప్పునీరుతో నాచమనము నిషిద్ధముగాన వేరుజలముతో నాచమనము
చేయ వలయుగాని సముద్ర జలముతో నాచమనము చేయఁగూడదు.

నిషేధము లేదుగాన తర్పణాదులు సముద్ర జలముతో చేయ నగునని కొంద
ఱు చెప్పిరి గాని ఆతర్పణాదులును పితృదేవతలు మొదలగు వారి పిపాసను (దప్పిన) తీ
ర్పనె యేర్పడినవి గాన ఇతర జలములతోన తర్పణాదులు చేయవలయు.

సూర్యుండస్తమింపఁగా నదియందు స్నానము చేయఁ గూడదు. ఒక నదియందు
స్నానము చేయునప్పుడు వేరొకనదిని ప్రశంసింపఁ గూడదు. అనియాజ్ఞ వల్క్యుఁడు చె
ప్పెను. ఒకనదియొడ్డున నుండి వేరొకనదిని- ఒకపర్వతము మీదనుండి. వేరొకపర్వతము
నుఇట్లేతీర్థములయందు- క్షేత్రములయందును ఒక్కచోనుండి వేరొకదానిని ప్రశంసింపఁ
గూడదు.

కురుక్షేత్రము- గయ- గంగ- ప్రభాసము- నైమిశము అనువానిని స్నాన కా
లమునందు స్మరింప వలయునని వ్యాసుఁడు చెప్పెను.

మిత్తికం చైవక్రియాంగం మలకర్షకం। తీర్థాభావేతు కర్తవ్యముష్ణోదక కుశోదకైరితి। గౌతమః। శివలింగ సమీపేతు యత్తోయం పురతస్థితం। శివగంగేతివిఖ్యాతం తత్ర స్నాత్వా శివం వ్రజేదితి।

మృదాద్యాహరణం.

దక్షః॥ చతుర్థేచ తథాభాగే స్నానార్థం మృదమాహరేదితి। యాజ్ఞవల్క్యః॥ న ప్రాతర్నూర్తికాస్నానం నచభౌమార్కవారయోః॥

---

భాషని నీవు.

నదిపక్కి వహించు నప్పుడు పాశ్చ్యముల యొక్క పల్లపు చోట్ల కొంతనీరు నిలిచియుండును, వర్షించి వరదగా కొంతనీరు పాశ్చ్య ప్రదేశముల వైపు ప్రవహించి పోవును, ఎదురుపోయి కొంతనీరు వెనుకకు తిరిగి వచ్చును. ఈనదులయందు స్నానము చేయరాదని అత్యాయుఁడు చెప్పెను.

బాలశేఖర స్నానము చేయుట, వేశ్యయింట భుజించుట, పవిత్ర శిలగను పుస్తక ములగను పడుకొనుట దేవేంద్రుని సంపదనైన పోగొట్టునని బోధాయనుఁడు చెప్పెను.

శూద్రులు, స్త్రీలు, నాస్తికులు, పాపులు, బాలురు, రోగులు, అపవిత్రులు అను వారితో కలసి స్నానము చేయరాదని శాండిల్యుఁడు చెప్పెను.

గ్రీష్మఋతువునందు ఎండిపోవు చిన్న నదులయందు వర్షకాలమున నీరురాగా పదిదినముల లోపల స్నానము చేయరాదని కాత్యాయనుఁడు వచించెను.

పెడసరముతో స్నానము చేయుట, వైదికములు గాని మంత్రముల జపించుట శ్రోత్రియుఁడు గాని వానికి దానము చేయుట, అతిథి లేక తానొక్కఁడే భుజించుట ఇవి యన్నియు వ్యర్థములని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

జలము స్వభావమునసే పవిత్రమైనది. దానికి నగ్ని సాహచర్యము కలుగ నెన మరియు పవిత్రమని చెప్పవలెనని ఉష్ణోదక స్నానవిధి అప్పస్తూ విమయమని కొందరి యాశయము.

నిత్యము, నైమిత్తికము, క్రియాంగము మలకర్షకమును స్నానము, పుణ్య తీర్థము సంభవింప నప్పుడు ఉష్ణోదకముచే గాని, పరోదకముచే గాని, చేయవచ్చునని యముఁడు చెప్పుటచే స్పష్టముగ ఉష్ణోదక స్నానము కూడుననియు తెలియుచున్నది.

శివలింగమున కొంచెము దగ్గరగా యున్న జలమునకు శివగంగయని పేరు. అందు స్నానము చేయువాఁడు సకలతీర్థములను పొందును. అని గౌతముఁడు చెప్పెను.

మధ్యందినేతుకర్తవ్యం నాతిమధ్యందినే౦వా| గృహ్యపరిశిష్టే| శుద్ధదేశే ఖనిత్రేణ భువం గాయత్ర్యా ఖాత్వారంభం చతురంగుళ ... దస్య దస్త్రాన్మృదంతథ ఖాత్వాగాయత్ర్యా దాయమృద ముపాదాయ తాం శుచౌస్థలేనిధాయ గాయత్ర్యా ప్రోక్షయేదితి| మాధవీయే| జలందేవ గృహం చైవ శయనంచ ద్విజాలయం| నిర్ణిక్త పాదః ప్రవిశేన్నా నిర్ణిక్తః కదాచనేతి| వ్యాసః| షడ్భిః పాదౌ చతుర్భిశ్చ జంఘే నాభిం కటింత్రిభిః| మృదైకయా శిరః పశ్చాత్తతః కుర్యాత్ప్రమార్జనం| మృత్తికాచ సమాదిష్టా త్వార్ద్రామలకమాత్రికేతి| వ్యాసః| అంగుష్ఠాంగుళిభిశ్చ న శోధ్ర దృశ్యాసి కాముఖం| పీడ్యచాగ్రః ప్రతిస్రోతః త్రిర్ద పేదఘమర్షణం| ద్రుపదాద్వానాథ గాయత్రీ వేదేవాబ సనీయకే| సకృదంతర్జలే జప్త్వా

---

మృత్తికను తెచ్చుకొనుట.

దినమునకు నాల్గవ భాగమునందు స్నానార్థమై మృత్తికను తెచ్చుకొనవలయునని దక్షుడు చెప్పెను.

ప్రాతఃకాలమునను, మంగళవారమునను, భానువారమునను, మృత్తికాస్నానము చేయఁగూడదు. సూర్యుఁడు తీక్షణముగగల మధ్యభాగమునకు రానప్పుడు మధ్యాహ్న కాలమునందే చేయవలయును.

పరిశుద్ధమగు చోట గాయత్రి మంత్రమును చెప్పుచు త్రవ్వకోలచే త్రవ్వి, నాలుగంగుళముల పైనున్న మృత్తికను తీసివైచి లోని మృత్తికను గ్రహించి దానిని పవిత్రమగు చోట నడుగుద్దున నునిచి గాయత్రిచే జలము చల్లవలయునని గృహ్యపరిశిష్టము నందు గలదు.

జలమును, దేవగృహమును, శయనమును, బ్రాహ్మణగృహమును కాళ్లు కడుగుకొనక ప్రవేశింపఁగూడదు. కాళ్లు కడుగుకొనక ప్రవేశించు మనుజునకు మోక్షము కలుగదు. మృత్తికలో నాలుగు మూళ్లు పాదములను, నాలుగు మూళ్లు జంఘలను, మూడు మూళ్లు నాభిని, కటిప్రదేశమును, ఒక మూడు శిరమును గడిగికొని జలములో మార్జనము చేయవలయు ననియు, ప్రతిపదమును మృత్తిక పచ్చి ఉసిరికాయ యంతటిదై యుండవలయు ననియు వ్యాసుఁడు వచించెను.



స్నానము చేయునప్పుడు ... అఘమర్షణ మంత్రమును మూడుమారు జపింపవ

బ్రహ్మహత్యాం వ్యపోహతి। యోగయాజ్ఞవల్క్యః। మహత్యాతు లోకానపియః త్రిః పఠేదఘమర్షణం। అథాశ్వమేధావభృథమేవంతం మనురబ్రవీత్। ఇతి।

## మృత్తికా స్నానం.

మృత్తికా స్నానముక్తం బోధాయనేన। అథాతో మృత్తికాస్నానవిధిం వ్యాఖ్యాస్యామో బ్రాహ్మణానాం గృహస్థవానప్రస్థ పరివ్రాజకానా మశ్వక్రాంతే. సహస్ర పరమాదేవీతి భూమిం దూర్వా మభిమంత్ర్య, ఉద్ధృతాసీత్యుద్ధృత్య తతో లోష్ట మాదాయ - కాండాత్కాండాదితి ద్వాభ్యాం దూర్వా మాదాయ - మృత్తికే హనమేపాప మితి దూర్వాం లోష్టే ప్రక్షాల్య, యత ఇంద్ర స్వస్తి స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః స్త్రాతారమింద్ర మాపానమన్యః పరంమృత్యో అనుప

వేదమున వాజసనేయ శాఖయందు ద్రుపదాదివ ఋక్కు గలదు. జపం త్రిమును నీళ్లలో నుండి మూడుమార్లు జపించు నెడ బ్రహ్మహత్య వలని పాపంబైనను తొలంగును. అని వ్యాస మహర్షి పలికెను.

లోకములను వధించియు, అఘమర్షణ మంత్రమును మూడుమార్లు పఠించు నెడ అశ్వమేధ యాగము చేసి యవబృథ స్నానము చేసిన దానితో సమమగు పుణ్యము లభించునని మనువు చెప్పెనని యాజ్ఞవల్క్యుడు చెప్పెను.-

## మృత్తికా స్నానము.

బోధాయనుడు మృత్తికాస్నానము నిట్లు చెప్పెను బ్రాహ్మణాది గృహస్థులకు, వానప్రస్థులకు, యతులకు, సన్యాసులకు మృత్తికా స్నానము చేయు విధానమును తెలుపుచున్నాము అశ్వక్రాంతే- సహస్ర పరమాదేవీ అను మంత్రములచే భూమిని- గరికెను మంత్రించి- ఉద్ధృతాసి అను మంత్రముచే త్రవ్వి మృత్తిక తీసికొని- కాండాత్కాండాత్ అను మంత్రములచే గరికెను తీసి మృత్తికపై నుంచి- యత ఇంద్ర స్వస్తి- స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః- త్రాతారమింద్రం- అపాంతమన్యుః- పరం మృత్యో అనుపరేహి పంథాం అను మంత్రములచే మృత్తికలో కొంత భాగమును తూర్పు మొదలుకొని పది దిక్కుల యందు విసరి వేయవలయును, తరువాత, గంధద్వారాం అను మంత్రము

శేషైస్త్రిభిః ప్రతిమన్త్రం ప్రతిదిశం లోష్టముత్సృజ్య గన్ధద్వారామి తిలోష్టమాదాయ- ఉద్ధృతాసి జాతవేదస మితి లోష్టమాదిత్యం దర్శయిత్వా- శ్రీర్మేభజతు అలక్ష్మీర్మే నశ్యత్వితి శిరః ప్రదక్షి ణీకృత్య, సహస్రశీర్షేతి శిరఆలిప్య, అగ్నిర్ముఖా ఇతి ముఖం, ఇన్ద్ర గ్రీవామో జసాతి గ్రీవాం, మహో నిన్ద్రోవజ్రబాహురితి, బాహూ, సోమానం స్వ ర్ణమితి కుక్షౌ, శరీరం యజ్ఞశమల మితి శరీరం నాభిర్మే చిత్తం వి జ్ఞానమితి నాభిం, మాపాంత మవ్యురితికరం, విష్ణోర్ల లాటమసీతి పృష్ఠం, వరుణస్య స్తమ్భనమసీతి మేఢ్రం, ఆనందనాదావిత్యండౌ, పృథుచో రాజస త్యూరూ. జంఘాభ్యామితి జానుయోరిదం విష్ణురితి- త్రీణిపదేతి ద్వా భ్యాంపాదౌ- సజోషాఇన్ద్రేతి శేషం దూర్వాసహితం శిరసినిధాయ, హిరణ్యశృంగ మితి తీర్థంగత్వా- సుమిత్రాన ఆపఓషధయ ఇత్యాత్మా న మభిషించే దుదకాంజలి మాదాయ- లోష్టదేశే యుర్మి తాస్సన్తు భూయాసురితి ప్రథమం- ద్వేద్మోఽస్మాన్ద్వేష్టీతి ద్వితీయం - య.చ వ

---

చే మృత్తిక పట్టుకొని- ఉద్ధృతాసి జాతవేదసం అను మన్త్రముచే నామృత్తికను సూ ర్యునకు గనబరచి- శ్రీర్మేభజతు, అలక్ష్మీర్మేనశ్యతు అను మంత్రముచే శిరసునకు ప్ర దక్షిణముగా (త్రిప్పి, సహస్ర) శీర్షా అను మంత్రముచే శిరమున రాచి, అగ్నిర్ముఖా అను మంత్రముచే ముఖమున, ఇన్ద్రగ్రీవామోజః అనుమంత్రముచే మెడయందు, మహో నిన్ద్రో వ్రజబాహుః అనుమంత్రముచే బాహువుల యందు, సోమానం స్వర్ణం అను మంత్రముచే కుక్షియందు, శరీరం యజ్ఞశమలం అను మంత్రముచే కడమ శరీరము నందు నాభిర్మే చిత్తంవిజ్ఞానం అనుమంత్రముచే బొడ్డునందు, ఆపాంతమన్యుః అను మంత్రముచే చేతియం దు, విష్ణోర్లలాటం అను మంత్రముచే వీపునందు, వరుణస్య స్తంభనమసి అను మంత్రము చే మేఢ్రము నందు, ఆనంద నందౌ అను మంత్రముచే అండములయందు, పృథుచో రాజ అను మంత్రముచే తొడయందు, జంఘాభ్యాం అను మంత్రముచే జంఘలయందు, ఇదం విష్ణు త్రీణిపదా అను మంత్రములచే పాదములయందు రాచికొని, సజోషా ఇన్ద్ర అను మంత్రము చే మిగిలిన మృత్తికను గరికతో కూడ శిరమున నుంచికొని, హిరణ్య శృంగం అను మం త్రము ఛనుచ్చరించుచు తీర్థమునకుబోయి సుమిత్రాన ఆప ఓషధయః అను మంత్రముతో, [illegible]

యాం ద్విష్మ ఇతి తృతీయం. జపన్ బహిఃక్షిపేత్. ఆపోహిష్ఠామయోభువ ఇతి తిసృభిః- హిరణ్యవర్ణాశ్శుచయః పావకా ఇతి తిసృభిః- పవమానస్సువర్జన ఇత్యేతేనానువాకేన మార్జయిత్వా- నమోఽగ్నయేఽప్సుమతే నమ ఇతి నమస్కృత్య- యదపాం క్రూరమితి అద్భిస్త్రిరావృత్య- ఇమంమే గంగే ఇతి- ఆపోఽభిమంత్ర్య- ఋతంచ సత్యం చేత్యఘమర్షణ సూక్తేన ఆపోఽవగాహేత। దేవానృషీన్ పిత్రూంస్తర్ప్య శుచీనో హవ్యేతి వస్త్రమద్భిః ప్రోక్ష్య- దేవస్యత్వేతి వస్త్రమాదాయ- అవధూతగ్ం రక్ష ఇత్యవధూయ- ఉదుత్యం జాతవేదసమితి వస్త్రమాదిత్యం దర్శయిత్వా- ఆవహంతీతి వాసః పరిధాయ ద్విరాచామేత్। భూతప్రేత పిశాచాశ్చ యేచాన్యే నిశాచరాః। తేషాంస

---

ము చల్లుకొన వలయును. మరియు జలము దోసిలితో గ్రహించి- దురితాన్ని భూమియం- యాంచ వయం ద్విష్మః అను మంత్రముల జపము చేయుచు విడువవలయును. తరువాత- ఆపోహిష్ఠామయోభువః అనుమూడు మంత్రములచే- హిరణ్యవర్ణాః అనుమూడు మంత్రములచే- పవమానస్సువర్జనః అను మంత్రమును జపించుచు జలము చల్లుకొని- నమోఽగ్నయే- ప్సుమతే అను మంత్రముచే నమస్కారము చేసి- యదపాం క్రూరం అని జలమును మూడుమారులు త్రిప్పవలెది. ఇమంమే గంగే అను మంత్రముచే జలముల మంత్రించి- ఋతంచ సత్యంచ అను అఘమర్షణ సూక్తముచే మూడుమారులు మునుంగవలయును- అనంతరము దేవర్షి పితృతర్పణములు చేసి- శుచీనోహవ్యా అనుమంత్రముతో వస్త్రముపై జలము చల్లి దేవస్యత్వా అనుమంత్రముతో వస్త్రము గ్రహించి అవధూతగ్ం రక్షః అను మంత్రముతో దులిపి- ఉదుత్యం జాతవేదసం అనుమంత్రముతో నావస్త్రమును సూర్యునకు గనుపరచి- ఆవహంతీ అను మంత్రముతో ధరించి రెండు మారులు ఆచమనము చేయవలయును. భూత ప్రేత పిశాచములును- రాక్షసులును బాధకము లేకుండ బ్రహ్మకర్మను ప్రారంభించుచున్నాను. అని దర్భాసనము మీద కూర్చుండి మూడు ప్రాణాయామములు చేసి పిదప మూడుమారులు గాయత్రి జపింప వలయును. ఇట్లు చేయుట వలన పవిత్రుండగును. మరియు- గోహత్య- గురుతల్పగమనము స్వర్ణస్తేయము సురాపానము మొదలగు సకల పాపములు నశించునని భగవంతుడగు బోధాయనమహర్షి చెప్పెను.

లాది స్పర్శనేతు కార్యం వారుణమేవతు! కామ్యం మలాపకర్షణం చ నిత్యస్నానం చ వారుణం। ఇతరాణి యథాయోగ్యం దేశ కాలాద్య పేక్షయేత్॥ మనుః। దివ కీర్త్య ముదక్యాంచ సూతికాం పతితం తథా। శవం తత్స్పృష్టినం చైవ స్పృష్ట్వా స్నానేన శుధ్యతీతి॥ దివాకీర్త్య శ్చండాలః ఉదక్యా రజస్వలా॥ పరాశరః॥ దుస్స్వప్నం యది పశ్యేత్తు వాన్తే చ క్షుర కర్మణి। మైథునే ప్రేత ధూమే చ స్నానమేవ విధీయత ఇతి। మైథునే స్నానం ఋతుకాల విషయం। తదాహ శాతాతపః॥ ఋతౌ తు గర్భ శంకిత్వాత్ స్నానం మైథున కేస్మృతం॥ అన్యదా తు యథా- గచ్ఛేచ్చాపి చ మూత్రపురీష వదిత॥ అమృతావపి క్షాళనం స్నానం స్మర్యతే॥ అష్టమ్యాం చ చతుర్దశ్యాం దివా పర్వణి మైథునం। కృత్వా స చేల స్నానంతు వారుణేభిశ్చ మార్జయేదితి। చండాలాదీనాం వ్యవస్థానే దేశ పరిమాణ మాహ పరాశరః॥ యుగం యుగద్వయం చైవ త్రియుగం చ చతుర్యుగం॥

---

మిత్తిక స్నానము నిమేషు.

చండాలుని ముందలను తాకినప్పుడు వారుణ స్నానమే (జలస్నానమె) చేయవలయును, ఇట్లే కామ్య కర్మలు చేయునప్పుడును- మలాపకర్షణము నందును వారుణ స్నానమె చేయవలయు. దేశకాలముల ననుసరించి యితర ములగు స్నానముల నుపయోగింప వలయును- అనియున్నది. చండాలుని- రజస్వలను- ప్రసవించిన దానిని- పతితుని- శవమును తాకినవానిని తగులు కొని స్నానము చేసి శుద్ధుడగు నని మనువు వచించెను. దుస్స్వప్నము గాంచినప్పుడును- వాంతి చేసికొని నప్పుడును- క్షౌరము చేయించి కొనిన నప్పుడును- స్త్రీ సంగమము కలిగినప్పుడును- కాటిపొగ పారి నప్పుడును స్నానమె చేయవలయునని పరాశరుడు చెప్పెను. ఋతుకాలమున స్త్రీ సంగమము కలిగిన ప్పుడె స్నానము చేయవలయును. ఋతుకాలమున- గలుగు సంగమము వలన గర్భమేర్పడు గాన నప్పుడు స్నానము విధింప బడియెను. ఇతర సమయముల యందు అట్టి యనుమానము లేదుగాన మూత్రపురీషముల విడిచి నప్పుడు చేసికొనినట్లు శుద్ధిచేసి కొనవలయును అని శాతాతపుడు చెప్పెను. ఋతుకాలము కానప్పుడును కొన్ని సమయముల యందు స్నానము విధింప బడియెను ఎట్లనగ.

అష్టమి- చతుర్దశి- పగలు- పర్వకాలముల్లో విడిచి స్త్రీ సంగమము సంభవిం

చండాల సూతికోదక్యా పతితానామధః క్రమాత్ । తతస్సన్నిధి మా
త్రేణ సచేలస్నాన మాచరేదితి। అధః క్రమాత్ విపరీతక్రమాత్
మాధవీయే । నవపదం రథయుగమష్ట పద మనోయుగ మితి। ఉక్త ప్ర
వధానాభావే సచేలస్నానం। అజ్ఞానాద్గాత్ర స్పర్శనే స్నాత్వైవ లో
కనమధిక మిత్యర్థః। బుద్ధిపూర్వాంగస్పర్శేతు సచేల స్నాన మగ్ని స్ప
ర్శనం ఘృత ప్రాశనంచ విహితం। సంవర్తః। సంకటే విషమే చైవ దు
ర్గే చైవ విశేషతః। హట్టపత్తన మార్గేషు యథా సంభవ మిష్యతే। తృ
ణకాష్ఠాది ఘాతేన కుడ్యేనాంతరితే తథా। గోవాల వ్యజనేనాపి స్నాన
త్రత న విద్యతే। ఇతి స్మృతిరత్నే। ఛాయామంత్య శ్వపాకాదేః స్పృష్ట్వా
స్నానం సమాచరేత్ చత్వారింశత్పదాదూర్ధ్వం ఛాయా దోషో న వి
ద్యతే। ఇతి। స్నానేచ నిమిత్తాంతర ముక్తం చతుర్వింశతి మతే। బౌద్ధా
న్పాశుపతాంశ్చైవ లోకాయతిక కాపిలాన్ వికర్మస్థాన్ ద్విజా
న్దృష్ట్వా స వాసా జల మావిశేత్। స్పృష్ట్వా దేవలకంచైవ సవా సాజ

---

చుసెడ సచేల స్నానముచేసి వరుణ సూక్తములతో జలము మార్జనముచేసి కొన
వలయునని యున్నది.

అంత్యజాలు మొదలగు వారలెంత దూరమున నుండవలయును నను విషయము
న పరాశరుఁ డిట్లు చెప్పెను ఏమనిన.

అంత్యజాలు నాలుగు కాడుల దూరమునను- పాపమొనరించినవాఁడు మూడు కాడుల దూ
రమునను- రజస్వల రెండు కాడుల దూరమునను- పతితుఁడు ఒక్క కాడి దూరమునను నుండ
వలయును వానికంటె సమీపించు నెడ సచేల స్నానము చేయవలయును. కాడి యనగా-
ప్రకాశిలో తొంబది అంగుళముల పొడవును- బండి కాడి ఎనుబది అంగుళముల పొడవును గలది
యుండునని మాధవీయమున గలదు.

చండాలాదులను తెలియక తాకినెడ సచేలస్నానము చేసి మాగ్యార లో
చనంబును చేయవలయును- తెలిసి తాకినెడ సచేలస్నానము- అగ్ని సంస్పర్శము- ఘృత ప్రా
శనము గూడ విధింపఁ బడియెను. ఆపదయందును- త్రోలుటకు వీలులేని చోటను-
గడివీధియందును- పట్టణమునందును- మార్గమునందును వీలును బట్టి దోషము కల్పించ
వలయును [illegible] లేక గాని

మావిశేత్। దేవార్చన పరోయస్తు విత్తార్థీ వత్సరత్రయం॥ సవై దేవల కోనామహవ్యకవ్యేషు గర్హితః॥ఇతి॥ చంద్రజ్ఞానోత్తరే॥ నాస్తికాన్బహు దేవాంశ్చ నిందకాన్గ్రామయాజకాన్। తప్తాంకిత తనూ న్స్పృష్ట్వా సవాసాజల మావిశేత్। శాతాతపః॥ రజకశ్చర్మ కృచ్చైవ వ్యాధ జాలోప జీవితౌ। నిర్ణేజ కశ్చనటకస్తథా శైలూషకస్తథా॥ ముఖేభగస్తథో నాచా గ్రామ్యకుక్కుట సూకరౌ। ఏతైర్యద్దంగం స్పృష్ట్వా స్యాచ్ఛిరో వ

ర్జముగా నుండు నెడ స్నానాదులతో పనిలేదు. అని సంవర్తుఁడు చెప్పియుండెను.

అంత్యజులు- కుక్కమాంసము తినువారు మొదలగు వారి నీడసోకినయెడ స్నానము చేయవలయు. నలుబదియడుగుల కంటె పైన ఛాయాదోషము లేదనిస్మృతి రత్నంబున గలదు.

స్నానము నెడ నిమిత్తాంత రంబును చతుర్వింశతి మతంబునఁజెప్పఁ బడియెను బౌద్ధులను- అవైదిక పాశుపతులను- చార్వాకులను- సాంఖ్యులను- కులాచారము లేని ద్విజులను దాకు నెడ స్నానము చేయవలయును. పరులయొద్ద డబ్బుతీసికొని మూఁడు వత్సరములు పరార్థముగా దేవపూజ చేయువాఁడు దేవలకుఁడని చెప్పఁబడును. అట్టివానిని తాకినను సచేలస్నానము చేయవలయును- నాస్తికులను, బహు దేవార్చకులను, దేవాది నిందకులను గ్రామయాజకులను, శరీరమున తప్త చిహ్నముల ధరించిన వారిని దాకు నెడ సచేల స్నానము చేయవలయునని చంద్రజ్ఞానోత్తరము నందుగలదు.

చాకలి, చెప్పులు కుట్టువాఁడు,మృగముల, జంపువాఁడు, పక్షులను చేపలను బట్టువాఁడు, నాట్యముచేయువాఁడు, వేషము వేయువాఁడు, కోళ్లు, పందులు వీనిచే తాకఁబడిన శరీర భాగము గడిగికొని ఆచమనము చేయు నెడ పవిత్రుడగును.

కాకి, కోతి, పిల్లి, గాడిద, ఒంటె, కుక్క, పంది, వీనిపెంటను తాకు నెడ స్నానము చేయవలయునని వ్యాసుఁడు చెప్పెను.

బ్రాహ్మణుఁడు ఎంగిలినోటితో శూద్రాదులను చూడఁ గూడదు. ప్రమాదము వలన జూచు నెడ వారితోఁ గూడి భుజించిన దోషము నొందును.

తోడేలు, కుక్క, నక్క, కఱచు నెడ ద్విజుడు స్నానముచేసి గాయత్రిని జపింపవలయు ననియు వ్యాసుఁడె వచించెను.

అరుణోదయము ......... యుదయ స్నానము చే......... యను చెప్పన మ

ర్జం ద్విజాతిషు। తోయేన క్షాళనం కృత్వా ఆచాన్తః ప్రయతో మత ఇ
తి॥ తథా వ్యాసః॥ కాకవానర మార్జార ఖరోష్ట్రాణాం శునాంతథా।
సూకరాణామ మేధ్యం వై స్పృష్ట్వా స్నానం సచేలకమితి॥ పరాశరః॥ ఉ
చ్ఛిష్టవదనో విప్ర శ్శూద్రా దీన్నావలోకయేత్। అవలోకే ప్రమాదా
చ్చ సహస్రైర్భుక్త వాన్భవేదితి॥ సఏవ॥ వృకశ్వాన సృగాలాద్యై ర్దష్ట
శ్చేత్తు ద్విజోత్తమః। స్నాత్వాజపేత్స గాయత్రీం పవిత్రాం దేవ మా
తరమితి॥ అరుణోద యాత్పూర్వ భావిస్నానం నిషేధతిపరాశరః॥ భా
స్కరస్య కరైః పూతం రాత్రౌ రన్యత్ర దర్శనాత్। స్నానం దానం జ
పో హోమః కర్తవ్యో రాహుదర్శనే। అన్యదాత్వ శుచీ రాత్రి స్త
స్మాత్తాం పరివర్జయేదితి॥ మనుః॥ నస్నాన మాచరేద్భుక్త్వా నాతురో
న మహానిశి। నవాసోభి స్సహాజస్రం నావిజ్ఞాతే జలాశయే॥ పరాశరః॥
మహా నిశాతు విజ్ఞేయా మధ్యస్థ ప్రహ రద్వయం। ప్రదోష పశ్చిమౌ

---

చున్నాడు.

జలము సూర్యుని కిరణములచే పవిత్రమగును. రాత్రి కాలమున గ్రహణ సమయమున ను పవిత్రమై యుండును, గావున గ్రహణము లేనప్పుడు రాత్రి కాలమున స్నానము చేయఁ గూడదు.

రోగియు, భుజించిన వాఁడును, మహానిశా కాలమందును, పెక్కు వస్త్రముల గట్టుకొనియు, ఎఱుఁగని మడుగు నందును, స్నానము చేయఁ గూడదు. రాత్రి కాలమున నడిమిజాములు రెండును మహానిశయని చెప్పఁ బడును. ప్రదోష కాలమున, తుదిజాము నను పవలియందువలె స్నానము చేయనగును. అని పరాశరుఁడు చెప్పెను ఇది ఆపద్విషయము, ఇట్టు లంగీకరింప కున్నయెడ జలము సూర్యకిరణములచే పవిత్రమగునను పూర్వవచనము విరోధించు నని కొందఱు చెప్పుచున్నారు. కాని పూర్వవచనమునకే మహానిశయందు స్నానము చేయఁ గూడదను తాత్పర్యము గలదని గ్రహించుటయే యుక్తము. ఏలనను బహుప్రమాణములయందు మహానిశయందగు స్నానమే నిషేధింపఁ బడియున్నది. జలము సూర్యకిరణములచే పవిత్రమగును గాన నదిలేనప్పుడు స్నానము చేయఁ గూడదని యంగీకరించు నెడ అరుణోదయ కాల స్నానంబును ముఖ్యమే కాక పోవును. కావున నా వచనమునకు రాత్రాగ్రహణ కల్పనము ఎట్లును చెప్పక తప్పదు. దానిం బట్టి నేనువఱ మునస్నానము ఇపస్వాప యంబని క్లిష్టకల్పనము చేయంబనిలేదు.

యామాదిన పత్స్నాన మాచరే దితి॥ ఏతచ్చాపద్విషయం। అన్యథా భాస్కరస్య కరైరిత్యనేనవిరుధ్యతే॥ ఇతి కేచిత్. భాస్కరస్య కరైరితి పూర్వవచస్స్యైవ మహానిశాయాం స్నాననిషేధ కత్వేన యుక్తం బహుప్రమాణానురోధాత్. షట్త్రింశన్మతే॥ అపేయంహిసదాతోయం రాత్రౌమధ్య మయామయోః। స్నానం తత్రనకుర్వీత తథైవాచ మనక్రియాః। మూత్రోచ్చారే మహారాత్రౌ కుర్యాన్నాచ మనంతుయః।ప్రాయశ్చిత్తీయతే విప్రః ప్రాజాపత్యార్థ మర్హతీతి॥ వృద్ధమనుః॥ ఆరాధ్యం దేవమారాధ్య బంధూనప్య నుసృత్యచ। భుక్త్వా వ్యాఘానచ స్నాయాత్తై లేనాపినిశాస్వపి।ఇతి॥ స్మృత్యర్థసారే॥ అస్పృశ్య స్పర్శనేస్నానం. నిశ్యుష్ణేన జలేనచ। సద్యోః నాస్తమితే స్నాయాద్విశేషాన్మధ్యయామయో రితి॥ యోగ యాజ్ఞవల్క్యోపి। గ్రహణోద్వాహ సంక్రాంతి యాత్రార్తి ప్రసవేషుచ స్నానం నైమిత్తికం ప్రోక్తం రాత్రావపి న దుష్య తీతి॥

### అథగ్రహణస్నానం.

మహాభారతే । గంగాస్నానం ప్రకుర్వీత గ్రహణే చంద్ర

---

రాత్రి కాలమునడిమి జాములయందు జలముత్రాగ కూడదు. అప్పుడు స్నానంబును ఆచమనాది క్రియలును చేయఁ గూడదు. మహా రాత్రి యందైనను మూత్రోత్సర్గము చేసినప్పుడు ఆచమనము చేయని యెడల అర్థ ప్రాజాపత్యమును ప్రాయశ్చిత్తముగా చేయవలయును. అని షట్త్రింశన్మతమునందు గలదు.

దేవునిఁ బూజించియు- బంధువులతోఁ గూడి సంచరించియు, భుజించియు,రోగియు స్నానము చేయఁ గూడదు. రాత్రియందు కేవలస్నానము, అభ్యంజనస్నానంబునుచేయఁ గూడదు.

రాత్రి యందు తాకఁగూడని వారిని తాకినచో వేడినీటితో స్నానము చేయవలయు

గ్రహణము, వివాహము, సంక్రమణము,యాత్ర,ఆపద, ప్రసవముఇవి సంభవించినప్పుడు రాత్రియందైన స్నానము చేయనగును. అనియోగ యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

గ్రహణ స్నానము.

మహా భారతము నందు, గ్రహణ కాలమున గంగానది యందు గాని ఇతరన

సూర్యయోః । మహానదీషు చాన్యాసు స్నానం కుర్యాద్యథా విధీతి॥
శంఖః॥ వాపీకూపతటాకేషు గిరిప్రస్రవణేపివా। నద్యాంనదే దేవఖా
తే సరసీ షూద్ధృతాంబుని॥ ఉష్ణోదకే౽థవాస్నాయాత్ గ్రహణే చం
ద్రసూర్యయోః॥ ఇతి॥ ఉష్ణోదకస్నానమాతురవిషయం ॥ వ్యాసోపి॥
సర్వంగంగాసమంతోయం సర్వేబ్రహ్మసమాద్విజాః ॥ సర్వం భూ
మిసమందానం గ్రహణేచంద్రసూర్యయోః॥ గ్రహణే స్నానాకరణేప్ర
త్యవాయమాహ వసిష్ఠః॥ గ్రహణే సంక్రమేవాపి నస్నాయాద్య దిమా
నవః। సప్తజన్మసు కుష్టీస్యా ద్దుఃఖభాగీచ జాయతే। ఇతి॥ శాతాతపః॥
స్నానందానం తథాశ్రాద్ధమనంతం రాహుదర్శనే ఇతి ॥ అత్ర హిర
ణ్యేనామేన వా శ్రాద్ధం కుర్యాత్ ॥ బ్రహ్మాండపురాణే॥ ఆశౌచం జా
యతే నృణాం గ్రహణేచంద్రసూర్యయోః। రాహుస్పృశ్యేతయోః
స్నాత్వాదానాదా కల్పతేనరః॥ సర్వేషామేవ వర్ణానాం సూతకం రా
హుదర్శనే। స్నాత్వాకర్మాణి కుర్వీత పక్వమన్నం వివర్జయేత్ ॥ గ్రహ

దుల యందుగాని, స్నానము చేయవలయును. అనియున్నది. దిగుడుబావి, చేదుడు బా
వి, చెరువు, సెలయేరు, నది, నదము, దేవఖాతము మొదలగు వానియందుగాని, ఉష్ణోద
కముచే గాని గ్రహణ కాలమున స్నానము చేయవలయును. అని శంఖుఁడు చెప్పెను.
ఉష్ణోదక స్నానము అశక్తుల నుద్దేశించి చెప్పఁబడెను.

గ్రహణ కాలము నందు జలమంతయు గంగా రూపమైనది. విప్రులందఱు బ్ర
హ్మదేవుని తోఁ సములు. సకలదానములును. భూదానముతో సమానములగును. అని
వ్యాసుఁడు చెప్పెను. గ్రహణ కాలమున స్నానము చేయకున్న యెడ వసిష్ఠుఁడు ప్రత్య
వాయము కలదని చెప్పెను.

గ్రహణము నందును, సంక్రమణము నందును, స్నానము చేయకున్న యెడ ఏ
డుజన్మములయందు కుష్ఠరోగియు, దుఃఖవంతుఁడు నగును.

గ్రహణ కాలమునఁ జేసిన స్నాన దానాదుల వలన ననంతమగు ఫలము కలుగునని శాతా
తపుఁడు వచించెను. గ్రహణ కాలమున హిరణ్యముచే గాని, ఆమద్రవ్యముచే గాని శ్రా
ద్ధము నాచరింప వలయును. అని శాతాతపుఁడు చెప్పెను.

ణకాలే తత్పూర్వం వాయత్పక్వం తత్సూతకాన్నం తత్తుపశ్చాన్నభుం జీతేత్యర్థః॥ జన్మమరణా నిమిత్తా శౌచవానపి స్నానం కుర్యాదితి వృద్ధ వసిష్ఠః॥ చంద్రసూర్య గ్రహేస్నాయా స్మృతకే సూతికేపివా। అస్నా యీమృత్యు మాప్నోతి స్నాయీమృత్యుం నవిందతీతి॥ ఆంగిరాః॥సూ ర్యేందు గ్రహణం యావత్తా వత్కుర్యాజ్జ పాదికం। నస్వపేన్నచభుం జీత స్నాత్వాభుంజీత ముక్తయోరితి॥ కాలసర్గ ణ్యే॥ గ్రస్య మానే భవే త్స్నానం గ్రస్తేహోమో విధీయతే। ముచ్య మానేభ వేద్దానం ము క్తేస్నానం విధీయతే॥ వారవిశేష యోగేఫలాతి శయమాహవ్యాసః॥ రవిగ్రహే సూర్యవారే సోమేసోమ గ్రహేతథా। చూడామణిరితి ఖ్యా తస్త త్రానంతఫలం భవేత్। వారేష్వన్యేషు యత్పుణ్యం గ్రహణేచం ద్ర సూర్యయోః॥ తత్పుణ్యాత్కోటి గుణితం గ్రస్తేచూడా మణౌస్మృ

గ్రహణకాలమున జనులకు ఆశౌచము కలుగును-అప్పుడు స్నానము చేయుటకెడి కానాములుచేయువర్ప్రాడగును గ్రహణకాలమునగాని- అంతకు ముందు గాని యుడికిన య న్నముభుజింపఁ గూడదు. అని బ్రహ్మాండ పురాణమున చెప్పఁబడి యున్నది.

జాతాశౌచ మృతాశౌచ ములయందును గ్రహణ స్నానము చేయవలయునని వృద్ధవసిష్ఠుఁడు చెప్పెను. ఎట్లనిన- మృతకము నందును- సూతకమునందును గ్రహణస్నా నము చేయవలయును. అప్పుడు స్నానము చేయని వాఁడు మృత్యువు నొందును. స్నా నము చేసినవాఁడు మృత్యువును జయించును. అని చెప్పెను.

సూర్య చంద్రుల గ్రహణ ముందువఱకు జపదానాదులు చేయవలయును. అప్పు డు నిద్రింపఁ గూడదు. భుజింపను గూడదు. గ్రహణ మోక్షము కలిగిన తరువాత స్నా నము చేసి భుజింప వలయును. అని యంగిరుఁడు చెప్పెను.

గ్రహణము పట్టు చుండఁగా స్నానము చేయవలయు. పట్టిన తరువాత హో మము చేయవలయు. విడుచు చుండఁగా దానముచేసి- విడిచిన తరువాత స్నానము చేయవలయునని కాలనిర్ణయము నందు గలదు.

ఆదివారమునాడు సూర్యగ్రహణము- సోమవారమునాడు చంద్రహణము గలుగనే డే దానికి చూడామణి యని పేరు. తక్కిన గ్రహణ సమయముల కంటె చూడామణి.

తమితి॥ యత్తుజ్యోతిశ్శాస్త్రమాత్రసిద్ధం గ్రహణం తత్రస్నానాదిన
కర్తవ్యం॥ తదుక్తం కాలనిర్ణయే॥ సూర్యగ్రహో యదా రాత్రౌ ది
వాచంద్రగ్రహస్తథా। తత్రస్నానం నకుర్వీత దద్యాద్దానం నచక్వచి
త్॥ సంక్రాంతౌ స్నానాకరణే ప్రత్యవాయ మాహ శాతాతపః॥ సూ
ర్యసంక్రమణే పుణ్యేనస్నాయాద్యదిమానవః। సప్తజన్మసు రోగీస్యా
ద్దుఃఖభాగీచ జాయతి ఇతి॥ మేషాదిషు ద్వాదశరాశిషు సంక్రమణేనసం
చరత స్సూర్యస్య పూర్వస్మాద్రాశేరుత్తరరాశౌ ప్రవేశస్సంక్రమణం
తత్రముఖ్యకాలస్యగ్రహీతుమశక్యత్వాత్తత్సంబంధినౌ పూర్వోత్త
రకాలౌ గ్రహీతవ్యౌ। తదాహ దేవలః॥ సంక్రాంతిసమయస్సూక్ష్మో
దుర్జ్ఞేయః పిశితేక్షణైః। తద్యోగాదప్యధశ్చోర్ధ్వం త్రింశన్నాడ్యః ప్ర
కీర్తితా ఇతి॥ సంక్రాన్తేః పూర్వోత్తరకాలయోరేకైకస్మిం స్త్రింశద్ఘ
టికాః పుణ్యా ఇతి సామాన్యేనోక్తం॥ తత్రవిశేష మాహ వృద్ధవసిష్ఠః॥

---

రుగమునందు కోటిగుణితమగు ఫలము కలదని వ్యాసుఁడు వచించెను.

పవలు చంద్రగ్రహణంబును - రాత్రి సూర్యగ్రహణంబును పాతాళగ్రహణము లంగా గొన్ని సమయముల యందుఁ బట్టుచుండును. అవ్వి జ్యోతిశ్శాస్త్రముచే తెలియఁబడును గాని మనకు గోచరింపవు. ఆసమయముల యందు స్నానదానాదులు చేసిన ఫలము లేదు.

సంక్రమణము నందు స్నానము చేయకున్న యెడ శాతాతపుఁడు ప్రత్యవాయము లగునని చెప్పెను. సూర్య సంక్రమణము నందు స్నానము చేయకుండు నెడ నేడుజన్మముల యందు రోగియై దుఃఖ మొందు చుండును.

సూర్యుఁడు మేషము మొదలుకొని పండ్రెండు రాసులయందు తిరుగునప్పుడు ఒక రాశినుండి యింకొక రాశియందు ప్రవేశించుటకు సంక్రమణ మనిపేరు. అందు ముఖ్య కాలము తెలుసుకొన శక్యముగాదు గావున దానికి సంబంధించిన పూర్వోత్తర కాలములు గ్రహింపఁ బడుచున్నవి.

సంక్రాంతి సమయము సూక్ష్మమైనది గాన మాంస చక్షుష్కులకు గోచరింపదు గావున దానికి ముందు గాని వెనుక గాని ముప్పది గడియలు పుణ్యకాలమని దేవలుఁడు చెప్పెను.

అయనేద్వే విషువేద్వే చతస్రష్షడశీతయః। చతస్రో విష్ణుపద్యశ్చ సంక్రాంత్యో ద్వాదశస్మృతాః॥ మృగకర్కట సంక్రాంతీద్వే ఉదగ్దక్షిణాయనే। విషువేతు తులామేష గోలమధ్యే తథాపరా। కన్యాయాం మిథునే మీనేధనుష్యపి రవేర్గతిః॥ షడశీతి ముఖాః ప్రోక్తా ష్షడశీతిగుణైః ఫలైః॥ వృషవృశ్చిక కుంభేషుసింహే పిచరవేర్గతిః। ఏతద్విష్ణు పదానామ విషువాదధికంఫలైః॥ అతీతానాగతే పుణ్యేద్వే ఉదగ్దక్షిణాయనే। త్రింశత్కర్కటకే నాడ్యోమకరేవింశతిస్మృతాః॥ వర్తమానేతు లేమేషే నాడ్యస్తూభయతోదశ। షడశీత్యా మతీతాయాం షష్టిరుక్తాస్తు నాడికాః। పుణ్యాయాం విష్ణుపద్యాంచ ప్రాక్పశ్చాదపిషోడశ॥ ఇతి॥ మృగోమకరః॥ గోలమధ్యే అయన విషువగోలమధ్యే। అతీతానాగతఇతి॥ ఉత్తరాయణమతీతం సత్పుణ్యం భవతి। దక్షిణాయన మనాగతం సత్పుణ్యం భవతి కర్కటక సంక్రాంతేః ప్రాచీనాస్త్రింశద్ఘటికాః పుణ్యాః॥ మకర సంక్రాంతేః పరకాలికా వింశద్ఘటికాః పుణ్యాః బృహస్పతిః। కర్కటకే వింశతిః పూర్వేమకరేవింశతిః పరే। వర్తమానేతు లామేషే.

---

వృద్ధవసిష్టుఁడు సంక్రమణములలో విశేషమును జెప్పెను. ఎట్లనిన. అయనములు రెండు, విషువములు రెండు- షడశీతులు నాలుగు- విష్ణుపదములు నాలుగు చేరి పండ్రెండుసంక్రమణములగును

ఇందు మకర సంక్రాంతి ఉత్తరాయణమనియు- కర్కటక సంక్రాంతి దక్షిణాయన మనియు- తులామేష సంక్రాంతులు రెండును విషువము లనియు- కన్యామిథునము, మీనము- ధనుస్సు వీనిసంక్రాంతులు షడశీతులనియు, వృషభము- వృశ్చికము- కుంభము- సింహము- వీనిసంక్రాంతులు విష్ణుపదములనియు జెప్పఁబడెను.

ఉత్తరాయణము ప్రవేశించిన తరువాతను, దక్షిణాయనము ప్రవేశింపక ముందును పుణ్యకాలము. కర్కాటకము ప్రవేశింపక ముందుముప్పదిగడియలునుమకరముప్రవేశించినతరువాత ఇరువది గడియలును- తులామేష సంక్రాంతుల ప్రవేశమునకు ముందు వెనకను గూడ పదేసి గడియలును- షడశీతులు ప్రవేశించిన తరువాత నరువది గడియలును, విష్ణుపదములు ప్రవేశించుటకు ముందు వెనుకను గూడ పదునారు గడియలును పుణ్యకాలము లగును. లోగడ జెప్పిన వచనమందు మకరసంక్రాన్తి యందును ముప్పదిగడియల వఱకు పుణ్యకాలమని చెప్పఁబడియెను. అయినను అది సామాన్య వచనము గాన

నాడ్యస్తూభయతో దశేతి॥ నాత్ర త్రింశద్ఘటికావచనేన విరోధశ్శంక్యః॥ తాదృశసామాన్యవచనస్యాభ్యనుజ్ఞాపరత్వాత్. విశేషవచనోక్త ఘటికాసంకోచ ఏవ వరీయాన్॥ తదుక్తం దేవలేన॥ యాయాస్సన్నిహితానాడ్యస్తాస్తాః పుణ్యతమాస్మృతా ఇతి॥ సన్నిహితఘటికాస్వనుష్ఠానాసంభవే త్రింశద్ఘటికాః పరమావధిత్వేనాభ్యనుజ్ఞాయన్తే॥ తాశ్చసంక్రాన్తయః కదాచిదహ్ని కదాచిద్రాత్రౌ చభవంతి. తద్విశేషేణానుష్ఠానవిశేషమాహ వృద్ధవసిష్ఠః॥ అహ్నిసంక్రమణే పుణ్యమహః కృత్స్నం ప్రకీర్తితం। రాత్రౌ సంక్రమణే భానోర్దినార్ధం స్నానదానయోః॥ అర్ధరాత్రాదధస్తాచ్చేన్మధ్యాహ్నస్యోపరిక్రియా। ఊర్ధ్వం సంక్రమణే చోర్ధ్వముదయాత్ప్రహరద్వయం। పూర్ణేచేదర్ధరాత్రేతు యదా సంక్రమతే రవిః। ప్రాహుర్దినద్వయం పుణ్యం ముక్త్వామకరకర్కటావితి॥ అహ్ని యదా సంక్రాన్తిర్భవతి। తదాకృత్స్నమహః పుణ్యమి

---

విరోధింపదు ఇందు తక్కువ కాలమును చెప్పిన విశేషవచనమునకే సాధ్యము గలదు కావుననే సంక్రాంతికి సమీపములగు గడియలే ఎక్కువ పుణ్యకాలములని దేవలుఁడు చెప్పెను. ఈసంక్రాంతు లొకప్పుడు పగలు నింకొకప్పుడు రాత్రియు వచ్చు చుండును. సంక్రాంతి పగలు ప్రవేశించిన యెడ పగలంతయు పుణ్యకాలమగును. రాత్రి ప్రవేశించిన యెడ అర్ధదినము పుణ్యకాలమగును. సంక్రాంతి అర్ధరాత్రము లోపల ప్రవేశించు నెడ నాటిమధ్యాహ్నము నుండి పుణ్యకాలమగును. అర్ధరాత్రము పైన ప్రవేశించు నెడ మరునాడు సూర్యోదయము మొదలుకొని రెండుజాములవరకు పుణ్యకాలమగును. కేవలము నడిరాత్రియందే ప్రవేశించు నెడ పూర్వోత్తర దినములు రెండును పుణ్యములే యగును. ఈవిధి మకరకర్కట సంక్రాంతుల యందు చెల్లదు. అని వృద్ధవసిష్ఠుఁడు చెప్పెను. దీనిం బట్టి అర్ధరాత్రియందు స్నానదానాదికము నిషిద్ధమని తెలియుచున్నది. కావున సూర్యోదయము కాఁగనే దక్షిణాయనము ప్రవేశించు నెడ పూర్వ భాగమునకు ప్రాశస్త్యము వదలిపెట్టి, ఉత్తర భాగముననే స్నానాద్యనుష్ఠానము యుక్తమగును అస్తమయమునకు పూర్వక్షణమున ఉత్తరాయణము ప్రవేశించు నెడ ఉత్తరభాగమునకు ప్రాశస్త్యము వదలి పూర్వభాగముననే స్నానాద్యనుష్ఠానము యుక్తమగును. కర్కటకసంక్రాంతి యందు పూర్వకాలము ప్రశస్తమనియు మకర సంక్రాంతి యందు ఉత్తర భాగము

త్యుక్త్వా అర్ధరాత్రే స్నానాదికం ప్రతిషిధ్యతే. ఏతేన ఉదయానంతర భావిని దక్షిణాయనే పూర్వ భాగ ప్రాశస్త్యం బాధిత్వా ఉత్తర భాగేఽనుష్ఠానం భవతి. అస్త మాన పూర్వక్షణ భావిన్యుత్తరాయణేచ ఉత్తరభాగ ప్రాశస్త్యం పరిత్యజ్య పూర్వభాగఏ వానుష్ఠానం యుక్తం పూర్వోత్తర భాగ ప్రాశస్త్యంతు మధ్యాహ్నాది సంక్రమణ విషయం తత్రాహ్నాస్యైవ హేయోపాదేయ భాగద్వయ సంభవాత్॥ తథాచస్మర్యతే॥ అహస్సంక్రమణే రాత్రావనుష్ఠాన నిషేధతః। ఉక్తకాలాద్వ్యవస్థాప్యా తద్వయాత్పూర్వ పశ్చిమావితి॥ అర్వాగ్యామాః స్సన్నిహితా నాడ్యస్తాస్తాః పుణ్యతమాః స్మృతా ఇతి వచనేన రాత్రి సంక్రమణేషు రాత్రావేవానుష్ఠానం ప్రశస్తమితి జ్ఞాయతే॥ తథా మనునాపి॥ రాహు దర్శన సంక్రాంతి వివాహాత్యయవృద్ధిషు। స్నాన దానాదికం కార్యం నిశికామ్యవ్రతేషు చేత్యుక్తం। తత్రవికల్ప ఇతి కేచిత్. యథా దేశాచారం వ్యవస్థా.

### రజస్వలా స్నానవిషయః.

రజస్వలాస్నాన మాహాంగిరాః ॥ స్నానం రజస్వలాయాస్తు చతుర్థేఽహాని శర్దిశేత్। కుర్యాద్రజసి నిర్వృత్తే శౌచార్థంతునేతః పునః।

---

ప్రశస్తమనటయును మధ్యాహ్నాదుల యందు సంక్రాంతి ప్రవేశించి నప్పుడేయని కొందఱి యాశయము.

ఇందు సంక్రాంతికి సమీపములగు గడియలు పుణ్యములని చెప్పుటచే రాత్రి సంక్రమణముల యందు రాత్రియందే స్నానాద్యనుష్ఠానము ప్రశస్తమని తెలియుచున్నది. కావునను- గ్రహణము- సంక్రాంతి- వివాహము- మొదలగు వానియందును- కామ్యవ్రతముల యందును రాత్రి యందును స్నాన దానాదులు చేయనగు నని మనువు చెప్పి యున్నాడు- ఇందు వికల్పమని కొందఱు- దేశాచారమును బట్టి యనుష్ఠింప వలయును.

### రజస్వలా స్నాన విషయము.

రజస్వలా స్నానమును గూర్చి యంగిరుఁ డిట్లు చెప్పి యుండెను. ఎట్లనిన- రజస్వల నాల్గవ దినమున స్నానము చేయవలయును. రజస్సు నివర్తించిన పిదప శుద్ధికై తిరిగి

హాస్తేఽశ్నీయాన్మృణ్మయేవా హవిర్భుక్ క్షితిశాయినీ। రజస్వలా చ
తుర్థేహ్ని స్నాత్వాశుద్ధి మవాప్నుయాత్ ॥ ఇతి ॥ సంగ్రహే ॥ మృతే
చ సూతకే చాన్తే సంగవే స్నాన మాచరేత్ । సంగవాత్పరత స్స్నాన
మార్తవే తు విగర్హ్యతే ॥ ఇతి ॥

కర్మాధి కారస్తు రజోనివృత్తావేవ। స్నాతా రజస్వలా యాతు చ
తుర్థేఽహని శుధ్యతి । కుర్యాద్రజో నివృత్తౌ తు దైవపిత్ర్యాది కర్మ
చేతి పరాశర స్మరణాత్ ॥ రోగజన్య రజసితు నాస్త్యశుద్ధిః ॥ తదుక్తం
చంద్రికాయాం ॥ అకాలే యద్భవేత్ స్త్రీణాం రక్త మాహుర్మనీషి
ణః। కాలేతు యద్రజః ప్రోక్తం తస్మాత్తత్రైవ సాశుచిరితి॥ అంగిరాః।
ఆద్వాదశాహాన్నారీణాం మూత్రవచ్ఛౌచ మిష్యతే । అష్టాదశాహా
త్స్నానం స్యాత్త్రిరాత్రం పరతోఽశుచిరితి॥ స్మృత్యర్థసారే ॥ రజస్వలా

స్నానము చేయవలయు. చేతియందుగాని- మృణ్మయ పాత్రము నందు గాని అన్నముని
డికొని భుజింప వలయు. నేలమీద పండుకొన వలయు. నాల్గవ దినమున స్నానము చే
యఁగా శుద్ధురాలగును. జాతాశౌచ మృతాశౌచములయందు కొనకు సంగవ కాలమున
స్నానము చేయవలయు. ఋతుమతులైన వారలు సంగవ కాలము దాటిన పిదప స్నా
నము చేయుటె ముఖ్యము.

ఋతుమతి నాల్గవ దినమున స్నానము చేయఁగా శుద్ధ రాలగును. రజస్సు నిలిచి
పోయిన తరువాత దేవపితృ కర్మముల కర్హురాలగు నని పరాశరుఁడు చెప్పి నందున రజ
స్సు నిలిచిన మీదనే కర్మాధికారముండు నని తెలియఁగునది. రోగమువలన రజస్సు క
నఁబడు నప్పుడు అపవిత్రత లేదు. కావునకే- అకాలమున స్త్రీలకు కలుగునది రక్తమేగా
ని రజస్సు కాదు. కాలమున కలుగునదియే రజస్సు. కావున నప్పుడే స్త్రీ అపవిత్రురాలని
చంద్రిక యందుఁ జెప్పఁబడి యున్నది. స్త్రీ ఋతుమతియైనది మొదలుకొని నాలుగు
దినములు గడచిన పిదప రజస్సు కనఁబడినను పండ్రెండు రోజుల వఱకు మూత్రమున కే
గి నప్పటి వలె శుద్ధిచేసి కొన వలయు. తరువాత- పదునెనిమిది దినముల వఱకు స్నా
నము చేయఁగా శుద్ధురాలగు. పదునెనిమిది దినములు గడచినమీద రజస్సు కనఁబడినయెడ
మూడుదినములు నపవిత్రు రాలగును.

రజస్వల నాల్గవ దినమున సంగవ కాలము నందు అరువది మాఱ్లు మృత్తికతో శు
ద్ధి చేసికొని స్నానము చేయవలయు. [illegible] గా శుద్ధిచేసికొని

చతుర్థేహ్ని షష్టిమృత్తికాభిశ్శౌచం కృత్వా విధవా చేద్ద్విగుణ మృత్తి
కాభిశ్శౌచం కృత్వా సంగవే స్నానం కుర్యాత్॥ సంగ్రహే॥ ప్రథమేఽ
హని చండాలీ ద్వితీయే సూతికా భవేత్। తృతీయేఽహ్ని స్వధర్మస్థా చ
తుర్థే పతితా యథా॥ సంగవాన్తే చతుర్థేహ్ని స్నానాచ్ఛుద్ధి మవాప్ను
యాత్॥ ఏకవింశతి నాలిప్య సర్వాంగం శుద్ధయా మృదా। కృత్వా స్నా
నశతం పశ్చాచ్ఛుచిర్భవతి నాన్యథా॥ స్నానాన్తే భాస్కరం దృష్ట్వా పు
త్రిం ప్రార్థ్య సుమంగలీ। త్రివారం ప్రాశయేదన్నం సచేద్దోషవతీ భవే
త్। ఇతి. ప్రసూతికా విషయే ప్రజాపతిః॥ ప్రసూతి యాయాతు నారీ
స్నానతో వింశతేః పరం। ఆర్తనీర జనా ప్రోక్తా ప్రాక్తునైమిత్తికం రజః।
రజస్యుపరతే తత్ర స్నానేనైవ శుచిర్భవేత్ ॥ ఇతి ॥ బృహస్పతిః ॥ ప
తితాంత్య శ్వపాకైశ్చ సంస్పృష్టా చేద్రజస్వలా। తాన్యహాని వ్యతిక్ర
మ్య ప్రాయశ్చిత్తం సమాచరేత్ ॥ సంగ్రహే ॥ ఆర్తవాభిప్లుతాయా
స్తు శావశౌచం భవేద్యది। సూతకం వా భవేన్మధ్యే స్నాత్వా భోజనమి

---

స్నానము చేయ వలయు. ఋతుమతి ప్రథమ దినమున చాండాలియు- రెండవ దినమున సూతికయు- మూడవ దినమున రజకియు- నాల్గవ దినమున పతితురాలువునై నాల్గవ దినమున సంగవ కాలము దాటిన మీద స్నానము చేయగా శుద్ధురాలగును. శుద్ధమగు మృత్తికను ఇరువది యొక్క మారు సర్వాంగములకు రాచి కొని స్నానము చేసి సూర్యుని గాంచి- సుమంగలియగు నెడ పుత్రు నొసగుమని ప్రార్థించి వెంటనె ముమ్మారు మూడు కబళముల యన్నమును భుజింప వలయు. అట్లు చేయకున్న దోషవతియగు నని సంగ్రహము నందుఁ జెప్పఁబడి యున్నది.

ప్రసవించిన స్త్రీ స్నానము చేసినది మొదలు కొని యిరువది దినములు గడచిన తరువాత రజస్సు కనఁబడి నప్పుడె ఋతుమతి యని చెప్పఁ బడును. అంతకు పూర్వము రజస్సు కనఁబడినను అది ప్రసవ నిమిత్తకము గాన ఆరజస్సు నివర్తింప, గా స్నానము చేయఁగనే శుద్ధురాలగును. రజస్వల పతితులచే గాని, అంత్యజులతో గాని, శ్వపచులచే గాని స్పృశింపఁబడు నెడ ఋతుమతియైన మూడు దినములు గడచిన తరువాత ప్రాయశ్చిత్తము చేసి కొన వలయు. రజస్వల యైయుండఁగా జాతాశౌచ మృతాశౌచములు వచ్చు నెడ స్నానముచేసి భుజింపవలయును.

ష్యతే ॥ ఇతి. రజస్వలయో రన్యోన్య స్పర్శే శుద్ధి మాహ పరాశరః ॥
స్పృష్ట్వా రజస్వలా న్యోన్యం బ్రాహ్మణీ బ్రాహ్మణీ తథా। తావత్తిష్ఠే
న్నిరాహారా త్రిరాత్రేణైవ శుధ్యతీతి॥ వృద్ధవిష్ణురపి॥ రజస్వలాహీనవ
ర్ణాం రజస్వలాం దృష్ట్వాన తావదశ్నీయా ద్యావన్న శుద్ధిస్స్యాత్। సవ
ర్ణామధిక వర్ణాం వాస్పృష్ట్వా సద్యస్స్నాతా శుధ్యతీతి ॥ శాతాతపః ॥
మార్గేతు యత్రసంస్పృష్టి ర్యాత్రాయాం కలహాదిషు। గ్రామ సంక్షోభ
ణే చైవ స్పృష్టిదోషో న విద్యతే॥ షట్త్రింశన్మతే । దైవయాత్రా వివాహే
షు యజ్ఞేషు ప్రకృతేషు చ। ఉత్సవేషు చ సర్వేషు స్పృష్టాస్పృష్టిర్న దూ
ష్యతీతి॥ బృహస్పతిరపి॥ తీర్థే వివాహే యాత్రాయాం సంగ్రామే దేశ వి
ప్లవే। నగరే గ్రామ దాహే చ స్పృష్టాస్పృష్టిర్న దూష్యతి ॥ పాద్మేపి ॥
దేవాలయ సమీపస్థా దేవసేవార్థ మాగతాః। చండాలాన్పతితా
న్వాపి స్పృష్ట్వాన స్నాన మాచరేదితి.

ఇతి నైమిత్తిక స్నానాని.

---

రజస్వల యగు బ్రాహ్మణస్త్రీ రజస్వలయగు బ్రాహ్మణ స్త్రీని దాకునెడ ఋతు స్నానము చేయువఱకు నిరాహారయై యుండవలయునని పరాశరుఁడు చెప్పెను.

రజస్వల తనకన్న తక్కువ కులపు రజస్వలను దాకినయెడ ఋతు స్నానము చేయువఱకు శుద్ధురాలు కాదనియు, ఎక్కువ కులము, సమాన కులముగల రజస్వలను దాకునెడ స్నానము చేయఁగా శుద్ధురాలగు ననియు వృద్ధవిష్ణువు చెప్పెను. మార్గమునందు గాని- యాత్రయందు గాని- కలహాదుల యందు గాని- గ్రామ క్షోభముల యందు గాని స్పృష్టిదోష ముండ నేరదని- శాతాతపుఁడు చెప్పెను.

దైవ యాత్రల యందు- వివాహముల యందును- యజ్ఞముల యందును- ఉత్సవముల యందును స్పర్శదోషము లేదని షట్త్రింశన్మతము నందు గలదు. తీర్థము నందును- వివాహము నందును- యాత్ర యందును- యుద్ధము నందును- దేశ క్షోభము నందును- పట్టణము నందును- గ్రామము తగులఁబడునప్పుడును స్పర్శ దోషము లేదని బృహస్పతి చెప్పెను. దేవాలయము దగ్గఱనున్న వారును- దేవుని సేవింప వచ్చిన వారును నగు చండాలుర- పతితులు మున్నగు వారిని దాకి స్నానము చేయఁ గూడదని పద్మపురాణము నందు గలదు. నైమిత్తిక స్నానములు ముగిసెను.

## అథకామ్య స్నానాని.

పులస్త్యః॥ పుష్యేచ జన్మ నక్షత్రేవ్య తీపాతేచ వైధృతౌ । అమాయాంచ నదీస్నానం పునాత్యా సప్తమంకులం॥ఆర్కాంగారక శనైశ్చరే స్నానం కుర్వన్తియేనరాః । వ్యాధిభిస్తే నపీడ్యన్తే మృగైః కేసరిణో యథా॥ చైత్రకృష్ణ చతుర్దశ్యాం యస్స్నాయాచ్ఛివసన్నిధౌ। నప్రేత త్వమవాప్నోతి గంగాయాంచ విశేషతః ॥ యమః॥ కార్తిక్యాం పుష్కరేస్నానం సర్వపాపైః ప్రముచ్యతే। మాఘ్యాం స్నానం ప్రయాగేతు ముచ్యతే సర్వకిల్బిషైః ॥ సూర్యగ్రహేణ తుల్యాతు శుక్లామాఘస్య సప్తమీ॥ అరుణోదయ వేళాయాం తస్యాంస్నానం మహాఫలం॥ శాతాతపోపి॥ అమావాస్యా రవేర్వారేణు దాభూమి సుతస్యవై । జాహ్నవీస్నాన మాత్రేణ గోసహస్ర ఫలంలభేత్ ॥ ఇతి ॥

---

## ఇంక కామ్య స్నానములు.

పుష్యమి యందును- జన్మనక్షత్రము నందును- వ్యతీ పాతము నందును- వైధృతి యందును- అమావాస్య యందును నదీ స్నానము చేయు నెడ ఏడుతరముల వారు తరింతురు. ఆది- మంగళ- శనివారముల యందు నదీ స్నానము చేయు నెడ మృగములు సింహమును బాధింప నేరనట్లు వ్యాధులు బాధింప లేవు. చైత్ర బహుళ చతుర్దశి నాడు శివ సన్నిధి యందు గాని- గంగయందు గాని స్నానము చేయునెడ ప్రేతత్వము కలుగనేరదు. అని పులస్త్యుడు చెప్పెను. కార్తిక పూర్ణిమ యందు పుష్కరము నందు స్నానము చేయు నెడ సమస్త పాపములు తొలంగును. మాఘ పూర్ణిమ నాడు ప్రయాగమున స్నానము చేయునెడ సర్వపాతకములు నివర్తించును. మాఘ శుద్ధ సప్తమి సూర్యగ్రహణముతో సమానమైనది. నాడు అరుణోదయ కాలమున స్నానము చేయునెడ మహాఫలము గలుగును. ఆది వారముతో గాని మంగళ వారముతో గాని అమావాస్య వచ్చిన ప్పుడు గంగయందు స్నానము చేయు నెడ వేయిగోవులను దానము చేయగా గలుగు ఫలము లభించును.

## అథ మాఘస్నాన విధిః

తత్రవిష్ణుః॥ బాలాశ్చతరుణావృద్ధా నరనారీ నపుంసకాః। స్నాత్వా మాఘే శుభేతీర్థే ప్రాప్నువంతీప్సితం ఫలమితి॥ యత్తు మహా భారతే॥ మాఘేఽర్ధోదితే సూర్యే స్నానం విధి వదాచరేత్ । నియతో నియతాహార స్సర్వపాపైః ప్రముచ్యతే॥ మాఘమాసే రటన్త్యాపః కించిదభ్యుదితేరవౌ। బ్రహ్మఘ్నం వా సురాపం వా కం పతంతం పునీమహే ఇతి- తత్ సంధ్యోపాసనాద్యనధికృత స్త్రీశూద్ర విషయం। ఉషస్యుదయే మాఘ స్నానమాహుర్ద్విజన్మనాం। స్త్రీశూద్రాదీనాం తథాన్యేషామర్ధోదయ ఉదితేఽథవా ఇతిస్మరణాత్ ॥ బ్రాహ్మణాది విషయే సంధ్యాతిక్రమ దోషోఽపి దుర్వారస్స్యాత్ । స్నానపూర్వకత్వాత్సంధ్యావందనాదేః ॥ కేచిత్తు ॥ విచేయతారకే కాలే నిత్యస్నానం విధాయచ। పునరభ్యుదితే సూర్యే మాఘస్నానం విధీయతే॥ అత్యర్ధఘటికాత్పూర్వం పరం సూర్యోదయాత్తథా। సవివాభ్యుదితోనామ ధర్మ

---

### మాఘస్నాన విధి.

బాలురు- యువకులు- వృద్ధులు- పురుషులు- స్త్రీలు- నపుంసకులును మాఘమాసము నందు శుభతీర్థమునందు స్నానము చేయుచెడ నిష్టఫలము నొందుదురు. అని విష్ణువు చెప్పెను. మహాభారతము నందు- మాఘమాసమున సూర్యుడు సగము దయించఁగా యథావిధిగా స్నానము చేయుచు- నియమవంతుండును- నియతాహారుండు నగువాడు సకల పాపముల నుండి విముక్తుండగును. బ్రహ్మహత్య చేసినవానిని గాని- సురాపానము చేసిన వానిని గాని పవిత్రము చేయుదుమని మాఘమాసమున సూర్యుడు కొంచెము దయింపఁగా జలములు ధ్వని చేయు చుండును. అను వచనము సూర్యుడు కొంచె ముదయింపగా మాఘస్నానము చేయవలయునని తెలుపు చున్నది. అయినను అవచనము సంధ్యా వందనాదుల యందధికారము లేని స్త్రీ శూద్రులను గూర్చి చెప్పఁబడియెను. ఏలన- మాఘస్నానము ద్విజులకు నుషః కాలంబున విహితమనియు- స్త్రీ శూద్రాదులకు నుషః కాలంబునను- అర్ధోదయంబు నను విహితమనియు స్మృతికలదు. అట్లుగాక-యీ

శాస్త్రే) ప్రకీర్తిత ఇతివచనేన ఉదయానంతరం సార్ధఘటి కామధ్యే ద్వితీయస్నానం కర్తవ్యమితి వదన్తి.

## అథమలాప కర్షణస్నానం.

తత్ర భరద్వాజః॥ ఇందాబుధేచ సౌరేచ వారేఽభ్యాగః ప్రశస్యతే। బలంకాంతిం శ్రియందద్యః భోగం వారాధిపాః క్రమాత్ ॥ ॥ఇతి॥ ఇందువారేఽ భ్యంగా భ్యుపగమ శ్శ్వేతర విషయః॥ నాభ్యంగ మిందాకుర్వీత భానోశ్చాభసస్య వాసరే। తిథాశ్మిన్న చతుర్దశ్యాం త్రయోదశ్యాంచ పర్వసు। ఇతిచంద్రజ్ఞానోత్త రోక్తేః ॥ భరద్వాజః॥ భానుభామ సురాచార్య శుక్రవారేచ సంక్రమే। వ్యతీపాతేచ జన్మర్షే నాభ్యంగ స్నానమాచరేత్। ఏకాదశ్యాం చతుర్దశ్యా మష్టమ్యాం ప్రతిపద్యపి। షష్ఠ్యాం పర్వణిచాభ్యంగం స్నానంనైవ సమాచరేత్। ఉత్తరాఫల్గునీ జ్యేష్ఠా శ్రవణార్ద్రా సుర్యాత్రిషు। అభ్యాంగ సంజ్ఞకం స్నానం సుఖార్థీ వర్జయేత్తథా ॥ శిరోభుజాంచ వృద్ధానాం యథా కాలం శరీరిణాం। అభ్యాంగోష్ణోద కస్నానం నైవదోషావహంస్మృత మితి ॥మనురపి॥

వచనము బ్రాహ్మణాదుల వివయ మను నెడ స్నానము చేయక సంధ్యా వందనము చేయఁ గూడదు కాన సంధ్యావందన మునకు కాలా తిక్రమ దోషము తప్పక ప్రాప్తించును- ఈసందర్భమునన్- చుక్కలు కనఁబడు చుండఁగనె నిత్యస్నానము చేసి సూర్యోదయిమపగా తియగా మాఘస్నానము చేయు వలయును అనువచనమును బట్టి సూర్యోదయమైన తరువాత నరగడియ లోపల ద్వితీయ స్నానము చేయవలయునని కొందఱు చెప్పుచున్నారు.

## మలాపకర్షణ స్నానము.

మలాపకర్షణ స్నానమనఁగా అభ్యంగస్నానము. సోమ వారము- బుధవారము శనివారము. ఈదినములయందు అభ్యంగస్నానము ప్రశస్తమైనది. ఈవారములయందు అభ్యంగస్నానము చేయునెడ వారాధిపతులగు చంద్రుఁడు మొదలగు మువ్వురును బలమును- కాంతిని- సిరిని క్రమముగా నొసంగుదురు. అని భరద్వాజుడు చెప్పెను. సోమవార

పక్షాదౌచ రవౌ షష్ఠ్యాం రిక్తాయాంచ తథాతిథౌ। తైలేనాభ్యజ్య మా
నస్సద్యో నాయుర్భ్యో ప్రహీయత ఇతి। చంద్రికాయాం। కుహూ పూ
ర్ణేందు సంక్రాంతి చతుర్దశ్యష్టమీషుచ। నరశ్చండాల యోనిస్స్యాత్తైల
స్త్రీమాంస సేవనాత్। ఉత్పత్తౌచ విపత్తౌచ దంతకాష్ఠేషు మైథునే। అ
భ్యంగేఽభ్యుదయేస్నానే తిథిస్తాత్కాలికీస్మృతా॥ ఇతి. వృద్ధవసిష్ఠః॥
దంతకాష్ఠేఽప్యమావస్యా మైథునేచ చతుర్దశీ। హన్తి సప్తకులం పుంసాం
తైలగ్రహణేఽష్టమీ॥ దివాక పిత్థచ్ఛాయాయాం రాత్రౌప ధిషు
పర్వసు। ధాత్రీకల్కేచ సప్తమ్యామ లక్ష్మీర్వర్తతే సదా। ఏవం వార
నిషేధోఽపి జ్యోతిశాస్త్రేచదర్శితః॥ సంతాపః కాంతి రల్పాయుర్ధనం నిర్ధన
తాతథా। అనారోగ్యాం సర్వకామ అభ్యంగాద్భాస్కరాదిషు॥ వామన
పురాణే॥ నాభ్యంగ మర్కేనచ భూమి పుత్రే క్షౌరంచ శుక్రేచ కుజేచ
మాంసం। బుధేచ యోషిత్పరి వర్తనీయా శేషేషు సర్వాణి సదైవకు
ర్యాదితి॥ సంగ్రహే॥ ఉపోష్య తస్య వ్రతినః కృత్త కేశస్య నాపితైః।

---

ము- ఆదివారము- మంగళవారము- కృష్ణచతుర్దశి- త్రయోదశి పర్వములు ననుదినముల
యందు అభ్యంగ స్నానముచేయఁ గూడదని చంద్రజ్ఞానోత్తరమున కలదు గాన సోమ
వారమునాడు అభ్యంగము శైవులకుకూడదు కూడుసను భరద్వాజవచనము శైవేతరవిష
యము. మతియు- ఆదివారము, మంగళవారము, గురువారము, శుక్రవారము, సంక్రమ
ణము, వ్యతీపాతము, జన్మతిథియు, ఏకాదశి, చతుర్దశి, అష్టమి, పాడ్యమి, షష్ఠిపర్వము
లు ఈదినములయందును- ఉత్తరఫల్గుని- జ్యేష్ఠ- శ్రవణము- ఆర్ద్ర ఈనక్షత్రములయందు
ను రాత్రుల యందును అభ్యంగ స్నానము చేయగూడదు. ఇఁక రోగముగల వారును-
వృద్ధులును వీరికివీలగు కాలమునందుఅభ్యంగమును- ఉష్ణోదక స్నానమును జేసినను దోషము
లేదు. అనిభరద్వాజుఁడు చెప్పెను. పాడ్యమి- ఆదివారము- షష్ఠి- రిక్తతిథి ఈదినముల
యందు అభ్యంగస్నానము జేయునెడ ధనము- ఆయువు తొలంగునని మనువు చెప్పెను.
అమావాస్య- పూర్ణిమ- సంక్రమణము- చతుర్దశి- అష్టమి- ఈ తిథుల యందు అభ్యంగ
ము- స్త్రీసంగమము- మాంస భక్షణము జేయునెడ చండాల జాతియందు జన్మించును.
జననము నందును- మరణము నందును- దంత ధావనము నందును స్త్రీసంగమ విషయ

తావత్తిష్ఠత్య లక్ష్మీర్వై యావత్తైల ముపస్పృశేదితి॥ స్మృతిరత్నావళ్యాం॥ సురయాలిప్త దేహస్య ప్రాయశ్చిత్తం విధీయతే। ప్రాతరభ్యక్త దేహస్య నిశికృన్న విధీయత ఇతి॥ అయంనిషేధో నరకచతుర్దశీవ్యతిరిక్త విషయః॥ ప్రత్యూష ఆశ్వయుక్కృష్ణ చతుర్దశ్యా మినోదయే। స్నాన మభ్యజ్య కర్తవ్యం నరైర్నరక భీరుభిరితి స్మరణాత్॥ కాలాదర్శేపి॥ తైలేలక్ష్మీర్జలే గంగాదీపావళి దినేవసేత్। అలక్ష్మీ పరిహారార్థ మభ్యంగస్నాన మాచరేత్। తతఆభరణా వస్త్రం ధారయేత్సర్వ సంపదఇతి॥

---

మునను- అభ్యంగ విషయమునను అప్పటి తిధియె గ్రాహ్యమగును. అని చంద్రిక యందు గలదు. అమావాస్య నాడు దంతకాష్ఠంబును- చతుర్దశినాడు స్త్రీసంగమంబును- అష్టమినాడు అభ్యంగంబును చేయువాడు ఏడు తరముల వారు నరకమునం బడుదురు. పగలు వెలగ చెట్టునీడను- పర్వదినముల యందు రాత్రియందు మార్గమందును- సప్తమినాడు ఉసిరిక కాయలపు నందును అనగా అభ్యంగ సాధనము నందనుట. అలక్ష్మి కొలువున నుండును. మఱియు అభ్యంగ విషయమై వారనిషేధము జ్యోతిష శాస్త్రము నందు గలదు. ఎట్లనిన- ఆదివారము మొదలగు వారముల యందభ్యంగము చేసి కొనిన యెడ క్రమముగా- సంతాపము- కాంతి- అల్పాయువు- ధనము- నిర్ధనత- అనారోగ్యము- సర్వ కామములును కలుగును. ఆదివారము నాడు అభ్యంగమును- మంగళ వారము నాడు క్షౌరమును- మంగళ శుక్రవారముల యందు మాంసమును- బుధవారమునాడు స్త్రీసాంగత్యమును వదలి పెట్టవలయును. కడమదినముల యందన్ని కృత్యములను జరుపుకొనవగును అని వామన పురాణము నందు గలదు. వ్రతస్థుడై యుపవాస మున్న వాడును- క్షౌరము చేయించుకొనిన వాడును అభ్యంగము చేసికొనవలెను వారిని అలక్ష్మి యాశ్రయించి యుండును. అని సంగ్రహము నందు గలదు. కల్లు శరీరము నంటిన వానికిని ప్రాయశ్చిత్తము కలదు గాని- వేకువను- రాత్రియందును అభ్యంగము చేసికొనిన వానికి ప్రాయశ్చిత్తము లేదు. అని స్మృతి రత్నావళి యందు గలదు. కాని యీనిషేధము నరక చతుర్దశి నాటి స్నానమునకు లేదు. ఏలన- నరకమునకు వెరచిన మనుజులు ఆశ్వయుజ బహుళ చతుర్దశినాడు వేకువను అభ్యంగ స్నానము చేయవలయునని విశేషవిధి కలదు. మఱియు దీపావళి నాడు తైలమున లక్ష్మియు- జలము నందు గంగయు నుండును గాన అలక్ష్మి తొలగుటకై నాడు అభ్యంగ స్నానము చేయవలయు- తరు

స్మృత్యర్థసారే॥ నిషిద్ధ దిపసేవారే। రాత్రౌచాకాలికస్యచ। ద్రవ్యాంతర యుతం తైలం నదూష్యతి కదాచనేతి॥ స్మృత్యంతరే ॥ రవౌపుష్పం గురౌదూర్వాం భృగౌగోమ యమేవచ। భౌమేభూమిం వినిక్షిప్య తైలాభ్యంగం సమాచరేత్ ॥ ద్రవ్యాంతరయుతం తైలం నదుష్యేద్గ్రహణంవినా॥ మహాభారతే॥ పాదాభ్యంగం శిరోభ్యంగం ద్విజోచ్ఛిష్టా పమార్జనం। ఏకైకం పాండవశ్రేష్ఠ రాజసూయాద్వి శిష్యతఇతి. ఇతి మలాపకర్షణం స్నానం॥

అథక్రియా స్నానం.

తత్రశంఖః ॥ క్రియాస్నానం ప్రవక్ష్యామి యథావద్విధి పూర్వకం। సరస్సుదేవ ఖాతేషు తీర్థేషుచనదీషుచ। క్రియాస్నానం సముద్దిష్టం స్నానంతత్ర క్రియామతా॥ మృద్భిరద్భిశ్చ కర్తవ్యం శౌచమాదౌ యథావిధి॥ జలేవి మగ్నఉన్మజ్య ఉపస్పృశ్య యథావిధి। తీర్థస్యావాహనం

---

వాళ వస్త్రాభరణాదుల ధరింప వలయు. ఇట్లు చేసిన సకల సంపదలు కలుగు నని కాలా దర్శము నందు గలదు. నిషిద్ధమగు వారమునందు ఇతర ద్రవ్యముతోఁ జేర్చి తైలము నంటుకొనిన యెడ దోషము లేదని స్మృత్యర్థ సారము నందు గలదు. ఆదివారమునాడు పువ్వును- గురువారము నాడు గరికెను- శుక్రవారము నాడు గోమయమును- మంగళవారమునాడు మృత్తికను తైలమునఁ జేర్చి యభ్యంగము చేసికొన నగును. గ్రహణ కాలమునందు దప్ప ఇట్లు ద్రవ్యాంతరముతోఁ గూడిన తైలము నంటు కొనినయెడ దోషములేదని స్మృత్యంతరము నందు గలదు. ఒరునిపాద మునకు తైలము రాయుట యు- తలయంటుటయు- బ్రాహ్మణులు భుజించిన విస్తళుల తీసివైచుటయు వీనిలో నొక్కొక్కటియు రాజ సూయ యాగము కన్న నెక్కువ ఫలము నొసంగును. అని మహాభారతమునఁ గలదు. మలాప కర్షణ స్నానము ముగిసెను.

ఇఁక క్రియా స్నానము.

ఈసందర్భమున శంఖుఁ డిట్లు చెప్పెను. క్రియా స్నానమును యథా విధిగాఁ జెప్పు చున్నాను. సరస్సులు- దేవ ఖాతములు- తీర్థములు- నదులు వీనియందు క్రియాస్నా

కుర్యాత్తత్ప్ర వక్ష్యామ్యతఃపరం। ప్రపద్యేవ రుణందేవమంభసాంపతి
మూర్జితం। యాచితం దేహి మేతీర్థం సర్వపాపాప నుత్తయే। తీర్థమావా
హయిష్యామి సర్వాఘ విషూదనం॥ సాన్నిధ్య మస్మిన్తోయే తు సిద్ధ్
యతాం మదనుగ్రహాత్। రుద్రాన్ప్రపద్యే వరదాన్ సర్వానప్సుషద
స్తథా। దేవ మప్సుషదం వహ్నిం ప్రపద్యేఽఘ నిషూదనం। ఆపః పు
ణ్యాః పవిత్రాశ్చ ప్రపద్యేఽ ఘారుణంతథా। రుద్రాఅగ్నిశ్చ శర్వశ్చ
హ్యరుణశ్చాప ఏవచ। శమయంత్వాశు మేపాపం రక్షంతుచ సదైవ
మాం। ఇత్యేవ ముక్త్వా కర్తవ్యం తతస్సమ్మార్జనం కుశైః॥ ఆపో హి
ష్ఠేతి తిసృభిర్యథా వదనుపూర్వశః॥హిరణ్యవర్ణా ఇతిచ ఋగ్భిశ్చ తసృ
భిస్తథా। శన్నోదేవీరితి తథా శన్న ఆపస్తథైవచ। ఇదమాపః ప్రవ
హతేత్యేవంచ సముదీరయేత్। ఏవంసమ్మార్జనం కృత్వా ఛందసాపాం
పరిగ్రహః॥ అఘమర్షణ సూక్తంచసంస్మరేత్ప్రయతస్తదా। తతోఽభ

---

నము చేయవలయు- ఇందు స్నానమే క్రియ గావున నది క్రియా స్నానమని చెప్పఁ బడి
యెను. తీర్థయాత్రలకేగి యచ్చటచ్చట స్నానము చేయుటే ముఖ్యము గాన నది క్రియా
స్నాన మగును. మొదట మృత్తికచేతను- జలముల చేతను యథా విధిగా శౌచమునుచే
సికొని నీరిలో మునిఁగి లేచి యాచమనము చేసి తీర్థము నావాహనము చేయవలయు. ఎ
ట్లనిన- జలముల కధిపతియగు వరుణుని శరణు జొచ్చెదను. సకలపాపములఁ బోగొట్టు
నట్టితీర్థమును నాకొసఁగుము. సర్వపాపహరమగు తీర్థము నావాహనము చేయుచున్నా
ను ఆతీర్థము నన్ననుగ్రహింప నీజలమున నుండుగాక- జలమున నుండి వరము లొసంగు
రుద్రులను శరణు జొచ్చు చున్నాను. నీరునందుండు వహ్ని నాశ్రయించు చున్నాను. ప
విత్రములగు జలములను- అరుణుని నాశ్రయించు చున్నాను. రుద్రులు- అగ్ని- శర్వుఁడు
జలములును నాపాపమును శమింపజేసి నన్నెల్లప్పుడు రక్షింతురుగాక. అనిపలికి ఆపోహి
ష్ఠా అని మొదలగు మూఁడుమంత్రములను- హిరణ్యవర్ణా అనిమొదలగునాలుగు ఋక్కు
లను- శన్నోదేవీ- శన్న ఆపః- ఇదమాపః ప్రవహత అనుమంత్రములను జదువుచు దర్భల
తో జలమును సమ్మార్జనము చేసికొనవలయును. ఇట్లుసమ్మార్జనముచేసికొని నీటిలోమునిగి
లేచి యఘమర్షణ సూక్తమును మూఁమారు పఠింపవలయును. తరువాత మహావ్యాహృతు
లతో జలమును శిరమునఁజల్లుకొనవలయును.

సి నిమగ్నస్త్రిషు పతే దఘమర్షణం। ప్రదద్యా న్మూర్ధని తథా మహావ్యా
హృతి భిర్జలమితి॥ తీర్థయాత్రాయాం వర్జనీయమాహ వ్యాసః॥ ఛత్రం
చ హరతే పాదమర్థం హరతి పాదుకా। యానంహరేత్త్రిపాదంతు సర్వం
హరతి డోలికా। ఐశ్వర్యలోభా న్మోహాద్వాగచ్ఛే ద్యానాదిభిస్తుయః।
నిష్ఫలంతస్య తీర్థంతు తస్మాద్యానాని వర్జయేత్॥ గోభిర్యుక్తేన యానే
న తీర్థయాత్రాంకరోతియః॥ సయాతి నరకం ఘోరం యావద్గోరోమ
సంఖ్యయేతి॥ పైఠీనసిః॥ షోడశాంశం సలభతే యః పరార్థేన గచ్ఛతి।అ
ర్ధంతీర్థ ఫలంతస్యయః ప్రసంగేన గచ్ఛతి॥ వ్యాసోపి॥ యస్య హస్తౌ
చ పాదౌచ మనశ్చైవ సుసంయుతం। విద్యాతపశ్చ కీర్తిశ్చ సతీర్థ ఫల
మశ్నుతే॥ వృద్ధవసిష్ఠోపి॥ పితరంమాతరం వాపిభ్రాతరం సుహృదంగు
రుం। నిమజ్జేత్తు యముద్దిశ్య ద్వాదశాంశం లభేతసః॥ తీర్థఫలం నవిక్రీణీ
యాత్॥ తథాహాపస్తంబః॥ మాంసమాయుధం సుకృతాశాంచ తిల
తండులాంశ్చైవ ధాన్యంచ విశేషేణ నవిక్రీణీయాదితి॥ సుకృతాశా
తీర్థస్నానాది సుకృతఫలం। ధర్మదానంతు విషయవిశేషే స్మర్యతే॥

---

తీర్థయాత్రయందుఁ గూడని వానిని గూర్చి వ్యాసుండిట్లు చెప్పెను. గొడుగు వేసికొ
ని తీర్థమున కేగిన నాల్గవవంతు పుణ్యము నశించును. పాదుకలు తొడిగికొని తీర్థమునకేగిన
సగము పుణ్యము నశించును. వాహనము నెక్కి తీర్థమునకేగిన మూఁడుపాళ్లు పుణ్యము నశిం
చును. మేనా యెక్కి తీర్థమున కేగిన సర్వము నశించును. ఐశ్వర్యమదముచేగాని - అజ్ఞా
నముచేగాని యానముల నెక్కి తీర్థ యాత్రల కేఁగునెడ నిష్ఫలమగుగాన యానము
ల నెక్కి పోఁగూడదు. ఎద్దుల బండి నెక్కి తీర్థమున కేగినవాఁడు ఎద్దులరోమము లె
న్ని కలవో అన్నియేండ్లు నరకమునను భవించును.

వేఱొకరు రమ్మని నందున వారిలో పదార్థముగా తీర్థమున కేగిన వాని
కి పదునాఱవ పాలు ఫలము లభించును. ప్రసంగవశమున పోయిన వానికి సగము ఫల
ము కలుగును- అని పైఠీనసి చెప్పెను. ఎవ్వనికి చేతులు- కాళ్లు- మనస్సు- విద్య- తప
ము- కీర్తియు నిర్దుష్టములుగా నున్నవో వాఁడు సంపూర్ణ ఫలము నొందును. తల్లిని-
తండ్రిని- తోఁబుట్టువులను- స్నేహితుని- గురుని గాని యుద్దేశించి తీర్థమున మునుంగు
నెడ వారికి పండ్రెండవ పాలు ఫలము లభించును- తీర్థఫలము విక్రయింపఁ గూడదు

దేవతానాం గురూణాంచ మాతా పిత్రోస్తథైవచ। పుణ్యం దేయం ప్రయత్నేన నాపుణ్యంచోదితం క్వచిత్॥ శాండిల్యః॥ జీవనార్థం హతం తీర్థం జీవనార్థం హతం వ్రతం। సందిగ్ధో హతో మంత్రో వ్యగ్రచిత్తో హతో ద్విజః॥ పృథివ్యాం యానితీర్థాని తానిసర్వాణి సాగరే సాగరేయాని తానిస్యుః పాదేవిప్రస్య దక్షిణే॥ ఇతి.

అథనదీరజోదోష నిగ్రహః.

తత్రకాత్యాయనః॥ సంప్రాప్తే శ్రావణేమాసి సర్వానద్యో రజస్వలాః। తాసుస్నానం నకుర్వీత వర్జయిత్వాతు జాహ్నవీ॥ యోగయాజ్ఞవల్క్యోపి॥ యావన్నోదేతిభగవాన్ దక్షిణాశా విభూషణం। తావద్రేతో వహానద్యో వర్జయిత్వాతు జాహ్నవీమితి॥ అగస్త్యోదయ పర్యంతం నద్యోరజస్వలా ఇత్యర్థః॥ ఉదయస్తు తస్యజ్యోతిశ్శాస్త్రే దర్శితః॥ వ్యాఘ్రపాదః॥ సింహకర్కటయోర్మధ్యే సర్వానద్యో రజస్వలాః। తాసుస్నానం నకుర్వీత వర్జయిత్వా సముద్రగాం॥ సముద్రగా మహాన

మాంసమును- ఆయుధమును- తీర్థస్నానాది సుకృత ఫలమును- నువ్వులను- బియ్యమును- ధాన్యమును విక్రయింపఁ గూడదు అని యాపస్తంబుడు చెప్పెను. ధర్మదానము కొన్ని యెడల విధింపఁ బడియెను. దేవతలకును- గురువులకును- తలిదండ్రులకును పుణ్యమును దానము చేయ వలయును. అపుణ్యము నొసంగుమని యెందును లేదు. జీవనార్థమై చేయు తీర్థ యాత్రయు- జీవనార్థమగు వ్రతంబును- సందేహము గల మంత్రంబును- వ్యర్థంబులు. చలచిత్తుండగు ద్విజుండును వ్యర్థుఁడు. పుడమి యందు గల తీర్థము లన్నియు సముద్రము నందుగలవు. సముద్రమునఁ గల తీర్థము లన్నియు విప్రుని కుడిపాదము నందు గలవు. అని శాండిల్యుఁడు చెప్పెను.

ఇఁక నదుల రజోదోష నివృత్తి.

శ్రావణ మాసము రాగానే నదులన్నియు రజస్వల లగును. అప్పుడు గంగా నదియందుఁ దప్ప తక్కిన నదులయందు స్నానము చేయఁ గూడదు- అని కాత్యాయనుఁడు చెప్పెను. అగస్త్య నక్షత్ర ముదయించు వఱకు గంగానది తప్ప తక్కిన నదులు రజస్వల లగునని యోగయాజ్ఞవల్క్యుండు చెప్పెను. అగస్త్యనక్షత్ర మెప్పుడు దయించునది జ్యోతి

దీ ॥ తత్రగవిశేషః ...స్మృతో భవిష్యత్పురాణే ॥ ఆదౌ కర్కటకే సర్వా
మహానద్యో రజస్వలాః। త్రిదినంతు చతుర్థేహ్ని శుద్ధాస్స్యుర్జాహ్నవీ
తథేతి॥ బ్రహ్మపురాణే॥ గోదావరీ భీమరథీ తుంగభద్రా చ వేణికా। కా
వేరీ చ తథా కృష్ణాః వింధ్య దక్షిణతః స్మృతాః। భాగీరథీ నర్మదా చ య
మునా చ సరస్వతీ । విశోకా చ వితస్తా చ వింధ్యస్యోత్తరతః స్మృతాః॥
ద్వాదశైతా మహానద్యో దేవర్షి క్షేత్ర సంభవాః ॥ ఏవం మహానదీత్వే
న పరిగణితా నామేవ దినత్రయం రజోదోషః॥ అన్యాసాంతు సముద్ర
గా నామపి మాసద్వయం రజోదోషః॥ కేచిత్తు ॥ యానిస్సృతా నదాః
ప్రోక్తాయాశ్చ గంగేతి కీర్తితాః। ఏతాసాం కర్కటే భాసా రజోదో
న విద్యతే ॥ కావేరీ తుంగ భద్రా చ కృష్ణవేణీ చ గౌతమీ । భాగీ
రథీ చ విఖ్యాతాః పంచ గంగాః ప్రకీర్తితాః ఇతి వచనము దాహరన్తః
రజోదోషో నాస్తీత్యాహుః॥ కాత్యాయనోపి॥ జాహ్నవ్యాదిత్య సంభూ
తా ప్రతీచ్యా చ సరస్వతీ । రజసా తాన దూష్యన్తి నద్యః కృష్ణా చ వేణి
కా। మధుప్రవాహాం శుమతీ కౌశికీ పాపనాశినీ। దృషద్వతీ తథా పు
ణ్యాతథా వై గగణీనదీ। ఏతాసాముదకం పుణ్యం. వర్షాకాలే ప్రవర్తితం।

---

క్షేత్రమున గలదు. సింహకర్కాటక సంక్రమణముల మధ్య మహానది తప్ప కడమ న
దులు రజస్వల లగును. కావున వాని యందు స్నానము చేయఁ గూడదు. అని వ్యాఘ్ర
పాదుడు చెప్పెను. కర్కాటక సంక్రమణము ప్రవేశింపగనే గంగాదులతోఁ గూడి మహా
నదులన్నియును మూడుదినములు రజస్వల లగును. నాల్గవనాడు పవిత్రములగు నని భవిష్య
త్పురాణము నందు గలదు.

గోదావరి- భీమరథి- తుంగభద్ర- వేణి- కావేరి- కృష్ణ, అను నాఱును వింధ్యప
ర్వతమునకు దక్షిణ దిక్కున నున్నవి- భాగీరథి- నర్మద- యమున- సరస్వతి- విశోక- వి
తస్త అను నాఱును వింధ్య పర్వతమునకు నుత్తర దిక్కునఁ గలవు- ఈ పండ్రెండును మ
హానదులును దేవర్షి క్షేత్రముల యందుఁ బుట్టెను. ఇట్లు మహానదులలోఁ లెక్కింపఁ బడి
న వానికే రజోదోషము మూడుదినములు - తక్కినవి సముద్రములోఁ జేరునవైనను వా
నికి రజో దోషము రెండు నెల లుండును.

రజస్వలాత్వ మేతాసాం విద్యతేన కదాచ నేతి ॥ సఏవ కదా చిద్రజో దోషస్యా పవాదమాహ ॥ ఉపాకర్మణి చోత్సర్గే పితృస్నానే తథై వచ। చంద్రసూర్య గ్రహేచైవ రజోదోషో నవిద్యతే ॥ మహాదంబు సమం వాపి యదిత్యేత్పురాతనం । నవాంబు మిశ్రితం తేన నదష్టమితి సూరయః । వ్యాఘ్రపాదః ॥ అభావే కూపవాపీనాం అనపా యపయోభృతాం। రజోదుష్టే పిపయసిగ్రామ భూమాన దూష్యతీతి॥ ఇతిరజో దోషనిర్ణయః॥

## అథగౌణ స్నానాని.

జాబాలిః ॥ అశిరస్కం భవేత్స్నానం స్నానాశక్తౌతు కర్మిణః॥ నాభిమాత్రం నిమజ్జ్యాప్సుకటిం వాతూళ యేజ్జలైః । ఆర్ద్రేణవాస సా

---

ఇందు కొందఱ యభిప్రాయ మేమనిన- నదములను సుజ్ఞ గలవానికిని- గంగయను పేరుగల వానికిని- రజోదోషము లేదు. కావేరి- తుంగభద్ర- కృష్ణవేణి- గోదావరి- భాగీరథి యను నైదు నదులకును పంచ గంగలను ప్రఖ్యాతి గలదు గాన కావేరి మొదలగు నైదు నదులకు రజోదోషము లేదని వారి యభిప్రాయము.

భాగీరధియమున- సరస్వతి- కృష్ణ- వేణి- అంశుమతి- గోదావరి- దృషద్వతి- వైతరణి ఈనదుల యుదకము వర్షా కాలమున వృద్ధి నొందినను పవిత్ర మైనది. వీనికి రజోదోష మెప్పుడును లేదు. అని కాత్యాయనుఁడు చెప్పెను. ఉపాకర్మము నందును- ఉత్సర్గము నందును- పితృస్నానము నందును- చంద్ర సూర్య గ్రహణముల యందును- నదులకు రజోదోషము లేదని కాత్యాయ నుఁడె చెప్పెను.

ఏటి యందు పాతనీరు క్రొత్త నీరు కన్న నెక్కువగా గాని దానితో సమముగా గాని యుండు నెడ రజోదోషము లేదు. తగ్గిపోని నీరుగల నూతులు లేనియెడ నదీజలము రజోదోషము గలది యైనను ఊరి పొలిమేర భూమి లోపల స్నాన పానాదులకు నిషేధము లేదని వ్యాఘ్ర పాదుఁడు చెప్పెను. రజోదోష నిర్ణయము ముగిసెను.

## గౌణ స్నానములు.

కర్మఠుఁడు తనకు శిరస్స్నానము చేయుటకు శక్తి లేని యెడ కంఠస్నానము చేయ వలయును. దానికిని శక్తి లేనియెడ నాభి వరకైనను నీటిలోదిగి కటిప్రదేశమును గడిగికొన వలయును.

చాగం మార్జనం కాపిలం విదుః॥ స్నానాని పంచ పుణ్యాని కీర్తితా ని మహర్షిభిః। ఆగ్నేయం వారుణం బ్రాహ్మం వాయవ్యం దివ్య మేవ చ। ఆగ్నేయం భస్మనాపాద మస్తకాద్దేహ ధూళనం। గవాంహిరజసా ప్రోక్తం వాయవ్యం స్నానముత్తమం। యత్తుసాతప వర్షేణ దివ్యం త త్స్నాన ముచ్యతే.॥ గర్గః॥ దివ్యంవాయవ్య మాగ్నేయం బ్రాహ్మంసా రస్వతం తథా। మానసంచేతి విజ్ఞేయం గౌణస్నానంతు షడ్విధమితి॥ యోగయాజ్ఞ వల్క్యః॥ అసామర్థ్యా చ్ఛరీరస్య కాలశక్త్యా ద్యపేక్షయా మంత్రస్నానాది కాన్సప్త కేచిదిచ్ఛంతి సూరయః॥ మాంత్రం భౌమంత థాగ్నేయం వాయవ్యం దివ్యమేనచ। మానసంవారుణం చేతిసప్త స్నా నాన్య నుక్రమాత్॥ ఆపోహిష్ఠాద్యాది మంత్రైర్మృదాలం భస్తు పార్థివం। వారుణం చావగాహస్తు మానసం శివచింతనం। మానసంప్ర వరంస్నా నం సర్వేశం సంతి సూరయ ఇతి॥ దక్షః॥ ఆగ్నేయం వారుణం బ్రా హ్మం వాయవ్యం దివ్యమేవచ। మానసం యౌగికంచైవ అష్టమం కాపి లంస్మృతం। సారస్వతం తథాప్రోక్తం నవమం స్నానముత్తమ మితి॥ త

దానికిని శక్తి లేకుండిన- తడివస్త్రముతో శరీరము తుడిచి కొన వలయును. దీనికి కాపిల స్నానమని పేరు అని జాబాలి మహర్షి చెప్పెను.

ఆగ్నేయము- వారుణము- బ్రాహ్మము- వాయవ్యము- దివ్యమునని స్నానములై దు విధములు. ఇందు- భస్మము నాపాద మస్తకము రాసికొనునది ఆగ్నేయ స్నానమ ని చెప్పఁ బడును. గోధూళితోఁ జేయఁ బడునది వాయవ్య మగును. ఎండతో గూడిన వానలోఁ దడియుట దివ్యస్నాన మగును. అని పరాశరుఁడు చెప్పెను.

దివ్యము- వాయవ్యము- ఆగ్నేయము- బ్రాహ్మము- సారస్వతము- మానసము నని గౌణ స్నానము లాఱువిధములని గర్గ మహర్షి తెలిపెను.

శరీరము యొక్క- యశక్తి యను- దేశకాలాదులను బట్టి మాంత్ర స్నానాదు లేడు గలవు. అవి యెవ్వి యనిన- మాంత్రము- భౌమము- ఆగ్నేయము- వాయవ్యము- దివ్య ము- దివ్యము- మానసము- వారుణము ననునవి- ఇందు- ఆపోహిష్ఠా అని మొదలగు మం త్రములతోఁ జేయఁ బడునది మాంత్రము- మృత్తికతోఁ జేయఁ బడునది భౌమము- నీరు లో మునుగుట వారుణము- శివచింతనము చేయుట మానసము- నగు. వీనిలో మానసము సర్వోత్తమ మైనది. అని యోగయాజ్ఞ వల్క్యుఁడు చెప్పెను.

తాగ్నేయ స్నానప్రకార మాహాపస్తంబః॥ భస్మస్వా దగ్నిహోత్రా
గ్నేరావసథ్యాదథాపివా । అభావేచానయోర్వీర స్వగృహ్యాగ్నేర
థాపివా। తస్మాదాదాయ విధివత్ స్నాన మాగ్నేయ మాచరేత్॥ భ
స్మస్థాప్య కరేవామే విధ్యుక్తం ప్రాగ్యథోదితం। సౌవర్ణే రాజతే వాపి
తామ్రేమృత్పాత్రాంత రేపివా । అగ్నిరిత్యాది భిర్మంత్రైః ప్రణవేన తథై
వచ। షడ్భిర్మంత్రైః ప్రజప్తేన భస్మ తద్గృహ్య పద్ద్వయే । ఈశాద్యైః
పంచభిర్మంత్రైః క్రమాదుద్ధూళయేత్తత ఇతి॥ అగ్నిరిత్యాదయో మం
త్రా అథర్వశిరసిస్థితాః। అగ్నిరితిభస్మ। వాయురితిభస్మ। జలమితిభస్మ।
స్థలమితిభస్మ। వ్యోమేతిభస్మ। సర్వగ్ంహవా ఇదగ్ంభస్మ। ఇతిశిరః॥
॥లింగపురాణే॥ ఈశానేన శిరోదేశం ముఖంతత్పురుషేణతు । ఉరోదేశ
మఘోరేణ గుహ్యం వామేన సువ్రత । సద్యేనపాదౌ సర్వాంగం ప్రణ
వేన విశోధయేత్। కృత్వాపి చాతులంపాపం మృత్యు కాలేపి యోన్నా

---

ఆగ్నేయము- వారుణము- బ్రాహ్మము, వాయవ్యము, దివ్యము, మానసము, యౌ
గికము, కాపిలము, సారస్వతమునని స్నానములు తొమ్మిదివిధములని దక్షుఁడు చెప్పెను.

అందు ఆగ్నేయ స్నాన విధానమును ఆపస్తంబుడు చెప్పెను, గార్హపత్యము,ఆ
వసథ్యమునను నగ్నుల నుండిగాని, గృహ్యాగ్ని వల్ల నుండి గాని భస్మమును గ్రహించి యా
గ్నేయ స్నానము చేయ వలయు. అది యెట్లనిన, భస్మమును, ఎడమచేతి యందు గాని,
లోహపాత్రము నందు గాని యునిచి అగ్ని ఇత్యాది మంత్రముల చేతను, ప్రణవము చేత
ను మంత్రించి ఈశానాది పంచ బ్రహ్మ మంత్రములచే క్రమముగా శరీరము నంతను రా
చుకొన వలయు. అగ్నిరితి భస్మ, ఈ మొదలగు మంత్రములు అథర్వ శిరమున నున్నవి.

ఈశాన మంత్రముచే శిరస్సునను, తత్పురుష మంత్రముచే ముఖము నందును, అ
ఘోర మంత్రముచే వక్షము నందును, వామదేవ మంత్రముచే గుహ్యము నందును, సద్యో
జాత మంత్రముచే పాదముల యందును ప్రణవముచే సర్వాంగ యవముల యందును భస్మము
ను రాచుకొన వలయు. మితములేని పాపములు చేసినను అంత కాలమునందైన నిట్లు భస్మ
స్నానము చేసిన వాఁడు సకల పాపములచే శీఘ్రముగా విడువఁబడునని లింగ పురాణ

జః। భస్మస్నాయీ భవేత్కశ్చిత్ క్షిప్రం పాపైః ప్రముచ్యతే। ఇతి। వారుణస్నాన మాహ వ్యాసః। స్నానమబ్దైవ తైర్మంత్రై ర్మజ్జనావ గాహనైః। తర్పణం పితృదేవానాం స్నానం వారుణముచ్యతే। బోధా యనః। జలావగాహనం స్నానం వారుణం సర్వవార్ణికం। మంత్రవత్ప్రో క్షణంచాపి ద్విజాతీనాం విశిష్యత ఇతి। బ్రాహ్మస్నాన ప్రకారమాహ కా త్యాయనః। ఆపోహిష్ఠాదిభిర్బ్రాహ్మం మంత్రస్నానం హితత్స్మృతం। కు శాగ్రైః ర్మార్జనం కుర్యాద్దేవ తీర్థేన వా ద్విజః। ఋగంతే మార్జనం కుర్యా త్పాదాంతే వా సమాహితః। ఋచశ్చాంతేఽథ వాకుర్యాత్ శిష్టానామ తమీదృశం। బ్రహ్మ। భువిమూర్ధ్ని తథాకాశే మూర్ధ్న్యాకాశే తథా భువి। ఆకాశే భువి మూర్ధ్నిస్యాత్ మంత్రస్నానం విధీయతే। భువిపాద యోః। ఆకాశే హృది। వాయవ్యం దర్శయతి బృహస్పతిః। వాయవ్యా గోరజః ప్రోక్త మస్తంగచ్ఛతి గోపతౌ। విద్వత్సరస్వతీ ప్రాప్తం స్నానం

---

ము వందు గలదు. వరుణ దేవతా కములగు మంత్రములతో స్నానము చేసి పితృదేవతల కు తర్పణము చేయుట వారుణ స్నానమగును. అని వ్యాసుఁడు చెప్పెను.

నీరిలో మునుగుట యను వారుణ స్నాన మన్ని వర్ణముల వారికి సమానమే. అం దు మంత్రములతో ప్రోక్షించు కొనుట యనునది బ్రహ్మ క్షత్ర వైశ్యులకు విశేషముగా విధింపఁ బడు చున్నది.

బ్రాహ్మ స్నానము చేయు విధమును కాత్యాయనుఁ డిట్లు చెప్పెను, ఎట్లనిన, ఆ పోహిష్ఠా ఈ మొదలగు మంత్రములు చదువుచు ఋక్కు యొక్క యంతమునగాని పా దాంతమునగాని దర్భలతో జలమును శిరమున జల్లుకొనుట బ్రాహ్మస్నానమని యను చెప్పె డును. పాదములు, శిరము హృదయమునను వానియందు మొదటను, శిరము హృదయము పాదములు, శిరమునను వానియందు పిమ్మటను, హృదయము, పాదములు శిరమునను వా నియందు తరువాతను మంత్రస్నానమునందు జలముచల్లుకొన వలయును.

సూర్యుం డస్తమించు నప్పుడు గోధూళితోఁ జేయఁబడునది వాయవ్యమగును.

పండితుల యొక్క వాక్కుతోఁ జేయఁబడునది సారస్వత స్నానమగు. అది

సారస్వతం స్మృతం। గోపతిస్సూర్యః। విదుషాం సరస్వతీ వాణీ తయా ప్రాప్తం సారస్వత మిత్యర్థః। తత్స్వరూప మాహవ్యాసః। స్వయమేవోప సన్నాయ వినయేన ద్విజాతయే। తథా సంపాద యేత్స్నానం శిష్యాయచ సుతాయచ। గాత్రోయేణ మయైఃకుంభైః మంత్రిపక్షావ్నా వీజతైః। కృతమంగళ పుణ్యాహైః స్నానమస్తుత దర్శిన। ఆదావత్రప్రభాసే బహుగుణ సలిలే మధ్యమే పుష్కరేచ। గంగాద్వారే ప్రయాగే కనఖలసహితే గవ్యకర్ణే గయాయాం। రాహుగ్రస్తేతు సోమేదినకర సహితే సత్యశత్యా విశేషా। దేతైర్విఖ్యాతరూపైస్త్రిభువన విదితైః స్నానమచ్ఛిద్ర మస్తు। ప్రాప్యసారస్వతం తీర్థం భవేన్ముదిత మానసః। సర్వతీర్థాభిషేకాద్ధి పవిత్రం విదుషాంహివాక్। సపవః శుచిదేశాన్మృదంగృహ్య కుర్యాద్గాత్రోప లంభనం। మంత్రైః పార్థివసంయుక్తైః భౌమస్నానం తదుచ్యతే। మృత్తికేహనమేపాప మిత్యాదయః పార్థివ సంయుక్తా మంత్రాః। గోఖురాద్ర జలమాదాయ గోసావిత్రీం జపేద్బుధః। గాత్రేమ్వేధ

---

ట్లనిక, వినయవంతుఁడగు శిష్యునుద్దేశించి గాని, పుత్రునుద్దేశించి గాని, చేయవలయును. బంగారు కలశముల యందు గంగా జలము నునిచి స్వస్తి పుణ్యాహ వాచనము గావించి యా జలము చల్లుచు పవిత్రోదకములగు ప్రభాసము నందును, పుష్కరము నందు, గంగాద్వారము నందును, ప్రయాగయందును, కనఖలము నందును, గోకర్ణము నందును, గయయందును ఇట్లు లోకప్రసిద్ధములగు పుణ్యతీర్థముల యందు చంద్ర సూర్య గ్రహణముల యందు స్నానము చేయఁగా గలుగు ఫలమంతయు సంపూర్ణముగా నీకుగలుగు గాక యనిగురువు పలుక వలయును. ఇట్టి సారస్వత తీర్థమున స్నానము చేసి శిష్యుఁడు సంతోషభరితుఁడై యుండ వలయును ఏలన, సర్వతీర్థముల యందు స్నానము చేయుట కన్న పండితుల వాక్కు పరమ పవిత్రమైనది. అని వ్యాసుఁడు చెప్పెను.

పవిత్రమగు చోటమృత్తికను గ్రహించి, మృత్తికే హనమే పాపం ఈ మొదలగు మంత్రములు చదువుచు శరీరమునకు రాచికొనుట భౌమ స్నానమగును.

గోపాద ధూళిని గ్రహించి గోసావిత్రిని పఠించుచు శరీరమునకు పూసికొనుటవాయవ్య మగును.

తదాలిప్య స్నానం వాయవ్య ముచ్యతే॥ ఉత్తరాయణమధ్యేతు యదా వర్షతి వాసవః। ఆతపేన సహస్నానం దివ్యంస్నానం తదుచ్యతే॥ కూర్మపురాణే॥ అప్రాయుత్యే సముత్పన్నే స్నానమేవం సమాచరేత్। బ్రాహ్మాదీనన్యథా శక్తౌ స్నానాన్యాహుర్మనీషిణః॥ జాబాలిః। అశిరస్కం భవేత్స్నానం స్నానాశక్తౌతు కర్మిణః॥ తస్యాప్య సామర్థ్య విధౌ మంత్రస్నానాదికం భవేత్। అసామర్థ్యా చ్ఛరీరస్య వైషమ్యాద్దేశ కాలయోః॥ స్నానాన్యే తాని తుల్యాని వారుణేన భవంతిహి॥ మనుః। ప్రభుః ప్రథమకల్పేపి యోనుకల్పే ప్రవర్తతే॥ నసాంపరాయికంతస్యదుర్మతేర్వర్తతేఫలమితి॥ సాంపరాయికమాముష్మికం॥

ఇతిగౌణ స్నానాని.

---

ఉత్తరాయణమున, ఎండ యుండగా వానకురియు నప్పుడు ఆవానలో తడియుట దివ్యస్నానమగును. అనియు వ్యాసుడు వచించెను.

అశక్తత సంభవించి నప్పుడు బ్రాహ్మాది గౌణస్నానముల చేయవలయును. శిరస్స్నానము చేయుటకు జాలకుండినకంఠస్నానము చేయ వలయును. దానికిని శక్తి చాలకుండిన మంత్రస్నానాదులు చేయవలయును, అశక్తియందును, దేశకాలవైపరీత్యము నందును గౌణస్నానములు చేసినను అవి ముఖ్యస్నానములతో సమములే యగును. అని జాబాలి మహర్షి చెప్పెను, మొదటి పక్షమును చేయశక్తి యుండియు నదినిడిచి రెండవ పక్షమును అవలంబించునో వానికి నాముష్మిక ఫలము లేదని మనువు వక్కాణించెను.

గౌణస్నానములు ముగిసెను.

# అథత్రిపుండ్రవిధిః.

కాలాగ్ని రుద్రోపనిషది॥ ఆగ్నేయం భస్మసద్యో జాతమితి పంచ బ్రహ్మమంత్రైః ప్రతిగృహ్యా, అగ్నిరిత్యనేన చాభిమంత్ర్య, మానస్తోక ఇతిసముద్ధృత్య; జలేన సంసృజ్య, శిరోలలాటవక్షస్కంధేషు త్ర్యాయుషైః త్ర్యంబకైః స్తిస్రోరేఖాః ప్రకుర్వీతేతి, తత్రైవ॥ త్రిపుండ్రం భస్మనా కరోతి యోవిద్వాన్ బ్రహ్మచారీ గృహీ వానప్రస్థోయతిర్వా స సమస్తమహా పాతకోప పాతకేభ్యః పూతో భవతి। ససర్వాన్దేవాన్ధ్యాతో భవతి। సస ర్వేషు తీర్థేషు స్నాతో భవతి। ససర్వ సంపత్స మృద్ధోభవతి। ససతతం సర్వరుద్ర మంత్రజాపీ భవతి। సర్వ భోగ భుగ్దేహం త్యక్త్వా శివసాయుజ్య మవాప్నోతి। సచ పునరా వర్తతే నచపునరా వర్తత ఇత్యాహ భగవాన్కాలాగ్ని రుద్రః॥ఇతి॥

జాబాలోపనిషది॥అగ్నిరితిభస్మ,జలమితిభస్మ,వాయురితిభస్మ,స్థలమితిభస్మ,వ్యోమేతిభస్మ,సర్వగ్ం హవా ఇదగ్ం భస్మ, మనఇత్యాదీని చక్షూగ్ంషి కరణాని భస్మాని॥ అగ్ని రిత్యాది నాభస్మగృహీత్వా విమృజ్యాంగానిసంస్పృశేత్ ॥ఇతి॥తథా-శైత్తిరీయే, శిష్యానుశాసనే॥సత్యా

కాలాగ్ని రుద్రోపనిషత్తునందు॥ అగ్నియందుఃబుట్టిన భస్మమును సద్యోజాతాది పంచ బ్రహ్మ మంత్రములచే గ్రహించి, అగ్నిరితి భస్మ ఈమొదలగు మంత్రములచే నభిమంత్రించి, మానస్తోకే అనుమంత్రమును జదువుచు జలము కలిపి,త్ర్యాయుషం జమదగ్నేః త్రియంబకం యజామహే ఈమంత్రములను జదువుచు శిరము నందు, ముఖము నందు, రొమ్మునందు, భుజము లందును మూడేసి రేఖలు ధరింప వలయునని యున్నది. మఱియు నాయుపనిషత్తునందే॥ బ్రహ్మచారి, గృహస్థుడు- వానప్రస్థుడు- యతి యను వారిలో నెవ్వరైనను భస్మ త్రిపుండ్రమును ధరించువాడు వాడు సకల మగు మహాపాతకముల నుండియు, ఉపపాతకముల నుండియు విముక్తుడగును. సకల దేవతలను ధ్యానముచేసిన వాడగును. సకల రుద్ర తీర్థముల యందు స్నానము చేసిన వాడగును. సకలసంపదలు గలవాడగును. సకల రుద్ర మంత్రములను జపించిన వాడగును. మఱియునట్టివాడు సకల భోగముల నను భవించి, దేహావసానమున శివసాయుజ్య మును పొంది యున్నటికిని పునరావృత్తిని పొందనేరడని భగవంతుడగు కాలాగ్ని రుద్రుడు పలికెనని కల

న్న ప్రమదితవ్య మిత్యారభ్య భూత్యైన ప్రమదితవ్యమితి॥ అత్రత్య భూతిపదస్య భస్మపరతాం సిద్ధాంతయతి భగవాన్బోధాయనః॥ యథా॥ అథాతో ద్విజాతీనాము హరహ త్రిపుండ్రవిధిం వ్యాఖ్యాస్యామో భూత్యైనప్రమదితవ్యమితి వాక్యమ్నాయతఇతి॥ ఉపబృంహితశ్చాయ మర్థో మానవపురాణే॥ సత్యాన్నప్ర మదితవ్యాన్వై ధర్మాచ్చ కుశలాచ్చనభూత్యా అగ్నిసముత్థా యాస్తతో దేహానుకూలనాత్ లలాటేహృదిదోర్మూలేత్రిపుండ్రస్యచ ధారణాత్॥ ఇతి. తథాసూత సంహితాయాం॥ సత్యాద్ధర్మాచ్చ కుశలాద్భస్మ నోద్ధూళ నాదపి। త్రిపుండ్రధారణాచ్చాపి త్యాది కల్ప్రద్రష్టవ్యం॥ ఏతేనభూత్యై-మంగళయుక్తాత్కర్మణఇతియత్పరేషా వివరణంతన్నిర్యాలితం॥ కల్పసూత్రేయథా వేదఇతి వేదకల్పకల్పసూత్రవిరుద్ధత్వాదుపబృంహణబాధితత్వాచ్చేత్యధికం రహస్యరుద్రాక్షమాహా

---

దు. ఇదిశాక- జాబాలోపనిషత్తునందు॥ అగ్నిరితి భస్మ ఈ మొదలగు మంత్రములచే భస్మమును గ్రహించి, శరీర మున నలదు కొన వలయునని యున్నది. మరియు- తైత్తిరీయమా నందు॥ శిష్యులకు బోధించు నప్పుడు॥ సత్యము నెడ ప్రమాదము నొందఁగూడదని యారంభించి, భూత్యైన ప్రమదితవ్యం, భస్మధారణ మునెడను ప్రమాదము నొందఁ గూడదని చెప్పంబడి యున్నది.

ప్ర॥ భూత్యై అనఁగానే భస్మధారణ మని యెట్లు నిశ్చయమగును?

ఉ. భూత్యైన ప్రమదితవ్యం, అని శ్రుతియందు గలదు. గాన ద్విజాలకు నహదినము త్రిపుండ్రవిధిని నవచించు చున్నా మనుట చేయందగు భూతి పదము నకు భస్మధారణమే యర్థమని బోధాయన మహర్షి నిర్ణయించి నందున నాయర్థము నిశ్చితమగు చున్నది.

మరియు, సత్యము నెడను, ధర్మము నెడను, కుశలము నెడను, భస్మధారణము నెడను ప్రమాదము నొందఁ గూడదని మానవ పురాణము నందును నీయర్థము ఉపబృంహింపఁ బడియున్నది. సూత సంహిత యందును నీయర్థమే నిర్ణయింపఁ బడియెను.

ప్ర. భూత్యై॥ మంగళ యుక్తమగు కర్మము నుండి అని శ్రీశంకరాచార్యులు చెప్పియుండఁగా నాపదము భస్మపర మనుట యెట్లు?

ఉ. భూతి పదమునకు మంగళ పర ముగా శంకరాచార్యుల వారు చేసిన అర్థము వేద తుల్యమగు కల్ప సూత్రములకు విరుద్ధమైనది గావునను మానవ పురాణము సూత సంహిత మొదలగు వానియందు గలయుప బృంహణ ములచే బాధింపఁ బడిన

త్మ్య చండమార్తాండే నిరూపిత మస్మాభిః॥

తథా వాయవీయే॥ శుద్ధశీతజలేనైవ భస్మనా చ త్రిపుండ్రకం। యోధారయేత్పరం బ్రహ్మ సప్రాప్నోతి నసంశయః॥ యేషాం వపుర్మనుష్యాణాం త్రిపుండ్రేణ వినాస్థితం। శ్మశాన సదృశం తస్మాన్న ప్రేక్ష్యాః పుణ్యకృజ్జనైః॥ ధిగ్భస్మరహితం ఫాలం ధిగ్గ్రామ మశివాలయం। ధిగనీశార్చనం జన్మ ధిగ్విద్యామశివాశ్రయాం॥ త్రిపుండ్రం యేవినిన్దన్తి నిన్దన్తి శివమేవ తే। ధారయన్తి చ యే భక్త్యా ధారయన్తి శివం చ తే॥ ఇతి జాబాలోపనిషది॥ అగ్నిరిత్యాదినా భస్మ గృహీత్వా విమృజ్యాఙ్గాని సంస్పృశేదితి తథా, ఉపరి. తిర్యక్త్రిపుండ్రం ధారయేదితి చ, అథర్వశిరసి చ అగ్నిరిత్యాదినా భస్మ గృహీత్వా విమృజ్యాఙ్గాని సంస్పృశేత్తస్మాద్వ్రతమేతత్పాశుపతం పశుపాశ విమోక్షాయేతి

సూతసంహితాయాం॥ అగ్నిరిత్యాదిభిర్మన్త్రైర్జాబాలోపనిషద్గతైః సప్తభిర్ధూళనం కుర్యాద్భస్మనా సజలేన చ। త్రియాయుషేణ మన్త్రేణ

---

నను గ్రహింపఁ దగినది గాదు. ఈవిషయము రక్షా రుద్రాక్ష మాహాత్మ్య చండమార్తాండమునందు మఱియు, మాచే నధికముగాఁ జేయఁ బడియున్నది గాన నందుఁ జూడఁ దగును.

మఱియు, వాయు సంహిత యందు॥ జలమిశ్రమగు భస్మముచే త్రిపుండ్రమును ధరించువాఁడు పర బ్రహ్మమును పొందును ఎవ్వారల శరీరము నందు భస్మ త్రిపుండ్రము లేదో వారి శరీరము శ్మశానముతో తుల్యమైనదిగావున నట్టివారిని పుణ్యాత్ములు చూడఁ గూడదు. భస్మ త్రిపుండ్రములేని ఫాలంబును, శివాలయములేని గ్రామంబును, శివుని పూజింపని జన్మంబును, శివుని సంబంధింపని విద్యయు నిందార్హములు. మఱియు, భస్మ త్రిపుండ్రమును నిందించువారు శివుని నిందించిన వారే యగుదురు భస్మ త్రిపుండ్రమును ధరించువారు శివుని ధరించువారే యగుదురు అనికలదు.

జాబాలోపనిషత్తునందు॥ అగ్నిరితి భస్మమను మంత్రములతో భస్మమును గ్రహించి శరీరమునకు నలదుకొని అడ్డముగా త్రిపుండ్రమును ధరింప వలయునని యున్నది అథర్వశిరస్సునందు॥ అగ్నిరితి భస్మ ఇత్యాదులగు మంత్రములతో శరీరమునకు భస్మము నలదుకొనుట పాశుపత వ్రతమని చెప్పఁ బడును. దీని నాచరించిన వాఁడు బంధవిముక్తి నొందును. అనికలదు.

బుస్తిర్యక్త్రిపుండ్రకం। ధార్యం ప్రోక్తం ద్విజైః శ్వేతం కార్తికై ర్వేద
పారగైః॥ మేధావీత్యాది నావాపి బ్రహ్మచారీ దినేదినే। భస్మనా సజలే
నైవధారయేచ్చ త్రిపుండ్రకం। ఓంకారేణ త్రిరుక్తేనసహాంసేన త్రిపుండ్రకం
ధారయేద్భిక్షుకో నిత్యమితి జాబాలికీ శ్రుతిః॥ లలాటేచైవదోర్ద్వంద్వేత
థైవోరసి బుద్ధిమాన్। త్రిపుండ్రం ధారయేన్నిత్యం భుక్తిముక్తి ఫలప్ర
దం। వర్ణానామాశ్రమాణాంచ మంత్రతో, మంత్రతోపివా। త్రిపుండ్రో
ద్ధూళనం ప్రోక్తం జాబాలైరాదరేణతు॥ భారద్వాజస్మృతౌ॥ ప్రా
ఙ్ముఖశ్చరణౌహస్తౌ ప్రక్షాళ్యాచమ్య పూర్వవత్॥ ప్రాణానాయమ్య సం
కల్ప్య భస్మస్నానం సమాచరేత్। ఆదాయ భసితం శ్వేత మగ్నిహో
త్ర సముద్భవం। ఈశానేనతు మంత్రేణ స్వమూర్ధని వినిక్షిపేత్। తత
ఆదాయ తద్భస్మ ముఖే తత్పురుషేణతు। అఘోరాఖ్యేన హృదయే గు
హ్యే వామాహ్వయేనచ। సద్యోజాతాభిధానేన భస్మపాదద్వయే క్షి
పేత్। సర్వాంగం ప్రణవేనైవ మంత్రేణోద్ధూలయెత్తతః। ఏతదాగ్నే

సూతసంహితయందు॥ జాబాలోపనిషత్తునందుఁ జెప్పఁబడిన అగ్నిరితిభస్మయిత్యాది
పలుగు మంత్రములతో శరీరమునకు భస్మోద్ధూళనము చేసి కొనవలయును. త్రియాయుష
అను మంత్రములతో త్రిపుండ్రము ధరింప వలయు. బ్రహ్మచారి యగు వాడు మేధావీ
అనుమంత్రము చదువుచు సజల భస్మముతో త్రిపుండ్రమును ధరింప వలయు. యతియ
గు వాఁడు హంస మంత్రము తోఁగూడ ముమ్మారు ప్రణవము నుచ్చరించుచు త్రిపుండ్ర
మును ధరింప వలయు. ననిజాబాల శ్రుతియందు గలదు. ముఖము నందును, బాహుయుగ
మునందును, వక్షము నందును త్రిపుండ్రమును ధరింప వలయు. అన్ని వర్ణముల వారికి అ
న్నియాశ్రమముల యందున్న వారికిని భస్మోద్ధూళనము- భస్మ త్రిపుండ్రము విధింప
బడియెను. కానివారిలో వేదాధికారము గలవారికి సమంత్రకముగను, అదిలేనివారికి నమం
త్రకముగను ధారణము విహితము.

భారద్వాజస్మృతియందు॥ కాలుచేతులుగడిగికొని, తూర్పుమొగమునఁ గూర్చుండి ఆచమ
నము ప్రాణాయామము సంకల్పంబును చేసి, భస్మస్నానము సేయవలయు. అదిఎట్లనిన, అగ్ని
హోత్రమునఁ బుట్టిన తెల్లని భస్మమును దీసికొని, యందు జలము గలిపి ఈశానమంత్రముతో శి
మునందును, తత్పురుష మంత్రముతో ముఖమునందును, అఘోరమంత్రముతో హృదయమునందు

యాకం స్నానముదితం పరమర్షిభిః। సర్వకర్మ సమృద్ధ్యర్థం కుర్యాదాదౌ విధానబుధః॥ తిర్యక్ త్రిపుండ్రవిధి నాలలాటే హృదయే గళే। పంచభిర్బ్రహ్మభిర్వాపి తథాఽగ్నిరితి మంత్రతః ॥ఇతి॥

స్మృత్యంతరేచ। మానస్తోకేతి మంత్రేణ మంత్రితం భస్మ ధారయేత్ ॥ఇతి॥ బోధాయనస్మృతౌ। సద్యోజాతేన గృహ్ణీయాద్వామదేవేనత్వాభిమంత్రయేత్ ।అఘోరేణదహేద్భస్మ తత్పురుషేణ తు శోధయేత్ ।స్నానమీశాన మంత్రేణ కుర్యాన్మూర్ధాది పాదతః। ఆచమ్య కూర్చ ఆసీనః శివీభూత్వాశివంజపేత్ ॥ఇతి॥ కాత్యాయనోపి। శ్రాద్ధేయజ్ఞేజపేహోమే వైశ్వదేవే సురార్చనే। ధృత త్రిపుండ్రః పూతాత్మా మృత్యుం జయతి మానవః। త్రిపుండ్రంయద్యధృత్వాతు కుర్యాద్యత్కర్మ తద్వృథా ॥ఇతి॥ త్రిపుండ్ర ధారణ వర్జం క్రియమాణం శ్రాద్ధాదికమఫలమితి ప్రతిపాదయతి॥ తథా, శాతాతపోపి॥ సత్యం శౌచం తపోహోమస్తీర్థం దే

---

ను, వామదేవమంత్రమునగు హృదయము నందును, సద్యోజాత మంత్రముతో పాదముల యందును, ప్రణవముతో సర్వాంగముల యందును నలదు కొనవలయు. ఇట్లు భస్మము నలదు కొనునెడవిధియాగ్నేయ స్నానమగు సర్వకర్మ సమృద్ధికై కర్మారంభము నందు భస్మస్నానము జేయు వలయును. తరువాత, పంచ బ్రహ్మమంత్రముల తోడను అగ్నిరితి భస్మ ఈ మొదలగు మంత్రముల తోడను ముఖము, కంఠము- హృదయము, భుజ, హువులు సమస్థానముల యందు త్రిపుండ్రమును ధరింప వలయు. నని యున్నది. స్మృత్యంతరమునం దు॥ మానస్తోకే అనుమంత్రముతో మంత్రింపబడిన భస్మమును ధరింప వలయునని కలదు॥ బోధాయన స్మృతి యందు॥గోమయమును వెంటనె గ్రహించివామదేవమంత్రముచేమంత్రింప వలయు. అఘోర మంత్రముచే దహింపవలయు తత్పురుషమంత్రముచేశోధింపవలయు. ఈ శాన మంత్రముతో శిరము మొదలుకొని పాదముల వరకు నలదుకొన వలయు.ఆచమనము చేసి దర్భాసనమునం గూర్చుండి శివరూపులైశివమంత్రమునుజపింపవలయు. ననియున్నది.

శ్రాద్ధము, యజ్ఞము- జపము- హోమము- వైశ్వదేవము- దేవతార్చనము మున్నగు నవి చేయునప్పుడు భస్మ త్రిపుండ్రమును ధరించిచేయునెడపవిత్రుండై మృత్యువును జయిం చును.త్రిపుండ్రమునుధరింపక చేయుకర్మంబెల్ల వ్యర్థమగునని కాత్యాయన మహర్షి వచించెను.

మఱియు- సత్యము- శౌచము- తపము- హోమము- తీర్థయాత్ర- దేవపూజ ము

హావి పూజనః। తస్య స్పర్శ మిదం సర్వం యస్త్రిపుండ్రం నధారయే
త్ ॥ఇతి॥ పరాశర స్మృతౌ॥ బ్రాహ్మణో విధినోత్పన్నం త్రిపుండ్రం భస్మ
నైవతు। లలాటే ధారయే న్నిత్యం తిర్యగ్భస్మ స్నాన కుంఠనం ॥ఇతి॥ స్మృతి
సారసముచ్చయే॥ అశక్తస్సమయా చారే మనసాపాప మాచరన్। శు
చిరేవ భవేన్నిత్యం త్రిపుండ్రస్య చధారణాత్ ॥ఇతి॥ మహాభారతే ఆ
నుశాసనిక పర్వణి॥ అహంపశు పతిర్నామ మద్భక్తాయే చమానవాః॥
సర్వేషాం సతాక్షేమా భస్మదిగ్ధత నూరుహాః॥రక్షార్థం మంగళార్థం చ
పవిత్రార్థం చభామిని। లాంఛ నార్థంచ భక్తానాం భస్మదత్తం మయా
పురా ॥ఇతి॥ తత్రైవ॥ ఆయుష్కామో, ధవారాజన్ భూతి కామో,
ధవానరః। నిత్యం వైధారయేద్భస్మ మోక్షకామీచ యోద్విజః।
ఇతి ॥ ఆదిత్య పురాణే త్రిపుండ్ర ధారీ సతతం బ్రాహ్మణస్స
ర్వ కర్మసు। భస్మనైవాగ్ని హోత్రస్య శివాగ్ని జని తేన

---

స్నగువానిని భస్మ త్రిపుండ్రము ధరింపనివాఁడు చేయునట్టి వ్యర్థమగునని శాతాతపమహర్షి పలికెను.

ఇదిగాక- కల్పాదులచే సంపాదింపఁబడినభస్మముతో నుద్ధూళనమును త్రిపుండ్రమును బ్రాహ్మణుఁడను దినము ధరింపవలయునని పరాశర మహర్షి వచించెను.

మఱియు- శౌచాచారము నాచరింపఁ జాలనివాఁడైనను- పాపము లాచరించువాఁడైనను ప్రతిదినము భస్మత్రిపుండ్రమును ధరించుచుండిన పవిత్రుండగునని స్మృతి సారసముచ్చయము నందుగలదు.

ఇదిగాక- అనుశాసనిక పర్వమునందు॥ నేనుపశుపతిని. భస్మమును ధరించునా భక్తులందరును నా శుభులు. రక్షణకొఱకును- మంగళము కొఱకును- పావిత్ర్యము లాంఛనము కొఱకును భక్తులకు భస్మను నొసగితినని పరమేశ్వరుఁడు దేవితో చెప్పినట్లుకలదు. మఱియు నాపర్వమునందే॥ ఆయువునఁగాని- ఐశ్వర్యమునఁగాని- మోక్షమునుగాని గోరువాఁడు ముఖ్యముగా నెల్లప్పుడు భస్మమును ధరింప వలయునని యున్నది.

బ్రాహ్మణుఁడగు వాఁడు గృహ్యాగ్ని యందుగాని- శివాగ్నియందుగాని జనించిన భస్మమును సకలకర్మములు చేయునప్పుడును ధరింపవలయునని ఆదిత్యపురాణమునఁగలదు.

సత్యజ్ఞానానంద స్వరూపమైన జ్ఞానముచేత నెఱిఁగికొనఁదగినపరబ్రహ్మమే ముఖ్యమగు భస్మమని యెఱుంగుము. ఇఁక రెండవది యగ్నిజనితమగుభస్మము. ఇది యజ్ఞానమును తొలఁగించి జ్ఞానమును [illegible] భేదములు గలన్నది.

నా ॥ఇతి॥ వాసిష్ఠలైంగే, వసిష్ఠం ప్రతిసూతః దేవః॥ భస్మాదిధి పరం బ్రహ్మ సర్వబోధ సుఖావహం। భస్మేతత్వేద నామాభ్యాం ముఖ్యం తదపగా బుధః॥ ఆగ్నేయం గౌణమిత్యాహుర్ధ్యానసిద్ధిం జ్ఞానసాధనం। గౌణం నామాపి భావద్ధి బ్రహ్మ బ్రహ్మవిదాం వరం ॥ఇతి॥ పరాశరః॥ భస్మనా వేద మంత్రేణ త్రిపుండ్రం చావకుంఠనం। యస్యాసిద్ధ్యై ప్రియత్వేన బ్రాహ్మణ్యం తస్య పుష్కలం। భస్మనా వేదమంత్రేణ త్రిపుండ్రస్యతు ధారణం। ఆశ్రమాణాంచ సర్వేషాం ధర్మత్వేనాహు రాస్తికాః॥ భస్మసంపన్న సర్వాంగం త్రిపుండ్రాంకిత మస్తకం। యోనిన్దన్తి నరా రాజా స్సన్యాత్రాన విచారతః ॥ఇతి॥ గారుడే॥ ఉద్ధూళనం త్రిపుండ్రంచ మనసాపి న లంఘయేత్ శ్రుత్యా విధీయతే యస్మాత్ తత్త్యాగీ పతితో భవేత్ ॥ఇతి మానవ పురాణే॥ త్రిపుండ్రధారిణం దృష్ట్వా భూతప్రేత పురస్సరాః। భీతాః పర్కిం పి తార్క్ష్యఘ్నం గచ్ఛన్త్యేవ నసంశయః॥ త్రిపుండ్ర ధారణం భూత్వాతథా దేహావ కుంఠనం। యోవకుర్యాత్సమంత్రేణ ససాతపాత్పతితో భవేదితి॥ సనత్కుమార సంహితాయాం॥
త్రిపుండ్రం ధారయే న్నిత్యం గృహస్థ శ్రీమమాశ్రితః। ధారయేద్భిక్షుకో నిత్యమితి జాబాలికీ శ్రుతిః। ధారయే ద్బ్రాహ్మణో విద్వాన్ సర్వదైవ త్రిపుండ్రకం। త్రిపుండ్రం ధారయే న్నిత్యం మనసాపి న లంఘయేత్।

---

యనివసిష్ఠున కీశ్వరుండు పదేశించి నటుల వాసిష్ఠలైంగ మునందుగలదు.

వేదమంత్రములతో భస్మోద్ధూళనమును- భస్మ త్రిపుండ్రమును సేవించాచరించు కొనునో వానికే బ్రాహ్మణ్యము సమగ్రముగా గలదు. భస్మముతోను ద్ధూళనము- త్రిపుండ్రము నాచరించుట సర్వాశ్రమస్థులకు ధర్మమగును. భస్మోద్ధూళనమును- భస్మత్రిపుండ్రమును ధరించువానిని యెవ్వారలు నిందింతురో అట్టివారిని రాజైనవాడు శిక్షకనధిప వలయునని పరాశర పురాణమునం గలదు.

భస్మోద్ధూళనము- భస్మత్రిపుండ్రము శ్రుతిచే విధింపఁబడుచున్నది గాన వీనిని మనసునైన నిర్లక్ష్యము చేయఁదగదు. ఇట్టివానినిధరింపని వాఁడు పతితుఁడగునని గరుడపురాణంబున గలదు.

త్రిపుండ్రము ధరించినవానిని చూచి భూతప్రేతః శాచాదులు భయపడి పరుగిడుచుండును. అట్టిభస్మముతోను ద్ధూళనమును- త్రిపుండ్రమును చేసికొననివాడు కేవలము

త్రైత్యా విధీయతే యస్మాత్తత్త్యాగీ పతితో భవేత్ ॥ఇతి కూర్మపురాణే॥ స్రష్టాసృష్టిప్రభృతేనా హ్యత్రిపుండ్రస్య ప్రశస్తతాం। ససర్జ సలలాటం హి తిర్యక్ష్వోర్ధ్వా నవర్తులం। తిర్యగ్రేఖాః ప్రవర్తన్తే లలాటే సర్వదేహినాం। తథా పిమానవా మూర్ఖానకుర్వన్తి త్రిపుండ్రకం। వేదస్యాధ్యయనే శూద్రో నాధికారీయథా భవేత్। త్రిపుండ్రేణ వినా విప్రో నాధికారీస్వకర్మసు। యథా రాజా స్వచిహ్నాంకం స్వజనం మన్యతే సదా తథా శివ స్త్రిపుండ్రాంకం నరం స్వమివ మన్యతే॥ ద్విజాతిర్వాన్య జాతిర్వాపి తచ్ఛుద్ధేన భస్మనా। ధారయేద్య స్త్రిపుండ్రాంకం రుద్రస్తేన వశీకృతః॥ ఇతి లైంగే॥ త్రిపుండ్రం సురవిప్రాణాం వర్తులం నృపవైశ్యయోః॥ అర్ధచంద్రంతు శూద్రాణా మన్యేషా మూర్ధ్వ పుండ్రకమితి॥

బ్రహ్మక్షైవర్తైర్ధార్యా భస్మసధాగ్నిహోత్రజనితం యద్వైదికం వైదికైస్త్రిర్యక్పుండ్రకతయా లలాటఫలకే వక్షస్థలే మస్తకే। బాహ్వోర్మాత్రపురస్సరం క్రతుశతం తైరేవసమ్యక్కృతం స్నానం తీర్థసహస్రకోటిషు ధరాదత్తా

---

పతితుండగునని మానవపురాణము నందుగలదు.

గృహస్థుడు- యతియు ప్రతిదినము భస్మత్రిపుండ్రమును ధరింపవలయునని జాబాల శ్రుతియందుఁ గలదు. కావున బ్రాహ్మణుఁ డెల్లప్పుడు త్రిపుండ్రమును ధరింపవలయు. ఇది శ్రుతిచే విధింపఁ బడినదిగాన దీనిని విడిచిపెట్టినవాఁడు పతితుండగును. అని సనత్కుమార సంహిత యందు గలదు.

బ్రహ్మదేవుఁడు త్రిపుండ్రము యొక్క ప్రాశస్త్యమును సృష్టియందే కనఁబరిచెను. ఎట్లనిన- అతఁడు లలాటము నడ్డముగ సృజించెను గాని నిడుపుగ గాని గుండ్రముగాగాని సృజింపలేదు. మఱియు- అందఱియొక్క ముఖమునందును అడ్డరేఖలె కనఁబడుచున్నవి. దీనింబట్టి అడ్డముగ భస్మత్రిపుండ్రమును ధరింపవలయునని యీ సృష్టికర్త తాత్పర్యమైనట్లు తెలియుచున్నది. అయినను మూర్ఖులగు మానవులు త్రిపుండ్రమును ధరింపనొల్లరు. శూద్రునకు వేదాధ్యయనము నందున నధికారములేనట్లు త్రిపుండ్రము ధరింపని ద్విజునకు వైదికకర్మానుష్ఠానము నందధికారములేదు. రాజు తన చిహ్నము ధరించినవానినిస్వ

నవద్యాఖిలా॥ శంకర సంహితాయాం॥ యత్రభుంజీత భస్మాంగీ మూర్ఖో వా పండితోపివా। తత్రభుక్తో మహాదేవ స్సపత్నీకో వృషధ్వజః॥ భూతిరేవౌషధం పుంసాం ముక్తిశ్రీవశ్యకర్మణి ॥ఇతి॥ క్రియాసారే॥ యావన్తః పతితా భూమౌ భస్మనః పరమాణవః। తావద్వర్ష సహస్రాణి రౌరవం నరకం వ్రజేదితి॥ పరాశర పురాణే॥ శ్రౌత ధర్మైక నిష్ఠానాం లింగంతు శ్రౌత మేవహి। అశ్రౌత ధర్మనిష్ఠానామశ్రౌతం లింగమేవహి। శ్రౌతం లింగంతు విజ్ఞేయం త్రిపుండ్రోద్ధూళ నాత్మకం। అశ్రౌత మూర్ధ్వ పుండ్రాది నైవతిర్యక్త్రిపుండ్రకం। వేదసిద్ధో మహాదేవ స్సాక్షాత్సంసారమోచకః। సమూర్ధ్నివిగ్రవాశ్చార్ధ చంద్రార్ధ కృతశేఖరః। లోకానాముపకారాయ శ్రౌతం లింగం దధాతిచ ॥ఇతి॥ సౌర సంహితాయాం॥ భస్మసంఛన్న సర్వాంగమనుగచ్ఛతియః పుమాన్। సర్వపాతకయుక్తోపి ససద్యః పూయతే నరః॥ వాజాపశ్యోయథా సర్వపురాణేషు శుభస్మృతః॥

---

జననిగా దలంచినట్లు పరమేశ్వరుఁడును భస్మత్రిపుండ్రధారిని స్వీయునిగా దలంచుచుండును. కావున ద్విజుఁడుగాని ఇతరుఁడుగాని భస్మముతో త్రిపుండ్రము నెవ్వఁడు ధరించునో రుద్రుఁడు వాని కళేబరమున నుండునని కూర్మపురాణమునఁగలదు.

దేవతలకు విప్రులకును తిర్యక్పుండ్రంబును రాజులకు వైశ్యులకు వర్తులాకార పుండ్రంబును శూద్రులకు నర్ధచంద్రాకార పుండ్రంబును తక్కువారికి నూర్ధ్వపుండ్రంబును విహితములని లింగపురాణమున గలదు.

వేదమునందధికారముగలవారు అగ్నిహోత్రమున బుట్టిన భస్మమును వేదమంత్రములతో నడ్డముగా ముఖమునందును శిరమునందును వక్షమునందును బాహువులయందును ధరింపవలయును. ఇట్లు ధరించుచోడ సకలయజ్ఞములు సకల తీర్థస్నానములు సకలభూదానము చేయఁగా గల్గు సుకృతమంతయు లభించునని బ్రహ్మకైవర్తమునఁ గలదు.

మూర్ఖుఁడుగాని, పండితుఁడుగాని, భస్మము ధరించినవాఁడు ఎచ్చట భుజించునో అచ్చట పార్వతీ సహితుండగు పరమేశ్వరుండు భుజించినవాఁడగును. మనుజులకు భుక్తిముక్తుల నొసఁగుటకై విభూతి యొక్కటియే ఔషధమగు. అని శంకర సంహిత యందు గలదు.

ఎవ్వనిచేతినుండి భస్మముయొక్క పరమాణువులెన్ని నేలమీఁదఁబడునో వాఁడన్ని వేల వర్షములు రౌరవమను నరకమున మునుఁగునని క్రియాసారమునఁగలదు.

యథాపురీషు సర్వాసు పురీ వారాణసీశుభా। తథాశుభం త్రిపుండ్రం చ సర్వపుండ్రేషు కథ్యతే॥ యథావిశ్వాధికో రుద్రః సర్వ వేదేషు గీయతే। తథా సర్వ పురాణేషు త్రిపుండ్ర మపి గీయతే॥ త్రిపుండ్ర ధారిణః పాదా ప్రక్షాళ యతియః పుమాన్ సర్వ పాతక యుక్తోపి సనద్యః పూయతే నరః॥ త్రిపుండ్రధారిణో భిక్షాప్రదానేనసహి కేవలం సర్వపాతక యుక్తోపి పూయతే ఖ్యాసవో చిరాత్॥ తేనాధీతంశ్రుతం తేన తేన సర్వ మనుష్ఠితం। యేనవిప్రేణ శిరసి త్రిపుండ్రం భస్మనాధృతం॥ కృతంస్యా దకృతం తేన శ్రుతం స్యాద శ్రుతం భవేత్। అధీత మనధీతంచ త్రిపుండ్రం యేనవా ధృతం॥ వృథా వేదా వృథాయజ్ఞావృథాదానం వృథాతపః। వృథావ్రతోపవాసాశ్చ త్రిపుండ్రం యోనధారయేత్। సత్యం శౌచం తథాయజ్ఞ స్తీర్థ దేవాది పూజనం।సర్వమే

వైదికధర్మ నిష్ఠులకు వైదిక చిహ్నంబులును, అవైదిక ధర్మనిష్ఠులకు నవైదిక చిహ్నంబులును విహితములగును. ఇందు భస్మత్రిపుండ్రము, భస్మోద్ధూళనము ననునివి వైదిక చిహ్నములు, ఊర్ధ్వపుండ్రము మొదలగునవి యవైదిక చిహ్నములగును. సర్వవేద వేద్యుండును సంసార మోచకుండును, కుమార్ధ విగ్రహుండును చంద్రశేఖరుండు నగుమహాదేవుండు లోకోపకారమునకై వైదిక చిహ్నమునే ధరించునని పరాశర పురాణంబునఁ గలదు.

సౌరసంహిత యందు॥ శరీరమునందంతటను భస్మము నలదు కొనినవాని ననుసరించి పోవువాఁడు సకల పాతక యుక్తుండైనను నప్పుడే పవిత్రుండగును॥ సకల పురములలో కాశీనగర మెట్లో అట్లే సకల పుండ్రములలో భస్మ త్రిపుండ్రము సర్వోత్తమమైనది. సకల వేదముల యందును, పురాణముల యందును, పరమేశ్వరుండు ప్రశంసింపబడున ట్లే సకలవేదాదులయం దును భస్మత్రిపుండ్రంబును ప్రశంసింపఁబడుచున్నది॥ ఎవ్వండు భస్మత్రిపుండ్రధారియొక్క పాదములను గడుగునో వాఁడు సర్వపాతకయుక్తుండైనను అప్పుడే పవిత్రుండగును॥ త్రిపుండ్రము ధరించినవానికి భిక్షము నొసఁగువాఁడు సకలపాపవిముక్తుఁడగును॥ ఎవ్వండు త్రిపుండ్రము ధరించెనో వాఁడు సకల వేదముల జదివినవాఁడును సకల సత్కర్మములు చేసిన వాఁడగును భస్మ త్రిపుండ్రము ధరించినవాఁడు తాను చేయని సత్కర్మముల నెల్లఁజేసినవాఁడును, వినని వేదార్థములను వినినవాఁడును నగును. త్రిపుండ్రము ధరింపని వాఁడు చదివినవేదములును॥ అట్టివాఁడు చేసినయజ్ఞములు, దానములు, తపములు, వ్రతములు, ఉపవాసములును

తద్భవేద్వ్యర్థం యస్త్రిపుండం నధారయేత్। కీకటేష్వపిదేశేషు యత్ర భూతి విభూషణః।మానవస్తువసేన్నిత్యం కాశీక్షేత్రసమం హితత్॥ దుశ్శీలశ్శీలయుక్తోవా యోగవాకోవాప్యలక్షణః। భూతిశాసనసంయుక్తస్సపూజ్యో రాజపుత్రవత్॥ భస్మనాపిచ యోధత్తే భూతిశాసనమైశ్వరం। సపియాంగతి మాప్నోతి నతాంయజ్ఞశతైరపి॥ సంపర్కాల్లీలయావాపిభయాద్వా ధారయేత్తుయః। విధియుక్త విభూతింతు సతుపూజ్యో యథాహ్యహం॥ భస్మనావేద మంత్రేణ త్రిపుండ్రం చావకుంఠనం। యస్యసిధ్యేత్త్రయ త్నేన బ్రాహ్మణ్యం తస్యపుష్కలం॥ వేదవేదాంత నిష్ఠానాం భస్మనైవ త్రిపుండ్రకం। సమ్యక్ జ్ఞానపదం శీఘ్రం సత్యముక్తం నసంశయః॥ భస్మనావేద మంత్రేణ త్రిపుండ్రస్యతు ధారణం। మహాపాతక సంఘాత తమసశ్చండ భాస్కరః॥ భస్మనావేద మంత్రేణ త్రిపుండ్రస్యతు ధారణం। సర్వపాపహరం ప్రోక్తం సత్యమేవన సంశయః॥ భస్మనావేదమం

---

వ్యర్థము లేయగును॥ త్రిపుండ్రము ధరింపనివాని సత్యము, శౌచము, యజ్ఞము, తీర్థసేవ, దేవపూజ, మొదలగునవియెల్ల నిష్ప్రయోజనంబులగును॥ కీకటదేశముల యందైన నెచ్చోట భస్మధారి యుండునో ఆప్రదేశము కాశీ క్షేత్రముతో తుల్యమగును. దుశ్శీలుండుగాని, సుశీలుండుగాని భస్మధారణము విడువక చేయుచుండెనేని వానిని రాజపుత్రునివలె పూజింపవలయు॥ నెపముచేనైన భస్మము ధరించువాడెట్టి యుత్తమగతిని పొందునో అట్టిసద్గతిని నూరుయజ్ఞములచేనైన పొందనేరడు॥ సాంగత్యము వలనగాని, విలాసార్థముగాని, భయముచే గాని విభూతినిధరించినవానిని శివునివలె పూజింపవలయు॥ వైదికమంత్రములతో భస్మోద్ధూళనమును, భస్మత్రిపుండ్రమును నెవ్వండు ధరించుచున్నాడో వానికే సంపూర్ణముగ బ్రాహ్మణ్యంబు గలదు॥ వేదాంతనిష్ఠులకైనను భస్మత్రిపుండ్రమే జ్ఞానపదమగును. వైదిక మంత్రములతో జేయఁబడు భస్మత్రిపుండ్ర ధారణము మహాపాప సంఘమను నంధకారమునకు మధ్యాహ్నకాల సూర్యునింబోలిన దగును॥ భస్మధారణము సమస్త పాప నివారకంబగును॥ మఱియు, త్రిపుండ్ర ధారణము శివునకు విష్ణునకు బ్రహ్మదేవునకు, పార్వతీ దేవికి, లక్ష్మీదేవికి సరస్వతికి సంతోషకారణంబగును॥ ఇదిగాక, భస్మ త్రిపుండ్ర ధారణము చేనితో నెవ్వని కైనను వేదాన్నజ్ఞానము కే

త్రేణ త్రిపుండ్రస్యతు ధారణం। శివస్య విష్ణోర్దేవా నాంబ్రహ్మణ స్తృ
ప్తి కారణం। భస్మనా వేదమంత్రేణ త్రిపుండ్రస్యతు ధారణం। పార్వత్యా
శ్చ మహా లక్ష్మ్యా భారత్యా స్తృప్తి కారణం॥ భస్మనా వేద మంత్రేణ
త్రిపుండ్రస్యచ ధారణం। వినా వేదాన్త విజ్ఞానం జాయతే నైవ కస్యచి
త్॥ భస్మనా వేదమంత్రేణ త్రిపుండ్రస్యతు ధారణం। సతాం మార్గతయా
ప్రాజ్ఞాః ప్రవదంతి మహర్షయః, భస్మనా వేద మంత్రేణ త్రిపుండ్రస్య
తు ధారణం। రక్షార్థం మంగళార్థం చ ప్రవదంతి మహర్షయః. త్రిపుండ్ర
ధారణం ముక్త్వా ముక్తి మిచ్ఛతియః పుమాన్। ఏవ వానేన నిత్యత్వం
కురుతే హ్యాత్మ నోపిసః. వేదోదితేన మార్గేణ భస్మ నోద్ధూళ నేనచ
త్రిపుండ్ర ధారణా న్నైవ జ్ఞానం సమ్యగ్విజాయతే॥ బ్రాహ్మణే నాత్మ భూ
తేన శివేన పరమాత్మనా। ఆదరేణ ధృతం భస్మత్రిపుండ్రోద్ధూళనాత్మ
నా। ఆదిబ్రాహ్మణ భూతస్య ధర్మం తిర్యక్త్రి పుండ్రకం। బ్రాహ్మణో

---

లుగసేరదు॥ భస్మత్రిపుండ్ర ధారణము సత్పురుషుల మార్గమని పండితులు చెప్పుదురు॥
భస్మధారణము సంరక్షణ కొఱకును, మంగళము కొఱకును ప్రయోగించునని మహర్షులు
చింతురు॥

ఏపురుషుండు త్రిపుండ్ర ధారణమును వదలిపెట్టి ముక్తినొంద వలయునని కోరు
చుండునో అట్టివాడు వివముద్రావి శాశ్వతముగా నుండగలయునని కోరువాడే యగు
ను॥ వేదోక్త మార్గమున భస్మోద్ధూళనము- భస్మ త్రిపుండ్రమును ధరించు నెడ జ్ఞానము గ
లుగును॥ దేవతలలో బ్రాహ్మణుండును, పరమాత్ముండునగు పరమేశ్వరుండు భస్మోద్ధూళ
నమును, భస్మత్రిపుండ్రమును ధరించెను॥ ఆది బ్రాహ్మణుండగు పరమేశ్వరుని ధర్మమై
గునదియు, భుక్తి ముక్తి ప్రదంబును నగు త్రిపుండ్రమును బ్రాహ్మణుడు ధరింపవలయును॥ వే
దమునందగు సన్ని మార్గములలో భస్మత్రిపుండ్రము సర్వచిహ్నముల కంటెను శ్రేష్ఠమైన
దావున శ్రేయము గోరిన వారెల్లరును భస్మోద్ధూళన భస్మత్రిపుండ్రములను తప్పక ధరిం
ప వలయును॥ భస్మోద్ధూళన భస్మ త్రిపుండ్రముల ధరించువానిని రాజైనవాడు రక్షిం
ప వలయును॥ ఎవ్వండు భస్మ ధారణ నిందించునో వానిని రాజు శిక్షింప వలయును॥ చతు
ర్ముఖుండు సృష్టిసేయంబున త్రిపుండ్రము యొక్క ప్రాశస్త్యమును దెలిపెను॥ ఎత్తునిన
అతఃము ముఖము నడ్డముగా, సృజించెనుగాని, గుండ్రముగాని, నిడుపుగాగాని సృజించెనా

ధారయేన్నిత్యం భుక్తిముక్తిఫలప్రదం. వేదసిద్ధేషుమార్గేషు త్రిపుండ్రం
భస్మకుంఠనం। శివస్య సర్వలింగే భ్యశ్శివ సత్యం మయోదితం. భ
స్మ త్రేశయోర్ధ్వ భిస్సర్వైర్బ్రహ్మ స్తనాల బ్ధజాలభి। ధార్యా త్రిపుండ్ర రూ
పేణ భస్మనా చావ కుంఠితః. త్రిపుండ్రాన శిఖర్దీప్తం తంరాజా పరిర
క్షయేత్. భస్మసంఛన్న సర్వాంగం త్రిపుండ్రాంకిత మస్తకం। యేనిం
దంతి నరారాజా హన్యాత్తాన విచారయన్. ఇత్యాద్యుక్త్వా స్రష్టాస్ప
ష్టీచ్ఛలేనాహ త్రిపుండ్రస్య ప్రశస్తతాం। ససర్జ సలాటుహి తిర్య
గ్రేఖా నవగ్రహః॥ తిర్యగ్రేఖాః ప్రకాశన్తే లలాటేసర్వ దేహినాం।
తథా పిమాన వామూర్ఖాః నకుర్వన్తి త్రిపుండ్రకం॥నతద్దానం నతద్ధ్యా
నం నతధ్యానంనతత్తపః। వినాతిర్యక్త్రి పుండ్రాంకం విప్రేణ యదను
ష్ఠితం॥ వేదస్యాధ్యయనే శూద్రోనాధికారీ యథాభవేత్! త్రిపుం
డ్రేణ వినా విప్రో నాధికారీశివార్చనే॥ నదానేనన యజ్ఞేన నతపో
భిస్సుదుష్కరైః। నతీర్థ యాత్రయా పుణ్యం యత్త్రిపుండ్రేణ లభ్య
తేదు. మఱియు నందర యొక్క ముఖంబునను నప్తరేఖలు గలవు॥ దానింబట్టి తిర్యక్పుం
డ్రము ధరింప వలయునని బ్రహ్మదేవు నుద్దేశమని వ్యక్తమగుచున్నది॥ అజ్ఞానమూ
ఢులగు కొందఱు మనుజులు తిర్యక్పుండ్రమును ధరింపరు॥ త్రిపుండ్రమును ధరింపక వి
ప్రుఁడు చేయు ధ్యానము ధ్యానము కాదు॥ దానము దానము కాదు॥ తపము తపము
కాదు॥ అట్టివాఁడు సంపాదించు జ్ఞానము జ్ఞానము కాదు॥ శూద్రునకు వేదాధ్యయన
మున నధికారము లేనట్లు త్రిపుండ్రము ధరింపని విప్రునకు శివార్చనమున నధికారము లే
దు॥ భస్మ త్రిపుండ్రము ధరింపఁగాఁగలుగు పుణ్యము దానముచేగాని, యజ్ఞముచే గానిఁ చే
యరాని తపములచేగాని, తీర్థయాత్రచే గాని లభింపనేరదు॥ మఱియు దానంబును, త
పంబును, త్రిపుండ్రధారణముయొక్క పదునారవ యంశమునైనఁ బోలనేరవు॥ రాజు త
న చిహ్నము ధరించినవానిని స్వజనునిగా నెంచునట్లు పరమేశ్వరుఁడు భస్మత్రిపుండ్రధా
రిని స్వీయునిగా దలంచుచున్నాఁడు॥ ద్విజుఁడుగాని, యితరుఁడుగాని భస్మత్రిపుండ్ర
మును ధరించునేని పరమేశ్వరుండు వాని వశమున నుండును. వర్ణాశ్రమధర్మముల విడి
చినవాఁడైనను సర్వకర్మములు లోపించినవాఁడైనను ఒకసారి తిర్యక్పుండ్రము ధరించునే
ని పూజనీయుండగును॥ భస్మధారియందు జ్ఞానమును గాని, కులమును గాని వ్రతమును

తే॥ దానం యజ్ఞాశ్చ ధర్మాశ్చ తీర్థయాత్రాచ నారద। త్ర్యా నంత వ
స్త్రిపుండ్రస్య కలాంనార్హంతి షోడశీం। యథాశాజాన్వచిహ్నం కం స్వ
జనా మన్యతే సదా। తథాశివ త్రిపుండ్రాం కధరం స్వామివ మన్యతే
ద్విజాతిర్వా త్యజాతిర్వా సిత శుద్ధేన భస్మనా। ధార యేద్య స్త్రిపు
డ్రాంకం రుద్రస్తేన వశీకృతః॥ త్యక్తవర్ణా శ్రమాచారోలుప్త సర్వక్రి
యోపివా। సకృత్తిర్య క్త్రిపుం డ్రాంకంధా రయేత్సోపిపూజ్య
తే॥ నాస్మిన్ జ్ఞానం పరీక్షేత నకులం నవ్రతంతథా। త్రిపుం డ్రాంకిత
ఫాలోయః పూజ్యఏవ సనారద. శ్రీభూతి మాత్రమాహాత్మ్యం వక్తుం
బ్రహ్మాన శక్నుయాత్। కింపున స్సంస్కృతా గ్న్యుద్ధం భూతిం వక్తుంస
ముత్సహేత్॥ శివ మంత్రాత్పరో మంత్రస్తత్వం చాపిశివాత్పరం। శివా
ర్చ నాత్పరం పుణ్యం నహితీర్థంచభస్మతః॥ రుద్రాగ్నేర్య త్పరం వీర్యా
తద్భస్మ పరికీర్తితం। ధ్వా సనం సర్వ దుఃఖానాం సర్వపాప విశోధనం।
అంత్య జోవాధ మోవాపి మూర్ఖోవా పండితోపివా। యస్మిన్దేశే వసే
న్నిత్యం భూతిశాసన సంయుతః। తస్మిన్ సదాశివ స్సోమః సర్వ భూత
గణైర్వృతః। సర్వతీర్థైశ్చ సంయుక్త స్సాన్నిధ్యం కురుతే సనాయుస్మిన్దే

గాని పరీక్షింపఁగూడదు. ముఖమున భస్మత్రిపుండ్రము కలదేని వాఁడు పూజనీయుండే
యగును. సామాన్యమగు భస్మముయొక్క మహిమము వచింపబ్రహ్మకైన యలవిగాదు
ఇఁక మంత్రములచే సంస్కరింపఁబడిన, యగ్నియందుఁ బుట్టిన భూతియొక్క మహిమ
ము వచింప నెవ్వని వశమగును. శివమంత్రముకంటె నెక్కుడగు మంత్రంబును శివు
కంటె పరమగు తత్వంబును శివపూజకంటె పరమగు సుకర్మంబును భస్మముకంటె పర
మగు తీర్థంబును లేదు. రుద్రాగ్నియొక్క వీర్యము భస్మమగును. ఇయ్యది సర్వదుఃఖ
ములను ధ్వంసము చేయునదియు సర్వపాపములను హరించునదియు నగును. అంత్యజుఁడు
గాని, అధముఁడుగాని, మూర్ఖుఁడుగాని పండితుఁడుగాని భస్మమును ధరించువాఁడే దేశ
మున నుండునో, ఆ దేశమున సర్వభూతగణములతో శివుఁడు సర్వ తీర్థములతోడనుసదాశి
వుండెల్లప్పుడు వసించుచుండును. భస్మత్రిపుండ్ర ధారియే దేశమున నుండునో, ఆదే
శమే పవిత్రమైయుండఁగాఁ బట్టివాని గృహము పవిత్రమైనదని వేఱ చెప్పవలయును. శివ
మంత్రముచే పవిత్రములైనవియు పరమేశ్వరుని శరీరమున నలంకారములైనవియు నగు నీళ

శే వసే న్నిత్యం భూతి శాసన సంయుతః। సోపిదేశోభ వేత్పూతః కింపున స్తస్య మందిరం॥ ఏతానితాని శివమంత్ర పవిత్రితాని భస్మాని కామత హా నాంగ విభూషి తానిత్రైపుండ్రకాని రచితాని లలాట పట్టెలుం పంతిద్రై వలిఖితాని దురక్షరాని ॥ఇతి॥ నారదీయె॥ శివప్రియాశ్చ యే భక్తా శ్శివపాదార్చ నేరతాః। త్రిపుండ్ర ధారిణోయేచ తేవైభాగవతోత్తమాః ॥ ఇతి ॥ గారుడే॥ భస్మదిగ్ధ శరీరాయ యోదదాతి ధనంముదా। తస్య సర్వాణి పాపాని వినశ్యన్తిన సంశయః॥ శ్రుతయః స్మృతయస్సర్వాః పురాణా న్యఖిలాన్యపి। వదన్తి భూతిమాహాత్మ్యం తతస్తాం ధారయేద్ద్విజః ॥ ఇతి ॥ శివధర్మే॥ సితేన భస్మనాకుర్యాత్త్రిసంధ్యం యస్త్రిపుండ్రకం। సర్వపాప వినిర్ముక్త శ్శివలోకే మహీయతే॥ రుద్రాగ్నేర్య త్పరం వీర్యం తద్భస్మ పరికీర్తితం। ధ్వంసనం సర్వదుఃఖానాం సర్వపాప విశోధనం॥ యోహి సర్వాంగికం స్నానమాపాదతల మస్తకం। త్రిసంధ్య మాచరే న్నిత్య మాగ్నేయం సంయతేంద్రియః॥ కులైక వింశ ముత్తార్య సగచ్ఛేత్పరమాంగతిం॥ భస్మస్నానం జలస్నానాద సంఖ్యేయ గుణాస్పదం। తస్మాద్వారుణ ముత్సృజ్య స్నాన

స్మములచే ముఖమున త్రిపుండ్రము రచించునెడ నిత్యావి ఫాలమున బ్రహ్మవ్రాసినదుర్లిపిని తుడిచివేయునని మొదలుగా ప్రశంసింపబడి యున్నది.

ఎవరు శివునియందు ప్రేమగలవారును శివభక్తిగలవారును శివార్చనముచేయువారును త్రిపుండ్రమును ధరించువారునగుదురో వారే పరమ భాగవతులని నారదీయమునందు గలదు.

భస్మోద్ధూళనము చేసికొనువాని కెవ్వండు ధనంబునొసగునో వానిపాపములన్నియు నశించును. సకలమగు శ్రుతులు స్మృతులు పురాణములును భస్మమాహాత్మ్యమును వచించుచున్నవి. కావున ద్విజుడు విభూతిని ధరింపవలయునని గరుడపురాణమున గలదు.

తెల్లని భస్మముచే మూడు సంధ్యాకాలములయందును త్రిపుండ్రమును ధరించువాడు సర్వపాపవిముక్తుండయి శివలోకమున వసించును. రుద్రాగ్నియొక్క యుత్తమమగు వీర్యమె భస్మమగును. ఇయ్యది సర్వదుఃఖముల ధ్వంసము చేయునదియు సకలపాపముల

శ్చాగ్నేయ మాచరేత్॥ సర్వయజ్ఞేషు యత్పుణ్యం సర్వతీర్థేషు యత్ఫ
లం। తత్ఫలం లభతే సర్వం భస్మస్నానా న్న సంశయః॥ మహాపాతక
యుక్తోవా యుక్తోవాచో పపాతకైః। భస్మస్నానేన తత్సర్వం దహత్య
గ్ని రివేంధనం। భస్మ స్నానాత్పరం స్నానం పవిత్రం నైనవిద్యతే॥ ఇతి॥
వాసిష్ఠలైంగే॥ ఏవం భస్మధృతం యేనతస్య పుణ్యఫలం శ్రుణు। మహా
పాతక సంఘాశ్చ పాతకాన్య పరాణ్యపి। నశ్యంతి. మునిశార్దూల సత్యం
సత్యం నచాన్యథా ॥ ఇతి ॥ కాలోత్తరే॥ తస్మాజ్జేతశ్చ విజ్ఞాన మాగ్నే
యం యస్స మాచరేత్। భవపాశైశ్చ నిర్ముక్త శ్శివలోకే మహీయతే।
జ్వరరక్షః పిశాచాశ్చాప్యసురా యాతు ధానకాః। కుమార గ్రహ భూ
తాశ్చ కూశ్మాండా డాకినీ గణాః। బ్రహ్మరాక్షస ముఖ్యాశ్చ కుష్ఠనాకు
ష్ఠగుల్మకాః। భగందలాణి సర్వాణి వ్యాశీతిర్వాత రోగకాః। చతుష్షష్టిః
పిత్తరోగాః శ్లేష్మ సప్తతి పంచకాః॥ వ్యాఘ్రసర్ప భయం చైవాన్య

గణాదుర్దియు నగును. ఎవ్వండు మూడు కాలములయందు భస్మముచే నాగ్నేయస్నాన
ము సర్వాంగములయందు నొనరించునో అట్టివాడు ఇరువదియొక్క కులము వారితో
నుత్తమ గతిని నొందును॥ జలస్నానము కంటె భస్మస్నానము అధిక గుణము గలది॥ కా
వున జలస్నానము చేసినను, చేయకున్నను తప్పక భస్మస్నానము చేయవలయును॥ సర్వయ
జ్ఞములు చేయనేమి పుణ్యము లభించునో సర్వ తీర్థములు సేవింప నేమిఫలము గలుగు
నో ఆఫలమంతయు భస్మస్నానము వలనఁ గలుగును మఱియు మహాపాతకములతోడను
ఉపపాతకములతోడను గూడినవాడయినను భస్మస్నానము చేయునెడ అగ్ని కట్టెల నెన్ని
టినైన దహించునటుల అయ్యది పాపములన్నిటి హరించును. భస్మస్నానముకంటె పవిత్ర
మైన దింకొక్కటిలేదు. అని శివధర్మమునందు గలదు.

భస్మముధరించువాని పుణ్యము చెప్పెదవినుము. మహాపాతక సంఘంబులును ఇత
రపాతకంబులును శీఘ్రంబునశించునని వాసిష్ఠలైంగమునందు గలదు.

మఱియు ఆగ్నేయస్నానముచేయగా శివజ్ఞానమునుపొంది భవపాశవిముక్తుండయి
శివలోకంబునవసించును. జ్వరములు, రాక్షసులు, పిశాచములు, కుమారగ్రహములు, కూ
ష్మాండగ్రహములు, ఢాకినీ గణములు, బ్రహ్మరాక్షసులు, కుష్ఠరోగములు, గుల్మరోగము
లు, భగందరములు, ఎనుబదివిధములగు వాతరోగములును, అయవది నాలుగు పిత్తరోగము
లును, డెబ్బదియైదు విధములగు శ్లేష్మరోగములును, [illegible] భయము దు

ర్వే దుష్టమృగాఅపి భస్మస్నానేన నశ్యన్తి సింహేనే వమృగాద యః ఇతి॥ మానవీయ సంహితా యాం॥ ప్రాతః కాలేచ మధ్యాహ్నే. సాయాహ్నేచ త్రిపుండ్రకం। సితేన భస్మనా కుర్యాత్। సరుద్రో నాత్ర సంశయః ॥ఇతి॥ శివరాఘవ సంవాదే॥ యథా విధి లలాటె వైవహ్ని వీర్య ప్రధారణాత్। నాశయేల్లి ఖితం వైధం కటస్థమి వహ వ్యభుక్। ఇతి॥ వాయవీయే॥ భస్మచ్ఛన్నో ద్విజోవిద్వాన్మహాపాతక సంభవైః॥ దోషైర్వి ముచ్యతే సద్యోముచ్యతే నాత్ర సంశయః॥ తస్మాత్సర్వేషు లోకేషు వీర్యవాన్భస్మ సంయుతః॥ రుద్రాగ్నేర్యత్పరం వీర్యం తద్భస్మ పరికీర్తితం॥ భస్మనిష్ఠస్య దహ్యన్తే దోషాస్తస్యాగ్ని సంగమాత్। భస్మస్నాన విశుద్ధాత్మా భస్మనిష్ఠఇతి స్మృతః॥ భస్మనా దిగ్ధ సర్వాంగో భస్మదీప్త త్రిపుండ్రకః॥ భస్మ శాయీచ పురుషో భస్మనిష్ఠఇతి స్మృతః॥ భూతప్రేతపిశాచాశ్చరోగాశ్చాతీవ దుస్సహాః॥భస్మనిష్ఠస్య సాన్నిధ్యా

---

దలగునదియును, సింహాముచే మృగములు నశించు విధమున భస్మస్నానముచే నశించును. అని కాలాగ్నిరుద్రోపనిషత్తునందు గలదు.

శుద్ధమగు భస్మముచే మూడు కాలములయందును త్రిపుండ్రమును ధరించువాడు రుద్రతుల్యుండగును. అని మానవీయ సంహితయందు గలదు.

అగ్ని వీర్యమగు భస్మమును యథావిధిగా లలాటమున ధరించువాడు వ్యాధి అగ్ని చోరులచేతను వస్త్రముల గాల్చునటుల లలాటమునందగు బహ్మలిఖితమును గాల్చునని శివరాఘవసంవాదంబునందు గలదు.

భస్మధారీయందు మహాపాతకములచే గలుగు సకల దోషములచే నప్పుడె విముక్తుండగును. కావున సకలలోకముల యందును భస్మధారియె వీర్యవంతుండగును. రుద్రాగ్నియొక్క వీర్యమె భస్మమగును. భస్మనిష్ఠుని దోషములన్నియు వహ్నిసంగంబు నంబరె దహింపఁబడిపోవును॥ భస్మస్నానముచే నిర్మలమగు శరీరముగలవాఁడు భస్మనిష్ఠుండని చెప్పఁబడును॥ మఱియు, భస్మమును శరీరము నందంత నలఁది కొని, భస్మత్రిపుండ్రమును ధరించి, భస్మమునందు పండు కొను పురుషుఁడు భస్మనిష్ఠుండని చెప్పఁబడు॥ భూతప్రేత పిశాచాదులును, సహింపరాని రోగములును భస్మనిష్ఠుని దరిమండి పరుగిడి పోవును॥ ప్రకాశించునది గావున భసితమనియు, పాపముల భక్షించునది గాన భస్మమనియు, ఐశ్వర్యము నొసంగు నదిగాన భూతియనియు, రక్షించునది కాన రక్షయనియు భస్మమున

ద్విజ ద్రవంతీవ సంశయః॥ భాసనాద్భ సితం ప్రోక్తం భస్మకల్మషభక్షణాత్। భూతిర్భూతి కరీపుంసాం రక్షారక్షా కరం పరం॥ కిమన్యదిహ వక్తవ్యం భస్మ మాహాత్మ్య కారణం। అతీవ భస్మనాస్నానాత్స్వయం దేవో మహేశ్వరః॥ పరమాస్త్రంచ శైవానాం భస్మ తత్పారమేశ్వరం॥ మానవే॥ త్రిపుండ్ర ధారిణం దృష్ట్వాభూత ప్రేత పురస్సరాః భీతాః ప్రకంపితాశ్శీఘ్రం గచ్ఛంత్యేవ నసంశయః॥ లైంగే॥ స్మరణాదేవ రుద్రస్య యథాపాపం ప్రణశ్యతి। తథాస్య ధారణాదేవ సర్వపాపం ప్రణశ్యతి॥ యద్యత్కార్య సహస్రాణి కృత్వా యస్స్నాతి భస్మనా। తత్సర్వం దహతే భస్మయథాగ్నిస్తే జసావనం। కృత్వాపిచాతులంపాపం మృత్యుకాలేపి యోద్విజః। భస్మస్నాయీ భవేత్కించిత్ శీఘ్రం పాపైః ప్రముచ్యతే॥ భస్మస్నాన విశుద్ధాత్మా జితక్రోధో జితేంద్రియః। మత్సమీపం సమాగమ్యన భూయోపి నివర్తతే ॥ఇతి॥ శివరహస్యే॥ సమస్తతీ

ర్థ సర్వార్థ నామములు గలవు। భస్మమాహాత్మ్యమును నింకను చెప్పనేల? ఎల్లప్పుడు భస్మస్నానము చేయువాడు మహేశ్వరుండే యగును। శైవులయొక్క పరమాస్త్రము భస్మమే యగును॥ అని వాయవీయ సంహితయందు గలదు.

భూతప్రేతాదులు భస్మధారినిజూచి భయపడి పోవునని మానవపురాణమునందు గలదు. రుద్రుని స్మరింపఁగా పాపము నశించునట్లు భస్మము ధరింపఁగా సకల పాపంబులు నశించును॥ ఎట్టి కార్యములను జేసి భస్మము ధరించినను అగ్నిహోత్రుండు వనమును దహించునట్లు భస్మము సకల పాతకములను దహించును। అధిక పాపమును చేసినవాఁడైనను మృత్యుకాలమునందు భస్మస్నానము చేయునెడ పాపముల నుండి శీఘ్రముగ విముక్తుండగును. భస్మస్నానము చేయువాఁడును, అక్రోధుండును, జితేంద్రియుండు నగువాడు శివసామీప్యమును పొంగి పునరావృత్తి నొందనేరఁడు। అని లింగ పురాణమున గలదు॥ కాశీనగరము సమస్త తీర్థ రూపమైనదియు, విశ్వేశ్వరుఁడు సర్వదేవతా శ్రేష్ఠుండును, విభూతి సకల తత్త్వాత్మకంబును నగునట్లే త్రిపుండ్రంబును సర్వోత్తమ మగును.

యజ్ఞములతో నేమి? తీర్థయాత్రలతో నేమి? వేదపాఠములతో నేమి? ఉగ్రములైన తపములతో నేమి? మంత్ర తంత్రములతో నేమి? జపములతో నేమి? ధ్యానములతో నేమి? దానములతో నేమి? సాంఖ్యయోగ భావితలతో నేమి? మోక్షము కావలయునెడ బుద్ధిశాలుఁడగువాఁడు శుద్ధభస్మముతో త్రిపుండ్రము ధరించిన జాలునని మత్స్య పురాణమున గలదు.

ధౌమ్యసుయువాచ కాశీవిశ్వేశ్వర స్సర్వసుఖోత్తమస్స్యాత్। సమస్తతత్త్వేక రసావిభూషస్త్రైవపుండ్రోయమయంత్రిపుండ్ర ఇతి। మాహాత్మ్య।కింయజ్ఞైః కిమనేకతీర్థగమనైః। కిం వేదపాఠ క్రమైః కిం ఘోరైర్వ్రత విధి సపోభర మృత్యైః కిమంత్ర తంత్రైర్జపైః। కిం ధ్యానైః కిమనేక దానని కరైః కిం సాంఖ్య యోగ భ్రమైః రోన్మత్తార్థి సిత భస్మనాచ నిపుణః కుర్యాత్ త్రిపుండ్రం బుధః ॥ఇతి॥ బోధాయన సూత్రే॥ భూత్యైన ప్రమదిత వ్యమితి విజ్ఞాయతే। తథాప్యుదాహరంతి ॥ మధ్యమానామి కాంగుష్ఠై స్త్రిపుండ్రం భస్మ నాకృతం ।త్రిపుండ్రం భవేచ్ఛ్వేత, మహాపాతక నాశనమిత్య ధత్రియంబక మితిసర్వాంగం సమ్మృజేత్॥ పూతో భవతి,దశ పూర్వాన్ దశాపరానా త్మానం చైకవింశతిం. పంక్తించపునాతి। బ్రహ్మణాసాయుజ్యం సలోకతామా ప్నోతి,ఇత్యాహభగవాన్ బోధాయనః।స్మృతిరత్నావళ్యాం॥ మధ్యమానామికాంగుష్ఠై ర్లలాటేము

---

బోధాయన సూత్రమునందు॥ భస్మ ధారణము సేయ ప్రమాదము నొందఁగూడదని తెలియుచున్నది నడిమివ్రేలు, అనామిక, అంగుష్ఠమునను మూడువ్రేళ్లతో భస్మత్రిపుండ్రమును ధరింపఁగా మహాపాతకములునశించునని పెద్దలు చెప్పుచున్నారు. త్రియంబకం అను మంత్రము చదువుచు శరీరమునందంతటను భస్మమును పూసికొనవలయును॥ ఇట్లు భస్మముధరించుచుండువారు పవిత్రుఁడగును॥ తనవంశమునఁ బూర్వికుల పదుగురిని, తనతర్వాతివారల పదుగురిని ఇటులతనతో నిరువదియొక్క కులమువారిని, తానున్న పంక్తిని గూడ పవిత్రముగా నించును॥ పరమేశ్వరుని సాయుజ్యమును, సాలోక్యమును పొందునని భగవంతుఁడగు బోధాయనుఁడు వచించెను.

మధ్యమము, అనామిక, అంగుష్ఠమునను మూఁడువ్రేళ్లతో భస్మము ధరింపఁగా మహాపాతకములు నశించునని స్మృతిరత్నావళి యందునుగలదు.

మంత్రపూతమగు భస్మముతో నెల్లపుడు త్రిపుండ్రము ధరించువాఁడు శివసాయుజ్యమును పొందునని ధర్మసార సుధాసింధువున గలదు.

అమావాస్యనాఁడు భస్మోద్ధూళనము చేసికొని శివదర్శనము చేయుసెడ సర్వపాతకములచే విముక్తుఁడగునని స్మృతిభాస్కరమునఁ గలదు.

నారదీయస్మృతియందు॥ త్రిపుండ్రము పుణ్యప్రదమైనదియును, త్రిమూర్త్యాత్మకమైనదియునగు। త్రిపుండ్రధారిని జూచునెడ రాక్షసులు, క్షుద్రజంతువులును పరుగిడును॥

త్రిపుండ్రకం తత్త్రిపుండ్రం భవేద్భస్మ మహాపాతకనాశనః॥ ధర్మ
సాంసుధాసింధౌ॥ త్రిపుండ్రకం సదా కుర్యాత్స్నాత్వా త్రిపూతేన భస్మనా। వే
దోక్తవిధానేన శివసాయుజ్యమాప్నుయాత్ ॥స్మృతిభాస్కరే॥ వ
నస్పతిగతేజో మే భస్మోద్ధూళితవిగ్రహః। అర్చితం శంకరం దృష్ట్వా సర్వ
పాపైః ప్రముచ్యతే ॥ఇతి॥ నారదీయస్మృతౌ॥ త్రిపుండ్రా కథమావు
ణ్యాం బ్రహ్మవిష్ణుశివాత్మకం। యే ఘోర రాక్షసాః ప్రేతా యే చాన్యే
క్షుద్రజాతయః। త్రిపుండ్రధారిణం దృష్ట్వా పలాయన్తే న సంశయః॥ మ
ద్యం పీత్వా గురుదారాంశ్చ గత్వా స్తేయం కృత్వా బ్రహ్మహత్యాం చ కృ
త్వా॥ భస్మచ్ఛన్నో భస్మశయ్యాశయానో రుద్రాధ్యాయీ ముచ్య
తే సర్వపాపైః॥ సత్యం శౌచం జపో హోమస్తీర్థం దేవాదిపూజనం।
తస్య వ్యర్థమిదం సర్వం యస్త్రిపుండ్రం న ధారయేత్ ॥ఇతి॥ లోకా
క్షిస్మృతౌ। మధ్యమానామికాంగుష్ఠైర్లలాటే భస్మనా కృతః। స తి

---

రాపానము, గురుతల్పగమనము, స్వర్ణస్తేయము, బ్రహ్మహత్య, అనుమహాపాతకముల చే
సినవాఁడైనను భస్మదిగ్ధాంగుఁడై భస్మశయ్యయందు శయనించుచు రుద్రాధ్యాయము పా
రాయణ చేయునెడ సకల పాపములచే విముక్తుండగును॥ త్రిపుండ్రము ధరింపనివానియొ
క్క సత్యము, శౌచము, జపము హోమము, తీర్థయాత్ర, దేవపూజ ఇవి యన్నియు వ్య
ర్థములగును అనియున్నది॥

లోకాక్షిస్మృతియందు॥ ఎవ్వఁడు శివుని యందు లగ్నమగు చిత్తముకల వాఁడై
త్రిపుండ్రమును ధరించునో వాఁడు మూఁడులోకములను ధరించినవాఁడగును త్రిపుండ్రము
ధరించిన వాని మహాపాతకములు నశించును. భస్మత్రిపుండ్రమును, గ్రుద్రాక్షలను ధరించు
పవిత్రుఁడగు బ్రాహ్మణుఁడు సర్వములను పాపములను, వ్యాధులను, దుర్భిక్షమును, దొంగ
లను పారద్రోలుటయు గాక పరబ్రహ్మయొక్క సాయుజ్యమును పొంది పునరావృత్తి
నొందనేరఁడు॥ ఇటుల భస్మత్రిపుండ్రధారి పంక్తిపావనుఁడుగాన దేవతలకును పూజ్యుఁ
డగును. అని చెప్పఁబడియున్నది.

అధిక పాపములు చేసియున్నందునను, దధీచి గౌతమాదులయొక్క శాపముల వ
ల్లను కొందఱు భస్మరుద్రాక్షాది వైదిక చిహ్నములు రుచింపనేరని భవిష్య పురాణ
మున గలదు.

మహాత్ముఁడగు దుర్వాసుని శాపమువల్లను, కణ్వుని శాపమువల్లను భృగుని శాప

అథ యాని పురాణాదివచనాని భస్మధారణాభినిందంతి: శ్రుతి విప్రతిషేధాత్తాన్య వథ వన్నినిందక్వాపి॥ తాదృశవచనానాం ప్రత్యక్ష శ్రుతి విహిత భస్మత్రిపుండ్ర విధి దూషక త్వేనైవ శ్రుతి విరుద్ధత్వస్య స్ఫుటత్వాత్॥ అథాపి యాని స్మృతి పురాణాది వచనాన్యూర్ధ్వ పుండ్రవిధాయకాని తత్ప్రశంసకానిచ తాన్యపి శ్రుతి విరోధాదేవభ వంత్యుపేక్ష్యాణి॥ తథాహి॥

శ్రు॥ త్రిర్యక్త్రీ శ్రోతేభ్యః ప్రకుర్వీత॥ శ్రు॥ మానస్తోకేతి మంత్రేణ మంత్రితం భస్మ ధారయేత్॥ భూత్యైన ప్రమదితవ్యం॥ ఇత్యేవమాది శ్రుతి వచనాని భస్మ త్రిపుండ్రం విదధతి॥ సూ॥ అథాతో స్వజాతీనామాచార హస్త్రిపుండ్రవిధిం వ్యాఖ్యాస్యామః॥ శ్రు॥ నిత్యోయం ధర్మో బ్రాహ్మణానాం॥ సు॥ ఏతదధఃకరణే ప్రత్యవైతి బ్రాహ్మణః॥ ఇత్యాది వచనాని భస్మత్రిపుండ్రస్య విధానఘటిత వచన విషయత్వ నిత్యశబ్దఘటిత వచన విషయత్వా కరణే ప్రత్యవాయ జనకవచన విషయత్వ ప్రతిపాదనేన నిత్యధర్మతాం ప్రతిపాదయన్తి॥ తథా॥ బ్రహ్మచారీ, గృహీ వానప్రస్థో, యతిర్వా ఇత్యాది బృహజ్జాబాలాది వచనాని చతురాశ్రమ్యధికారితాం చ ప్రతిపాదయన్తి ఏవమూర్ధ్వపు

బ్రాహ్మణులకు నిత్యమనియు, దీనినాచరింపకున్న యెడ ప్రత్యవాయమును పొందుదురని యూర్ధ్వముగల శ్రుతిసూత్ర వచనములు ద్విజులకు భస్మధారణము నిత్యవిధియని స్పష్టముగ బోధించుచున్నవి॥

ఇదిగాక, బ్రహ్మచారి, గృహస్థుడు వానప్రస్థుడు యతియు భస్మమును ధరింపవలయునని బృహజ్జాబాలాది శ్రుతివచనములు నాలుగాశ్రమలయందున్న వారికిని నిందధికారము గలదని తెలుపుచున్నవి॥

ఇటుల ఊర్ధ్వపుండ్రము విధించు వచన మొక్కటియు శ్రుతులయందు గనుపట్టుట లేదు. సీతోపనిషత్తు మొదలుగా వైష్ణవకల్పిత శ్రుతులలోనున్నను అవియే దశమునను కొడుకలో లేనందున లేనివే యగును. ఇంక నూర్ధ్వపుండ్రము పాంచరాత్రాది తంత్రములలోనె కలదు. దానింబట్టి యట్టి తాంత్రికుల ననుగ్రహింపనే కొన్ని స్మృతి పురాణములయందు ఊర్ధ్వపుండ్రము విధింపబడియె గాన వైదికులకందు నధికారము లేదు. ఏలనఁగా ధర్మ,

ణ్డ్రవిధాయకం నైక మప్యుపలభ్యతే వచనం సిగమేషు॥ పరంతు వి
ధీయతే హిపాంచ రాత్రాదిషు తంత్రేషు। అతశ్చ తాంత్రికా నుగ్రహార్థ
మేవ స్మృతి పురాణే ష్వూర్ధ్వ పుండ్రవిధాన మితి నతద్వైదిక సాధకరో
తి ॥శ్లో॥ ధర్మశాస్త్రేపురాణే వా యోర్థస్స్యత్యావిరుధ్యతే। సతం తాం
త్రిక ఇతి జ్ఞేయం సమాసేన మహర్షిభిరితి స్మరణాత్ ॥ నచోర్ధ్వ పుండ్ర
స్య శ్రుతివిరోధోస్తీతి వాచ్యం। స్మృతిపురాణాది విహితస్య మృద్ద్రవ్య
కోర్ధ్వ పుండ్రస్య భస్మద్రవ్యక తిర్యక్త్రి పుండ్ర విధాయక శ్రుతివిరుద్ధ
త్వాత్॥ కించ, తస్యభస్మ త్రిపుండ్ర విరుద్ధత్వేన తద్విధాయక శ్రుతివి
రుద్ధత్వాం దుర పలపం॥ నచ, భస్మత్రిపుండ్రమృదూర్ధ్వ పుండ్ర విధ్యో
ర్న విరోధ ఇతి వాచ్యం, తదుభయ విధ్యోర్వి రోధస్య సుప్రసిద్ధత్వా
త్. తథాహి, శైవా నిఖిల పురాణాని భస్మత్రిపుండ్రం విదధతి, నిషేధం
తి చోర్ధ్వ పుండ్రం। తథావైష్ణ వానిచపురాణాని మృదూర్ధ్వ పుండ్రం
విదధతి, విపరీతే ధన్తిచ భస్మ త్రిపుండ్రం। అతశ్చ విజ్ఞాయ తేవిష్ణుభ
క్తమాత్రాధికారిక మూర్ధ్వ పుండ్రమితి, నచ, తథైవ శివపురాణేషు
భస్మత్రిపుండ్రస్య శివ భక్తోద్దేశ్య కతయా ప్రతిపాదితత్వేన ఉభయ వి

త్రమునందు గాని పురాణమునందు గాని శ్రుతివిరుద్ధమగు స్థమందు నెడ అదితంత్రార్థమ
ని మహర్షులు నిర్ణయించినందున నదియే యుక్తము.

ప్ర. శ్వేతమృత్తికతో చేయు నూర్ధ్వపుండ్రమునకు శ్రుతివిరోధ మెట్లు?

ఉ. శ్వేతమృత్తికతో నూర్ధ్వపుండ్రముధరింపవలయునను వచనము భస్మముతో తిర్య
క్పుండ్రమును ధరింపవలయునను వచనమునకు విరుద్ధమగుటలకొన్ని స్మృతులయందును, పు
రాణములయందును చెప్పఁబడు నూర్ధ్వపుండ్రము భస్మత్రిపుండ్రమునకు విరుద్ధమైనదిగా
వునభస్మత్రిపుండ్రమును విధించుశ్రుతులకు విరుద్ధమైయున్నది.

ప్ర. భస్మత్రిపుండ్రమునకు నూర్ధ్వపుండ్రమునకును విరోధ మెట్లు?

ఉ. ఈరెండింటికి విరోధమును ప్రసిద్ధమే. ఎట్లనిన శివపురాణములు భస్మత్రి
పుండ్రమును విధించుచు నూర్ధ్వపుండ్రమును నిషేధించుచున్నవి. అట్లే విష్ణుపురాణము
లు ఊర్ధ్వ పుండ్రమును విధించుచు భస్మత్రిపుండ్రమును నిషేధించుచున్నవి. దీనింబట్టి
విష్ణుభక్తులకు మాత్రమే ఊర్ధ్వపుండ్రమునం దధికారమని తేలియుచున్నది.

ప్ర. భస్మత్రిపుండ్రము శివపురాణములయందు మాత్రమే విధింపఁబడుటచే శివభ

ధ్యోఽపి తుల్యత్వమేవ వేదవాక్యానాం, అనేనాపి భిన్నాధికారికత్వ సంప్రతి
పత్త్యా ఉభయవిధివిరోధస్య సిద్ధత్వాత్ ॥ కించ, భస్మత్రిపుండ్ర విధేస్సక
ల శ్రుతివిహితత్వేన వైదికత్వనిశ్చయేన, మృదూర్ధ్వపుండ్ర విధేస్తు
పాంచరాత్రాది తంత్రమాత్రమూలకతయా తాంత్రికత్వ నిర్ధారణే
చ విభిన్నాధికారికత్వస్య నిశ్చయాత్ ॥ ఏవంచ, భస్మత్రిపుండ్ర విధేశ్శ్రుతి
మూలకతయా తత్ప్రతిపాదకానా మూర్ధ్వపుండ్ర నిషేధకానాంచ
స్మృతి పురాణాది వచసాం వైదికజన విషయత్వాత్ తథా మృదూర్ధ్వపు
ండ్రస్య పాంచరాత్రాది తంత్రమాత్రమూలకతయా మృదూర్ధ్వపుండ్ర విధా
యకానాం భస్మత్రిపుండ్ర నిషేధకానాంచ స్మృతిపురాణాది వచసాం
తాంత్రికజన విషయత్వ మితిచ సిద్ధం.

యదుక్తం మతిప్రకాశే ॥ నను దేవతోత్కర్ష నికర్ష ప్రతిపాదకాని
పుండ్రస్తుతి నిందాపరాణిచ వచనాని పరస్పరవిరుద్ధాని బహూనీతిహా
సపురాణాదిషు దృశ్యన్తే। అతః పరస్పర విరుద్ధార్థాభిధాయకత్వా దితి
హాస పురాణానాం ప్రమాణానీతిచేత్ భవేదయం దోషో భేదవాదినాం
శైవానాం వైష్ణవానాంచ శివాదన్యో విష్ణుర్విష్ణో రన్యశ్శివ ఇత్యభ్యుపగచ్ఛ
తాం॥ అభేదవాదినాంతు సిద్ధాంతినాం నాయం దోషః। ఈశ్వరస్యైకత్వా
భ్యుపగమాత్వాది తదభిప్రాయ మూలః॥

---

కులకే భస్మత్రిపుండ్రమునకధికారమని తెలియుచున్నది గాని రెండును సమమునేకదా?

ఉ. అటుల కానేరవు. దీనిబట్టియు రెండుపుండ్రములకు నధికారులు వేర్వే
రనుటచే విరోధము స్పష్టమగుచునే యున్నది.

ఇందు భస్మత్రిపుండ్రవిధి అనేకశ్రుతులచే విధింపబడినదిగాన నిది వైదిక మని ని
శ్చితమగుచున్నది. ఇంక మృత్తికతో నూర్ధ్వపుండ్రము ధరింపవలయునను విధి పాంచ
రాత్రము మొదలగు తంత్రములయందు మాత్రమే కలదు గాన నది తాంత్రికమేయని
నిర్ణయింపబడుచున్నది. ఇటుల తంత్రానుసారముగా విష్ణూపాసనచేయువారలకే
యూర్ధ్వపుండ్రమునం దధికారము కలదని చెప్పుటచే రెండిటికి విరోధము కలదనుట
స్పష్టము.

ఇటుల భస్మత్రిపుండ్ర విధి వేదమూలకమైనది. భస్మత్రిపుండ్రమును ప్రశంసించున

శ్రుతిసిద్ధభస్మత్రిపుండ్రనిషేధకత్వేన తంత్రసిద్ధమృదూర్ధ్వపుండ్రస్థాపకత్వేనచ తాదృశానాం వచసామ ప్రామాణ్యే న్యాయసిద్ధేపి సదసన్మూలయో రుభయోరపి తుల్యస్య త్రైరంగీకృతత్వేన అభేదవాదిన యోన్యా యాన్యాయ యోరవ్య భేదా భ్యుపగమ ఇతి ప్రతీయ మానత్వాత్॥

వస్తుతో హరిహరాభేద స్యైవ అసిద్ధేః॥ తథాహి ననామైక్యేన హరిహరాభేద శ్శంక్యః॥ విష్ణుశంభ్వాది నామ విశేషైః తదుభయనామభేదస్య ప్రమితత్వాత్. నచ, స్వరూపైక్యేనభావ్యః, ద్వినేత్రత్వ త్రినేత్రత్వ చతుర్బాహుత్వదశబాహుత్వ లక్ష్మీపతిత్వ గౌరీపతిత్వా దిస్వరూప ధర్మవై లక్షణ్యస్య స్ఫుటత్వాత్. నాపిస్వ రూప భేదస్యావ

వియు, నూర్ధ్వ పుండ్రమును నిషేధించునవి యునగు స్మృతి పురాణాది వచనములు వైదిక జనుల నుద్దేశించి ప్రవర్తించినవి ॥ ఇక ఊర్ధ్వపుండ్రమన్నచో పాంచ రాత్రము మొదలగు తంత్రములే మూలముగా గలదిగావున ఊర్ధ్వపుండ్రమును విధించునవియు, భస్మత్రిపుండ్రమును నిషేధించునవియునగుస్మృతిపురాణాది వచనములుతాంత్రికజనుల నుద్దేశించి ప్రవర్తించినవి, అనిస్పష్టమగుచున్నది.

ఇందుఁ గొందఱిట్లుచెప్పుచున్నారు.

ప్ర: పురాణేతి హాసాదులయందు ఒకదేవతను ప్రశంసించుచు వేరొకదేవతనునిందించునవియు, ఒకపుండ్రమును స్తుతిచేయుచు వేరొక పుండ్రమును నిందించునవియు చెప్పువచనములు గన్పట్టుచున్నవి. దీనిఁబట్టి పరస్పర విరోధము స్పష్టముగా గలదు గానఁబట్టి పురాణేతి హాసములు అప్రమాణము లెట్లుకావు?

ఉ: శివునికంటె భిన్నుఁడు విష్ణువనియు విష్ణునికంటె భిన్నుఁడుశివుడనియు భేదమునంగీకరించిన శైవులకు వైష్ణవులకును నిదిదోషమేయగును ఈశ్వరుఁ డొక్కఁడే యని యంగీకరించినందున నభేదవాదుల కిట్టిదోషము లేదు.

అనిచిలరు తాముసంతోషించుచున్నారు కాని యిది వివేకమూలము కాఁజాలదు. ఏలన.

శ్రుతులయందు విధింపఁబడిన భస్మత్రిపుండ్రమును నిందించుటచేతను, తంత్రములయందుగల ఊర్ధ్వపుండ్రమును ప్రశంసించుటచేతను నిట్టివచనములకప్రామాణ్యము న్యాయ్యమైయున్నను, శ్రుతిమూల వచనములకును,శ్రుతివిరుద్ధ వచనములకును సామ్యము

తారవిశేష ప్రయుక్తత్వేన నసభేద సాధకఇతి వాచ్యం హరేరవ తార దశక వైశిష్ట్యస్య హరస్య లీలాపం చవింశక సాహిత్యస్యచ పార్థక్యేన ప్రమిత త్వేన తదుభయోరవ తార విశేష త్వస్యాప్రమితత్వాత్ ॥ ఏవం చాభేదవాదానుశోధేనై కేశ్వరత్వా భ్యుపగమోప్య సిద్ధః ॥ అభేదా భ్యుపగమేపి జీవేశ్వర యోరత్య భేదస్య సమ్మతత్వేన ద్వయోరేకస్య జీవత్వేనాపి తత్సంగత్యా తదుభయో రేకేశ్వరతా సిద్ధేః.

కించ హరస్యారాధనేహరిః ప్రహరేదితి హరి రారాధనే హరః ప్రహరేదితిచ సంశయేన ద్వావపి సమమన్యైశ్చ సేవమా నానా మేకే శ్వరత్వా భ్యుపగమా సిద్ధేః. అభేదస్యాపి వాదమాత్ర సిద్ధత్వ ప్రతీతే

ను వారంగీకరించిన గాన అభేదవాదిమతమునందు న్యాయాన్యాయములకును భేదములేద ని యేర్పడుచున్నది.

నిజమాలోచింప హరిహరాభేద మే సిద్ధింపదు. అదియెట్లనిన,

ప్ర॥ హరి- అనియు- హరుఁడనియు నీమొదలగు నామము లొక్కనికేకదా!

ఉ॥అట్లుకాదువిష్ణునారాయణాదినామములుహరివనియు శివ శంభ్వాది నామము లు హరునివనియు నిఘంటుకారులు నిర్ణయించియుండుటచే హరిహరులు వేర్వేరనియేయేర్ప డు చున్నది.

ప్ర॥ పేర్లువేర్వేరైనను నిద్దఱి స్వరూపమొక్కటె గావున నిద్దరు నొక్కరేయ నిరేల యంగీకరింపరాదు?

ఉ॥ హరిహరుల కిద్దఱకు స్వరూపమొక్కటై యుండునెడ పేర్లువేర్వేరుగనుండనే రవు. హరికి రెండు నేత్రములును, హరునకు మూడు నేత్రములును, హరికి నాలుగు చేతులు ను, హరునకు పదిచేతులును నిట్లు ఇద్దఱి స్వరూపము వేర్వేరుగనే యున్నటుల ప్రమాణ ములవల్ల తెలియుచున్నది. మఱియు హరియొక్క పత్ని లక్ష్మియు, హరుని పత్ని గౌరి యు నిటుల వారి భార్యలును వేర్వేరుగనే యున్నటుల ప్రమాణములవల్ల తెలియుచుం డఁగా నిద్దఱు చేరి యొక్కరే యనుట విరుద్ధము.

ప్ర॥ రామకృష్ణాద్యవతారములయందు నొక్కహరికే స్వరూపభేదంబును పత్నీభే దంబును, గలిగియున్నటుల హరిహరులకును కలిగియున్నను హరిహరరూపములు రెండును నొక్కని యవతారములేయని యంగీకరించునెడ నభేదము సిద్ధింపదా?

ఉ॥ అటుల సిద్ధింపదు. హరికి పదియవతారములు గలవనియు హరునకు నిరువది యైదు లీలలు గలవనియు నిటుల ఇద్దఱి యవతారములు వేర్వేరని ప్రమాణములవల్ల తే

సంభవం రుద్రాక్షధారణస్యైవ న్యాయ్యత్వాత్ । అతఏవ ‘ విప్రాదీ
నాం క్రమాచ్ఛ్వేతం రక్తం పీతమథాసితం । తథాలాభే యథాలాభం ధా
రణీయమ దూషితమితి శివపురాణవచన మపిసంగచ్ఛతే । యత్త్వ
త్రోక్తం బ్రాహ్మణో బిభృయా దిత్యాదివచన విరుద్ధస్య తథాలాభే య
థాలాభమిత్యాది వచనస్య ప్రమాణత్వమితి తదపి శ్రుత్యంతరాపరిజ్ఞా
నమూలం బృహజ్జాబాలోపనిషది । అష్టమబ్రాహ్మణే తృతీయఖండే
రుద్రాక్షాశ్శ్వేతా వా ఽశ్వేతా వా నైవతత్ర సమ్మర్శ్య ఇతి । భస్మజాబా
లేపి । రుద్రాక్షాః శ్వేతానేవ బిభృయాన్న తత్ర సమ్మర్శ్య ఇత్యనేనచ
రుద్రాక్షేషు శ్వేతాశ్వేతవిమర్శనం వినా నిత్యతయా ధార్యత్వస్య ప్రతి
పాదనాత్ । కించ తామ్రాస్స్నిగ్ధా దృఢాస్థూలా ఇత్యాదినా తామ్రా
దీనామపి విధానాత్ । శ్వేతాదీనాం వృక్షపర్యాయత్వాచ్చ శ్వేతరు
ద్రాక్షాణామలభ్యత్వాత్తద్ధారణమను పపన్నమితి వాదో దుష్ట ఇతి
స్పష్టం ।

---

నచేదం శిష్టజనానుష్ఠితమితి వాచ్యం సర్వజనానుష్ఠితత్వాత్తథాహి
చో నల్లనిమృత్తికతోనైన శౌచవిధి తీర్చుకొనుట న్యాయమైయున్నది గాని తెల్లనిమృ
త్తిక దొరకదన్యాతని బ్రాహ్మణుడు శౌచాధని పధలుట యుక్తమగునా? గుణములోపిం
చినను ముఖ్యమును విడువగూడదను ప్రాచ్యమీమాంసాన్యాయమును బట్టి తెల్లనిమృత్తిక
దొరకనిచో నల్లనిమృత్తికయు గ్రాహ్యమేయని యెన్నడును. ఈ న్యాయమును బట్టియే
తెల్లని రుద్రాక్షములు దొరకనప్పుడు నల్లని రుద్రాక్షములను ధరించుట యుక్తమని ని
ర్ణయించును. కావుననే బ్రాహ్మణులు మొదలగువారు క్రమముగా తెలుపువన్నె మొ
దలాగాగల రుద్రాక్షములను ధరింపవలయు. అట్టివి దొరకనియెడ నెవ్వియైన ధరింపవల
యునని శివపురాణమునగలదు.

ప్ర. తెల్లని రుద్రాక్షములు దొరకున్నయెడ దొరకినవానిని ధరింపవలయునను శివ
పురాణవచనము తెల్లనివానినె ధరింపవలయునను శ్రుతికి విరుద్ధముగాదా?

ఉ. ఆ వచనము శ్రుతికి విరుద్ధమైనది కాదు. రుద్రాక్షలు తెల్లనివైనను కాకున్న
ను దానియెడ విమర్శింపక లభించినవానిని ధరింపవలయునని బృహజ్జాబాలమునందు కలదు
గాన తెలుపు సహా సాధకములే యగును. శ్రుతియందు రుద్రాక్షములెట్టివైనను వానిని
నిత్యవిధిగా ధరింపవలయునని యున్నది. ఇదిగాక తెలుపు, ఎఱుపు మొదలగునవి చెట్ల

న చేదం శిష్టజనానుష్ఠితమితి వాచ్యం సర్వశిష్టజనానుష్ఠితత్వా
త్తథేతి రుద్రాక్షధారిణో మహర్షయ స్సనత్కుమార సనకనిదాఘ
కాత్యాయన దత్తాత్రేయ భరద్వాజ కపిలవశిష్ఠపైప్పలాదముఖాః రు
ద్రాక్ష జాబాలాది షూపనిషత్సు ప్రశంసితాః తథాపాద్మేచ । అథరా
మగిరౌ రామః పుణ్యే గోదావరీతటే । భూతిభూషితసర్వాంగో రుద్రా
క్షాభరణైర్యుత ఇతి శ్రీరామచంద్రస్యాపి తద్ధారణం స్మృతం । సూ
తసంహితాయాం ॥ ఏతస్మిన్నంతరే శ్రీమాన్ మహాకారుణికోత్తమః ॥
కృష్ణాజినోత్తరీయశ్చ ఆషాఢేన విరాజితః ॥ భస్మోద్ధూళితసర్వాంగ స్త్వృధ
తిర్యక్త్రిపుండ్రధృక్ ॥ రుద్రాక్షమాలాభరణో జపన్ పంచాక్షరంము
దా ॥ శిష్యైస్తాదృశైర్యుక్తో మహాత్మాస్స్వయమాగత ఇతి ॥ సత్రావ
సానే సన్నద్ధా ఇతి ప్రస్తుత్య ఋషివర్ణనావసరే ॥ ఋషయో మహామృతవన్స్వ
ష్ఠా స్సర్వద్వంద్వవివర్జితాః । రుద్రాక్షమాలాభరణా స్సితభస్మావకుం
ఠితాః । ఇతి విశిష్టధర్మగ్రహణార్థినః స్తావనీయాన్ ఋషీన్ ప్రస్తుత్య
భస్మోద్ధూళిత సర్వాంగా త్రిపుండ్రాంకిత మస్తకాః । రుద్రాక్ష మా

---

లోని భేదములు కాని రుద్రాక్షలలోని భేదము కానేరవు. కావుననే ఎరుపైనవి గూడ ధ
రింపవలయునని విధివచనము గలదు.

ప్ర. రుద్రాక్షములను శిష్టులు ధరించినారా?

ఉ. సకల శిష్టులు ధరించిరి. సనత్కుమారుడు, సనకరుడు నిదాఘుడు, కా
త్యాయనుడు దత్తాత్రేయుడు, భరద్వాజుడు, కపిలుడు. వశిష్ఠుడు పైప్పలాదుడు మొ
దలగువారు రుద్రాక్షధారులని రుద్రాక్షజాబాలము మొదలగు నుపనిషత్తులలో గలదు.
పద్మపురాణమునందు గోదావరియొడ్డుననున్న చిత్రకూటపర్వతమునందు శ్రీరామచంద్రుం
డు భూతిభూషిత సర్వాంగుండును, రుద్రాక్షమాలికాధరుండునై యుండెననుటచే శ్రీ
రామచంద్రుడు రుద్రాక్షముల ధరించెనని తెలియుచున్నది

సూతసంహితయందు । దయాశాలియు, కృష్ణాజినోత్తరీయుండును, పాలాశదండ
ధారియు భస్మోద్ధూళితసర్వాంగుండును, తిర్యక్త్రిపుండ్రధారియు, రుద్రాక్షమాలాభర
ణుండునునగు సూతుండు పంచాక్షరమంత్రము జపించుచు నిట్టిశిష్యగణములతో నింతలో నే
తెంచెనని కలదు. దీనింబట్టి సూతుండును తచ్ఛిష్యులును భస్మరుద్రాక్షధారులని తేట
పడుచున్నది. మరియునందే సత్రావసానమునవచ్చిన మునీశ్వరులనుద్దేశించి కొంతలు

లాభరణా జటావల్కల ధారిణ ఇతి । పురా శ్వేతాది ద్విజ్యా శాము
నయో మునిసత్తమాః । సాంఖ్యాచకరతమే తేషాం సహస్ర్యాదశ సంఖ్య
యా । తవతేభస్మ దిగ్ధాంగా త్రిపుండ్రాంకిత మస్తకాః । రుద్రాక్ష
మాలాభరణాః రుద్రారాధనతత్పరా । ఇత్యాదినా బహుష్వపిపురాణే
షు బహవస్తద్ధారిణః ప్రశంసితా ఇతి మహతీయ మనుష్ఠాత్ప్రశంసా ।
బృహజ్జాబాలోపనిషది । సమరనిదాఘః కాత్యాయన దత్తాత్రేయభర
ద్వాజ కపిలవసిష్ఠ పైప్పలాదైశ్చ కాలాగ్నిరుద్రం పరిసమేత్యోవాచ ।
అథ కాలాగ్నిరుద్రః కిమర్థం భవతా మాగతమితి సహోవాచ రుద్రా
క్ష ధారణవిధిం సర్వే శ్రోతు మిచ్ఛామ ఇతి । అథ కాలాగ్ని రుద్రః ప్రో
వాచ । రుద్రస్యనయనాదుత్పన్నా రుద్రాక్షా ఇతి లోకేవ్యాఖ్యాయ
తే । అథవా సదాశివ స్సంహారకాలే సంహారంకృత్వా సంహారాక్షిం
ముకుళీకరోతి । తన్నయనా జ్జాతా రుద్రాక్షఇతివ్యాఖ్యాయతే । తస్మా
ద్రుద్రాక్షత్వమితి । అథకాలాగ్నిరుద్రః ప్రోవాచత ద్రుద్రాక్షేవాగ్వి
షయాకృతే దశగోప్రదానే యత్ఫల మవాప్నోతి తత్ఫల మవాప్నోతి

---

దు ద్వంద్వదోషరహితులును, రుద్రాక్షమాలాధారులును భస్మాన్విత గుంఠనపరులునని చె
ప్పఁబడియెను.

ఇదిగాక. ఉత్తమధర్మమును దెలిసికొనదలచిన మునుల నుద్దేశించి భస్మోద్ధూళిత
సర్వాంగులును, త్రిపుండ్రధారులును, రుద్రాక్షమాలాభరణులునని చెప్పఁబడియున్నది.
మరియు శ్వేతుడు మొదలుగాని శివభక్తులు సాంఖ్యపండితులగు ఋషులును భస్మరు
ద్రాక్షధారులును రుద్రారాధనతత్పరులునని యున్నది. ఇటులనేక పురాణములయందు రు
ద్రాక్షధారులగు మహర్షులు పెక్కుఱు ప్రశంసింపఁబడియున్నారు.

బృహజ్జాబాలోపనిషత్తునందు. సనత్కుమారుడు, నిదాఘుడు, కాత్యాయనుడు, దత్తాత్రే
యుడు మొదలగు మహర్షులు కాలాగ్నిరుద్రునొద్దకు వచ్చి రుద్రాక్షధారణవిధిని చె
ప్పుమని యడుగ నద్దేవుండిట్లనెను. రుద్రుని నేత్రముల నుండి పుట్టినవి గాన రుద్రా
క్షములని చెప్పఁబడుచున్నవి. సదాశివుడు సంహారకాలంబున ఫాలనేత్రంబుచే జగము
ల సంహరించి యా ఫాలనేత్రంబు మూయఁగా నట్టి నేత్రంబునుండియు రుద్రాక్ష
ములు ప్రభవించెను. దానను రుద్రాక్షంబులని చెప్పఁబడుచున్నవి.

రుద్రాక్షముల నుచ్చరింపగా పదిగోదానముల ఫలము కలుగును. రుద్రాక్షమును

తత్ఫల మశ్నుతే । సహమజ్యోతి రుద్రాక్షీతిహోవాచ । తద్రుద్రాక్షం
కరేస్పృష్టమిచ్ఛయా శతగోప్రదాన ఫలంభవతి । తద్రుద్రాక్షే కరయో
ర్ధార్యమాణేసతి ద్విసహస్రగోప్రదానఫలం భవతి॥ రుద్రాక్షేకంఠేధా
ర్యమాణేత్రి సహస్రగోప్రదానఫలం భవతి । రుద్రాక్షేకర్ణయోర్ధార్య
మాణేఏకాదశ సహస్రగోప్రదాన ఫలంభవతి॥ఏకాదశరుద్రత్వంగచ్ఛతి।
శిరసి ధార్యమాణే కోటిగోప్రదానఫలంభవతి । ఏతేషాంస్థానానాం క
ర్ణయోఃఫలంవక్తుం నశక్యమితి సహోవాచ । అథసనత్కుమారః ప
ప్రచ్ఛ రుద్రాక్షస్య దానమస్త్యేవేతివా ఇతి । అథకాలాగ్నిరుద్రః ప్రో
వాచ అష్టశతరుద్రాక్షం దత్వా అష్టశతరుద్రాక్షం ధారయేత్ । భూ
వలయదానే యత్ఫలమవాప్నోతితత్ఫల మశ్నుతే । సహమజ్యోతి రుద్రా
క్షీతిహోవాచ । అథ కాలాగ్నిరుద్రం భగవంతం సనత్కుమారః
ప్రపచ్ఛ । రుద్రాక్షసహస్రం క్రమేణ ధర్తుంవా శక్యంవా ఇతి । అ
థకాలాగ్నిరుద్రః ప్రోవాచ । రుద్రాక్షధారణా కర్తుమధివాసాది
ప్రాణప్రతిష్ఠాం కృత్వా రుద్రాక్షాన్వర్షమేకంతు ధారయేత్ । బ్ర

---

స్పృశించగా నూరుగోదానముల ఫలము లభించును, రుద్రాక్షములను ధరింపగా సహస్ర
గోదానఫలము సంప్రాప్తమగును. రుద్రాక్షమును చేతులయందు ధరింపగా రెండువేల
గోదానముల ఫలము దొరకును. రుద్రాక్షమును మెడయందు ధరింపగా మూడువేలగో
దానముల ఫల మబ్బును. రుద్రాక్షములను చెవులయందు ధరింపగా పదునొకండువేల
గోదానములకలిగినఫలము సిద్ధించును. ఏకాదశరుద్రత్వంబునుపొందును. శిరంబునధరింపగాకో
టిగోదానఫలము చేకూరును. ఈస్థానములలో చెవులయందు ధరించేవాని ఫలము వచిం
పనలవి కాదు. ఎనిమిదినూర్లరుద్రాక్షములను దానముచేసి అన్నిరుద్రాక్షములను ధరించువా
డు భూవలయము నెల్ల దానము చేయగలుగు ఫలము లభించును. సహస్రరుద్రాక్షములను
ధరించుటకెట్లనిన రుద్రాక్షములకధివాసములు చేసి ప్రాణప్రతిష్ఠ గావించి సహస్రరు
ద్రాక్షములను ఒక సంవత్సరకాలము ధరించువాడు బ్రహ్మత్వము నందును. రెండు సంవ
త్సరములు ద్విసహస్రరుద్రాక్షలను ధరింపవిష్ణుత్వము గలుగును మూడు సంవత్సరములు
మూడువేలరుద్రాక్షములను ధరింప సదాశివత్వము సిద్ధించును. వాడు పునరావృత్తి నిపొం
దనేరడు. రుద్రాక్షమహిమలు వచింప వలనికాదు. ఇది యొక్కటే జ్యోతిరూపమని
వచించినట్లు కలదు.

ర్మత్వంగచ్ఛతి। ద్విసహస్రరుద్రాక్షం ద్వివర్షేధారయేత్ విష్ణుత్వంగచ్ఛతి। త్రిసహస్రరుద్రాక్షం త్రీణివర్షాణిధారయేత్ సదాశివత్వంగచ్ఛతి। నసపునరావర్తతే। సపరోజ్యోతి రుద్రాక్షోపనిషదోవాచ ఇతి।

తథా స్కాందే। శంకరసంహితాయాం। రుద్రాక్షస్యాక్షితో యావిప్రాః రుద్రాక్షమితి కీర్తితః। రుద్రాక్షధారకశ్శంభుః పరిపూర్ణకటాక్షవాన్। రుద్రాక్షధారకాస్సర్వే రుద్రాకారాః ప్రకీర్తితాః। యస్యాస్యాజ్జన్మ చరమంతస్య రుద్రాక్షధారణే। త్రిపుండ్రధారణేచైవ పంచాక్షరజపే తథా। పరాశ్రద్ధాభవేత్పుంసామన్యేషాం దుర్లభా భవేత్। యస్యదేహేభవేదేకో రుద్రాక్షశ్శివభావకః। శివాలయంతు తద్దేహం సాక్షాచ్ఛంభుశ్శివస్స్వయం। నదేహేయస్య రుద్రాక్షోన త్రిపుండ్రస్యధారణం। శ్మశానమేవతద్దేహం తన్ముఖంగిరిగహ్వరం।

---

స్కాందమున శంకర సంహితయందు. రుద్రుని నేత్రములవలన జనించెను గాన రుద్రాక్షములని చెప్పఁబడుచున్నవి. రుద్రాక్షముల ధరించినవానియెడ పరమేశ్వరుఁడు పరిపూర్ణకటాక్షము కలిగియుండును. రుద్రాక్షములధరించినవారలందఱును రుద్రస్వరూపులనఁబడుదురు. ఎవ్వారల జన్మంబు చివరదైయుండునో వారలకు రుద్రాక్షధారణమునందును, భస్మత్రిపుండ్రధారణమునందును, పంచాక్షరజపమునందును నెక్కువశ్రద్ధకలిగియుండును; గాని యది తక్కినవారలకు లభింపనేరదు.

ఎవ్వని శరీరంబున నొక్క రుద్రాక్షము కలదో వాని శరీరము శివాలయంబును వాఁడు కేవలము రుద్రుండునగును. ఎవ్వని దేహంబున రుద్రాక్షలు భస్మ త్రిపుండ్రంబును లేవో వానిదేహము శ్మశానముంబలె నపవిత్రమైనదియు వాని నోరు కొండగహ్వరంబోలినదియు నగును. ఎవ్వఁడు రుద్రాక్షములను ధరించిన శైవులను శివరూపులనుగాఁ జూచునో వాని కన్నులె సార్థకము లైనవి గాన వాఁడె కన్నులుగలవాఁడని యెన్నఁబడును. మఱియు నెవ్వఁడు రుద్రాక్షధారులను మనుష్యమాత్రులనుగాఁ జూచునో అట్టివాఁడు చేయుపూజయు జపహోమాదులును వ్యర్థంబులగును. ఎవ్వఁడు రుద్రాక్షధారులను శివరూపులనుగా జూచునో వాఁడు సర్వవిధములగు తపంబులు చేసినవాఁడగును. శివార్చనంబు

రుద్రాక్షధారిణం దృష్ట్వా పశ్యేద్యశ్శివభావతః। స యాతే తస్య సఫలే చక్షుష్మత్త్వం శ్రుతస్య చ। యస్తు రుద్రాక్షమాలాం ధృత్వా మానవస్త్వేన కుర్వ్యతి। కృతం తేనార్చనం వ్యర్థం జపోపాసశ్చ నిష్ఫలః। యో వా రుద్రాక్షభూషాం ధృత్వా శివభావేన పశ్యతి। తేన త్రిషవణస్సర్వం కృతం తేన శివార్చనం। యస్తు రుద్రాక్షమణిభిః స్పృష్టతోయాభిషేచనః। గంగాస్నానం కృతం తేన తీర్థచర్యా కృతా పరా। రుద్రాక్షమేకం యో దద్యాచ్ఛివభక్తాయ భక్తితః। తస్య పుణ్యఫలం వసుమతీం దత్త్వా శ్రోత్రియేషు నః। యో ధత్తే మాలికాం భక్త్యా త్వష్టోత్తరశతైర్యుతాం। కైలాసే స్వజనైస్సార్ధం మోదతే శివసన్నిధౌ। ఇత్యాదినా రుద్రాక్షమాహాత్మ్యమధికం ప్రతిపాదితం। తథాపి కేచిద్భస్మరుద్రాక్షధారణేన ప్రవర్తంతే। తత్కారణముక్తం భవిష్యత్పురాణే। పాపానామపి బాహుళ్యాద్దధీచస్య చ శాపతః। గౌతమస్య మునేశ్శాపాత్ శ్రౌతలింగం పరోచత ఇతి। ఆదిత్యపురాణే। దుర్వాససో మునేశ్శాపాత్ కుపితస్య మహాత్మనః। కణ్వశాపాద్భృగోశ్శాపాదుపమన్యోశ్చ శాపతః। దధీచస్యాము

---

పూజగా చేసినవాడగును. ఎవ్వడు రుద్రాక్షము స్పృశించిన జలము స్నానము చేయునో వాడు గంగాస్నానము చేసినవాడును సకలతీర్థయాత్రలు నొనరించినవాడును నగును. శివభక్తునకొక్క రుద్రాక్షము నిచ్చునెడ శ్రోత్రియులకు సకల భూమండలముదానముచేయుటవలనగు ఫలములభించును. నూటయెనిమిది రుద్రాక్షములుగల మాలికను శివభక్తునకొసంగువాడు కైలాసంబున శివసాన్నిధ్యంబున స్వజనులతోఁగూడి సుఖమొందుచుండును. అని యిట్టి విధమున రుద్రాక్షమాహాత్మ్యమధికముగా గలదు. అయినను గొందఱు భస్మరుద్రాక్షముల ధరింప విముఖులైయుండెదరు. దానికారణంబును భవిష్యత్పురాణంబునగలదు. పాపాధిక్యమువల్లను దధీచి గౌతమాదులశాపంబుల వల్లను వైదికవిప్రులగు భస్మరుద్రాక్షములయొక్క ధారణము రుచింపనేరదని చెప్పబడెను.

ఆదిత్యపురాణమునందు కోపించిన దుర్వాసునియొక్క శాపమువల్లను, కణ్వశాపమువల్లను, భృగుని శాపము వల్లను, ఉపమన్యుని శాపమువల్లను, దధీచుని శాపము వల్లను, గౌతముని శాపమువల్లను దాక్షిణాత్యులలో పాపాత్ములగు విప్రులకు శివునియందును భస్మమునందును, రుద్రాక్షమునందును కొంచెమైనను శ్రద్ధకలుగనేరదు. అనియున్నది.

మాళవ పురాణమునందు, పూర్వము దుష్టకాలమున కలియుగ విప్రులు గౌతము

నశ్యేత్ గౌతమస్య చ శాపతః। విప్రాణాం దాక్షిణాత్యానాం శాపోపహ
తచేతసాం। శివే భస్మని రుద్రాక్షే కించిచ్ఛ్రద్ధా న విద్యతే ఇతి॥ మానవే చ॥
బ్రాహ్మణైశ్చ పురా సర్వైః గౌతమేన సురక్షితైః। విచార్య కార్యం సం
భూయ స్వదేశగమనోద్యతైః। గాం కృత్వా గౌతమే నేతిం నిర్గతైః పురుషా
ధమైః। కృత్వా మిథ్యాభిశాపం తు మహామోహవశేన తు॥ తద్బుద్ధ్వా స
మునిశ్రేష్ఠో గౌతమో మునిసత్తమః। మహాక్రోధేన సంయుక్తః శ
శాప బ్రాహ్మణాధమాన్। యద్యత్తు రుద్రసంబంధి తత్ర తత్రాపి గ
ర్హితాః। భవతానున్ముఖా యూయం సర్వథా బ్రాహ్మణాధమాః॥ స్వా
ధ్యాయే చ జపే చైవ తథా ప్రవచనేపి చ। భవతానున్ముఖా యూయం సర్వ
థా బ్రాహ్మణాధమాః॥ శ్రుతిస్మృతిపురాణోక్తేష్వర్థేషు సకలేషు చ।
భవతానున్ముఖా యూయం సర్వథా బ్రాహ్మణాధమాః॥ శంఖచక్రగ
దాపద్మ దండపాశాంకుశాదిభిః। అంకితాః శ్రద్ధయా యూయం సర్వథా
బ్రాహ్మణాధమాః। పర్ణశాలాశ్వత్థపత్రార్ధ చంద్రశూలాదిలింగినః।
భవత శ్రద్ధయా యుక్తాస్సర్వథా బ్రాహ్మణాధమాః॥ అశ్వత్థపత్రలింగీచ

---

నొద్దఁ జేర్చి యామహామునిచే సురక్షితులై యుండి పదంపడి కొంతకాలమునకు తమదేశము
సుభిక్షంబుగా నున్నదని విని స్వదేశగమనోన్ముఖులై గౌతమమునిమీద నొక నెపమునిడ
దలచి యందఱును జేరి దుర్బలోపేతము గానించి కృత్రిమగోవును నిర్మించి యద్దానిని
గౌతమునిమీదికి నుసిగొల్ప నమ్మునీంద్రుఁడా గోవును దర్భతోఁ గొట్టెను. అంత నాగోవు నే
లపైఁ ద్రెళ్లె గౌతముఁడు గోవును జంపెను గాన నిందుండరాదని యందరును బైలువెడలు
దు రమ్మునీంద్రుఁడు నిజతపః ప్రభావంబున నిజమారసి కృతఘ్నులగు వారినుద్దేశించి బ్రా
హ్మణాధములారా! మీరలు రుద్రసంబంధములగు భస్మరుద్రాక్ష ధారణము శివపూజనము
దలగు దానియందు నాసక్తిలేని వారలగుదురు.

మఱియును, శ్రుతిస్మృతులయందుఁ జెప్పఁబడు విషయములయందు శ్రద్ధారహితులై
యుందురు శంఖము, చక్రము, గద, పద్మము, దండము, పాశము, అంకుశము మొదల
గువాని ముద్రలను ధరింతురు. పర్ణశాలాకారము, అశ్వత్థపత్రాకారము, అర్ధచంద్రాకారము
త్రిశూలాకారములగు పుండ్రములు ధరింతురు. ఇదిగాక, బౌద్ధధర్మమును నవలంబించి పాం
చరాత్రము, కాపాలము, కాలాముఖము, శాక్తము నను వానియందుఁగల దీక్షలనొందుదురు.
చార్వాకము, పాషండము, వైష్ణవము మొదలగు దీక్షలనవలంబించు ఆచారకములగు దుర్మతి

బౌద్ధధర్మముపాశ్రితాః । పాంచరాత్రేచ కాపాలే తథా కాలాముఖేపిచ। శాక్తేచదీక్షితాయూయం భవత బ్రాహ్మణాధమాః । చార్వాకేచమతే యూయం తథాపాషండకేపిచ । వైష్ణవేదీక్షితాయూయం భవత బ్రాహ్మణాధమాః॥ ధూర్తశేషుతథాన్యేషు మార్గేష్వశ్రౌతకేషుచ। శ్రద్ధయా దీక్షితా యూయం భవత బ్రాహ్మణాధమాః ॥ ఇత్యాది । కౌర్మే । సృష్టాని కాయశో యూయం వేదబాహ్యవిరోధినః। నిర్మాయచపురాణాని భవత బ్రాహ్మణాధమాః ॥ దోర్మూలే తప్తముద్రాది ధారిణః పాపచేతసః । వేదమార్గపరిభ్రష్టా భవత బ్రాహ్మణాధమాః॥ విష్ణుమేవపురస్కృత్య శివమార్గవిదూషకాః । నరకాయాతనాయూయం భవత బ్రాహ్మణాధమాః ॥ సన్మార్గనిందకాదుష్టమార్గైకపరిమోహినః । పాపోపదేశ నిరతా భవత బ్రాహ్మణాధమాః ॥ మోక్షమార్గం పరిత్యజ్య వక్రమార్గైకగామినః । వేదనిందాపరాయూయం భవత బ్రాహ్మణాధమాః ॥ అగ్నిష్టోమాదికర్మాణి విసృజ్యశ్రుతినిందకాః । వాయ్వాదిదేవతా భక్తా భవత బ్రాహ్మణాధమాః ॥ చక్రాంకితాశ్శైవమార్గ నిందకాస్స్వాత్మదూషకాః । ధర్మార్థప్రతికూలాశ్చ భవత బ్రాహ్మణాధమాః । భారతాద్యాఃప్రకల్ప్యాపి వచనానిస్వబుద్ధితః । కపోలకల్పితార్థ

---

ములయందు నధిక శ్రద్ధకలిగి యుండుడని మొదలుగా పెక్కువిధముల శపించినట్లు కలదు

కూర్మపురాణమునందును. గౌతమశాపభ్రష్టులగు, బ్రాహ్మణాధములారా మీయిచ్ఛాలది వేదవాక్యములను పురాణవాక్యములను కల్పించుకొనుడు. బుజములయందు తప్తముద్రలను ధరించి వేదమార్గమునుండి తొలంగినవారలు కండు. విష్ణుని సేవ చెప్పుచు శివమార్గమును దూషించుచు పాతకముల ననుభవించుడు. దుష్టమార్గమున మోహితులై సన్మార్గముల నిందించుచు పాతకృత్యముల నుపదేశించుచుండుడు. మోక్షమార్గమును విడిచి పుట్టి వంకరదారి నేగుచు వేదనిందచేయుచుండుడు. అగ్నిష్టోమము మొదలగు కర్మముల వదలి వేదముల దూషించుచు వాయువు మొదలగు దేవతల నారాధించుడు. చక్రాంకనము ధరించి శైవమార్గము నిందించుచు ధర్మమార్గమునకు ప్రతికూలురై యుండుడు.

జ్ఞా భవత్ర్యబ్రాహ్మణాధమాః ॥ ఇత్యాదిశాపపరాహతత్వాదూర్ధ్వపుండ్ర విధౌ తిర్యక్పుండ్రనిషేధచ తమపఃకల్పిత వచనా న్యస్మరణీయానీతి సిద్ధం ॥ ఇతి ॥

రుద్రాక్షధారణవిధి
స్సమాప్తః.

---

మరియు మహాభారతము మొదలగువానియందు స్వకపోలకల్పితవచనములు చొప్పింపబడుచుండును. ఈ మొదలగు శాపములచే పరాభూతులగు వారు ఊర్ధ్వపుండ్రము నంగీకరింపలయాననుటయును, భస్మరుద్రాక్షములు ధరింపగూడదనుటయును కల్పించిన వాక్యములు స్మరింపదగినవి కానేరవు.

రుద్రాక్ష ధారణవిధి
ముగిసెను.



శైవప్రచారిణీ గ్రంథమాల— ౧౫

ధర్మసంగ్రహే,

# ఆహ్నిక కాండః

ద్వితీయ భాగః

ఇది

బ్ర. శ్రీ. మునిగొండ నాగలింగ శాస్త్రిగారిచే
రచింపఁబడి,

బ్ర. శ్రీ. విద్వాన్. మునిగొండ వీరేశలింగ శాస్త్రిగారిచే
ముద్రణాక్షర స్ఖాలిత్య రహితముగాఁ బరిశోధింపఁబడి,


బ్ర. శ్రీ. కోడిమేల రాజలింగారాధ్యుల వారిచే

శైవప్రచారిణీ ముద్రాక్షర శాలయందు

ముద్రింపఁ బడినది.

వరంగల్

౧౩౦౦

1928

వెల. 1—4—0

## రాజపోషకులు

బ్ర॥ శ్రీ॥ రా॥ శ్రీ ఇజ్జతాసార్ రాజా కంకుకూరి బాలసూర్య ప్రసాదరావు జమీందారుగారు. విశాఖపట్టణము.

## శాశ్వతాభిమానులు

బ్ర॥ శ్రీ॥ కామర్సు రాజయ్యగారి కొమారుఁడు వీరశాజుగారు. దువ్వ.
మ॥ రా॥ కొమరవెల్లి శాశయ్య గారు. వరంగల్.
మ॥ రా॥ భూపతి రత్నంగారు. వరంగల్
మ॥ రా॥ భూపతి రామన్న గారు. వరంగల్
మ॥ రా॥ నాగబండి కట్టమల్లయ్యగారు వరంగల్
మ॥ రా॥ కొండూరి వెంకటరాజుబ్రదర్సు వరంగల్
మ॥ రా॥ కుంచం నాగయ్యగారు వరంగల్
మ॥ రా॥ అప్పనిరామయ్యగారు వరంగల్
బ్ర॥ శ్రీ॥ ముధిగొండ బాలకోటిలింగం గారు మున్సబ్ హెడ్ క్లర్కు నరసరావుపేట

## శాశ్వతచందాదారులు

బ్ర॥ శ్రీ॥ పతిపండితారాధ్యుల మల్లయ్య అయ్యవార్లంగారు మట్టెవాడ.
బ్ర॥ ముదిగొండ రాజమాంబగారి మల్లయ్య అయ్యవార్లం గారు. వరంగల్
బ్ర॥ శ్రీ॥ శివదేవుని శ్రీశైలలింగారాధ్యులవారు వరంగల్
మ॥ రా॥ అల్వైదన్నగారి నారాయణ సింగుగారు. వరంగల్
మ॥ రా॥ పెద్ది వీరయ్యగారు, మట్టిముచ్చాల,
మ॥ రా॥ ములుగు కిష్టయ్యగారు సిద్దిపేట.
మ॥ రా॥ కొమరవెల్లి శివరాజంగారి అంతయ్య గారు "
మ॥ రా॥ భూపతి బుచ్చిరామయ్య గారు ముల్కనూరు.
మ॥ రా॥ చిటిమల్లి భద్రయ్యగారు వెన్నంపల్లి.
మ॥ రా॥ చిటిమల్లి నర్సయ్యగారు వెన్నంపల్లి.

# విషయసూచిక.

---:o:---

## ధర్మసంగ్రహే.

### ఆహ్నికకాండే - ద్వితీయభాగః

విషయము | పుట

శ్రీ



సమాప్తము.



# అథసంధ్యావిధిః.



శ్రు. అహరహస్సంధ్యాముపాసీతేతి తద్విధావహరహశ్శబ్దశ్రవణా
త్తదుపాసనం నిత్యమిత్యవగమ్యతే। అకరణే ప్రత్యవాయస్మర
ణాచ్చత న్నిత్యమిత్యే వావగమ్యతే। తదాహగోభిలః। సంధ్యాయేన
నవిజ్ఞాతా సంధ్యాయేనానుపాసితా। జీవమానోభవేచ్ఛూద్రో మృత
శ్శ్వాచాభిజాయతే। ఇతి। తథా విష్ణుపురాణేపి। ఉపతిష్ఠంతియేసం
ధ్యాంయేనపూర్వాంనపశ్చిమాం। వ్రజంతి తేదురాత్మాన స్తామిస్రంనర
కంనృప। ఇతి। ఏవం కూర్మపురాణేపి। యోన్యత్రకురుతేయత్నం ధ
ర్మకార్యేద్విజోత్తమః। విహాయసంధ్యాప్రణతిం సయాతినరకాయుత
మితి। శౌనకః। సంధ్యాతిక్రమణం యస్య సప్తరాత్రమవిచ్ఛిన్నం।
తన్మాత్రదోషయుక్తోవా పునస్సంస్కార మర్హతి। ఇతి తస్మాదస్యాఃనిత్య
త్వ మవిప్రతిపన్నం.

తదనుష్ఠానంచార్థజ్ఞానపూర్వకమేవ భవతి మహాఫలం।
అతఏవఛాందోగ్యే।యదేవవిద్యయాకరోతి శ్రద్ధయాతిదేవ వీర్యవత్తరం

---

సంధ్యావిధి.

సంధ్యోపాసనము విధించు వాక్యమునందు అహరహః = ప్రతి రోజు, అనుమాటల
యొక్క ఉనుటచే సంధ్యోపాసనము నిత్యమని తెలియుచున్నది ఇద్దానిని చేయకపోయిన
యెడల ప్రత్యవాయము కలుగునని స్మృతుల యందు గలదు గావున ఇది నిత్యమనియే చెప్ప
బడుచున్నది. అది యెట్లనిన సంధ్యనెరుంగని వాడును సంధ్యనుపాసింపని వాడును బ్ర
తికి యున్నప్పుడు శూద్రుండు గానుండి మృతినొందిన తరువాత కుక్కయై జన్మించునని
గోభిలుడు చెప్పెను. ప్రాతస్సంధ్యను సాయం సంధ్యనుపాసింపనివారు తామిస్రమను
నరకమును పొందుదురని విష్ణుపురాణమునందు గలదు, ద్విజుడు సంధ్యావందనము చేయక
ఇతర కార్యమున బ్రవర్తించునెడ పెక్కు నరకముల నొందునని కూర్మ పురాణమునందు గల
దు. ఏడురోజులు తెంపులేక సంధ్యావందనము విడుచునేని యట్టి వాడు ఉన్మాదరో
గియైనను వానికి తిరిగి ఉపనయనసంస్కారము చేయవలయునని శౌనకుడు చెప్పెను. కా
వున సంధ్యోపాసనము నిత్యకర్మమనుట నిర్వివాదము.

ఈ సంధ్యోపాసనమును అర్థజ్ఞానము గలిగి చేసినచో ఎక్కువఫలము గలుగును.

భవతి। విద్యా = సమ్యగర్థజ్ఞానం । శ్రద్ధా=ఆస్తిక్యబుద్ధిః॥ వీర్యవత్తరం= సమగ్రఫలంభవతీత్యర్థః ॥ నిరుక్తే ॥ అధీత్య వేదం నవిజానాతి యో౽ర్థం స్థాణురయం భారవాహః కిలాభూత్ । యో౽ర్థజ్ఞ ఇత్సకలం భద్రమశ్నుత ఇతి । అత ఏవ తేషాం పూజాదికమపినకార్యమిత్యాహ వ్యాసః । పాఠమాత్రరతాం స్తాంస్తు ద్విజాతీ నర్థవర్జితాన్ । పశూనివ నతాన్ప్రాజ్ఞో వాఙ్మాత్రేణాపినార్చయేదితి ॥ అతో౽ర్థజ్ఞానమావశ్యకమితి సిద్ధం । అతఏవ । నవేదపాఠమాత్రేణ సంతుష్టోయోభవే ద్ద్విజః పాఠమాత్రావసాయీతు పంకే గౌరివ సీదతీతి వేదార్థాపరిజ్ఞానే దోషస్స్మృతః ।

తథాచ । మంత్రార్థపరిజ్ఞానపూర్వకోపదేశసిద్ధ్యర్థముపనేతుర్విద్వత్తామాహ భగవానాపస్తంబమునీంద్రస్సామయాచారికేషు । తమసోవా ఏష తమః ప్రవిశతి యమవిద్వానుపనయతే ॥ యశ్చావిద్వానితిహి బ్రాహ్మణమితి ॥ తత్రవృత్తికారః ॥ విద్వానేవోపనేతాభిగమ్యత ఇతి ॥ విధాతుమవిదుషోనిందామాహ తమసోవేతి ॥ య

కావుననే అర్థజ్ఞానము ఆస్తిక్యబుద్ధి గలిగి చేసినచో కర్మము సంపూర్ణఫలము నొసగునని ఛాందోగ్యమున గలదు.

ఎవ్వడు వేదము చదివి దానియర్థము నెఱుఁగడో వాడు బరువు మోయు మొద్దుతో సమానుండగును. అర్థము నెఱిగినవాడు సకలమగు శ్రేయము నను పొందునని నిరుక్తమున గలదు. కావుననే అర్థము దెలియక వేదము చదువుచుండువారిని గౌరవింపవలదని వ్యాసమహర్షి చెప్పెను. కావున నర్థజ్ఞాన మావశ్యకమని యేర్పడినది. దాన నే వేదము చదివి నంతమాత్రమున తృప్తి నొందినవాడు బురదలోబడిన యెద్దువోలె దుఃఖమొందునని దోషము చెప్పబడియెను.

ఇటుల అర్థజ్ఞానముతో గూడిన మంత్రోపదేశము సిద్ధించుటకై యుపనయనము చేయువాడు విద్వాంసుడుగా నుండవలయునని ఆపస్తంబుడు చెప్పియుండెను. అదియెట్లనిన ఎవ్వానికి నపండితుడు ఉపనయనము గావించునో వాడు చీకటినుండి చీకటియందే ప్రవేశించునని బ్రాహ్మణమున గలదు. చీకటిలోనుండి చీకటిలోనే ప్రవేశించినవాడు తెలివి నెఱుఁగనటుల మూఢునివల్ల నుపయనము పొందినవాడు నేమియు నెఱుఁగ నేరడుగాన పండితునివల్లనే మంత్రోపదేశమును పొందఁగలయునని వృత్తికారుడు వచించెను.

థాకశ్చిత్తమసన్నకాశాత్తమ ఏవ ప్రవిష్టః కించిన్న జానాతి ॥ ఏవమేషః యమవిద్వానుపనయతే ॥ తథాఽసశ్చావిద్వానుపనయతే ॥ ఇత్యాపేత్యతే ॥ యశ్చస్వయమవిద్వానుపనయతే ॥ సోఽపితమస ఏవ తమః ప్రవిశతీతి తస్మాదర్థజ్ఞానం నిత్యమితి హృదయః॥

నను సంధ్యావందనం కథంభూతేన కర్తవ్యమిత్యపేక్షాచే దుచ్యతే । యజ్ఞోపవీతీ నిర్ణోదక సంధ్యాముపాసీతే త్యాశ్వలాయన సూత్రేదర్శనాత్ యజ్ఞోపవీతినా కృతస్నానేన మార్జనాదికం కుర్వతా ప్రదక్షిణం సంధ్యావందనం కర్తవ్యం ॥ తదుక్తం భృగుణా ॥ సదోపవీతినా భావ్యం సదాబద్ధశిఖేనచ । విశిఖోనుపవీతీచ యత్కరోతి నతత్కృతమితి ।

## సంధ్యా కాలః.

తత్ర దక్షః॥ అహోరాత్రస్య యస్సంధి స్సూర్యనక్షత్రవర్జితః । సాతు సంధ్యా సమాఖ్యాతా మునిభిస్తత్త్వదర్శిభిరితి ॥ పితామహః నక్షత్రజ్యోతిరారభ్య సూర్యస్యోదయ దర్శనాత్ । ప్రాతస్సంధ్యే

దీనింబట్టి అర్థజ్ఞానము ముఖ్యముగా నుండవలయునని యేర్పడినది

ప్ర. సంధ్యావందనము నెటువంటివాడై చేయవలయును?

ఉ. యజ్ఞోపవీతము ధరించి ఉదకము దగ్గరనయుంచుకొని సంధ్యనుపాసింపవలయునని యాశ్వలాయన సూత్రమునకలదు గాన స్నానముచేసి యజ్ఞోపవీతముధరించి మార్జనాదికము నాచరించుచు ప్రదక్షిణము సంధ్యావందనము నాచరింపవలయు. జందెము నుపవీతముగా ధరించి సిగముడివైచుకొని కర్మము నాచరింపవలయును. జుట్టుముడివైచుకొనకయు యజ్ఞోపవీతము లేకయు చేయుకర్మము నిష్ఫలమగునని భృగుమహర్షి చెప్పెను.

## సంధ్యా కాలము.

రేయింబవళ్ల యొక్క సంధి అనగా సూర్యుడు నక్షత్రములు లేని కాలము సంధ్యాకాలమని దక్షుడు వచించెను. చుక్కలవెల్గు తగ్గునది మొదలు సూర్యుడు ఉదయించువరకు ప్రాతస్సంధ్యయని పితామహుడు చెప్పెను. రాత్రిచివర జామయొక్క కొనయున్న రెండుగడియలు సంధ్యాకాలమని దక్షుడు చెప్పెను. చుక్కలు వెలుగుచున్న కాలము ఉత్తమమగు సంధ్యాకాలమనియు, చుక్కలవెల్తురు లేనిది మధ్యమమనియు సూర్యుం డుదయించినది అధమకాలమనియు వ్యాసుడు నిర్ణయించెను.

ఉదితాః ప్రాప్తుశ్చ్యుత మోముని సత్తమా ఇతి ॥ తత్రనిర్ణయమాహ ద
క్షః ॥ రాత్ర్యంతయామ నాడీద్వే సంధ్యాదిః కాల ఉచ్యతే । దర్శనా
ద్రవిరేఖాయాస్తదంతో మునిభిస్స్మృత ఇతి ॥ వ్యాసోపి ॥ ఉత్తమాతు
సనక్షత్రా మధ్యమాలుప్తతారకా । అధమా సూర్యసహితా ప్రాతస్సం
ధ్యా త్రిధామతా ॥ ఇతి. తథా ॥ యస్సంధ్యాం కాలతః ప్రాప్తా మాల
స్యాదతివర్తతే । సూర్యహత్యామవాప్నోతి ఉలూకత్వమియాత్తతః ।
యాసంధ్యాసా జగత్సూతిర్మా యాతీతా తు నిష్కలా । ఐశ్వరీ కేవలాశ
క్తి స్తత్త్వత్రయసముద్భవా ॥ తస్మాత్సర్వ ప్రయత్నేన సంధ్యోపాసన
మాచరేత్ ॥ ఉపాసితో భవేత్తేన శివో యోగతనుః పర ఇతి ॥ గాలవః ॥
కాలేతు వందితా సంధ్యా స్వర్గ మోక్షప్రదాయినీ । అకాలే వందితా సం
ధ్యా పాచర ధ్యావధూరివ ఇతి ॥ ఛందోగశ్రుతిరపి ॥ బ్రహ్మవాదినో వద
న్తి కస్మాద్బ్రాహ్మణస్సాయమాసీన స్సంధ్యాముపాస్తే కస్మాత్ప్రాతస్తి
ష్ఠన్ కశ్చ సంధ్యాయాః కాలః ॥ కించ సంధ్యాయా యత్సంధ్యాత్వం ॥ దేవా
శ్చాసురాశ్చాస్పర్ధంత । తే అసురా ఆదిత్యమభిద్రవన్ । స ఆదిత్యో

---

సంధ్యాకాలమున సంధ్యావందనము చేయనివాడు సూర్యహత్యాదోషముచే పొం
ది దానంతరని గుడ్లగూబయై పుట్టును. సంధ్యయనగా మాయకంటె అతీతమైనదియు త్రి
మూర్తులకు కారణమైనదియు నగు నీశ్వరశక్తియే యగును. కావున సర్వప్రయత్నముల
తో సంధ్యనుపాసింపవలయు. ఇట్లు సంధ్యనుపాసించువాడు యోగతనుండగు శివుని ను
పాసించినట్లే యగుననియు వేదవ్యాసమహర్షియే చెప్పియుండెను. యుక్తకాలమున సం
ధ్యావందనము చేయునెడ భోగమోక్షంబుల నొసగును. అకాలంబున చేయునెడ వ్యర్థ
మగునని గాలవుండు వచించెను. సంధ్యను గూర్చి ఛందోగశ్రుతియందు. బ్రాహ్మణుడు
సాయంకాలమున గూర్చుండి సంధ్యనుపాసింపనేల? ప్రాతఃకాలమున నిలుచుండిచే
యనేల? సంధ్యాకాలమెద్ది? అద్దానికి సంధ్యయను పేరెలవచ్చెను? అని ప్రశ్నచేసికొని
దేవతలు రాక్షసులును పరస్పరము ద్వేషము కలిగియుండిరి. దానలశేసి రాక్షసులు సూ
ర్యునిమీది కరుదెంచిరి. అప్పుడు సూర్యుడు భయపడి బ్రహ్మదేవుని కడ్డకేగను. అంత బ్ర
హ్మదేవుడాలోచించి యుక్తముగు సత్యమును బ్రహ్మమును ఓంకారమును త్రిపదయగు గా
యత్రిని రాక్షసబాధను తొలగించు సాధ్యముగా గనిపెట్టెను. కావున అహోరాత్రి
ములకు సంయోగకాలమునందు సంధ్యనుపాసింపవలయు. అదియు సంధ్యాకాలము.

విశేత్ । తస్యహ్యాపయః కూర్మస్కూపేణాతిష్ఠా స్త్రప్రజాపతిముపాధా
వత్ । తస్యాగ్రేణాంగళిరే లిప్తృషజముపశ్యత్ । ఋతంచసత్యంచ శ్రిష్ఠా
చోంకారంచ త్రిపదాంచ గాయత్రీం బ్రహ్మాణ మపశ్యత్తస్మా బ్రాహ్మ
హ్మణోఽహోరాత్రస్య సంయోగే సంధ్యాముపాస్తే స జ్యోతిషాదర్శ
నాత్ స సంధ్యాకాలః ॥ సా సంధ్యాయాస్సంధ్యాత్వం ॥ యస్సమా
సీనస్సంధ్యాముపాస్తే తయావీరస్థానం జయత్యథాయదిపః త్రయుక్తే
తావిప్రుషా వజ్రీభూత్వా అసురానపఘ్నంతీతి ॥ తైత్తిరీయకేపి॥ రక్షాం
సిహవా పురోనువాకే తపోగ్రమతిష్ఠంత । తాన్ప్రజాపతి ర్వరేణోపమం
త్రయత । తానివరమవృణీతాదిత్యోనోయోద్ధా ఇతి । తాన్ప్రజాపతి ర
బ్రవీ ద్యోధయధ్వమితి తస్మాదుత్తిష్ఠంతంహవా రక్షాగ్ం స్యాదిత్యం
యోధయంతి యావద స్తమన్వగా త్తావాతాని రక్షాగ్ం సీత్వాది
మందేహారుణేద్వీపే ప్రక్షిపంతి యత్ప్రదక్షిణా ప్రక్రమంతి । తేన స్థా
ప్మానమవధూన్వన్తి ॥ ఇతి ॥ అత్రహారీతః ॥ అదిత్యేన సహప్రాత ర్మం
దేహానామ రాక్షసాః । యుధ్యన్తివరదానేన బ్రహ్మణోవ్యక్త జన్మనః ॥

---

అహోరాత్రముల సంధియందు నుపాసింపబడుటనే అద్దానికి సంధ్యయని పేరువచ్చెను.
కూర్చుండి సంధ్యను పాసింపగా వీరస్థానమును జయించును. అప్పుడు బ్రాహ్మణుడు వి
డిచిన అర్ఘ్యజలము వజ్రమై రాక్షసుల జంపును అని కలదు. తైత్తిరీయమునయందు పూ
ర్వకాలమున రాక్షసులు ఘోరమగు తపము చేసిరి. అంత బ్రహ్మదేవుడు వారియొద్దకువ
చ్చి మీకేమి వరము వలయునో కోరుడనిరి. వారు వినివారు సూర్యునితో మేము యుద్ధ
ముచేయునట్లు వరము నిమ్మని కోరిరి అటులే యుద్ధము చేయుడని వారికి బ్రహ్మవర మొ
సంగెను. దానంజేసి సూర్యుడుదయించునప్పుడును అస్తమించునప్పుడును రాక్షసులు
సూర్యునితో యుద్ధముచేయుచుందురని యారంభించి అప్పుడు బ్రాహ్మణులు విడిచిన అ
ర్ఘ్య జలము రాక్షసులను మందేహారుణమను ద్వీపమున బడద్రోయును. తరువాత వి
ప్రులు చేసిన ప్రదక్షిణముచే రాక్షసవధ జనిత పాతకము తొలంగును. అనియున్నది. ఈ
సందర్భమునహారీతస్మృతియందు. మందేహులను రాక్షసులు బ్రహ్మయొక్క వరముచే
ప్రాతఃకాలమునసూర్యునితో యుద్ధమొనరించుచుందురు. అప్పుడు హరిదిసనకుడు శాం
తులగువారు గాయత్రితో మంత్రించి చల్లిన జలము లా రక్కసులను వధించును. ఇట్లు
బ్రాహ్మణులు అర్ఘ్యజలము విడువగా సూర్యుడు స్వకృత్యమును నెరవేర్చుచుండును.

ఉదకాంజలి నిక్షేపా గాయత్ర్యా చాభిమంత్రితాః । నిఘ్నంతి రాక్ష
సాన్ సర్వాన్ మందేహాఖ్యాన్ ద్విజేరితాః । తతః ప్రయాతి సవితా బ్రాహ్మణై
రభిరక్షితః । మరీచ్యాద్యైర్మహాభాగైః సనకాద్యైశ్చ యోగిభిః ॥ త
స్మాన్నలంఘయేత్సంధ్యాం సాయం ప్రాతస్సమాహితః । ఉల్లంఘయతి
యో మోహాత్ స యాతి నరకం ధ్రువమితి ॥ సంధ్యాత్రయమాహాత్రిః ।
సంధ్యాత్రయం తు కర్తవ్యం ద్విజేనాత్మవిదా సదేతి ॥

### సంధ్యాశబ్దార్థః.

అత్ర సంధ్యాశబ్దేన సంధ్యోపాస్యా పరమేశ్వరరూపా దేవ
తాభిధీయతే । తాముపాసీత — ధ్యాయీతేత్యనేన సాంధ్యకాలికపార
మేశ్వరోపాసనం విధీయతే । నన్విదమనుపపన్నం । శ్రుతౌ ఉద్యన్తమ
స్తం యన్తమాదిత్యమభిధ్యాయన్నిత్యాదిత్యస్యైవ తదాధ్యేయత్వా
మ్నానాదితి చెన్న ఉద్యన్తమిత్యాది శ్రుత్యా ఆదిత్యమండలాంతర్వర్తి
నః పరమేశ్వరస్యైవ ధ్యేయత్వావగమాత్ । తథాహి । సంధ్యాకర్మణః
గాయత్రీజపాంగత్వేన గాయత్ర్యాశ్చ పరమేశ్వరపరత్వాదాదిత్యధ్యా

---

కావున సంధ్యాకాలమున అర్ఘ్యమియ్యనివాడు నరకముల నొందునని కలదు. మూడు కా
లములయందు సంధ్యావందనము చేయవలయునని అత్రి వచించెను.

### సంధ్యాశబ్దార్థము.

సంధ్యను పాసింపవలయుననుచోట సంధ్యయనగా సంధికాలమున నుపాసింపద
గు పరమేశ్వరరూపమగు దేవత చెప్పబడుచున్నది. కావున సంధ్యనుపాసింపవలయున
నగా సంధ్యాకాలమున పరమేశ్వరునుపాసింపవలయునని తెలియుచున్నది.

ప్ర. ఇదియెట్లు? ఉదయించునప్పుడు నస్తమించునప్పుడును సూర్యుని ధ్యానింప
వలయునని శ్రుతియుండగా పరమేశ్వరుని ధ్యానింపవలయుననుట యుక్తముగునా?

ఉ. సూర్యుని ధ్యానింపవలయుననగా సూర్యునంతర్యామియగు పరమేశ్వరుని
ధ్యానింపవలయునని యర్థము. అదియేల? అనగా సంధ్యాకర్మము గాయత్రీజపమున
కంగము కావునను గాయత్రీమహామంత్రము పరమేశ్వరపరమైనది కావునను ఉద్యన్తమను
శ్రుతి ఆదిత్యుని పరముగా కన్పట్టుచున్నను ఆదిత్యునంతర్యామియగు పరమేశ్వరుని పర
మనియే గ్రహింపవలయును.

ప్ర. అట్లేల?

నపరతయా ప్రతీయమానాయా అపి స్తుతేః తదన్యస్యాపి పరమేశ్వర ధ్యానపరత్వమవగమ్యతే। అన్యథా ఏకేన మన్త్రేణైకేన పరమేశ్వరాదిత్యరూపదేవతాద్వయోపాసనస్య దురుపపాదయత్వాత్ ॥ న చ గాయత్ర్యాః పరమేశ్వరోపాసనాపరత్వమసిద్ధమితి వాచ్యం ॥ అనుపదమేవ తదర్థవిచారే నిర్ధార్యమాణత్వాత్ ॥ సంధ్యాకాలే దేవతాంతరస్యానుపాస్యత్వాచ్చ ॥ తథాహి ॥ శివధర్మే ॥ విహాయ త్ర్యంబకధ్యానముపాస్తే యోऽన్యదేవతాః । కృత్యాన్తరవిధాతా చ సంధ్యాయాం స వ్రజత్యధ ఇతి ॥ అత ఏవ ॥ స్కాందే ॥ మలయాచలఖండే ॥ న ప్రదోషే హరిం పశ్యేద్యది పశ్యేత్ప్రమాదతః । హన్త్యాదిత్యస్య పత్న్యస్తు హ్యాయుః ప్రజ్ఞా యశో బలమితి ॥ అత్ర ప్రదోషపదం సంధ్యాకాలసామాన్యస్య హరిదర్శనం దేవతాంతరోపాసనస్య చ ఉపలక్షణం ॥

యద్యప్యత్ర వసిష్ఠేన ॥ యా సంధ్యా సా జగత్సూతిర్మాయాతీతా హి నిష్కలా । ఐశ్వరీ కేవలా శక్తిస్తత్త్వత్రయసముద్భవా ॥ ధ్యాత్వార్కమండలగతాం సావిత్రీం వై జపేద్ద్విజ ఇత్యుక్త్వా అర్కబింబాభిన్నత్వాది

---

ఉ. అటులగానిచో, ఒక్కడు ఏక కాలమునందు పరమేశ్వరుడు ఆదిత్యుడు నను నిద్దరు దేవతల నుపాసింప శక్యము గాదు గాన నా విధివచనము వ్యర్థమగును. దానం జేసి సూర్యున కంతర్యామి యగు నీశ్వరునే ధ్యానింపవలయునని గ్రహింపక తప్పదు.

ప్ర. గాయత్రీమహామంత్రము పరమేశ్వర పరమనుట యెటుల?

ఉ. ఆయంశము మంత్రార్థవిచారమున నిర్ణయము కాగలదు. ఇదిగాక సంధ్యాకాలమున వేరొక దేవతను తలపగూడదు గాన సంధ్యాపదమునకు నర్థము పరమేశ్వరుడనియే గ్రహింపవలయు. ఇదియెట్లనిన సంధ్యాకాలమున శివోపాసనను విడిచిపెట్టి యితరదేవతలను పూజించువాడును వేరు పనులు చేయువాడును అధోగతిని పొందునని శివధర్మమున నున్నది. మరియు ప్రదోషకాలమున విష్ణుని దర్శింపగూడదు. అటుల దర్శించునెడ ఆయువు బుద్ధి కీర్తి బలములను హరించునని స్కాందమున మలయాచలఖండమున నున్నది ఇచట ప్రదోషపదము సంధ్యాకాల సామాన్యమునకును హరిదర్శనపదము దేవతాంతరోపాసనమునకు నుపలక్షణమని గ్రహింపవలయు.

ప్ర. సంధ్యయనంగా జగములకు కారణభూతురాలును మాయకన్న నతీతమైనదియు బ్రహ్మవిష్ణురుద్రులకు జననియునగు నీశ్వరశక్తియేయగు. సూర్యమండలము ననున్న

త్యాద్యబ్దవాచ్యా పరబ్రహ్మరూపా చిచ్ఛక్తిరేవ సంధ్యాదేవతేత్యన్యై
రుక్తం। తథాపి। తస్యాశ్శక్తేః పరమేశ్వర నిత్యానపాయినీత్వేన తా
దృశశక్త్యుపాసనేనాపి శక్త్యుపాసనవ్యాభిన్నత్వేన పరబ్రహ్మరూపేత్యు
క్త్యాతస్యాః పరమేశ్వరరూపత్వాత్ వధానేనచ సిద్ధం నస్సమీహితం।
నను, నసంధ్యాపదం పరమేశ్వర రూపదేవతాపరం। పరంతు
కర్మపరమేవ। సంధ్యాస్నానమిత్యాదినా పరాశరేణ తత్పరత్వేన
ప్రస్మృతత్వాదితి చేన్న విధివాక్యే సంధ్యాపదస్య ముఖ్యవృత్త్యా పరమే
శ్వరపరత్వేపి తదితరత్ర సంధ్యాపదస్య లక్షణయా సంధ్యాకాలోపాస్య
పరమేశ్వరోపాసనాంగ మార్జనాది క్రియాపరత్వస్య నిర్బాధత్వాత్ ।
అన్యథా సంధ్యాముపాసీతేత్యత్ర కర్మణ ఉపాస్యత్వాసంభవేనాన
న్వయాపత్తేః। యత్తు. సంధ్యాపదస్య ముఖ్యవృత్త్యా చిచ్ఛక్తిపరత్వేపి
సంధౌ భవా సంధ్యేతి వ్యుత్పత్త్యా క్రియాపరత్వస్యాపి సంభవాత్
తాం క్రియామాదిత్యాఖ్యాం చిచ్ఛక్తిరూపాం దేవతాం ధ్యాయన్ను
పాసీతేతి తదసారం। ఉభయపరత్వే వాక్యభేదాపత్తేః॥ ఉపాసీతేతి

---

ఉపాసించు త్రైవర్ణికులు ధ్యానము చేయుచు జపము చేయవలయునని వసిష్ఠుడు చెప్పెను గా
న ఆత్మబింబమున నభివ్యక్తి నొందినదియు ఆదిత్య శబ్దముచే చెప్పబడునదియు పరబ్రహ్మ
రూపమైనదియునగు చిచ్ఛక్తి యే సంధ్యాదేవతయని కొందరు చెప్పుచున్నారు. అదియే
ల యుక్తము గాదు?

ఉ. ఈ యర్థమంత బాధకమైనది కానేరదు. ఏలనిన ఆచిచ్ఛక్తి ఎప్పుడును ప
రమేశ్వరుని వదలియుండునది కాదు. దానంజేసి యట్టిశక్తి నుపాసించినను నా శక్తితో
గూడియున్న పరమేశ్వరునుపాసనము లోపించుటలేదు. మఱియు నాశక్తి పరబ్రహ్మరూ
పమని చెప్పియున్నారు. దానంజేసి యాశక్తి పరమేశ్వరరూపమైనదే యని యేర్పడు
చున్నది. కావున నీయర్థము సార్థకమేయగును.

ప్ర. సంధ్యాపదము పరమేశ్వరరూపమగు దేవతను చెప్పునదిగాక ఇకకర్మమును
చెప్పునదియే యగును. ఏలనిన సంధ్య స్నానము మొదలుగా నాయకర్మములను ప్రతిదిన
ము చేయవలయునని పరాశరుడు చెప్పెను గాన సంధ్యయనగా నిత్యకర్మము లాంటిలో
నిదియొకకర్మమని తెలియుచున్నది గదా?

ఉ. సంధ్య నుపాసింపవలయునను విధివాక్యమునందు సంధ్యాపదము పరమేశ్వ

విధివాక్యే। ఉపాసనా ప్రాధాన్యస్య వివక్షితత్వేన ప్రకృతే ధ్యాయన్నర్ఘ్య- ర్ద్యాదితి కర్మప్రాధాన్యస్యాంగీకారేణ విరోధాచ్చ। అత ఏవ। దేశక్షోభే జలాప్రాప్తే మార్జనాదేరసంభవే। సంధ్యాగత సహస్రాంశుం మంత్రైః కుర్యాదుపస్థితిమితి వదతా వేదవ్యాసేన దేశక్షోభాదావాదిత్యోపస్థాన మాత్రమపి కర్తవ్యమిత్యుక్తం॥ కర్మాదేః ప్రాధాన్యే తు నైతత్సంగచ్ఛేత॥

---

పరమైనను పరాశర వాక్యములోని సంధ్యావందనము లక్షణచే పరమేశ్వరో పాసనకు నంగములు మార్జనాదిక్రియా పరమని గ్రహింపనగును. అట్లుగానిచో సంధ్య నుపాసింప వలయుననను విధివాక్యమున సంధ్యాకర్మము నుపాసింప వలయునని యర్థమగు. కర్మము పాసింప దగినది గాదు గాన నాయర్థము విరుద్ధమగును.

ప్ర॥ సంధ్యా పదము ముఖ్యవృత్తిచే చిచ్ఛక్తి పరమైనను సంధి కాలమునఁ జేయవలగు కర్మము సంధ్యాపదముచే వాచ్యమగును గాన నట్టి సంధ్యాకర్మమును చిచ్ఛక్తి రూపమగు దేవతను ధ్యానము చేయుచు చేయవలయునని యర్థము కొందఱు చెప్పచున్నారు. ఇది యుక్తముగాదా?

ఉ॥ యుక్తముగాదు. సంధ్యాపదమునకే కర్మపరత్వము- దేవతా పరత్వమునను రెండు అర్థములఁ జెప్పిన వాక్యభేదము ప్రసక్తించును

ఇదిగాక- దేవతను ధ్యానము చేయుచు కర్మమును చేయవలయుననగా కర్మమునకు ప్రాధాన్యము ప్రాప్తించును. ఈయర్థము సంధ్యాదేవత నుపాసింప వలయునని యుపాసనకు ప్రాధాన్యమును జెప్పువిధి వాక్యమునకు విరుద్ధమైనది. ఉపాసన ప్రధానమైనది గావుననే- దేశక్షోభము కలిగినప్పుడు- జలము దొరకనప్పుడును సూర్యోపస్థానము మాత్రము మంత్రములచేఁ జేయవలయునని వేదవ్యాసుఁడు చెప్పినది యుక్తమగుచున్నది. కర్మమే ప్రధానమై యుండు నెడ జలముతో మార్జనాదులు చేయక తప్ప నేరదు గాన వ్యాసవచనము సంగతము గాక పోవును.

దీనిం బట్టి యుపాసనమే ప్రధానమనియు- మార్జనాదు లంగము లనియు స్పష్టమగుచున్నది. కొందరైనను అర్ఘ్యప్రదానము- సంధ్యా ధ్యానము- గాయత్రీ జపము- ఉపస్థానమునను నవి ప్రధానము లని చెప్పుచున్నారు.

ప్ర॥ సంధ్యాకాలమున పరమేశ్వరు నుపాసింప వలయునని చెప్పచున్నారు ఇది యెట్లు పొసఁగును? కాలభేదమును బట్టి దేవత భేదించునని వ్యాసుడు చెప్పుచున్నాఁడు

ఏవంచాత్ర ఉపాసన మేవప్రధానం॥ అన్యత్సర్వం మార్జనాద్యం గం భవతి॥ పరేతు॥ అర్ఘ్యదానం,సంధ్యాధ్యానం, గాయత్రీజపః ఉపస్థానంచ ప్రధానమితి వదన్తి॥ యద్యప్యత్ర కాల దేవతా యా నామాది ది భేద మాహవ్యాసః॥ గాయత్రీ నామపూర్వాహ్నే సావిత్రీ మధ్యమేదినే। సరస్వతీ చసాయాహ్నే సైవసంధ్యాత్రిషు స్మృతా॥ ప్రతిగ్రహాదన్న దోషాత్పాత కాదుప పాతకాత్। గాయత్రీ ప్రోచ్యతే తస్మాద్గాయంతం త్రాయతే యతః। సవితృ ద్యోతనాచ్చైవసావిత్రీ పరికీర్తితా। జగతః ప్రసవితీవా వాగ్రూపత్వాత్సర స్వతీ గాయత్రీచ భవేద్రక్తా సావిత్రీ శుక్లవర్ణికా। సరస్వతీ భవేత్కృష్ణా ఉపాస్యావర్ణ భేదత ఇతి॥ తథాప్యత్రైవ సైవసంధ్యా త్రిషుస్మృతేత్యుక్త్యా సంధ్యాకాలోపాస్య పరమేశ్వర రూప దేవతాయా ఏవ నామత్రి రూపాన్త్యాకాలత్రయేపి పరమేశ్వరోపాసనమచ్ఛిన్న మేవేతి యుక్తంచ చేతత్॥

సంధ్యాకాలాతి క్రమణ ప్రాయశ్చిత్తం.

సంధ్యాకాలేత్వతి క్రాన్తే స్నాత్వా చమ్య యథావిధి। జపేద్దశ శతాం దేవీం తతస్సంధ్యాం సమాచరేత్॥ జమదగ్నిః॥ ఏకాహం స

అది యెట్లనిన- ప్రాతః కాలమున గాయత్రియు-మధ్యాహ్న కాలమున సావిత్రియు- సాయం కాలమున సరస్వతియు నుపాసింప దగినవారు. ప్రతిగ్రహము- అన్నదోషము మొదలగు పాతకముల నుండి రక్షించునది గాన గాయత్రి యనియు, సూర్యునందు ప్రకాశించునది గాన సావిత్రి యనియు- వాగ్రూపమైనది గాన సరస్వతి యనియు జెప్పబడును. గాయత్రి యెఱ్ఱనివన్నె గలదియు- సావిత్రి తెల్లని వన్నె గలదియు, సరస్వతి నల్లనివన్నె గలదియునని యున్నది గదా?

ఉ॥ అయినను. ఆసంధ్యయే మూడు కాలముల యందు నుపాసింప దగినదని యటనే కలదు గాన సంధ్యాకాలమున నుపాసింప దగిన పరమేశ్వరరూపయగు దేవతకే మూడుపేర్లు కలవని తెలియు చున్నది గాన మూడు కాలములయందు. పరమేశ్వరుడే ఉపాసింపదగిన వాడనుటకు బాధకములేదు.

కాలాతి క్రమణమునందు ప్రాయశ్చిత్తము.

సంధ్యావందనమునకు కాలము అతిక్రమించినచో స్నానాచమనంబులు చేసి వేయిమార్లు గాయత్రిని జపించి సంధ్యావందనము చేయవలయును. ఒక దినము సం

మేతి క్రమ్యా ప్రమాదాద కృతాయది। అహ్నో రాత్రోపి త్రిర్భూత్వా గాయత్ర్యాశ్చాయుతం జపేదితి॥ అత్ర కేచిత్। దేవాగ్ని ద్విజ విద్యార్థినాం కార్యేషు పాతి సంస్థితే: సంధ్యాహీనేనదోషోస్తి యస్మాత్తత్కర్మ సాధకాఇతి స్మరణాత్। యథా కాలాతిక్రమణే విద్యాదేవ పూజాది సక్తానాం నదోషఇతి వదన్తి॥ వస్తుతస్తు స్కాందే॥ శంకర సంహితాయాం॥ మహాదేవము పాసీత సంధ్యాయాం ప్రయత్నో ద్విజః। యది కార్యాంతరాసక్తః। ప్రత్యవాయ మవాప్నుయాదితి తదా కార్యాంతరస్య నిషిద్ధత్వేన తత్కరణే ప్రత్యవైత్యేవేత్యేవష్టవ్యం॥ అన్యోన్య పాసనాదీనామీశ్వరోపాసనా రూపత్వేన నిత్య కర్మ నుష్ఠానస్య బాధోపి॥

సంధ్యావందనస్య గౌణ కాల విచారః.

నప్రాతర్న ప్రదోషేచ సంధ్యాకాలోతి పద్యతే। ముఖ్య కల్పే నుకల్పశ్చ సర్వస్మి న్కర్మణ స్మృత ఇతి వృద్ధమను వచనాన్మధ్య మకాలో గౌణకాల ఇతిజ్ఞేయః॥ సచ నిరూపితః స్మృత్యంతరే। యథా। చతస్రోఘటి కాస్సాయం గౌణకాలస్తు మధ్యమః। ప్రాతః కాలేప్యేవమేవ సంధ్యాకాల ఉదీరిత ఇతి షడ్ ఘటికాత్మకః కాలః ప్రాప్తః కాలశబ్ద

---

ధ్యావందనము చేయనియెడ నుపవాసముండి పదివేలమార్లు గాయత్రిని జపింప వలయును. ఇంక కొందఱు- దేవకార్యము- అగ్నికార్యము. విప్రకార్యము- విద్యాభ్యాసము సంభవించినప్పుడు సంధ్యా వందనమునకు కాలమతిక్రమించినను దోషము లేదని చెప్పుచున్నారు. ఈసందర్భమున శంకరసంహితయందు- సంధ్యా కాలమున ద్విజుడు పరమేశ్వరునే యుపాసింప వలయును. అట్లుగాక- ఇతర కార్యములు ప్రవర్తించిన నెడ ప్రత్యవాయ మొందును. అని యున్నది. కావున కార్యాంతరము చేయగూడదు అన్న్యోపాసనాదులీశ్వరోపాసనా రూపములే గాన నిత్యకర్మానుష్ఠానమునకు బాధకములేదు.

గౌణకాల విచారము.

ప్రాతః కాలమునను- ప్రదోష కాలమునను సరియగు సంధ్యా కాలము లభింపకున్నను. కావున సర్వకర్మముల యందును ముఖ్యకల్పము-అనుకల్పము నంగీకరింపఁ బడుచున్నవి. అని వృద్ధమనువు చెప్పినందున మధ్య కాలము- గౌణ కాలమని తెలిసికొన వలయును. ఆగౌణకాల మెద్దియన ఆఱుగడియలు కాలపరిమాణముగల ప్రాతః కాలమునను- సా

వాచ్యః। ముహూర్త త్రయం ప్రాతరితి స్మరణాత్। ప్రదోష కాలో ప్యే కాహానేవ। త్రిముహూర్తం ప్రదోష స్స్యాద్భానావస్తంగతేసతీతి స్మృతేః। తత్రచత స్రోఘటికా గౌణమధ్య కాల ఇత్యర్థః। గోభిలః। ముఖ్యకాలే యథావశ్యం కర్మకర్తుం నశక్యతే। గౌణకాలేపి కర్తవ్యం గౌణేప్యత్రేదృశో మతః। ఈదృశః ముఖ్యఏవేతి సమ్మతః।

## సంధ్యాతిక్రమణే ప్రాయశ్చిత్త ద్వైవిధ్యం

సంధ్యాయాం ద్వౌకాలౌ నిర్ణీతౌ గౌణ ముఖ్య భేదాత్। ముఖ్యకాలే తిక్రాన్తే గౌణకాలే ప్రాప్తంచే దనుష్ఠానం వక్ష్యమాణప్రాయశ్చిత్త పూర్వకం కార్యం। తచ్చప్రాయశ్చిత్తం ద్వివిధం। గాయత్ర్యార్ఘ్య ప్రదాన రూపమేకం। ప్రాణాయామాత్మక మపరం। తత్రప్రథమే మహావ్యాసః। ప్రణవ వ్యాహృతియుతాం గాయత్రీం శిరసాసహ। ఉచ్చార్య దత్వార్ఘ్యం మూదా సంధ్యాకర్మ సమాచరేత్। ఇతి। ఇదం ప్రాయశ్చిత్తం సంధ్యాత్రయేపి సమానం। తదానీమేకం ప్రాణా యామం కృత్వా ముఖ్యకాలాతి క్రమణదోష పరిహారార్థ మర్ఘ్య ప్రక్షేపణాత్మకం ప్రాయశ్చిత్తం కరిష్యఇతి సంకల్ప్య ప్రాయశ్చిత్తార్ఘ్యం దత్వా త తస్సంధ్యాము పాసీత। అత్రద్వయోః ప్రాయశ్చిత్తయోః స్సముచ్చయో నతువికల్పః। ఏకస్మిన్దోషే శ్రూయమాణాని ప్రాయశ్చిత్తాని సముచ్చీయే రన్నితి శ్రౌతే దర్శనాత్।

---

యం కాలమువను నాల్గు గడియలపేరు గౌణ కాలమనుచుని స్మృత్యంతరము నందు గలదు. ముఖ్యకాలమున కర్మముచేయ శక్యము కానప్పుడు గౌణకాలమునం జేయువచ్చును. గౌణ కాలమునం జేసినను ముఖ్యకాలమున జేసిన దానితో తుల్యమగు ఫలమే కలుగును.

### సంధ్యాతిక్రమణము నందు ప్రాయశ్చిత్త విశేషము.

సంధ్యా వందనమునకు ముఖ్యమని, గౌణమని రెండు కాల ములు నిర్ణయింపఁబడియెను. ముఖ్య కాల మతిక్రమించి గౌణ కాలమునఁ జేయవలసి వచ్చినప్పుడు చెప్పబోవు ప్రాయశ్చిత్తమును ముందు గాఁజేసి చేయవలయు. ఆప్రాయశ్చిత్తంబును అర్ఘ్య ప్రదానరూపము. ప్రాణాయామరూపమును రెండు విధములు. అందు— ప్రణవయుక్తో మ—

### సంధ్యాత్రయస్య దివాభాగే అననుష్ఠానే కర్తవ్యతా.

ననుదివాభాగే దైవాన్మానుషాద్వా సంధ్యాత్రయస్యాననుష్ఠాన సంభవే కిం కర్తవ్యమితిచేదుచ్యతే। ఉక్తప్రాయశ్చిత్తపూర్వకం క్రమేణ శర్వర్యాః ప్రథమయామే కుర్యాత్। నతువ్యుత్క్రమేణ। తత్ర గ్రన్థోపకారే। దివోదితాని కర్మాణి ప్రమాదాదకృతానివై శర్వర్యాః ప్రథమేయామే తాని కుర్యాద్యథాక్రమమితి। అత్ర కేచిత్। స్వకాలే బలవత్యపీతి న్యాయేన సాయంసంధ్యామాదౌ కృత్వాదివాతిపన్నాని కర్మాణి కుర్యాదితి వదన్తి। అపరేపునః క్రమేణేతి వదన్తి। తదుక్తం। కాలాతీతేషు పూర్వేషు ప్రాప్తవత్స్వుత్తరేషుచ। కాలాతీతాని కృత్వైవ విదధ్యాదుత్తరాణితు। ఇతి। అత్రకః పక్షస్సమాశ్రయణీయ ఇతిచేదుచ్యతే। సాయంకాలేపి సంధ్యావందనం విహితం। తథాచస్వకాలేబలవత్యపీతిన్యాయేన తదేవాతిపన్నానుష్ఠానాత్పూర్వం కర్తు

---

వ్యాహృతుల తోడను- శిరముతోడను గూడిన గాయత్రీమంత్రము నుచ్చరించి, యర్ఘ్యము నిడిచి సంధ్యావందనము నాచరింపవలయునని మొదట దానిని వ్యాసమహర్షి తెలిపెను. ఈ ప్రాయశ్చిత్తము మూడు కాలముల యందును సమానముగనె చేయవలయు. అప్పుడొకమాఱు ప్రాణాయామముచేసి- ముఖ్యకాలమతిక్రమించి నందువలన గలుగు దోషము పోవుటకై అర్ఘ్యదానరూపమగు ప్రాయశ్చిత్తమును చేయుదునని సంకల్పము చేసి ప్రాయశ్చిత్తార్ఘ్యమునిచ్చి తరువాత సంధ్యావందనము చేయవలయు. అర్ఘ్యప్రదానము ప్రాణాయామమునను రెండిటిని చేయవలయుగాని యందొక్కటి చేసినచాలదు

అది యెట్లనిన: ఒక్కదోషమునకై పెక్కుప్రాయశ్చిత్తములు చెప్పి యున్నయెడ నన్నిటిని చేయవలయునని శ్రుతిమున గలదు గాన దానిబట్టియిట్లు నిర్ణయింపఁబడు చున్నది.

దైవికము వల్లగాని- మానుష యత్నము వల్లగాని పగలు ముమ్మారును సంధ్యావందనము చేయకున్నయెడ నేమిచేయవలయు ననిన, వినుము.

చెప్పిన ప్రాయశ్చిత్తమును ముందుగాఁజేసి ప్రాతస్సంధ్యాదులను క్రమముగా రాత్రి ప్రథమ యామమునను చేయవలయు. ఈ యంశమున లోకోపకారమను గ్రంథమునందు- పగలు చేయవలసిన కర్మములను ప్రమాదమువలన చేయనియెడల రాత్రి ప్రథమయామమునందు వానిని క్రమముగాఁ జేయవలయునని యున్నది.

ఈ సందర్భమున- స్వకాలే బలవత్యపి యను న్యాయమును బట్టి మొదట సాయం

ముచితం । తదనంతరం మాధ్యాహ్నికమనుష్ఠానం । యదా పునస్సాయం సంధ్యా కాలోఽప్యతిక్రాంతః స్యాత్ తదానీం యథాక్రమమనుష్ఠానాభావే అతిక్రాంతాః శేషత్వాత్ । కేచిత్తు — మధ్యాహ్నసంధ్యా రాత్రౌ చేత్ ప్రమాదాత్ క్రియతే తదా అగ్నిసమీపస్థానే జపేత్ సూక్తం సౌరం వైశ్వానరీయకమిత్యాహుః । తన్న — రాత్రౌ ప్రథమయామేఽప్యతిక్రాంతే కాలాతిరిక్తే చేత్ । అనుష్ఠానలోప ఏవ గతిః । ఉక్తప్రాయశ్చిత్తమేవ కుర్యాత్ ॥

సంధ్యాది నిత్యకర్మణా మేకదినాతిక్రమణే ప్రాయశ్చిత్తం.

సంధ్యాది నిత్యకర్మణా మనుష్ఠానాభావేన ఏకస్మిన్నహోరాత్రే గతే పరే ద్యురుపోష్య షోడశప్రాణాయామపూర్వకమష్టో

---

సాయంత్రమే అనుష్ఠించి తరువాతనే పదటికృత్యముల దీర్చుకొనవలయునని కొందఱు చెప్పుదురు. మఱికొందఱైతే:నో- పూర్వకర్మములు కాలాతిక్రమణము నొందినను- తరువాతికర్మములు ప్రారంభించు మున్నప్పను పూర్వకృత్యముల నేయుంగాఁ జేసి తరువాతనే తక్కినవి నాఁచేప్ప కొనవలయును వచనములు బట్టి క్రమముగ నేచేయవలయునని చెప్పుదురు.

ప్ర॥ ఇందేది యుక్తము?

ఉ॥ మొదట సాయంకాలమునందే సంధ్యావందనము విధింపబడి యున్నది. అప్పటికి సాయం సంధ్యాకాలమతిక్రమింపకున్నయెడ- స్వకాలే బలవత్త్వాపి అనువ్యాఖ్యమునఁబట్టి ముందుగ సాయం సంధ్యా వందనమును చేసి తరువాతను పదటి కృత్యములఁ దీర్చుకొనవలయు. అట్లుగాక నప్పుడు ప్రాతస్సంధ్యాదులను క్రమముగాఁ జేయునెడ సాయం సంధ్యకును కాలాతిక్రమణ దోషము సంభవించును గదా?

ఇంక- నప్పటికి సాయం సంధ్యా కాలంబును నతిక్రమించి యున్నయెడ అన్నియు కాలాతిక్రమణమును పొందినవి గాన ప్రాతస్సంధ్యాదులను క్రమముగనే చేయవలయును॥ ప్రమాదవశమునను మాధ్యాహ్నిక సంధ్య రాత్రియందుచేయవలసి వచ్చెనేని సౌరసూక్తమును చెప్పవలసి వచ్చును వైశ్వానర సూక్తమును చెప్పవలయును.

ప్ర॥ రాత్రిప్రథమ యామంబును నతిక్రమించునెడ నేమిచేయవలయును?

ఉ॥ పైనవాక్యమందు చెప్పిన ప్రాయశ్చిత్తమును మనసునందుంచుకొనవలయును॥

ప్ర॥ సంధ్యాది నిత్యకర్మముల కొకదినము కాలాతిక్రమణము గలిగిన నేమి ప్రాయశ్చిత్తము?

ఉ॥ సంధ్యాది నిత్యకర్మములు చేయవలయునుగాక యొకదినము గడచినయెడ మఱునాడు ఉపవాసముండి పదునాఱు ప్రాణాయామములు చేసి వేయినెనిమిది మార్లు గాయ

త్తర సహస్రగాయత్రీజపం కుర్యాత్॥ తథాచమనుః॥ వేదోదితానాం నిత్యానాం కర్మణాం సమతిక్రమే। స్నాతకవ్రతలోపేచ ప్రాయశ్చిత్త మభోజనం। సంధ్యావందన హానౌతు నిత్యస్నానం విలుప్యచ। హోమం చనిత్యకం శుద్ధేసావిత్ర్యష్ట సహస్రకం॥ శుద్ధే పరేద్యుః॥ అష్ట సహస్రకం॥ అష్టోత్తర సహస్రం॥

సంధ్యా లోపస్సప్త రాత్రాతిక్రమణే పునస్సంస్కారః.

సప్తరాత్రిం విచ్యుతం సంధ్యానుష్ఠానా భావేపున స్సంస్కారః కార్యః॥ తదనంతరము పేతం పూర్వవదనుష్ఠేయం॥ అత్రి శ్శౌనకః సంధ్యాతిక్రమణా యస్య సప్త రాత్ర మవిచ్యుతః। ఉన్మత్త దోషయుక్తో వాపునస్సంస్కారమర్హతి॥ ఇతో ప్యన్య దపేక్షిత మన్యతో జ్ఞేయం

ఆచమన విధిః

స్మృత్యంతరే॥ శౌచాన్తే చతథాపానే స్పృష్టాస్పృష్టే చకర్మణి। పురాణాచమనంకుర్యాన్నామభిః కేశవాదిభిః। సంధ్యాయాంకర్మకాలేచస్మృతేరా

---

త్రిని జపింప వలయును॥ వేదములచే చెప్పఁబడిన నిత్యకర్మములు లోపించినను– స్నాతక వ్రతము లోపించినను భుజింప కుండుట ప్రాయశ్చిత్తమగును. సంధ్యావందనము - నిత్యస్నానము- హోమము లోపించినప్పుడు మరునాడు వేయిన్నెనిమిదిమార్లు గాయత్రి జపము చేయవలయునని మనువు చెప్పెను.

ఏడురోజులు సంధ్యావందనము చేయకుండునెడ పునస్సంస్కారము.

నడుమ నొక మాఱైన సంధ్యావందనము చేయక యేడురోజులు దాటు నేని యగ నుపనయనము చేయవలయును. ఈ సందర్భమున- ఏడుదినము లెవ్వాడు సంధ్యావందనము చేయకుండునో వాడు ఉన్మాద దోషము కలవాఁడైనను వానికి తిరుగా నుపనయనము చేయవలయును॥ అని శౌనకుఁడు చెప్పెను. ఇంకను తక్కినవిశేషములు గ్రంథాంతరముల వలన నెఱుంగునది.

ఆచమనవిధి.

శౌచము చేసి కొన్నప్పుడు- నీరుద్రావినప్పుడు- స్పృష్టి దోషమునుం భవించి నప్పుడును కేశవాది నామములతో పురాణాచమనము చేయవలయునని స్మృత్యంతరము న నున్నది సంధ్యావందనము- స్మార్తకర్మములు చేయునప్పుడు స్మృత్యాచమనముచే

చమనం భవేత్। బ్రహ్మయజ్ఞేతు నైకుర్యాచ్ఛ్రౌతేరాచమనం ద్విజ
ఇతి॥ తథా। స్మృత్యాచమనముక్తం తత్రైవ॥ సంహతాంగుళిహస్తే
న గృహీత్వాచాంబు వీక్షితం। ముక్తాంగుష్ఠకనిష్ఠాభ్యాం త్రిః పిబేద్బ్రహ్మ
తీర్థతః। తతః ప్రక్షాళ్యహస్తౌచ సంకుచ్యోష్ఠౌ నిమార్జ్యాథ॥ సంహ
తాంగుళిమూలైశ్చత్రిః ప్రమృజ్యాత్తతోముఖం। ప్రక్షాళ్య హస్తౌదా
భ్యుక్ష్య పాదకౌక్షాళ్య థేవచ। మధ్యమాంగుళిష్వగ్రైశ్చత్రిః స్పృశేద్
ఘ్రాణమూలకం। హస్తౌప్రక్షాళ్య సంస్పృష్ట్వా ఘ్రాణాదిద్వయశః పృ
థక్। అంగుష్ఠేన ప్రదేశిన్యా ఘ్రాణౌపశ్చాదుపస్పృశేత్। అంగుష్ఠానా
మికాభ్యాంచ చక్షుశ్శ్రోత్రేపృథక్ పృథక్॥ అంగుష్ఠకనిష్ఠా
భ్యాం నాభింపశ్చాదుపస్పృశేత్। తలేన హృదయం స్పృష్ట్వా స్పృశే
దంగుళిభిశ్శిరః। అంగుళ్యగ్రైర్దక్షిణాభిశ్చబాహుమూలద్వయం స్పృశే
త్। పునివేనోదకంధృత్వా హ్యాత్మానం పరిషేచయేత్ ॥ఇతి॥ ఆపస్తం
బసూత్రోదితం యథా॥ తిష్ఠన్నాచామేత్। ప్రహ్వోవా ఆసీనస్త్రి
రాచామేత్। హృదయంగమాభిరద్భిః। త్రిరోష్ఠౌ పరిమృజేత్। ద్వి
రిత్యేకే। సకృదుపస్పృశేత్। ద్విరిత్యేకే। దక్షిణేన పాణినా సవ్యం ప్రో
క్ష్య పాదౌశిరశ్చ। ఇంద్రియాణ్యుపస్పృశేత్। చక్షుషీనాసికే శ్రోత్రే
చ। అథాప ఉపస్పృశేత ఇతి॥

తథాశ్రుత్యాచమనంతత్రైవ॥ దేవ్యాః పాదైస్త్రిభిః పీత్వా
చాబ్లింగైర్నవభిః స్పృశేత్। సప్తవ్యాహృతిసంయుక్తా గాయత్రీ

---

యువలయును. బ్రహ్మయజ్ఞము చేయునప్పుడు శ్రౌత్యాచమనము చేయవలయునని యానం
దే కలదు॥ ఆగ్రంథముననే స్మృత్యాచమనము ఇట్లు నిర్ణయింపఁబడి యున్నది.

బొటన వ్రేలిని చిటికెన వ్రేలిని వదలి కడమవ్రేళ్లు కూర్చిన చేతితో జలము గ్ర
హించి బ్రహ్మతీర్థముతో మూఁడుమారు పానము చేయవలయును.

తరువాత చేతులు కడిగికొని వ్రేళ్లు ముడిచి పెదవులను మూఁడుమారులు తుడువవల
యును. కూర్పఁబడిన వ్రేళ్లతో నోరుమూఁడుమారులు తుడుచుకొనవలయును. చేతులు కడిగికొ
ని పాదముల మీఁదను శిరము మీఁదను నీరుచల్లుకొని నడిమి వ్రేళ్ల వెనుక భాగములతో
నాసికా మూలమును మూఁడుమారులు తాఁకవలయును. చేతులు కడిగికొని ముక్కు మొదలగు

వామదేవసంహితోక్తం కారణోక్తం తథైవచ। ఆరణ్యకోక్త మన్యచ్చ శ్రౌతముక్తం చతుర్విధం॥ తద్యథావామదేవ సంహితాయాం॥ సమశ్శం భవఇత్యాది మంత్రాస్తామన వశ్చవషట్। భవోద్భవాయ నమ ఇతిమనుః ప్రథమః స్మృతః। వామ దేవాయ వాక్యస్థా మంత్రా ఏకాదశ స్మృతాః। నమస్తే అస్తు భగవ న్విశ్వేశ్వర ఇతి స్మృతః। మహాదేవస్త్ర్యం బక స్త్రిపురాంతక ఇతీ రితః। త్రికాగ్ని కాలః కాలాగ్ని రుద్రావ్యాయ ఇతి స్మృతః। నీలకంఠశ్చ సర్వేశ్వర స్సదాశివ ఏవచ। శ్రీమహా దేవఇ త్యేతే సంయుతా నమసాస్మృతాః। అష్టావింశతి నామాని కీర్తితాని మ హాన్తిచ। ఏతైరాచ మనాదీని కార్యాణ్యాహుర్మ నీషిణః। శంభ్వాదిభి స్త్రిభిర్నంత్రైః పీత్వా శేషైశ్చ సంస్పృశేత్। ఓమద్వయంచమ బుక మా

---

లు దుడిచి కొనవలయు॥ కడమ రెండిటితో శిరముపై జలము జల్లుకొని- యొక వాక్యము తో కుడిచేత నీరుతీసికొని యెడమచేతిమీద ప్రోక్షింప వలయు॥ అనంతర మొక వాక్య ము నుచ్చరించుచు పాదములమీద నీరు ప్రోక్షించి- చివర వాక్యముతో జలమును శిరము న జల్లుకొన వలయు॥ తరువాత- సప్తవ్యాహృతులు- త్రిపదా గాయత్రి గాయత్రి శిర ము నను వానితో కడమ యంగములను దాకవలయు॥ అట్లుగాక- ప్రణవముతో గాని- గాయత్రితో గాని- వ్యాహృతులతో గాని చేయవలసును॥ వైదికాచార నిర్ణయమునందు కంఠి లిఖితుఁడు॥ శైవపంచాక్షర మంత్రముతో ముమ్మారు లాచమనముచేసి రెండుమారు పె దవులు తుడువవలయు. ఈశానాది పంచబ్రహ్మ మంత్రములతో నాయా యిస్థానము లను స్పృశింప వలెను॥ ఇది శ్రౌతాచమనము॥ అనియున్నది॥ గరుడపురాణమున శివపూ జా ప్రస్తావమునందు "ఓంహ్రీం ఆత్మతత్వాయస్వాహా" ఈ మొదలగు మూడుమంత్రము లతో నాచమనము చేయవలయునని యున్నది॥ స్మృతి రత్నాకరమునందు॥ శైవులకు శి వనామంబులును యతులకు ప్రణవంబును వైష్ణవులకు విష్ణునామంబులును ఆచమన కృ త్యంబున యోగ్యంబులని యున్నది॥ మానవ పురాణము నందు॥ ముక్తిని కోరుదురేని కేశ వాది నామములను విడిచి పెట్టి శంభ్వాది నామములతోడనే ఆచమనము చేయుడని యున్నది॥

వామదేవ సంహితోక్తము, కారణాగమోక్తము, అరణ్యకశ్రుత్యుక్తము, మనో క్తమునని శ్రుతాచమనము నాలుగువిధములు॥ అందు వామదేవసంహితోక్త మెట్లనిన, న మశ్శంభవేచ ఈ మొదలగు నాలుగు మంత్రములును, భవోద్భవాయ నమః అనునదియొకటి.

గుళ్యగ్రైర నంతరం। భవోద్భవాది భిర్మంత్రైర్ద్వాదశాంగాని సంస్పృశేత్।అంగుష్ఠతర్జనీభ్యాంతు నాసారంధ్రే స్పృశేత్క్రమాత్। అంగుష్ఠానామికాభ్యాంతు నేత్రేకర్ణౌ స్పృశేత్క్రమాత్। సాంగుష్ఠేనకనిష్ఠేన నాభింకుంచితలేనతు। అంగుళ్యగ్రైశ్శిరో బాహూవ్యస్తైస్తలేవక్షస్థలం స్పృశేత్। నమస్తేస్త్వాది భిర్మంత్రైర్దశాంగానిచ సంస్పృశేత్ వామహస్తతలేనైవ దక్షహస్తతలం స్పృశేత్। తథా దక్షిణ హస్తేన వామహస్తతలం స్పృశేత్। పాదద్వంద్వం పార్శ్వయుగ్మము రోగండస్థలేహ్యపి। మూర్ధాంగం మునిశార్దూల తతేనైవ నచాన్యథా। ఏవమాచమ్య విధివత్కర్మానుష్ఠాన మాచరేదితి॥ యథాచకారణే। త్రిఃపిబేత్త్రిశ్చాచమేత హ్యాత్మ విద్యా శివాభిధైరితి॥ అంణ్యాకోక్తం యథా॥ త్రి

---

టియు, వాసుదేవ మంత్రమున గలవాక్యములు పదునొకండును నమస్తేఅస్తు భగవన్ విశ్వేశ్వరాయ ఈమొదలగు మంత్రమున గల వాక్యములు పదియును చేరియిరువదియొక్క నామములగును॥

వీనిలో మొదటి మూడువాక్యముల చేత మూడుమారులు ఆచమనముచేసి కడపటి యేడింటిచే అంగుళ్యగ్రములతో పెదవులను గడ్డమును తుడువవలయును॥ అనంతరము భవోద్భవాయనమః ఈమొదలగు పండ్రెండు మంత్రములతో పండ్రెండు స్థానములను తాకవలయును. ఎట్లనిన అంగుష్ఠము తర్జని ఈరెండు వ్రేళ్లతో ముక్కులను తాకవలయును॥ అంగుష్ఠము అనామిక ఈరెండు వ్రేళ్లతో కన్నులను చెవులను దాకవలయును॥ బొటన వ్రేలు చిటికెన వ్రేలు వీనితో నాభిని అరచేతితో వక్షమును తాకవలయును॥ తరువాత నమస్తేఅస్తు ఈ మొదలగు వాక్యములతో పదిస్థానములను స్పృశింపవలయును॥ ఎడమచేయి అరచేతితో కుడిచేయి అరచేతితో ఎడమ అరచేతిని తాకవలయును॥ అనంతరము రెండుపాదములను రెండు పార్శ్వములను ఉరమును రెండు చెక్కిళ్లను, శిరమును అరచేతితో తాకవలయును॥ ఇట్లాచమనముచేసి కర్మానుష్ఠానము చేయవలయునని కలదు॥ ఆత్మతత్త్వము, విద్యాతత్త్వము శివతత్త్వము అనువానిచే నాచమనము చేయవలయునని కారణాగమమునందుగలదు॥ అరణ్యకమునుక్తమెట్లనిన, మూడుమారులు ఆచమనము చేయవలయును॥ నీళ్లలో ముంచిన యంగుష్ఠముచే రెండు పెదవులను రెండుమార్లు తాకి మరలనొకసారి పెదవిని తాకి ఎడమచేతి మీదను, రెండుపాదముల మీదను, ప్రోక్షించి కరాగ్రమున శిరమును, అంగుష్ఠానామికలతో కన్నులను అంగుష్ఠతర్జనులతో రెండు ముక్కులను, అంగుష్ఠ నా

గాచామేత్॥ ద్విః పరిమృజ్య॥ సకృదుపస్పృశ్య॥ సవ్యం పాణిం పాదౌ ప్రోక్షతి॥ శిరశ్చక్షుషీ నాసికే శ్రోత్రే హృదయమాలభ్య॥ ఇతి॥ మనూక్తం జ్ఞేయం॥ పాద్మే ఇత్యాద్యుక్తక్రమేణ॥

స్మార్తోదితం స్మృతి ప్రోక్తం స్మార్తమాచమనం ద్విధా॥ యథా॥ ఆపస్తంబసూత్రే॥ త్రిరాచామే దిత్యాది స్మృతి ప్రోక్తం యథా॥ త్రిః పిబేద్బ్రాహ్మ తీర్థేన ఇత్యాద్యుక్తక్రమేణ॥ స్కాందే శంకర సంహితాయాం॥ నామభిః కేశవాద్యైస్తు తాంత్రికాచమనం మతం॥ బ్రహ్మయజ్ఞాది కాలేతు శ్రౌతాచమనమిష్యతే॥ సంధ్యాది స్మార్తకృత్యేషు స్మృత్యాచమనమీరితం॥ మూత్రాది శౌచకాలేతు పురాణాచమనం స్మృతం॥ శంభు నామాదిభిః పంచ వింశత్యా కుర్యాత్ పృథక్॥ శంభో శంకర శాంత శాశ్వత శివస్థాణో భవానీపతే భూతేశ త్రిపురాంతక త్రిణయన శ్రీకంఠ కాలాంతక॥ శర్వోగ్ర భవ భర్గ భీమ జగతాంనాథాయ శ్రీపతే రుద్రేశాన మహేశ్వరేశ్వర మహాదేవాయ తుభ్యం నమః॥ ఇతి॥

ఏవముదాహృత వచనానురోధేన కేశవాది నామ్నాం తాంత్రికత్వేన ప్రతిపత్త్యా న వైదికజన గ్రాహ్యత్వం॥ అథ శేషాం పరకీయా పౌరాణికత్వాభ్యుపగమేపిన శ్రౌతస్మార్త కర్మాంగాచమన గ్రాహ్యత్వా సిద్ధ్యతీతి స్ఫుటం॥

---

మికలచే చెవులను, కరతలముతో రొమ్మును తాకవలయును॥ ననియున్నది॥ మనూక్తము గాయత్రీ మంత్రముయొక్క పాదములతోఁ చేయవలయునను నదికవగింపఁ బడియెను॥

తాంత్రోక్తము, స్మృతి ప్రోక్తమనని స్మృత్యాచమనము రెండు విధములు॥ ఈ రెండు విధములు ప్రతిపాదింపఁ బడియున్నవి॥ పురాణాచమన మెట్లనిన స్కాందమున శంకరసంహిత యందు॥ కేశవాది నామముల చేయఁబడునది. తాంత్రికాచమనము॥ బ్రహ్మయజ్ఞాది కాలములయందు శ్రౌతాచమనము చేయవలయును॥ సంధ్యాది కృత్యములయందు స్మృత్యాచమనము చేయవలయును॥ మూత్రాది శౌచ కాలమునందు పురాణాచమనము చేయవలయును॥ శంభు మొదలగు నిరువదియైదు నామములఁ జేయఁబడునది పురాణాచమనము॥ శంభవే స్వాహా॥ శంకరాయ స్వాహా॥ శాంతాయ స్వాహా॥ శాశ్వత, శివ, స్థాణు, భవానీపతి, భూతేశ, త్రిపురాంతక, త్రిణయన, శ్రీకంఠ-

మన ప్రసంగేఽవిహితత్వాత్ ధర్మప్రవృత్తి- కృష్ణపండితీయే సాంఖ్య భాష్యే చ శౌచాచమన ఏవ తేషాం విహితత్వాచ్చ తదనుష్ఠాన స్యావిహితానుష్ఠాన రూపత్వేన తద్వచనస్య స్వయం భ్రష్టోఽన్యానపి భ్రంశయతీతి న్యాయ గోచరత్వాచ్చ అనుపాదేయతాం మన్యామహే॥

ఆచమన నియమాః.

నిబద్ధ శిఖకచ్ఛస్తు ద్విజ ఆచమనం చరేత్। కృత్వోపవీతం సవ్యం సేవాబ్రహ్మణః కాయసంయతః॥ గోకర్ణాకృతి హస్తేన మాషమాత్రం జలంపిబేత్। తన్న్యూన మధికం పీత్వా సురాపాన సమం భవేత్। ముక్తాంగుష్ఠ కనిష్ఠాభ్యాం త్రిః పిబేద్బ్రహ్మతీర్థతః॥ నాచామేదాసనస్థాంఘ్రిర్నబద్ధాసన ఏవ వా। నప్రసారిత పాదో వా బహిర్జాను కరోపి వా। పవిత్రకర ఆచామేత్ శుచిః కర్మార్థమాదరాత్॥ సపవిత్రో సదర్భో వా కర్మాకుర్వీత నాన్యథా॥

---

పునశ్శివుని సర్వవేదముల యందును పరత్వము నిరూపింపఁ బడియున్నది. దీనింబట్టి కేశవాది నామములు తాంత్రికము లనియు, శివనామములు వైదికములనియు నిర్ణయమగుచున్నది. తాంత్రికములగు కేశవాది నామముల కు స్వాహా శబ్దముతో సంబంధము కలుగఁ జేయుట కంటె వైదికములగు శివనామములకు స్వాహాశబ్దమును జేర్చియుపయోగించు కొనుటయే శ్రేష్ఠము॥ ఇదిగాక- తాంత్రిక శబ్దములకు స్వాహా కారమును జేర్చినను నవి వైదిక ములగునా? కానేరవు.

ప్ర॥ విష్ణునకు పరత్వము పాంచరాత్ర తంత్రముల యందే గాని వేదముల యందు లేదని యెట్లు విశ్వసింప వలయును?

ఉ॥ శివుఁడే పరబ్రహ్మము ఆయన యొక్కయంశమే జగము అని వేద ములు చెప్పుచున్నవి. అయినను వేదము లన్నియు శివపరముగా నుండనేయని యూర్వశేమితో పాంచరాత్ర వాదులు వేదముల యందును విష్ణు పారమ్యము కలద నియువాక్య ములు చెప్పఁ బూనిరి. వారిపద్ధతిని నిరసింప నిందజొచ్చిరి యని చెప్పుచు శ్రీమదప్పయ దీక్షితులవారు శివకర్ణామృతము నందును, శివతత్త్వ వివేకమునందును, వేదములయందు విష్ణుపారమ్యము లేదని నిర్ణయించిరి. ఈయర్థము వ్యాసపథము మొదలగు గ్రంథ ముల యందు మా చేతను నిరూపింపఁ బడియెను. కావున వైదికులగు వారు శ్రౌతస్మార్త కర్మాంగములను నాచమనము లందు శివనామముల నుపయోగించుటయే న్యాయ్యమని యేర్పడు చున్నది.

## భూతాద్యుచ్చాటనం

అథభూతాద్యుచ్చాటనం॥ తదుక్తం। చంద్రజ్ఞానోత్తరే॥ అపసర్పన్తుయే భూతాయే భూతాభువి సంస్థితాః। యేభూతా విఘ్నకర్తారస్తే నశ్యన్తు శివాజ్ఞయా। పార్ష్ణినా వామపాదస్య భూతాఘాతత్రయం చరేదితి॥

మూ॥ ఉత్తిష్ఠన్తు భూతపిశాచాయ ఏతేభూమిభారకాః।
ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే॥

---

పరి అట్లైన మతాంతరులు కేశవాది నామములతోనే ఆచమనము చేయుచున్నారు వారి ధర్మశాస్త్రముల యందు కేశవాది నామములతోనే చేయుమని యుండలేదు॥ మతాంతరు లట్లుచేయుదురు గాక అది సప్రమాణము మాత్రము కానేరదు. ఏలయన- అట్లు కేశవాది నామములతో నాచమనము చేయవలయునని వారిధర్మశాస్త్రములగు పరాశర మాధవీయము నందుగాని వైద్యనాథ దీక్షితీయము నందుగానిలేదు. ఇంక- ధర్మప్రవృత్తి యందు, కృష్ణపండితీయమను సంధ్యాభాష్యము నందును న్యాసము అచటనే వానిని శ్రౌతాచమనము నందే వినియోగించుకొన వలయునని యున్నది. గాని శ్రౌతస్మార్త కృత్యముల యందు వినియోగించుకొమ్మనిలేదు. దీనింబట్టి వారనడపడిక శాస్త్ర సమ్మతము కాదని యేర్పడు చున్నది.

### ఆచమన నియమములు.

సిగ ముడివైచికొని చెంగులు దోపుకొని- జందెము నుపవీతముగా ధరించి వాక్కును మనసును కాయమును నియమించి ఆచమనము చేయవలయును.

అరచేతిని ఆవుచెవిని వలె బట్టి అందు మినుపగింజ మునుగు నంత జలము నాచమింప వలయును అంత కెక్కువగాని తక్కువగాని పుచ్చుకొన గూడదు.

చూటనవ్రేలిని- చిటికెనవ్రేలిని సాచి కడమవ్రేల్లను మాత్రము గూర్చిన చేతితో జలము గ్రహించి బ్రహ్మ తీర్థముతో జలముగ్రహింప వలయును అంగుష్ఠమూలమున బ్రహ్మతీర్థ ముండును.

గొంతు కూర్చుండి గాని- శ్రోత్రగ పద్మాసనాదులను బంధించి గాని, కాళ్లుసాచుకొని గాని, మోకాళ్లకు వెలుపట చేతుల నిడుకొని గాని యాచమనము చేయ గూడదు.

బంగారుతోం జేయంబడిన పవిత్రముడి గాని దర్భలుగ్గాని చేతియందు ధరించి యాచమనము చేయ వలయును.

ద్మాసనం భవేదేతద్దేవానామపి పూజితం॥ భూశుద్ధిం సమాచరేత్॥ తత్ప్రకారస్త్వాహ్నికే జపప్రకరణే ద్రష్టవ్యః॥

ప్రాణాయామవిధిః.

అర్థంవాసి సాధయిష్యురిత్యాపస్తంబః॥ అత్రవృత్తికారః॥ అర్థఃప్రయోజనం తచ్చదృష్టమదృష్టంవా- సిసాధయిషుః ఆశరీర గ్లానేః ప్రాణాయామత్రియం కుర్యాదితి॥ తస్యలక్షణ మాహమనుః॥ సవ్యాహృతిం సప్రణవాం గాయత్రీం శిరసాసహ।త్రిఃపఠేదాయతప్రాణః ప్రాణాయామస్స ఉచ్యత ఇతి। యోగయాజ్ఞవల్క్యః॥ భూర్భువ స్స్వర్మహర్జన స్తపస్సత్యం తథైవచ। ప్రత్యోంకారసంయుక్తా స్తథాతత్సవితుఃపదం। ఓమాపోజ్యోతి రిత్యేతా శ్శిరః పశ్చాత్ప్రయోజయేత్। త్రిరావర్తన యోగాత్తు ప్రాణాయామస్సశబ్దితః॥ ఇతి॥

---

పముచేయవలయు ననియున్నది ఆచమన నియమముల యందు బద్ధాసన ఏవకా అని పద్మాసనాదులు నిషేధింపబడియును॥ కానిఅని షేధము క్రొత్తగ పట్టబడిన పద్మాసనాదులు సుఖకరములు గానందున ప్రవర్తించెనని యూహింపనగునది॥

ఆసన లక్షణంబును చంద్రజ్ఞానోత్తరము నందే కలదు॥ ఎట్లనిన, ఒక పాదమును రెండవ తొడమీదను రెండవ పాదమును వేరొకతొడ క్రిందను నుంచి కూర్చుండుట యది వీరాసన మగును॥ మోకాలి తొడల నడుమ రెండు యరకాళ్లను జేర్చి సరిగా కూర్చుండిన యదిస్వస్తికాసన మగును॥ ఎడమకాలి తొడమీద కుడిపాదమును, కుడికాలి తొడమీద యెడమ పాదమును నునుచు నెడనది పద్మాసన మగును॥ భూశుద్ధి నాచరించి భూతములను పారదోలి- యిట్టి యాసనమున గూర్చుండి భూతశుద్ధి చేయవలయు॥ భూశుద్ధిభూతశుద్ధి మొదలగునవి యాహ్నికమున జపప్రకరణమందు జూడవలయు॥

ప్రాణాయామవిధి.

దృష్టముగాని- అదృష్టముగాని యగు ప్రయోజనము సాధింప దలచిన వాడుశరీరమునకు యలసట వరకు మూడు ప్రాణాయామములను చేయవలయు నని యాపస్తంబుడు చెప్పెను॥ ప్రాణాయామ లక్షణ మెట్లన, వ్యాహృతులు ప్రణవము శిరస్సు అను వానితో గూడ గాయత్రిని మూమార్లు జపించు వరకు నూపిరి బిగబట్టి నుండు నెడ నదియొక ప్రాణాయామ మగును అని మనువు చెప్పెను యోగ యాజ్ఞవల్క్యుడును నిట్లు చెప్పెను.

ప్రాణాయామస్య సకల పాపనివృత్తిః ఫలమిత్యుక్తం మనునా॥ దశప్రణవ సంయుక్తాః ప్రాణాయామాస్తు షోడశ। అపిభ్రూణహనం యస్మాత్పునం త్యహరహః కృతా ఇతి॥ సచ ప్రాణాయామస్త్రిప్రకార స్తదుక్తం॥ పూరకః కుంభకో రేచ్యః ప్రాణాయామస్త్రిలక్షణః॥ నాసికాకృష్ట ఉచ్ఛ్వాసో ధ్మాతః పూరక ఉచ్యతే। కుంభకో నిశ్చలశ్వాసో రేచ్యమానస్తు రేచకః ఇతి॥ తల్లక్షణముక్తం వ్యాసేన॥ దక్షిణే రేచకం కుర్యాద్వామే నాపూర్య చోదరం। కుంభకేన జపం కుర్యాత్ప్రాణాయామస్స ఉచ్యతే। పంచాంగులీభిర్నాసాగ్ర పీడనం ప్రణవాభిధా। ముద్రేయం సర్వపాపఘ్నీ వానప్రస్థ గృహస్థయోః॥ కనిష్ఠానామికాంగుష్ఠై ర్నాసాగ్రస్యచ పీడనం। ఓంకారముద్రా సా ప్రోక్తా యతేశ్చ బ్రహ్మచారిణ ఇతి॥

## ప్రాణాయామ విధి యుక్త మంత్రార్థః

అథతద్విధియుక్త మంత్రార్థో యథా॥ ఓంభూః॥ ఇత్యనేన మంత్రేణ నాసాగ్రన్యస్తలోచన స్తదభిధేయం పరమేశ్వర మంతర్భావయన్ ప్రాణాయా మంత్రయం కుర్యాదిత్యాకూతం॥ ఓంకార శ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా। కంఠం భిత్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళికావుభావితి స్మృత్యా ఓమితి బ్రాహ్మణః ప్రవక్ష్యన్నాహ ఇతి శ్రుత్యా

---

ప్రాణాయామమునకు ఫలమే మనిన, పదిమార్లు ప్రణవమును జపించుచు చేయు ప్రాణాయామములను ప్రతిదినము పదునాఱు మార్లు చేయుచో భ్రూణహత్యాదిదోషము గూడ నశించునని మనువు చెప్పుటచే సకల పాపములు తొలంగుటయే ఫలమని తెలియుచున్నది॥ పూరకము కుంభకము। రేచకమునని ప్రాణాయామమునకు మూడంగములుకలవు॥ ముక్కునుండి గాలిని పీల్చుటకు పూరకమనియు॥ దానిని కదలకుండ నిలుపుటకు కుంభకమనియు॥ గాలినివెడలి పెట్టుటకు రేచకమనియు పేరు॥ ఎడమ ముక్కునుండి గాలినిపీల్చి కుడిముక్కునుండి విడువవలయు. కుంభకమున జపముచేయవలయు॥ అయిదువ్రేళ్లతో ముక్కుపట్టుకొనుటకు ప్రణవముద్ర అనిపేరు ఇది సకల పాపములం బోగొట్టును॥ వానప్రస్థునకు గృహస్థునకును నీముద్ర విహితమైనది॥ చిటికెనవ్రేలు అనామిక బొటనవ్రేలు అనువానిచే ముక్కుపట్టుకొనుట ఓంకారముద్రయనిపేరు ఇది యతికి బ్రహ్మచా

చ పరశివాభిధానత్వ మగ్రేస్పష్టీ భవిష్యతి। తస్మా దేవచాస్య పరమ
మాంగళికత్వమామ్నాయ పారత్వ మిత్యాద్యుపపద్యతే। అతఏవచ
ధర్మానుష్ఠాన యోగ్యతాచిత్తైకాగ్ర్యవిఘ్న పరిసమాప్తి సిద్ధ్యర్థాంత
ద్విసియోగా కాంక్షిత సంప్రదానార్థం చాస్యాదా వామ్నాన మితి
సాధు।

భూరితిభూలోకః. ఇదమధోలోకానాంసప్తానామప్యుపలక్షణం। భువరితి
భువర్లోక ఇత్యాద్యనుసంధేయం। భూరాదీనాంసప్తానామపిభువనానాంత
చ్ఛరీరత్వ తత్కార్యత్వ తచ్ఛాప్యత్వాద్యుపస్కృత తచ్ఛేషత్వ జ్ఞాప
నార్థం- పరమేశ్వరస్య సర్వాంతర్యా మిత్వాద్యుపస్కృత తచ్ఛేషిత్వ
బోధనార్థంచ పరశివాభి ధానస్యతస్య ప్రణవస్య ప్రతిపదం కీర్తనం
యుక్తం। అతఏవ। సప్తవ్యాహృతయ స్సప్తలోకా భూరాదయః క్ర
మాత్। ప్రత్యేకం ప్రణవాదిత్వాత్తన్మయా ఇతి సూచ్యత ఇత్యుక్తం।
గాయత్ర్యర్థస్తు జపావసరేఽభిధాస్యతే। ఓమాపో జ్యోతిరితి గాయత్రీ
శిరః। అస్యాయమర్థః। ఆపః= జలాని, ఓం= పరమేశ్వర ఏవతస్యాష్ట
మూర్తిత్వాత్। జ్యోతిః= సౌరాదితేజః ఓం= ఈశ్వరఏవ, ఏవంరసః=
మధురాదిః, అమృతం= దేవానామన్నం, బ్రహ్మ వేదః, ఏతత్సర్వం,ఓం
పరమేశ్వరఏవ. భూర్భువస్సువరితి భూరాదీనాము పలక్షణం, ఏతదపి
ఓం పరమేశ్వర ఏవేత్యర్థః। అనేన మంత్రేణ ప్రాణాయామం త్రీన

---

ఎవ్వారలు ఫలకాంక్షలేక నిత్యనైమిత్తిక కర్మములచే పరమేశ్వరునా రాధింతురో వారలను గ్రహించి మలమాయాది పాశములనుండి విముక్తులను గావించునని భావము। కాన పరమేశ్వరు డెవ్వని ననుగ్రహించునో వానికే లభ్యుండగునని శ్రుతి చెప్పుచున్నది। దీనింబట్టి జీవునియొక్క బంధవిముక్తి పరమేశ్వరున కధీనమైయని తెలియుచున్నది। ప్రణవము పరమేశ్వరు నామధేయ మైయుండుట ముందు స్పష్టము కాగలదు। దాననె ఇది మంగళప్రదమగుటయును వేదసార మగుటయును సిద్ధించుచున్నది। ఆ కారణముననే ధర్మానుష్ఠాన యోగ్యత చిత్తైకాగ్ర్యము విఘ్నపరిసమాప్తి సిద్ధించుట కనుకూల సానుష్ఠాన మంత్రము పరమేశ్వరు నుద్దేశించినదే యను నర్థమును తెలుపుటకును ఇదియాద్యుత పఠింపఁబడియెననుట యుక్తము।

శక్త్యైక వారంవాసృత్వా

దేశకాల కీర్తనం.

శివశివ శంభో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణో ద్వితీయ పరార్థే- శ్వేతవరాహకల్పే- వైవస్వత మన్వంతరే, కలియుగే ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోర్దక్షిణ దిగ్భాగే శ్రీశైలస్య ఈశాన ప్రదేశే కృష్ణాకావేర్యోర్మధ్యదేశే స్వగృహేసమస్తదేవతా మాహేశ్వర సన్నిధౌ అస్మిన్వర్తమానవ్యావహారికచాంద్రమానేన ... సంవత్సరె ...అయనే...ఋతౌ... మాసే... పక్షే... తిథౌ...వాసరే...శుభనక్షత్ర శుభయోగ శుభకరణ విశిష్టశుభే శోభనే ముహూర్తే శ్రీమాన్,... గోత్రః...శర్మా, ధర్మ పత్నీ సమే

---

భూః అనగా భూలోకము॥ ఈపదము దిగువ నున్నయేడు లోకములకు నుపలక్షణము॥ భువః భువర్లోకము, సువః- సువర్లోకము అని మొదలుగా గ్రహింప వలయు భూలోకము మొదలుగా లోకము లన్నియు పరమేశ్వరునకు శరీరము లగుటయు కార్యము లగుటయు పాల్యము లగుటయు మొదలగువానిచే పరమేశ్వర శేషము లనియు, పరమేశ్వరు డైనను యీలోకముల కంతర్యామి యగుట కర్తయగుట మొదలగు వానిచే శేషియనియు తెలుపనే పర శివుని నామధేయమగు ప్రణవము లోకవాచక ములగు భూరాది పదములతోఁ జేర్పఁ బడియెను॥ భూరాది సప్తవ్యాహృతులును సప్తలోకము లగును. వీనిలో ప్రతిపదము ప్రణవముతోఁ జేర్చుట వలన నవ్యుదిః ప్రణవవాచ్య పరమేశ్వర రూపమని సూచింపఁ బడుచున్నది అని కలదు॥ గాయత్రీ మంత్రార్థము జపావసరమున నిరూపింపఁ బడ గలదు॥ ఓమాపో జ్యోతిః అనునది గాయత్రీ శిరము దీని యర్థమేమి యనిన, ఆపః= జలములు ఓం= పరమేశ్వరుఁడే యగు పరమేశ్వరుడు అష్టమూర్తి గావునను జలములా యష్టతమవులలో శ్రేష్ఠనవి గాన నిదియుక్తము॥ జ్యోతిః॥ సూరాది తేజంబును ఓం= ఈశ్వరుడే యగును ఇట్లే- రసః= మధురాది రసంబును అమృతం= దేవతల యన్నంబును, బ్రహ్మ=వేదంబును ఇదియంతయు ఓం= పరమేశ్వరుడేయగు ననియర్థము॥ ఈ మంత్ర ముతో మూఁడుప్రాణాయామ ములను జేయవలయు అశక్తుడగుఁనేని ఒకమాఱు చేయవలయు॥

దేశ కాల కీర్తనము

శివశివ,........... కరిష్యే అని సంకల్పము చేసి పవిత్ర మగు జలమును బ్రహ్మముఖమును మంత్రముతో మంత్రించి యాయుదకమును దాకి ఆపో హిష్ఠా ఈమొ

ఖోహం, శ్రీమత్,...గోత్రస్య...శర్మణః ధర్మపత్నీ సమేతస్య మమోపాత్తదురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం ప్రాతస్సంధ్యాముపాసిష్యే ఇతి సంకల్ప్య

పవిత్రము దకం బ్రహ్మముఖాఖ్యేన మంత్రేణ సంమంత్ర్య, తదుదకం స్పృష్ట్వా ఆపోహిష్ఠేత్యాది మంత్రైర్మార్జనం శిరసి సమాచరేత్। బ్రహ్మముఖోఽయం మనునా నిరుక్తః॥ ఓంకారపూర్వికాస్తిస్రో మహావ్యాహృతయోఽవ్యయాః। త్రిపదా చైవ గాయత్రీ విజ్ఞేయం బ్రహ్మణో ముఖమితి॥

అత్ర యద్యపి సంధ్యాత్రయమధ్యే సాయం సంధ్యాయా ఏవ ప్రాథమ్యం తథాపి॥ శౌనకః॥ ఉపనీతౌ కృతాయాం తు సాయం సంధ్యాముపక్రమేత్। ఇతి, తథాప్యాహ్నికక్రమానురోధేన ప్రాతస్సంధ్యా ప్రస్తుతా॥

---

దలకు మంత్రముతో శిరమున జలము చల్లుకొనవలయు॥ బ్రహ్మముఖమను మంత్రమెద్దియనిన మొదట ప్రణవంబును, తరువాత మహావ్యాహృతులును, త్రిపదా గాయత్రియుం జేరి నది బ్రహ్మముఖమను మంత్రమగు నని మనువు చెప్పెను॥

ఉపనయనము చేయగానే సాయం సంధ్యనుపక్రమింప వలయునని శౌనకుఁడు చెప్పిన దానిం బట్టి యిచ్చట సాయం సంధ్యను వివరించుటకన్న న్యాయమైనను ఆహ్నిక క్రమమును బట్టి ప్రాతస్సంధ్యయే ఆరంభింపఁ బడుచున్నది॥

సంధ్యా వందనములోని మంత్రములకు ఋషి— ఛందస్సు చెప్పవలెనని ప్రమాణము కలదు. అయినను ఆపస్తంబ సూత్రులకు నట్టి యాచారము లేదు గాన వ్రాయబడలేదు. ప్రణవముతో గూడిన మంత్రములతో మార్జనము చేయఁగా నెక్కుడు ఫలము కలుగును॥ ఆపోహిష్ఠా మయోభువః మొదలగు తొమ్మిది వాక్యములకు ప్రణవము చేర్చిన వానితో మార్జనము చేయు నెడ సంవత్సర కృతమగు పాతకము నశించునని శౌనకుఁడు చెప్పెను॥ ఋక్కు యొక్క అంతమందుగాని పాదాంతమందు గాని ఋగ్వ్యచ యొక్క అంతమందుగాని మార్జనము చేసికొనవలయునని బ్రహ్మ చెప్పెను॥ అయినను— బహుప్రమాణములను బట్టియు శిష్టాచారము బట్టియు పాదాంతము నందే మార్జనము చేయవలయునని తెలియుచున్నది॥

మార్జనము అప్పటము బలికర్మము భోజనము మొదలగు వానిని దేవతీర్థము తోన

అత్ర. యద్యపి ఋషిచ్ఛందోదేవతా స్మరణం ప్రణవ మేవ త
థాప్యాప స్తంబీయా సామాచారా భావా న్నకృతః। ప్రణవయుక్తేన
మంత్రేణ ప్రోక్షణే ఫలవిశేషమాహ శౌనకః। సప్రణవయుక్తేన ఆ
పోహిష్ఠేత్యృచేనతు। సంవత్సర కృతం పాపం మార్జనాన్తే వినశ్యతి।
ఇతి। బ్రహ్మా ఋగంతే మార్జనం కుర్యాత్పాదాన్తేతు సమాహితః।త్ర్యృ
చసాన్తే తథా కుర్యాచ్ఛిష్టానా మ్మత మీదృశమితి। బహు ప్రమాణా
ను రోధాచ్ఛిష్టా చారాచ్చ పాదాన్త మేవ గ్రాహ్యం। హారీతః। మా
ర్జనార్చన బలికర్మ భోజనాది దేవ తీర్థేన కుర్యా దితి। వ్యాసః। ఉపవీ
తీ బద్ధశిఖ స్స్వాచాన్తో ద్విర నాకులః। ప్రాఙ్ముఖస్సతతం విప్రస్సంధ్యో
పాసన మాచరే దితి। మంత్రార్థశ్చ ప్రతీ తవ్య ఇత్యాహ మనుః।
యదధీతమ విజ్ఞాతః నిగదేనైవ శబ్ద్యతే। అగ్నావివ చ శుష్కైధో న తజ్జ్వల
తి కర్హిచిదితి। వ్యాసోపి। పాఠమాత్రావ సానస్తు పంకే గౌరివ సీదతి।
శ్రుతిరపి। యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతీతి। మో
ర్ధవిత్సకలం భద్రమశ్నుత ఇతిచ।

---

చేయవలయును అని హారీతుడు చెప్పెను। జందెము నుపవీతముగా ధరించి, శిగ ముడి వైచు
కొని వ్యాకులత లేక తూర్పుమొగముగాఁ గూర్చుండి యాచమనము చేసి సంధ్యా వంద
నము చేయవలయునని వ్యాసుడు చెప్పెను।

మంత్రార్థము తెలిసికొన వలయునని మన్వాదులు చెప్పి యున్నారు। ఎట్లన, అర్థ
ము తెలియక చదివిన వేదము నిష్ఫలమగునని మనువు చెప్పెను। అర్థమెఱుఁగక చదువు వా
న్నవాడు బురదలో దిగఁబడిన యెద్దువలె శ్రమ మొందునని వ్యాసుడు చెప్పెను। తెలిసి
చేసినదే ఫలమిచ్చునని యుఁ అర్థమెఱిఁగిన వాఁడు సకల శుభముల నొందు ననియు శ్రుతియే
చెప్పుచున్నది।

ఇఁక మార్జనమున నుపయోగించు మంత్రములకు నర్థమెట్లనిన, హే ఆపః= ఓయుద
కములారా, మీరు, మయః= సుఖమునకు భువః= స్థానములు హిష్ఠ= అగుదురు కదా?
తాః= అట్టిమీరు నః= మమ్ములను, ఊర్జే= ఇష్టలింగో పాసనము కొరకు దధాతన=
నిలుపుడు। శ్రుతి ఇదమూర్జంతప సాని యచ్ఛత మొదలగు చోట్ల ఊర్క్-శబ్దము ఇష్టలింగ
మనుముగా ప్రయోగింపఁ బడుచున్నదిగాన నీయర్థము సప్రమాణ మగును। ఇచట కొందఱు
ఊర్జే= అన్నము కొఱకుల నియర్థము [illegible] చున్నారు. కాని దీనింబట్టి వారికి ప్రా

అథమార్జ నోపయుక్త మంత్రార్థోయథా॥

మం॥ ఆపోహిష్ఠా మయోభువ స్తాన ఊర్జేదధాతన।
మహేరణాయ చక్షసే యోవశ్శివ తమోరసః।
తస్యభాజ యతేహనః। ఉశతీరివ మాతరస్తస్మా
అరంగ మామవో యస్యక్షయాయజిన్వథ।ఆపోజన యథాచనః॥

---

ద్రుపాదక ముందు నుండియే అన్నమో అన్నమోయని బొట్టుగొట్టు కొనుట భ్యాసము కలద ని తెలియుచున్నది॥ మహే=గొప్పదియు రణాయ= రమణీయంబునువగు చక్షసే= జ్ఞానము కొఱకు— దధాతన= నిలుపుడు॥ మిక్కిలి రమణీయమగు పారమేశ్వర జ్ఞానము ను మాకొసంగు డనియర్థము॥ వః= మీయొక్క— యః= ఏ, శివతమః= మిగుల శాంతిమ గు, రసః= ఆనందము కలదో తస్య= నిరతిశయ మగు నాపారమేశ్వ రానంద మును ఇ హ= ఈజన్మము నందు— నః= మమ్ములను— భాజయత= పొందింపుడు॥ ఈజన్మముననె పా రమేశ్వ రానందము నొసంగి మమ్ములను ముక్తి నొందఁ జేయుఁడను భావము॥ అదియట్లని న; ఉశతీః= ప్రేమగల, మాతరః= తల్లులు స్తన్యారసముచే పుత్రులను పోషించి నట్లు ఆ నందము నొసగి మమ్ములను ముక్తులను జేయుఁడనియాశయము॥ వః= మీయొక్క— తస్మై= ఆరసమును ఆనందమును అరం= మిక్కిలి గమామ= పొందుదుము గాక యస్య= ఏయానంద ము యొక్క— క్షయాయ= నివాసము కొఱకు, జిన్వథ= ప్రేమగలిగి యున్నారో ఆయా నందమును పొందుదుము గాకయనిపూర్వ వాక్యముతో నన్వయము॥ హే ఆపః= ఓ యుదక ము లారా నః= మాకు— ఆనంద ప్రాపక మగు పారమేశ్వర జ్ఞానమును జన యథా= సం పాదించుడు॥ జలములచేతనము లగుటంజేసి వానిం బ్రార్థింప యుక్త ముగాదు గాన జలా భి మాని దేవతయే ఈమంత్రమున జెప్పబడునని గ్రహింప వలయు॥ పూర్వా చార్యులైన న్నో జలములకు నంతర్యామి యగు పరమేశ్వరుని పరముగా నీమంత్రమును వివరించి యు న్నారు॥ అయినను సర్వాంతర్యామి యగు పరమేశ్వరుండు సర్వ మంత్ర మూల కుడు ప్ర తిపాద్యుఁడే గాన నీమంత్రమున ప్రతిపాద్యుఁడనుటలో విశేషము లేదు॥ గాన నీమంత్ర ము జలాభిమాని దేవతా పరముగనె వివరింపఁ బడియె॥ ఆపోహిష్ఠా అను మంత్రమునకు తొమ్మిది పాదములు గలవు॥ ప్రతి పాదమునను జలమును ప్రోక్షించు కొనుచుండ బ్రహ్మ హత్యాదోషము తొలంగునని అనివ్యాసుడు చెప్పెను॥ ఆపోహిష్ఠా అనుమంత్రముతో జల ముచల్లు కొనవలయును॥ జలములే సకలదేవతలనగు॥ దేవతలచేతనే తన్నుపవిత్రునిగాఁ జే సికొనవలయును॥ అట్లనుటి చెప్పుచున్నది॥

వ్యా॥ హే ఆపః యూయం మయఇతిసుఖనామ తస్యభువః భూమయః స్థ భవత హిశబ్దః ప్రసిద్ధౌ (తాన ఊర్జేద ధాతన) తాః తాదృశ్యః యూయం నః అస్మాన్ ఊర్జే ఇష్టలింగో పాసనాయ దధాతనస్థాపయత శ్రు॥ ఇష్టమూర్జంత వసాని యచ్ఛత ఇత్యాదా ఊర్క్ శబ్దస్య ఇష్టలింగ పర తయాహాంతో) వర్ణాత్॥ అతః ఊర్జే అన్నాయేతియేవివృణ్వాతే తేఓద యాదస్యన్న మన్న మిత్యుదర తాడనాభ్యాస మావేదయంతే॥ (మహేరణాయచక్షసే] మహే మహతే రణాయరమణీయాయ చక్షుసే దర్శనాయ దధాతన స్థాపయత మహద్రమణీయం పారమేశ్వరం జ్ఞాన మస్మభ్యం ప్రయచ్ఛ తేత్యర్థః॥ (యోవశ్శివ తమోరసః) వః యుష్మాకం సంబంధీయః శివతమః శాంతతమః రసః ఆనందః అస్తి [తస్యభాజయతే హనః) తస్యేతి ద్వితీయార్థే షష్ఠీ. తంనిరతిశయం పారమేశ్వర మానందం ఇహ జన్మని నః అస్మాన్ భాజయత ప్రాపయత అస్మిన్నేవ జన్మని పారమేశ్వ రానంద ప్రాపణే నాస్మాన్ముక్తిభాజః కురుతే త్యర్థః॥ కిమివ (ఉశతీరివ మాతరః] ఉశతీః ఉశత్యః( కామయమానాః) మాతరః యథా పుత్రాన్ స్తన్యరసేన పుష్ణంతి తథైవాస్మానానంద ప్రాపణే నామృతాన్ కురుతేతి భావః కించ (తస్మా అరంగ మామవః) వః యుష్మదీయం తస్మాఇతి ద్వితీయార్థే చతుర్థీతంరస మనవధిక మానందంఅరం అలం గమామేతి ఛాందసంరూపం॥ ప్రాప్నుయామేత్యర్థః, [యస్యక్షయాయ జిన్వథ] యస్య ఆనందస్య క్షయాయ నివాసాయ జిన్వథ ప్రీతా భవథః తస్మాఅరంగమామేతిపూర్వే ణాన్వయః (ఆపోజనయథా చనః) హేఆపః నః అస్మాకం ఉత్కలక్షణానంద ప్రాపకంపారమేశ్వరం జ్ఞానంజనయథా సంపాదయతే త్యర్థః

అత్రఅప్సుదైవ జలాభిమానినీదేవతా సిగద్యతే అన్యథా అహమ

---

ఈవిధమున మార్జనము చేసికొని సూర్యశ్చేతు మంత్రముతో మంత్రించి జలము పానము చేయవలయును॥ అగ్నిశ్చ అనుమంత్రముతో సాయంకాలమునను సూర్యశ్చేతి మంత్రముతో ప్రాతః కాలమునను ఆపః పునంతు అను మంత్రముతో మధ్యాహ్నమునను జలము పుచ్చుకొన వలయునని [illegible]

ష్ఠితనత్వేన ప్రార్థనాయోగ్యత్వాత్ పూర్వాచార్యాస్తు, అపాపమంత
ర్యామీపరమేశ్వర ఏవ ప్రకృతమంత్ర ప్రతిపాద్య ఇతి వదంతి॥ యోఽప
శ్శివతమోరసఇత్యాది తత్పతుఏవసుసంగతంచభవతి॥ తథాపి, సర్వాం
తర్యామిణః పరమేశ్వరస్య సర్వమంత్ర ప్రతిపాద్యతయాఽస్య ప్రకృత మం
త్ర ప్రతిపాద్యత్వ విశేషఇతి జలాభిమాని దేవతా పరతయైవ వివృ
తఇతి జ్ఞేయం అత్రవ్యాసః॥ఆపోహిష్ఠాస్స్వప్రసిద్ధాఃపవపాదాభవసన్ని తేపా
దేవా జేష్ఠి పేద్వారి బహ్మాహత్యాం వ్యపోహతి॥ ఇతి॥ శ్రు॥ ఆపో హి
ష్ఠా మయో భువ ఇత్యాదిభి ర్మార్జయన్తి ఆపోవై సర్వాదేవతాః దేవతా
భిరేవాత్మానం పూయన్త ఇతి॥

ఏవముక్త విధినా మార్జయిత్వా సూర్యశ్చేత్యపః పిబేత్। తథా
చశౌనకః॥ అగ్నిశ్చేత్యనువాకేన సాయం కాలే అపః పిబేత్। సూర్య
శ్చేత్యనువాకేన ప్రాతః కాలేపిబేదపః ఆపఃపునన్త్విత్యనేన మధ్యా
హ్నేచ జలంపిబేత్॥

మం॥ సూర్యశ్చ మామన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః।
పాపేభ్యోరక్షన్తాం। యద్రాత్ర్యా పాపమకార్షం। మనసావా
చాహస్తాభ్యాం। పద్భ్యాముదరేణ శిశ్నా। రాత్రిస్తదవలుం
పతు। యత్కించ దురితంమయి। ఇదమహం మామమృత
యోనౌ। సూర్యేజ్యోతిషి జుహోమిస్వాహా॥

సూర్యశ్చ అనుమంత్రము నకు నర్థము॥

సూర్యః= పగటి కధిపతి అనగా సూర్యమండలాభిమాని దేవతయగుటచేపగలుచేయు
కర్మములు ఆదేవత యొక్క వశమున నుండుగాన నాదేవతను ప్రార్థించుటయుక్త మేయ
గు వాస్తవము నఆదిత్యాంతర్యామి యగుపరమేశ్వరుఁడే ఇచటప్రార్థింపఁ బడుచున్నా
డు సర్వకర్మాధి పతిత్వము పరమేశ్వరు నందే సమంజసము గావున నాయర్థమే యుక్త
ము-మన్యుః= క్రోధముపాపప్రవృత్తి క్రోధముయొక్క వశముననుండుగాన దానిఁప్రార్థించు
టయు నుచితమే॥ మన్యుపతయః= రాగద్వేషాదులు అధికన్ను మొదలగు నింద్రియములను
గాలములలో విషయముల యందుఁ బ్రవేశించిన వారిని వశపరచు కొనుచుందురు॥ అట్లు
వశపరచుకొన [illegible] మన్యుకృతే
భ్యః= కోపముచే చేయఁ బడిన పాపేభ్యః= పాపముల వల్లనుండి రక్షన్తాం= రక్షిం చుత

త్యా॥ సూర్యః అహ్నాధిపతిః సౌరమండలాభిమానినీ దేవతా అహ్నికరిష్యమాణానాం కర్మణాం తద్ధీనత్వాత్। తత్ప్రార్థనా ఉచితా॥ వస్తుతస్తు। అంతర్యామీ పరమేశ్వర ఏవాత్ర ప్రార్థ్యతే. సర్వకర్మాధిపతిత్వాత్తత్రైవ సామంజస్యాత్॥ మన్యుః క్రోధః తదధీనత్వాత్పాపప్రవృత్తేస్తత్ప్రార్థనా ప్యుచితా॥ మన్యుపతయః రాగద్వేషాదయః. తేచక్షురింద్రియాది భిర్బహిర్విషయేషు ప్రవిష్టాః స్వావశీకుర్వన్తి. తదభావాయ తద్విషయ ప్రార్థనాపి సంగచ్ఛతే॥ మన్యుకృతేభ్యః పాపేభ్యో రక్షన్తాం॥ కామఏష క్రోధఏష రజోగుణ సముద్భవః। మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహవైరిణ మిత్యాది ప్రసిద్ధ క్రోధాఖ్య మన్యుకృతే భ్యస్సర్వేభ్యః పాపేభ్యో రక్షన్తాం, యథాహం క్రోధవివశో భూత్వాపాపం నకుర్యాం తథాసూర్యాదయో రక్షన్తామిత్యర్థః. కించ॥ యద్రాత్ర్యా పాపమ కార్షం రాత్ర్యా సప్తమ్యర్థే తృతీయారా త్రావిత్యర్థః॥ యద్వా రాత్రి శబ్దేన తదభిమానినీ దేవతోచ్యతే తయాప్రేరితో యత్పాపమ కార్షం తదేవ విశినష్టి (మనసావాచాహస్తాభ్యాం) మనసా పరహింసాపి చింతనేన, వాచా అనృత భాషణాదినా, హస్తాభ్యాం బ్రహ్మస్వాపహరణాదినా॥ పద్భ్యా ముదరేణ. శిశ్నా

---

గాక॥ కామము క్రోధము ననునవి రజోగుణంబునఁ బుట్టినవి॥ ఎంతకును తృప్తి నొందనివి కావు మహాపాతకములఁ జేయించునవియై నగు కావున వీనిని శత్రువులుగాఁ దెలిసికొనుము అనిగీతలలోఁ జెప్పఁబడినక్రోధముచేఁ జేయఁబడు పాపముల నుండి రక్షింతురుగాక, ఎట్లనఁ, నేనుక్రోధపర వశుఁడనై పాపముచేయ కుందునో అట్లు సూర్యాదులు రక్షింతురుగాక యనియర్థము॥ ఇదిగాక, రాత్ర్యా= రాత్రియందు లేక, రాత్ర్యభిమాని దేవతచే (ప్రేరింపఁ బడి) యత్, పాపం= ఏపాపమును అకార్షం= చేసితినో ఎట్లన మనసా= మనస్సుచే పర హింసాదులు చింతించుట చేతను వాచా= అసత్య భాషణాదుల చేతను- హస్తాభ్యాం= బ్రహ్మస్వము హరించుట మొదలగు వానిచేతను, పద్భ్యాం పోరానిచోట్లకు పోవుటచేతను, ఉదరేణ భక్షింపఁ గూడని వానిని భక్షించుట చేతను, శిశ్నా అగమ్య గమనాదుల చేతను, సర్వేంద్రియముల చే నేపాపము చేసితినో ఆపాపమును రాత్రిః రాత్ర్యభిమాని దేవత, అగ్ని, లేకచంద్రుఁడు- అవలుంపతు= పోఁగొట్టుదురు గాక మఱియు, యత్కించ ఏదేని- ఈజన్మమునగాని జన్మాంతరమునఁ గాని చేయఁబడినను

పద్భ్యాం అనాక్రమిత వ్యదే శాక్రమణాదినా, ఉదరేణ అభక్ష్య భక్షణాదినా, శిశ్నా శిశ్నేన, అగమ్య గమనాదినా ఉక్తానామింద్రియాణా మన్యేషా మప్యుపలక్షణ త్వేన సర్వేంద్రియై శ్చ, యచ్చపాప మకార్షంతత్సర్వంరాత్రిః రాత్ర్యభిమానినీ దేవతా, అగ్నిశ్చంద్ర మావా అవలుంపతు వినాశయతు. కించ, యత్కించ నాపి ఇహాజన్మని జన్మాంతరేవా కృతం దురితం పాపరాశిః, మయివర్తతే ఇదంసర్వం పాపజాతం. తస్యకర్తారం, మాంచ, అమృతయోనా అమృతం మరణాభావః, తస్యయోనిః కారణం అధవా, అమృతః పరమేశ్వరః, అమృతస్యవాహా నామధే యానీతి మంత్ర వర్ణాత్, సఏవయోనిః కారణం యస్య తస్మిన్, సూర్యే సుష్ఠు ఈరయతి ప్రేరయతీతి సూర్యః తస్మిన్నాదిత్యాత్మకే జ్యోతిషి, ఆదిత్యాంతర్యామిణి స్వయం ప్రకాశ బోధైక రూపే పరమేశ్వరే అహంజుహోమి ప్రక్షి పామిపార మేశ్వరాగ్నౌ ప్రక్షిప్య తేనాగ్నినా పూర్వోక్తం పాపం భస్మీకరోమీతిభావః॥ సాయం సంధ్యా యామ పాంపానే వినియుక్తస్య అగ్నిశ్చేత్యనువాకస్యాపి సూర్యశ్చేత్యను వాకే నతు ల్యోర్థః॥ ఇయాంస్తు విశేషః

మా॥ అగ్నిశ్చ మామన్యుశ్చ......... సత్యేజ్యోతిషి జుహో॥ మిస్వాహా॥ అగ్నిః రాత్ర్యధిపతిః, అహః అహర భిమాని నీదేవతా, సత్యే అవితథ స్వభావే, జ్యోతిషి పరమేశ్వరే, శిష్టంపూర్వవత్॥

---

కిత్తి, పాతకము, మయి, నాయందు గలదో ఇదం, ఈ పాపము నంతయు, అట్టి పాపములను చేసిన మాం, నన్నును, అమృతయోనౌ, పరమేశ్వరుని వల్లగలిగిన సూర్యే, సూర్యుడనే జ్యోతిషి= జ్యోతిస్సునందు లేక అమృతయోనౌ= ముక్తి ప్రదుఃడును, సూర్యే=సూర్యునకంతర్యామియు నగు, జ్యోతిషి= స్వయం ప్రకాశ జ్ఞాన స్వరూపుడగు పరమేశ్వరునందు, అహం= నేను, జుహోమి= హోమము చేయు చున్నాను. పారమేశ్వరాగ్నియందుంచి యాయగ్నిచే పూర్వోక్త మగు పాపమునుభస్మముచేయుచున్నానని యర్థము.

సాయం సాయంకాలమున జలము పుచ్చుకొను నప్పుడు వినియోగింపఁబడు అగ్నిశ్చఅను మంత్రమునకును నిదియే యర్థము॥ ఇందిది విశేషము॥ అగ్నిః= రాత్రి కధిపతి యను దేవత, అహః= పగటి యందు నభిమానము గలదేవత, సత్యే= నిజమగు- జ్యోతిషి.

అథమధ్యాహ్నసంధ్యాయాం జలపానేవినియుక్తోమంత్రోయథా మా॥ ఆపఃపునన్తు పృథివీంపృథివీ పూతా పునాతుమాం।
పునన్తు బ్రహ్మణస్పతి ర్బ్రహ్మ పూతాపునాతుమాం। యదు
చ్ఛిష్ట మభోజ్యం యద్వాదు శ్చరితం మమ। సర్వంపునన్తు
మామాపోఽ సతాంచ ప్రతిగ్రహగ్గ్ స్వాహా।

వ్యా॥ ఆపః మంత్రితా ఆపః పృథివీం పృథివ్యంశ ప్రాధాన్యేన పృథివీ శబ్దేన స్థూలశరీరము చ్యతే. తత్ పునన్తు. శోధయన్తు। తథా పూతా పృథివీ తదభి మానినం మాంచ పునాతు. తద్గతరా గద్వేషా ది మలని రాసేన మాంశోధయ త్విత్యర్థః (పునన్తు బ్రహ్మణ స్పతిః) బ్ర హ్మణః వేదస్య పతిః, దేశికః, మాంపునన్తు. శోధయతు, సుప్వ్యా పణ త్యేత వచనస్య బహువచనం॥ బ్రహ్మపూతా పునాతుమాం। బ్ర తా సర్వతః పూతం బ్రహ్మ వేదః, ప్రథమైక వచనస్యాకారః, మాం పునాతు శోధయతు, యత్, ఉచ్ఛిష్టం పురుషాన్త రస్య మహోప

---

పారమేశ్వర జ్యోతిస్సు నందు అనివిశేషము॥ కడమదంతయు సమానమేయగు॥

మధ్యాహ్న సంధ్య చేయు నప్పుడు జలపానమున వినియోగించు- ఆపః పునన్త్వి సుమంత్రమున కర్థము॥

ఆపః= మంత్రింపఁ బడిన జలములు- పృథివీం= స్థూల శరీరమును పునన్తు= పవి త్రము చేయు గాక॥ పూతా= పవిత్రమైన పృథివీ= స్థూలశరీరము మాం= దానియందభి మానము గలనన్ను, పునాతు= పవిత్రము చేయుగాక, రాగద్వేషాదులు పోవునట్లు నన్ను శు ద్ధునిఁ జేయుఁ గాక॥ అనియర్థము॥ బ్రహ్మణః= వేదమునకు- పతిః= దేశికుఁడగు నీశ్వ రుఁడు పునన్తు= పవిత్రునిఁ జేయుఁగాక॥ పూతా= పవిత్రమగు బ్రహ్మ= వేదము మాన న్ను పునాతు= శుద్ధిచేయుగాక॥ యత్= ఏ, ఉచ్ఛిష్టం= అన్యపురుషు నుచ్ఛిష్టము నాచే భుజింపఁ బడినదో, యచ్చ= ఎద్ది, అభోజ్యం= పతితాదుల యన్నము, భుజింపఁ బడి నదో, యత్= ఏ, మమ= నాయొక్క, దుశ్చరితం= పరదార గమనాదుల వలన గలిగిన పాపము గలదో, దానిని, ఆపః= జలములు, పునన్తు= శోధించుగాక, అసతాం= దుష్టుల వలన, ప్రతిగ్రహం= ద్రవ్యము తీసికొని నందువ గలిగిన పాతకము కలదో, సర్వం= అపా పనమును నశింపఁ జేయుగాక అని యర్థము॥ మాం= నన్ను స్వాహా= హుతము చేయుచున్నాను॥

భుక్తమిత్యర్థః॥ యచ్చ,అభోజ్యం పతితాద్యన్నం యచ్చ మమసంబంధి దుశ్చరితం, పరదారగమ నాది నిదానం సర్వ ఘజాతం, అపః పున స్తుఅసతాంచ,(పతి(గహం, ద్రివ్యం (పతి గ్రహ నిమిత్తం యత్పా పం, తత్సర్వమపిచ నాశయంత్విత్యర్థః తాఆపః శేషపాపం మాం స్వాహా ప్రోక్షిపామి సిరస్త సమస్తే పల్లవే పరమేశ్వరే హోజయామీత్యర్థః ఇతి (ప్రాశ్యాచమ్య దధిక్రావణ ఇత్యాద్యై పునర్జలం శిరసి ప్రోక్షేత్॥ తదుక్తం పితామహేన॥ ప్రోక్షేత్సుర భిమత్యాచ ఆపోహిష్ఠాది భిస్త్రి భిరితి॥ సురభిమతీ, దధిక్రావణ ఇతిఋక్॥ చంద్రజ్ఞానోత్తరే॥ పాదాహ ప్రాచసంతహ్యాచమ్య బద్ధశిఖశ్శుచిః॥ ప్రాణానాయమ్య సంకల్ప్య సం ధ్యోపాస్తిం సమాచరేత్॥ (ప్రోక్ష్యాబ్లింగై ర్వ్యాహృతిభిః పరిషిచ్య యన్మంత్రకం పీత్వాచమ్య దధిక్రాద్యైః(ప్రోక్ష్యాఽద్భిః పరిషిచ్యచేతి॥

మూ॥ దధి క్రావ్ణో అకారిషం జిష్ణోర శ్వస్య వాజి నస్సురభినో ముఖాకరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్॥

వ్యా॥ దధి క్రామతి ప్రాప్నోతీతిదధిక్రావా దధి క్రావణ ఇతి షష్ఠీ॥ దధిప్రియః కశ్చిద్దేవతా విశేషః తస్యదేవస్య అకారిషం కర్మకృత వాన స్మి. కీదృశస్య జిష్ణోర్జయ శీలస్య అశ్వస్య వ్యాపినః, అహూన్వాప్తా,వా జినః అన్నవతః, అకార్షమితి పూర్వే ణాన్వయః, సః దేవః, నః అస్మా కం, ముఖా ముఖాని, సురభీకరత్ కస్తూరాది ద్రవ్యప్రదానేన సుగం ధోపేతాని కరోతు, వః అస్మాకం ఆయూగ్ంషి, ప్రతారిషత్ (ప్రవ

---

ర్ధ్వ పరమేశ్వరు నందు హోమము చేయుచున్నానని యర్థము॥

అని జలము పుచ్చుకొని, ఆచమనము చేసి— తిరుగ—, దధిక్రావ్ణ మొద లగు మం త్రములతో జలమును శిరమున జల్లుకొన వలయును॥

ఈసందర్భమున పితామహుండు॥ దధిక్రావణః అను ఋక్కుతోను, ఆపోహిష్ఠా ది ఋక్కులతోను (ప్రోక్షణము చేసికొన వలయును అనిచెప్పెను॥

చంద్రజ్ఞానోత్తరమున యందును, కాలుసేతులు గడిగికొని, సిగముడి వైచి కొని ఆచ మనము చేసి, (ప్రాణాయామ మొనరించి, సంకల్పము చేసి సంధ్యోపాసన చేయవలయు ఆపోహిష్ఠాది మంత్రములతో శిరమున జలముచల్లుకొని, జలము పానముచేసి, ఆచమనము

ర్ధ యతు. తత ఆపో హిష్ఠా హిరణ్య వర్ణా ఇత్యాద్యను వాకైః ప్రో క్షయేత్॥ ఆపోహిత్య స్యార్ధ ఉక్తః॥

మూ॥ హిరణ్యా వ ర్ణాశ్శుచయః పావకా యాసు జాతః కశ్యపోయా స్వింద్రః। అగ్నింయాగర్భంద ధిరేవి రూపాస్తాన ఆపశ్శగ్గ్ స్యోనాభవన్తు॥

వా॥ హిరణ్య వర్ణాః సువర్ణ చ్ఛాయాః తామ్ర వర్ణా ఇతియా వత్. దివేతి శేషః॥ తథాచ బ్రాహ్మణం। యద్దివా దివాభ వత్యపో రాత్రిః ప్రవిశతి తస్మాత్తా మ్రా ఆపో దివాద దృశ్యే ఇతి॥ శుచయః శుద్ధాః, పావకాః పావిత్ర్యా, కారిణ్యః స్నానాదినాపావన ప్రదాయిన్య

---

గావించి, దధి క్రావణః ఈ మొద లగు మంత్రి ములతో అగిరి మార్జనము చేసి కొన వల యు వనియున్నది॥

దధిక్రావణః అను మంత్రమునకు నర్థము॥

దధి, పెరుగును– క్రామతి, పొందుచున్న వాడు॥ దధిక్రావా– దధిక్రాన్న, ద ధిప్రియుండగు నొకానొక దేవతయొక్క– అకారివం కర్మమును చ్చేసినవాండ నైతిని॥ ఆ దేవతి యెట్టిదనంగా– జిష్ణో– జయించు స్వభావము గలదియు,అశ్వస్య, వ్యాపించినదియు వాజినః, అన్నము గలదియు నగు॥ సః, ఆదేవత, నః, మాయొక్క– , ముఖాని, ముఖము లను, సురభీ కరత్, కర్పూరాది ద్రవ్యముల నొసంగి సుగంధ యుక్త ములను గావించు గాక, నః, మాయొక్క– , ఆయూగ్ంషి, ఆయువులను, ప్రతారిపత్, వృద్ధి పొందించు గాక అనియర్థము॥

తిరువాత, ఆపోహిష్ఠా– హిరణ్య వర్ణాః ఈమొదలగు నను వాకములతో ప్రోక్ష ణము చేసికొన వలయు॥ ఆపోహిష్ఠా మొదలగు వానియర్థము చెప్పం బడియెను॥ హిరణ్య వర్ణాః అను మంత్రమున నర్థము॥

హిరణ్యవర్ణాః, సువర్ణ చ్ఛాయగలవి, పవలు ఎ్రని వన్నెగలవి యనిభావము॥ శు చయః= పవిత్ర మైనవియు, పావకాః, పవిత్రము చేయువవియు, స్నానము చేయువా రిని పవిత్రులం గావించినవి యనియర్థము, ఇట్టియే జలములు గలవో– మతియు, యాసు, ఏజలముల యందు, కశ్యపః, సూర్యుండు జాతః, పుట్టెనో, యాసు, ఏజలముల యందు ఇంద్రః, ఇంద్రుడు పుట్టెనో, విరూపః= బహు రూపములగు, యాః, ఏజలములు, అ గ్నిం, బడబాగ్నిని, గర్భం, గర్భస్థజంతువునుగా, దధిరే, ధరిం చెనో తాః, అ, ఆపః

ఇత్యర్థః॥ ఏవం భూతాయాస్తిష్ఠన్తు॥ కించ యాస్వప్సు కశ్యపః పశ్యతీ
తి వర్ణ్యత్వయా తత్క-స్యపో జగచ్ఛక్షుస్సూర్యోజాతిః అబని, ఇంద్ర
స్సు రేశ్వరో యాస్వప్స్వేవ జనీత్యర్థః విరూపాబహురూపాయా ఆపః
అగ్నిం బడబాముఖం, గర్భం దధిరే గర్భస్థ జంతుత్వేన ధృతవత్య ఇ
త్యర్థః॥ తా ఆపః,నః అస్మాకం. శం దుఃఖనాశిన్య స్స్యోనాస్సు ఖదాయి
న్యశ్చ,భవన్తు॥

మూ॥ యాసాగ్ం రాజవరుణోయాతి మధ్యే సత్యానృతే॥ అవపశ్యం
జనానాం।మధుశ్చ్యుతశ్శుచయో, యాః పావకా స్తాస ఆపశ్శగ్ం
స్స్యోనాభవన్తు॥

వ్యా॥ మార్జన విని యుక్త మంత్రాంతర మాహ॥ యాసాగ్ం
రాజేతి॥ వరుణో జలాభి మాని దేవతా, యాసా మపాం రాజా ప
తిరిత్యర్థః॥ సః జనానాం, సత్యానృతే పుణ్యపాపే, అవపశ్యన్ ఈక్ష
మాణః, యాసాం మధ్యే అస్తీతి శేషః, పంచానా మపి భూతానాం
పుణ్యపాప సాక్షిత్వం ప్రసిద్ధమేవేతి జలగతం సాక్షిత్వం తదభి మా
నిని వరుణ ఉపపద్యతే॥ అత్ర. అవపశ్యన్ వివేచయన్నిత్యక్త్వాలివా
ను కూల్యేన వరుణ పదస్య దండ ధర ఇత్యర్థ కల్పనం యత్పరేషాంతే

---

జలములు, నః, మాకు, శం, దుఃఖమును పోగొట్టునవి యు, స్యోనాః, సుఖ మొసఁగు
నవియు- భవన్తు, అగుగాక॥

యాసాగ్ం రాజా అనుమంత్రమునకు నర్థము॥

వరుణః, వరుణుఁడని పేరుగల జలాభిమాని దేవత, యాసాం, ఏజల ములకు, రా
జా, ప్రభువగునో, సః, ఆవరుణుఁడు- జనానాం, జనులయొక్క-, సత్యానృతే, పు
ణ్యపాపములను, అవపశ్యన్, చూచుచు, మధ్యే, జలమధ్యమున గలఁడో పంచ భూత
ములకును పుణ్యపాప సాక్షిత్వము ప్రసిద్ధియే గావున జలము నందగు సాక్షిత్వము జలా
భిమాని యగు వరుణుని యందు నుపపన్నమగు చున్నది॥ ఇచట కొందఱు అవపశ్యన్,
వివేచన చేయుచు ననియర్థము చెప్పి వరుణుఁడనగా- దండ ధరుడు అనియర్థము చెప్పుచు
న్నారు॥ కాని యది యుక్తము కాదు॥ ఏలన, నను వరుణునకు జలాభి మాని త్వము ప్ర
సిద్ధమై యున్నదిగాన, అయ్యది దండ ధరునందు గన్పించుట విరుద్ధము॥మధుశ్చ్యుతః,తే

వ్యా॥ శివేనేతి॥ హేఆపః, శివేన కల్యాణ రూపేణ, చక్షుషా కటాక్షేణ, మాపశ్యత, మయి నిరంతరం కరుణాదృష్టిం న్యస్యతే త్యర్థః శివయా తనునా కల్యాణ మూర్త్యా, మేత్వచం ఉపస్పృశత మదీయాం త్వచం స్పర్శనేన పావయ తేత్యర్థః॥ తతస్స్వాకృత్యే మాహ॥ సర్వానగ్నీనితి, హేఆపః వః యుష్మాకం, అప్సుసీదన్తి తిష్ఠన్తీత్యప్సుషదః జలస్థాన్, సర్వానగ్నీన్ బాడబాదీన్, హువే ఆహ్వయామి, కిమర్థమిత్యత ఆహ॥ మయి వర్చఇతి, హేయువర్చః దీప్తిః, బలం శక్తిః, ఓజః ఉత్సాహః, ఏతత్సర్వం మయి నిధత్త స్థాపయత॥ మాం వర్చస్వినం బలవన్త మోజస్వినంచ కురుతేత్యర్థః॥

ఏవం మార్జనం విధాయ పాపపురుష వినిర్గమాయ జలం దక్షిణ కరే నిధాయ నాసికాగ్రం నీత్వా నిశ్వస్య వామభాగే భువి నిక్షిప్య తజ్జలం నావలోకయేత్॥ తదుక్తం నాసిస్థే॥ గృహీత్వా పాణినా వారి స్పృశా ఘ్రాణాస్త్మృచం జపేత్। ఉద్ధృత్య దక్షిణేహస్తే జలం గోకర్ణవత్కృతే॥ నిధాయ నాసికాగ్రేతు పాపపూర్షంచ సంస్మరేత్। బిభృయాన్నాసి కారంధ్రాత్తు నిరుద్ధ ప్రాణ మారుతః వామే నిక్షిప్య మేదిన్యాం తజ్జలం నావలోక యేదితి॥ తత్ర వినియుక్త మన్త్ర మాహ॥

---

యా, తనువా, కల్యాణ రూపముతో, మే, నాయొక్క, త్వచమ్, చర్మము ను ఉపస్పృశత, తాకుడు॥ నాచర్మమును స్పృశించి పవిత్రము చేయుడు డని యర్థము॥ హేఆపః, జలములారా, వః, మీయొక్క, అప్సు సదః, జలమున నున్న యగ్నులను, హువే, పిలుచుచున్నాను॥ ఎందుక నగా, మయి, నాయందు, వర్చః, దీప్తిని, బలం, శక్తిని, ఓజః, ఉత్సాహమును, నాయందుంచుడు నన్ను బలవంతునిగను, ఉత్సాహవంతునిగను, దీప్తిమంతునిగను చేయుడని యర్థము॥

ఇట్లు మార్జనము చేసికొని, పాపపురుషుడు వెళ్లుటకై జలమును కుడిచేతియందుంచుకొని, ముక్కునద్ద జేర్చి, యందు నిట్టూర్పువిడిచి, ఎడమ ప్రక్క నేలమీద వైచి, దానిని చూడఁగూడదు అనుటకు నాసిస్థము నందు, అట్లే చెప్పబడివ కుడి చేతియందు జలము గ్రహించి తదశాఖయందుఁ జెప్పఁబడిన ఋక్కును పఠింప వలయును॥ దానిని ముక్కు నద్దఁజేర్చి పాపపు రుషుని దలంచి ముక్కు రంధ్రములనుండి విడువ వలయును॥

మూ॥ ద్రుపదాదివేన్ముముచానః స్విన్నస్స్నాత్వీమలాదివ।
పూతం పవిత్రేణేవాజ్యమాపశ్శున్ధన్తు మైనసః॥

వ్యా॥ ద్రుపదాదితి॥ ఆపః, మాం, ఏనసః శున్ధన్తు మోచయ
న్తు తత్రదృష్టాంతమాహ॥ ద్రుపదాదివేతి॥ అపరాధినాం పాదయోః
కీలితం కాష్ఠం ద్రుపదం తస్మాత్, ఇన్ముముచానః ముక్త ఇవ॥ యథాఽద
యా ఛుంధికారీ బంధనాదపరాధినం మోచయతి తద్వదిత్యాశయః,
అత్ర దృష్టాన్తాన్తరమాహ॥ స్విన్న ఇతి॥ స్విన్నః స్వేదవాన్, స్నా
తి శేషః, స్నాత్వీస్నానకృత్, మలాత్ సర్వశరీరవ్యాపి మాలిన్యాన్ము
క్త ఇవేత్యర్థః॥ స్విన్నస్య హి సతస్స్నానకరణే సర్వమపి శారీరం మ
లమపగతం భవతి తద్వదితి భావః అత్ర ఉదాహరణాన్తరమాహ॥
పూతమితి॥ పూఙ్ సంజ్ఞాయామితి కరణే ఇతి ప్రత్యయః తేనప వి
త్రేణ సమనాగ్రదర్భరూపేణ, సమూసా గాదర్భౌ ప్రాదేశమాత్రౌ
పవిత్రీకృత్వా ఇతి శ్రౌతే దర్శనాత్, పవిత్రం వైదర్భ ఇతి సుతేశ్చ॥
తేన పూతం శోధితం, ఉదగగ్రాభ్యాం పవిత్రాభ్యాం పునరాధార
మాజ్యం త్రిరుత్పూయేతి శ్రౌతవచనాత్, సంస్కృతమాజ్యం సర్పి

తియవాని నాజలములు ఎనదు ప్రక్కనేలనూన నైవి యొబ్బుమాకుచుమనవు॥ అవి మున్న
ది॥ అప్పుడు పఠింప వలెనది ద్రుపదాదివ అను మంత్రము॥ దీని యర్థమే మనగ
ఆపః జలములు, మాం నన్ను, ఏనసః పాపములనుండి, శున్ధన్తు శుద్ధి చేయు
గాక॥ అందు దృష్టాంతము చెప్పుచున్నారు ద్రుపదాత్ కాలి సంకిలినుండి, ఇన్ముముచా.
నః విడిపింపఁ బడిన వానివలె పాపమునుండి విముక్తునిఁ జేయుగాక యనియర్థము॥ దయా
శాలి యగు నధికారి దోషిని బాధనమునుండి విడిపించునట్లు విముక్తునిఁజేయుగాక అని భా
వము॥ ఇంకొక దృష్టాంతము చెప్పుచున్నారు॥ స్విన్నః చెమటఁ బోసి, స్నాత్వీ స్నాన
ము చేసిన వాఁడు, మలాదివ ఒడలి మురికి నుండి విముక్తుఁడగు విధమునను, బాగుగఁ
జెమట పట్టినవానిని స్నానము చేయఁగా శరీర గతమగు మాలిన్యమంతయు నివర్తిం
చును. అవిధముగ శుద్ధిచేయుగాక యనియర్థము॥ ఇంకను, ఆజ్యం నేయి, పవిత్రేణ దర్భచే
పూతమివ పవిత్రము నట్లు, అనఁగా పవిత్రములచేత సంస్కరింపఁ బడిన నేయి సర్వ
దోష రహితమగును॥ అట్లే జలములు నన్ను సకల పాతకములనుండి విముక్తుని చేయు

రిన పవిత్రాభ్యాముత్పూయమానత్వం యథా సర్వదోషవినిర్ముక్తం భవతి. తద్వచ్చ మార్జనాపస్నానేన సకలోర్ధ్వగయ నివృత్తి భావః॥ శ్లో॥ ఆపోహిష్ఠేతి నవభిర్మార్జనం పూర్వచోదితం। పశ్చాదపి త్రిభిరేవ స్వాది శరేషాన్తు మార్జనం॥ అథార్ఘ్యప్రదానం కర్తవ్యం తత్ప్రయోగయుక్తమంత్రస్వరూపదమేవ వక్ష్యతే॥ మాధ్యాహ్నిక సంధ్యాయామర్ఘ్యప్రదానే వినియుక్తం మంత్రమాహ॥

మూ॥ హంసశ్శుచిషద్వసురన్తరిక్షసద్ధోతా వేదిషదతిథిర్దురోణసత్। నృషద్వరసదృతసద్వ్యోమసదబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతంబృహత్॥

---

గాక అని భావము॥

ఆపోహిష్ఠా మొదలగు మంత్రములతో మార్జనము మొదట చెప్పబడినది॥ అట్లే వాని చేతను ఇంకను కొన్నిటి చేతను తరువాత మార్జనము చేసి కొనవలయును॥

అనంతరమర్ఘ్యదానము చేయవలయును॥ అందు వినియోగించు మంత్రము పదంపడి చెప్పబడును॥ మాధ్యాహ్నికసంధ్యా కాలమున అర్ఘ్యప్రదానమున వినియోగించు మంత్రము హంసః అనునది॥ దీని యర్థమేమన, హంసః పరమేశ్వరుడు, అశ్రేజ్ఞాని వాడు, శుచిషత్ పవిత్రములగు కాశ్యాది పుణ్యక్షేత్రముల యందును, భక్తహృదయాదుల యందును నుండు వాడు, వసుః జగములకు నివాస భూతుడు, అన్తరిక్షసత్ అన్తరిక్షమున నుండు వాడు, హోతా యజమానుడు, వేదిషత్ అగ్నిరూపుడు, అతిథిః అతిథివలె పూజనీయుడు, దురోణసత్ గృహముల యందుండు వాడు, నృషత్ మనుష్యులు మొదలగు సకల ప్రాణులయందు నుండువాడు, వరసత్ = శ్రేష్ఠములగు తీర్థాదులయందు నుండువాడు, ఋతసత్ = యజ్ఞాధిపతిగాన యజ్ఞమున నుండు వాడు. వ్యోమసత్ = లింగాకారమున నాకసమున నుండు వాడు అప్సువత్ = జలముల యందుండు వాడు ఋతజాః = యజ్ఞము నందు భోక్తగా నావిర్భవించు వాడు, అద్రిజాః = పర్వతముల యందుండు వాడునగు పరమేశ్వరుడు బృహత్ = గొప్పదియగు ఋతం = ఉపాసనా రూపయజ్ఞమును సిద్ధింపజేయుగాక యని యర్థము॥

ఆచమనము, శక్తి కొలది ప్రాణాయామము చేసి, దేశకాలములజెప్పి, కాలాతిక్రమణదోష పరిహారార్థము ప్రాయశ్చిత్తార్ఘ్య ... మర్ఘ్యప్రదానము చేయదు

వ్యాహంసఇతి హన్తి, ఆహవనీయాది దేశేషు. వ్యాపకతయా గ
చ్ఛతీతి హంసః, పరమేశ్వరః హంసోనామ సదాశివఇతి వచనాత్॥ సకి
బృగిత్యాశంక్యాహ॥ శుచిషదితి శుచౌదేశే, అవిముక్తాది పుణ్య క్షేత్రే
షు భక్తహృదయాకాశేచ సీదతి తిష్ఠతీతి శుచిషత్ క్షేత్రాణాం పతయే
నమ ఇత్యాదినా తథాదర్శనాత్॥ వసన్త్యస్మిన్ జగన్తీతి వసుః తస్మిన్సర్వం
ప్రతిష్ఠిత మితి శ్రవణాత్॥ అంతరిక్షేసీదతి తిష్ఠతీత్యంతరిక్షసత్. సు॥
రాంతరిక్షేతి ష్వశ్రుతి శ్రుతేః॥ హోతా యజమానః తస్య. పరమేశ్వ
రాష్టమూర్త్యా తర్గతిత్వాత్ప్రాధాన్యేనగ్రహణం వేదిషత్ వేదిః పరిష్కృ
తాభూమిః భూలోకాదిర్వా, ఉభయథా పినద్రోహ ఏవయదగ్నిరిత్యగ్నిరూ
పత్వాత్, పృథ్వీరథత్వా చ్చ తద్వ్యాప్తిత్వ ముప పద్యతే॥ అతిథిస్తత్స
దృశః ఆరాధనీయఇతి యావత్ అతిథిస్తు మహేశ్వర ఇతి వచనాత్,
దురోణసత్ దురోణేషు గృహేషు సీదతి తిష్ఠతీతి దురోణసత్. దురో
ణశబ్దస్య సవాచీప్రసిద్ధః, గృహపతి త్వాదితి భావః॥ నృషత్ నృషు మ
నుష్యేషు ఇదం ప్రాణినా ముపలక్షణం వైశ్వానరరూపేణ సీదతీతి భా
వః॥ అహం వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహమాశ్రితఇతిస్మరణాత్
తథావరసత్, వరే శ్రేష్ఠే తీర్థానా సీదతీతి నమస్తీర్థ్యా యచేతి శ్రుతేః
యద్యపి శుచిష దిత్యనేనైవ లబ్ధస్యార్థస్సిద్ధః తథాప్యాదరాత్పునరుక్తిః॥

---

గాని సంకల్పము గావించి, జలము తీసుకొని, లేచి, చూపుడు వ్రేలును బొటన వ్రేలును తగుల కుండు నట్లుగా వ్యాహృతులతోఁగూడిన గాయత్రి మంత్రముతో మొదట ప్రాయశ్చిత్తార్థకము నొసఁగి,తరువాత మూఁడును అర్ఘ్యములు విడువ వలయును॥ ఇందు గొందఱు ప్రాతః కాలసాయం కాలముల యందు మాత్రమే మూఁడేసి యర్ఘ్యములు, మధ్యాహ్న కాలమున నొక్క యర్ఘ్యమే యనియందురు॥ కాని మధ్యాహ్న కాలమున నొక్క చేయుమను వచనమునకు హంస గాయత్రితోఁ జేయబడు ప్రధానార్ఘ్య మొక్క చేయుని యభిప్రాయము గాన నప్పుడును నర్ఘ్యములు మూఁడే యని గ్రహింప వలయును॥

ఇచట నింకొక విశేషముకలదు॥ ఆపస్తంబ శాఖులు మాధ్యాహ్నిక సంధ్య నబ్రహ్మ యజ్ఞముకంటె పూర్వమే చేయవలయును॥ బ్రహ్మయజ్ఞమును ప్రాతరౌపాసన చేసి తరువాత నో మాధ్యాహ్నిక సంధ్యయో [illegible] చేయనగును॥ ఆశ్వలా

షు మంత్రేషు బాహితా నాస్తీతి ప్రసిద్ధః॥ ఋతసత్, ఋతే యజ్ఞే అధిపతి త్వేన సీదతీతి ఋతసత్ అహోరాత్రాణ మధ్వరస్య రుద్రమితి॥ పరమేశ్వర స్యాక్రత్వధీశ్వరత్వ శ్రవణాత్ వ్యోమనిత్తారకా లింగాకృతి నాసీదతీతి వ్యోమసత్ ఆకాశే తారకాలింగమితి స్మరణాత్, అప్సుజలేషు జాయత ఇత్యబ్జాః యోప్సు తిష్ఠన్నితి శ్రుతేః॥ ఋతే యజ్ఞ భోక్తృత్వేన జాత ఋతజాః, భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోకమహేశ్వర మితి స్మృతేః॥ అద్రిషు, పర్వతేషు జాతః, అద్రిజాః॥ శ్రు॥ యస్సర్వ భూతేషు తిష్ఠన్నితి శ్రుతేః ఈదృశః, పరమేశ్వరః బృహ దధికం ఋతం, ఉపాస నాత్మకం యజ్ఞం నిష్పాదయత్వితి శిష్యతే॥

ఆచమ్య యథాశక్తి ప్రాణానాయమ్య దేశకాలా ననుకీర్త్య మమసంధ్యా కాలాతిక్రమణదోష పరిహారార్థం ప్రాయశ్చిత్తార్ఘ్య ప్రదానపురస్సర మర్ఘ్యదానం కరిష్యఇతి సంకల్ప్య జలం గృహీత్వా ఉత్థాయతర్జన్యంగుష్ఠ మౌా రసంసర్గం యథాతథా సవ్యా హృతికయాగాయత్ర్యాప్రా యశ్చిత్తార్ఘ్యం దత్వా తథైవ త్రీణ్యర్ఘ్యాణి దద్యాత్॥ యద్యపి ప్రాతస్సా యంకాలయో స్త్రీణ్యర్ఘ్యాణి మధ్యాహ్నేతు ప్రధానార్ఘ్యమేకమేవ॥ మధ్యాహ్నే చాంజలిక్షేపం సకృదేవ సమాచ రేదితివచనాదితి కేచిత్॥ తథాపి తస్య వచనస్య హంసగాయత్రీ క్రియమాణప్రధానార్ఘ్యపరత్వం జ్ఞేయం॥ అత్రాయంవిశేషః॥ మధ్యాహ్నే బ్రహ్మయజ్ఞాత్పూర్వ మాపస్తంబ శాఖినాం సంధ్యానుష్ఠానం యుక్తం॥ బహ్వృ

---

యన శాఖులైన వారు ప్రాతఃకాపాసన చేసిన తరువాత గాని, మాధ్యాహ్నిక సంధ్య చేయుక ముందు గాని బ్రహ్మయజ్ఞము చేసి తరువాతనె మాధ్యాహ్నిక సంధ్యను పాటింప వలయును॥ ఏలన, మధ్యాహ్నస్నానకాలమున స్నానము చేసిన వస్త్రమును దుళ గూడను॥ అట్లుగాక ఉదికినా ఆస్నానము వ్యర్థమగును॥ ఆవస్త్రము నొద్దు వనునిచ్చి, బ్రహ్మయజ్ఞము చేయ వలయు॥ తరువాత మాధ్యాహ్నిక సంధ్యను పాటింప వలయు ననియాశ్వలాయనుఁడు చెప్పెను॥

చూపుడు వ్రేలు బొటన వ్రేలు తాకియుండఁగా అర్ఘ్యప్రదానము చేయఁ గూడదు॥ ఏలన, ఈరెండు వ్రేళ్లు తగిలి యుండుట నేవ రాక్షసముద్ర యగును॥ దానితో సర్వ

యజుషస్తు ప్రాతరౌపాసనానంతరం వా మాధ్యాహ్నిక సంధ్యానంతరం
వా యుజ్యతే। ఆశ్వలాయన శాఖినాంతు ప్రాతరౌపాసనానంతరం వా
మాధ్యాహ్నికసంధ్యావందనాత్ప్రాగేవ వా విహితః। ఇతి మాధ్యాహ్నిక
సంధ్యావివేకః॥ తదుక్తం బహ్వృచ స్మృతిసంగ్రహకారేణ॥ శ్లో॥ మ
ధ్యాహ్న స్నానవేళాయాం స్నానవస్త్రం న పీడయేత్। పీడయేద్యది మూ
ఢాత్మా తత్స్నానం నిష్ఫలం భవేత్। తీరే సంక్షిప్య తద్వస్త్రం బ్రహ్మయ
జ్ఞం సమాచరేత్। తతో మాధ్యాహ్నికం సంధ్యాం కుర్యాదిత్యాశ్వ
లాయన ఇతి॥ తర్జన్యంగుష్ఠ యోగేన నార్ఘ్యదానం కార్యం। యదుక్తం
స్మృత్యంతరే॥ తర్జన్యంగుష్ఠ సంయోగాద్రాక్షసీ ముద్రికా భవేత్।
యోగదాతి తయాచార్ఘ్యం తత్తోయం రుధిరం భవేదితి॥ ఏవమర్ఘ్యదా
నం కృత్వా సజలేన పాణినా ఆత్మప్రదక్షిణమనువ్రజ్యాచామేత్॥ తథా
చ శ్రూయతే యత్ప్రదక్షిణం ప్రక్రమన్తి తేన పాప్మానమవధూన్వన్తీ
తి స్మృతిరపి। శ్లో. అసావాదిత్య మంత్రేణ సోదకేనైవ పాణినా ప్రదక్షి
ణమనువ్రజ్య చాచామేత్సంధ్యయోర్ద్వయోరితి॥ సంధ్యయోరితి ద్వివ
చనం త్రిసంధ్యానాముపలక్షణం॥ ప్రదక్షిణే వినియుక్త మంత్రమాహ॥
మం॥ ఉద్యన్తమస్తం యన్తమాదిత్యమభిధ్యాయన్కుర్వన్బ్రాహ్మణో
విద్వాన్సకలం భద్రమశ్నుతే అసావాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవ
సన్బ్రహ్మాప్యేతి య ఏవం వేద॥

---

ము నొసఁగు నెడ నాడలము నెత్తుటితో సమాన మగునని స్మృత్యంతరమున గలదు।

ఇట్టు లర్ఘ్యము నొసఁగి, చేతితో జలము గ్రహించి, ఆత్మప్రదక్షిణము చేసి ఆ
చమనము చేయవలయు॥ ప్రదక్షిణము సేయఁగా పాపములు తొలగిపోవునని శ్రుతియం
దే కలదు॥ సంధ్యా కాలములయందు చేతితో జలము గ్రహించి అసావాదిత్యో బ్రహ్మ
అను మంత్రముతో ప్రదక్షిణము తిరుగవలయునని స్మృతియందు గలదు॥ ఉద్యన్త మను
మంత్రము ప్రదక్షిణమున వినియోగింపఁ బడును. దీనియర్థ మేమన,

ఉద్యన్తం ఉదయించుచున్నవాఁడును, అస్తంయన్తం అస్తమించుచున్నవాఁ
డు నగు, ఆదిత్యం సూర్యుని, అసౌ ఈ ఆదిత్యః సూర్యుండు, బ్రహ్మేతి పరబ్రహ్మమని
అభిధ్యాయన్ — కుర్వన్ ధ్యానము చేయుచున్న, విద్వాన్ పండితుఁడగు బ్రాహ్మణుఁడు

నిగద వ్యాఖ్యాతోయం॥ ఏవం ప్రదక్షిణం ప్రకృత్యాచమనం కర్తవ్యః ఇత్యుక్తం॥ మందేహానాం వినాశాయ నిక్షిపేత్తు జలాంజలిం। ప్రాయశ్చిత్తార్థ మాచమ్య ముచ్యతే దైత్య హత్యయేతి॥ సంధ్యా భాష్యే సమాహ॥

మూ॥ అసావాదిత్యో బ్రహ్మ

వ్యా॥ అసావితి, అసావితిపాణినా నిర్దేశః ఆదిత్యః బ్రహ్మ, పరమేశ్వరః। శ్రు॥ య ఆదిత్యే తిష్ఠన్నితి పరమేశ్వరస్యాదిత్యాంతర్యామిత్వ శ్రవణేన శరీర శరీరిణో రభేద వ్యపదేశాదితి భావః॥ తత్త్వ మంత్రార్థ కరణేన రూపితమాచార్యైః॥ ఉపస్థాన మంత్రో వివరణావసరే చ స్పష్టముపరిష్టాద్భవిష్యతి ఇమమేవాశయ మంతరను సంధాయ ప్రబ్రూతే శ్రుతిః, అసావాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి య ఏవం వేదేతి। ఇదం పారమేశ్వరం ధ్యానమేవ ప్రధానం సాంధ్య కర్మత్వాహ లోకాక్షిః అసావాదిత్యో బ్రహ్మేతి యద్ధ్యానం క్రియతే న్వహం తదేవ సాంధ్యమిత్యుక్తం కర్మబ్రాహ్మణ్య మూలకమితి॥

---

ప్రాణులను, సకలం సమస్తమును భద్రి, శుభములను, అశ్నుతే పొందును అతియూ వాడును, బ్రహ్మైవ బ్రహ్మమే, సన్ అగుచు, బ్రహ్మ పరమేశ్వరుని- అప్యేతి పొందుచున్నాడు, యః ఎవ్వడు, ఏవం ఈవిధముగా, వేద ఎఱుంగునో- వాడును, పరమేశ్వరుని పొందునని యర్థము॥ ఉదయ కాలమునందును అస్తమయ కాలము నందును, ఆదిత్యాంతర్యామి యగు పరమేశ్వరుని ధ్యానించు వాడు, సకల కళ్యాణముల నధిగమించి పరమేశ్వర సాయుజ్యము నొందునని భావము॥

ఈమంత్రము చూడగనె ఆదిత్యుడే పరబ్రహ్మయను నర్థము స్ఫురించును॥ కాని బ్రహ్మ మీమాంస యందు భాష్యకర్తలగుటచే సూర్యాంతర్వర్తియగుటచే, తదంతర్యామి యగువాడు సర్వేశ్వరుడే పరబ్రహ్మమని సిద్ధాంతము చేసియుండుటచేత యీమంత్రమును సూర్యాంతర్యామి యగు పరమేశ్వరునిపరమనియె గ్రహింపవలయును॥

ఇట్లు ప్రదక్షిణము చేసి ఆచమనము చేయవలయును॥ మందేహులను రాక్షసులు, చుట్టై మూడుకోట్ల [illegible] సంఖ్యగలవా

అథ సంధ్యాంగతర్పణం కర్తవ్యం॥ తదుక్తం॥ క్రమాత్సంధ్యాం చ గాయత్రీం బ్రాహ్మీం చ నిమృజీం తథా। తర్పయామీతి వక్తవ్యం చ తేషాం దేవతాస్స్వధా ఇతి తత్రాయం ప్రయోగః॥ ఆచమ్య ప్రాణానాయమ్య మమోపాత్త దురితక్షయద్వారా పరమేశ్వర ప్రీత్యర్థం ప్రాతస్సంధ్యాంగత్వేన తర్పణం కరిష్యే ఇతి సంకల్ప్య సంధ్యాం తర్పయామి। గాయత్రీం తర్పయామి। బ్రాహ్మీం తర్పయామి। నిమృజీం తర్పయామీతి చతస్రో దేవతాస్తర్పయేత్॥ సంధ్యాం గాయత్రీం బ్రాహ్మీం నిమృజీమితి ప్రాతః, సంధ్యాం సావిత్రీం రౌద్రీం నిమృజీమితి మధ్యాహ్నే సంధ్యాం సరస్వతీం వైష్ణవీం నిమృజీమితి సాయం॥

---

సంధ్యా ధ్యానమునకుని గూర్చి యుంచు మంత్రముల కర్థము॥

అసా ఈ, ఆదిత్యః సూర్యుడు- బ్రహ్మపరమేశ్వరుడు అంతర్యామి బ్రాహ్మణమున ఆదిత్యుడు పరమేశ్వరుని శరీరమని చెప్పబడియున్నది గాన, శరీర శరీరులకు నభేదము వ్యవహారింపబడును గాన, సూర్యుడే పరమేశ్వరుడని చెప్పబడెను. ఈ యర్థమునంతరాధికరణమున పూర్వాచార్యులు బాగుగ రచియించి యున్నారు. ఈ యంశము ముందు ఉపస్థాన మంత్రముల వివరించునప్పుడు స్పష్టపడగలదు॥ కావున ఈ సూర్యుడే పరబ్రహ్మమని స్పష్టార్థము గనున్న సూర్యాంతర్యామియగు పరమేశ్వరుడే ప్రతిపాద్యుడని గ్రహింపక తప్పదు॥ ఇట్లు సంధ్యాకాలమున చేయబడు పరమేశ్వర ధ్యానమే ప్రధానముగు సంధ్యోపాసనము॥ అసావాదిత్యో బ్రహ్మ అని ప్రతిదినము చేయబడు, ఈశ్వరధ్యానమే బ్రాహ్మణ్యమును నిలుపు సంధ్యోపాసనమని లోకాక్షి చెప్పి యుండెను.

తరువాత సంధ్యాంగ తర్పణము చేయవలయు॥ క్రమముగ - సంధ్యను గాయత్రిని, బ్రాహ్మిని, నిమృజిని తర్పణము చేయుచున్నానని తర్పణము చేయవలయు॥ ఆచమనము- ప్రాణాయామము చేసి ప్రాతస్సంధ్యాంగ తర్పణము చేయుచున్నానని సంకల్పము గావించి, తర్పణము చేయునది॥

అందు సంధ్యాం- గాయత్రీం- బ్రాహ్మీం- నిమృజీం అని ప్రాతః కాలమునకు సంధ్యాం- సావిత్రీం రౌద్రీం- నిమృజీం అని మధ్యాహ్నమునకు సంధ్యాం సరస్వతీం - వైష్ణవీం నిమృజీం అని సాయంకాలమునకు తర్పణము చేయవలయు.

## అశౌచే సంధ్యావందనవిధిః

సన్యాశౌచే సంధ్యావందనం కథం కర్తవ్యమితి చేదాశౌచే సంధ్యావందనమర్ఘ్యాంత మిత్యుక్తం॥ యత్తు సంధ్యా మిష్టించ హోమంచ యావజ్జీవం సమాచరేత్। నత్యజేత్ సూతకే వాపి త్యజన్గచ్ఛ త్యధోగతిమితి॥ తత్తు మానసిక సంధ్యా వంద నాభిప్రాయం తముక్తం పులస్త్యేన॥ సూతకే మృతకేచైవ సంధ్యాకర్మ నసంత్యజేత్। మనసోచ్చారయే న్మంత్రాన్ ప్రాణాయామ మృతేద్విజఇతి॥ అత్రవిశేష మాహ వ్యాసః॥ ప్రక్షిప్య సూతకేత్వర్ఘ్యం గాయత్రీంతు సముచ్చరన్ దత్వా ప్రదక్షిణంకుర్యాత్సూర్యం ధ్యాయే త్తతోద్విజఇతి పైఠీనసిరపి॥ సూతకే సావిత్ర్యా చాంజలిం ప్రక్షిప్య ప్రదక్షిణంకృత్వా సూర్యంధ్యాయ న్నమస్కుర్యాదితి॥ ప్రయోగపారిజాతే భరద్వాజోపి॥ సూతకే మృతకే కుర్యాత్ప్రాణాయామ మమంత్రకం తథా మార్జన మంత్రాంస్తు మనసోచ్చార్య మార్జయేత్॥ గాయత్రీం సమ్యగుచ్చార్య సూర్యాయార్ఘ్యం నివేదయేత్ మార్జనం తునవాకార్య ముపస్థానం నచైవహి॥ ఇతి॥

---

ప్ర॥ అశౌచమున సంధ్యావందనము ఎట్లుచేయ వలయును?

ఉ॥ అశౌచమున సంధ్యావందనము అర్ఘ్యము వరకు చేయ వలయుననియున్నది॥ సంధ్యను, ఇష్టిని, హోమమును, యావజ్జీవము చేయవలయును। సూతకమునను వి డువ గూడదు॥ ఇట్లువిడిచెనా అధోగతిని పొందునని లేదా?

ఉ॥ ఉన్నది కాని అవచనముచే నశుచి సమయముల యందు మనస్సునను సంధ్యావందనము చేయ వలయునని తెలియుచున్నది॥ కావున అశుచి సమయము లందు సంధ్యాకర్మమును విడువ గూడదు॥ మంత్రములను మనసున నుచ్చరింప వలయునని పులస్త్యుడు చెప్పెను॥

ఇందు వ్యాసుడు విశేషమును చెప్పెను॥ అశౌచము నందు గాయత్రి నుచ్చరించుచు అర్ఘ్యమును విడువ వలయును॥ ప్రదక్షిణము చేసి సూర్యుని ధ్యానము చేయ వలయుననియును॥ సూతకము నందు సావిత్రితో నర్ఘ్యజలము నిచ్చి ప్రదక్షిణము చేసి సూర్యుని ధ్యానము చేయుచు నమస్కరింప వలయునని పైఠీనసుడు చెప్పెను॥

నన్వేవ మప్యాశౌచాదౌ సంధ్యాకర్మ నకర్తుం శక్యతే। ఆశౌచస్య కర్మాధికార ప్రతిబంధకత్వేన సిద్ధత్వాదితి చేన్న। తాత్కాలిక శుద్ధేస్సంభవాత్. తదుక్తం పరాశరేణ: ఉపాసనేతు విప్రాణా మంగ శుద్ధిశ్చ జాయతఇతి। తథా గోభిలేనచ। అగ్నిప్రణీతాది కర్మార్థం శుద్ధిస్తాత్కాలికీ స్మృతేతి॥

ననువ్యాధితస్య కథ మనుష్ఠాన మితిచే దుచ్యతే। జలాదినా యత్కించ త్పీడితత్వే శుద్ధమంబరం ధృత్వా వాగ్యత స్సమాసీనః। పరమేశ్వరం ధ్యాయ౯ భస్మదిగ్ధాంగ స్తప్తవారిణా త్రిరా చమ్య యథాశక్తి సంధ్యాముపాసీత। రుగ్ణస్య తప్తోదకాచమన మనిషిద్ధమిత్యాహ భగవా నాపస్తంబః। తప్తాభిశ్చ కారణాదితి। కారణం జ్వరాదికమితి వృత్తికారః। అత్యాతుర శ్చేత్పితరం భ్రాతరమన్యం శిష్యాదికంవా సమాహూయ తైః కారయేత్। ఇతియజమానస్యాత్త దురితక్షయార్థమితి సంకల్పః॥

---

ప్రయోగ ప్రకారము నందు। ఆశౌచములందు మంత్రము నుచ్చరించకయే ప్రాణాయామము చేయవలయును। ఆపోహిష్ఠాది మంత్రములను మనసునందు స్మరించుచు మార్జనము చేసికొనవలయును। గాయత్రిని స్పష్టముగా నుచ్చరించి సూర్యునకు అర్ఘ్యము నియ్యవలయును। మార్జనమును మంత్రముల మనస్సున స్మరించుచు చేసి జపము చేయవచ్చును। ఉపస్థానముచేయను గూడదు। అని భరద్వాజుడు చెప్పెనని యున్నది॥

ప్ర॥ ఆశౌచము కర్మాధికారమును ప్రతిబంధించు ననుట ప్రసిద్ధముగాన నప్పుడు సంధ్యావందనాద్యాదములనైన నెట్లు చేయవలయును?

ఉ. ఆశౌచ సమయమందైనను కర్మకాలమున నాశౌచము లేదు: ఉపాసనాకాలమున బ్రాహ్మణులకు నాశౌచముండదు॥ అని పరాశరుడు చెప్పెను॥ అగ్నిహోత్రము మొదలగు కర్మలు చేయునప్పుడు ఆశౌచముండదని గోభిలుడును చెప్పియుండెను॥ ప్ర॥ రోగి యెట్లు సంధ్యావందనము జేయవలయును?

ఉ॥ జ్వరము మొదలుగా నేదేని జబ్బుకలిగిన యెడల నుదికిన వస్త్రమును గట్టికొని కూర్చుండి పరమేశ్వరుని ధ్యానము చేయుచు భస్మము ధరించి, వేడి నీళ్లతో నాచమనము చేసికొని శక్తి కొలది సంధ్య నుపాసింప వలయును। జ్వరాది రోగము నందు వేడినీళ్లతో నాచమనము చేయవచ్చునని యాపస్తంబుడు చెప్పియుండెను॥

అథ షట్కాల శివపూజా పరశ్చేత్ శైవీంసంధ్యా ముపాస్య। సకలీకరణం కృత్వా। అరుణోదయకాలే కావసర పూజాం కుర్యాత్। త్రికాలపూజా పరశ్చేత్ సూర్యోపస్థానానంతరం శైవీంసంధ్యాముపాసీత శైవసంధ్యావిధి స్సూర్యోపస్థాన మంత్రో వివరణానంతరం సకలీకరణావసర పూజావిధీతు శివపూజా ప్రకరణేచ ప్రతిపాదయిష్యన్తే॥

తతోభూశుద్ధి భూత శుద్ధ్యాదీని కుర్యాత్॥ తత్ప్రయోగ స్స్వాహ్నికే ద్రష్టవ్యః॥ అథగాయత్రీ హృదయమాహ॥

మూ॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ॥

ఓమితి ఏకాక్షరం, ఏకాక్షర వాచ్య మిత్యర్థః॥ నామార్థ యోరభేదాన్వయ ఇతిన్యాయేన నిర్దేశః॥ ప్రణవో వాచక స్తస్య శివస్య పరమాత్మనఇతి శివపురాణవచనాత్॥ బ్రహ్మ, పరమేశ్వరః॥ నను ప్రణవ ప్రతిపాద్యం దేవతాంతరమితి పురాణాంత రేభ్యో జ్ఞాయతఇతి చేన్న తాదృశార్థస్య వేద విరుద్ధ త్వేన గౌణత్వా భ్యనుజ్ఞా నాత్। తథాహి। బ్ర

---

ప్రతిరోత్తుగ సేవాజాలని, రోగము నందెట్లు?

ఉ॥ అప్పుడు తిండిసో? తన్మాయినో, శిష్యునో- ఇతరునినో పిలి పించి వారిచే చేయింప వలయు॥ తాను సేవ జాలమి నితరులు చేయుచున్నారని చెప్ప కొనక యజమానోప్యపాత్త దురిత క్షయార్థం అని సంకల్పము చ్చేయవలసి యుండును॥

షట్కాలశివపూజా పరుడగు నేని అర్ఘ్యము, ధ్యానము వరకు సంధ్యా వందనము చేసిన తరువాత శైవ మంత్ర సంధ్యా వందనము నాచ రించి సక లీక రణము చేసికొని అరుణోదయ కాలమునఁ జేయవలయు నవ సర పూజను చేయ వలయు॥ త్రికాల పూజా పరుడైన సూర్యోపస్థానమైన తరువాతనే శైవమంత్ర సంధ్యా వంద నాముల జేయవలయు। శైవమంత్ర సంధ్యావిధి సూర్యోపస్థాన మంత్రములు వివ రించిన తరు వాతను సకలీకరణము, అవసరపూజ అనునవి శివపూజా ప్రకరణము నందును నిరూపింపఁ బడ గలవు.

తరువాత భూశుద్ధి, భూతశుద్ధి, అంత ర్మాతృక బహిర్మాతృకమున్నగు వానిఁ జేయవలయు వానిప్రయోగము స్వాహ్నికము నందు జూడవలయు॥

గాయత్రీ హృదయము.

ఓమితి ఓమను ఏకాక్షర వాచ్యుఁడని చెప్పఁబడువాఁడు బ్రహ్మ పరమేశ్వ

మం॥ స్తుతో మయా వరదా వేదమాతా ప్రచోదయన్తీ పవనే ద్విజాతా। ఆయుః పృథివ్యాం ద్రవిణం బ్రహ్మవర్చసం మహ్యం దత్వా ప్రయాతం బ్రహ్మలోకం॥ నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్ర పాదాక్షిశిరోరుబాహవే। సహస్ర నామ్నే పురుషాయ శాశ్వతే సహస్ర కోటీ యుగధారిణే నమః॥

స్తుతేతి॥ వరదా, అభీష్టప్రదా, ప్రచోదయన్తీ, ధీప్రేరకేత్యర్థః॥ పవనా, పావయిత్రీ, ద్విజాతా, ద్విజత్వసాధికా॥ తదుక్తం॥ ద్వైజన్మనీ ద్విజాతీనాం మాతుః స్యాత్ప్రథమంతయోః। ద్వితీయం ఛందసాంమాతుర్గ్రహణా ద్విధివద్గురోరితి॥ ఏవం భూతా వేదమాతా, గాయత్రీ, మయా స్తుతా, ప్రసన్నాచ సతీ, మహ్యం, పృథివ్యాం, ఆయుః, చిరజీవితం, ద్రవిణం, ధనం, బ్రహ్మవర్చసం, తేజశ్చ దత్వా, బ్రహ్మలోకం, నిజనివాసం, ప్రయాత మితి ఛాందసం రూపం॥ ప్రయాతేత్యర్థః॥ ఇదమనుష్ఠాతుః గాయత్ర్యనుగ్రహ ప్రకాశనం॥ అథ పరమేశ్వరార్పణం॥ నమోస్త్వితి॥ అనంతాయ, అనంతశక్తయే, సహస్రమూర్తయే, భక్తాను

---

విత్రము చేయునదియు, ద్విజాతా= ద్విజత్వమును సాధించు నదియు, వేదమాతా= వేదములకు జననియు, నగు, గాయత్రి, మయా= నాచేత- స్తుతా= స్తోత్రము చేయఁ బడినదై, మహ్యం= నాకొఱకు-పృథివ్యాం= భూమియందు, ఆయుః చిరంజీవితమును, ద్రవిణం= ధనమును, బ్రహ్మవర్చసం, తేజమును దత్వా, ఇచ్చి, బ్రహ్మలోకం= బ్రహ్మలోకమును గూర్చి, ప్రయాతం, వెళ్లుము॥ దీని వలన గాయత్రీ ప్రార్థనము॥ నమోస్తు అని మొదలు కొని పరమేశ్వరార్పణము॥

అనంతాయ=అనంతశక్తి గల వాఁడును సహస్ర మూర్తయే లీలార్థమగు ననేక రూపములుగల వాఁడును సహస్రపాదాక్షి శిరోరు బాహవే= అనన్తములగు పాదములు అనంతములగు కన్నులు,అనంతములగు శిరములు ఊరువులు బాహువులునుగల వాఁడును, సహస్రనామ్నే అనంతములగు నిజాభిధానంబులు గలవాఁడును, శాశ్వతే, శాశ్వతుఁడును, సహస్ర కోటియుగధారిణే సహస్ర కోటి యుగములును ధరించు వాఁడును, నగు పురుషాయ రుద్రుని కొఱకు నమః, నమస్కారము, అస్తు అగుఁగాక॥

ఇఁక భూమ్యంతరిక్ష ముల కొఱకు నమస్కారము చెప్పు మంత్రము॥

గ్రహార్థం లీలాకల్పితానేకవిధ విగ్రహాయేత్యర్థః॥ సహస్రపాదాక్షి శిరోరు బాహవే, అనన్తపాదాయ, అనంతలోచనాయ, అనన్తశిరసే ఇత్యాదినా సహస్రశీర్షాపురుష ఇత్యాది శ్రుతి బోధితా యేత్యర్థః, సహస్రనామ్నే, అనన్త నిజాభిధానాయ, శాశ్వతే శాశ్వతాయ, సహస్రకోటి యుగధారిణే, మృత్యుంజయాయేత్యర్థః॥ ఏవంవిధ మహామహిమ శాలినే, పురుషాయ రుద్రాయ, పురుషో వై రుద్ర ఇతి శ్రుతేః, నమో స్త్వితి సర్వమపి తన్నమస్కార రూపం తదారాధన మస్త్విత్యర్థః॥ స్తుతేత్యాది మంత్రా అన్యై ర్నవ్యాఖ్యాతాః, అతః కైశ్చిన్న పఠ్యన్త ఇతి జ్ఞాయతే॥ అథ ద్యావాభూమీ నమస్కరోతి॥

మూ॥ ఇదం ద్యావాపృథివీ సత్యమస్తు పితర్మాతర్యది హోపబ్రువేవాంభూతందేవానామవమే అవోభిర్విద్యామేషం వృజినంజీర దానం॥

ఇదమితి॥ హేపితః, హేద్యౌః, ద్యులోక, హేమాతః, పృథివి, ప్రశ॥ ఇయం వైమాతా, అసౌ పితా ఇతి శ్రుతేః॥ వాం యువాం ప్రతి, ఇహ కర్మణి, యత్ వచనం, ఉపబ్రువే బ్రవీమి॥ హేద్యావాపృథివీ ద్యావాపృథివ్యౌ, ద్వివచనాభావ శ్ఛాందసః॥ ఇదం మదీయం వచనం, సత్యమస్తు॥ కింతద్వచన మిత్యాశంక్యాహ॥ భూతమితి, అవోభిః అస్మద్రక్షణైః స్సహ, దేవానాం, సర్వేషా మమరాణాం, ఇదం భూ

---

హేపితః, తండ్రివగు, హేద్యౌః, ద్యులోకమా, మాతః, తల్లివగు- పృథివి, భూమీ, వాం మిమ్ములను గూర్చి- ఇహ, ఈకర్మమునందు॥ యత్ ఏవచనమును, ఉపబ్రువే,పలుకుచున్నానో- ఇదం, ఈవచనము, సత్యం, నిజమైనది, అస్తు, అగుగాక॥ అవచనమెద్దియనిన, అవోభిః మారక్షణములతోఁగూడ, దేవానాం సకల దేవతలను, సకల భూతములకునవమే, రక్షింమనవి, భవతం అగుఁను॥ వయం మేము, ఏషం గోయున్న మను, వృజినం' తాపరహితమగు జీవదానం జీవప్రదానమును, విద్యాంచ, విద్యలను, ఉపలభేమ పొందుదుము॥

ఇక్కడ కొందఱు, ఆకాశాత్ అని మొదలుగా కొన్ని శ్లోకములను జపవున్నారు॥ అందు, శంకరం ప్రతిగచ్ఛతి, అనువాదమే యుక్తమైనది॥ శ్రుతిసూక్తి మొదలగు వానియందు నమశ్శైషిష్యము పరమేశ్వరు నిదేయని సిద్ధాంతము చేయబడి

తానా మప్యుపలక్షణం,సర్వేషాం, భూతానాంచ, అవమే,రక్షకే,భూతం,భవతం, అస్మదాదీనాం రక్షకేభవతమితియస్మద్వచనం తత్సత్యమస్త్విత్యర్థః॥ వయమపి, ఏషం, ఇద మన్నం, నృజినం, తాపవర్జితం, జీవదానం, జీవస్యదాతారం, విద్యాంచ, ఉపలభేమేత్యర్థః॥ ఇతశ్చ ఆకాశాదిత్యాది పురాణశ్లోకాః పఠ్యన్తే॥ తత్ర సర్వదేవ నమస్కార శ్శంకరం ప్రతిగచ్ఛతీత్యేవ పాఠోయుక్తః॥ కేశవంప్రతి గచ్ఛతీత్యాది పాఠస్త్వ యుక్తః॥ నమశ్శేషిత్వస్య శ్రుతి సూక్తి మాలాదిషు పరమేశ్వరైకాన్తికత్వేన నిర్ధారితత్వాత్, వేదవిరుద్ధార్థ బంధురత్వేన సర్వవేదేష్వి త్యాదిశ్లోకా భవన్త్యుపేక్ష్యాః, శ్రుతిసమ్మత శిష్టాచార సమాగతాన్ శ్లోకానాహ॥

మూ॥ ఆకాశా త్పతితం తోయం యథా గచ్ఛతి సాగరం।
సర్వదేవ నమస్కార శ్శంకరం ప్రతిగచ్ఛతి॥
మహాదేవ మహాదేవ మహాదేవేతి యోజపేత్।
ఏకేనైవ లభేన్ముక్తిం ద్వాభ్యాం శంభూఋణీ భవేత్॥

---

యున్నది గాన, కేశవంప్రతిగచ్ఛతి అనుపాఠము సరియైనది కానేరదు॥

వేదవిరుద్ధములగు నర్థములు గలిగియుండుటచే సర్వవేదేషు ఈమొదలగు శ్లోకములు గ్రాహ్యములు కావు॥

శ్రుతి సమ్మతమగు శిష్టాచారమును బట్టి వచ్చిన శ్లోకము లెవ్వియన, ఆకాశాత్ ఈ మొదలైనవి॥

ఆకాశాత్= ఆకసమునుండి, పతితం= నేలమీదఁబడిన, తోయం= జలము, యథా= ఎట్లు, సాగరం= సముద్రమును, గచ్ఛతి= పొందుచున్నదో, తథా= అట్లు, సర్వదేవ నమస్కారః= సకల దేవతలను గూర్చి చేయఁబడిన నమస్కారము, శంకరం= పరమేశ్వరుని ప్రతిగచ్ఛతి= పొందుచున్నది॥

మహాదేవ ...... మహాదేవేతి= మహాదేవయని మూమ్మాఱు,యః= ఎవ్వఁడు, జపేత్= జపము చేయునో, సః= వాఁడు, ఏకేనైవ= ఒక్కమాఱు పలికిన దాననే, ముక్తిం= మోక్షమును, లభేత్= పొందును॥ ద్వాభ్యాం- కడమ రెండుమాఱ్లు పలికిన దానిచే, శంభుః- శివుఁడు, ఋణీ- ఋణస్థుఁడు, భవేత్- అగును॥

మహాదేవ విరూపాక్ష గంగాధర మృడాన్యయ।
ఇతీరయన్తి యేనిత్యం తేకృతార్థా నసంశయః॥

మృత్యుంజయాయ రుద్రాయ నీలకంఠాయ శంభవే।
అమృతేశాయ శర్వాయ మహాదేవాయ తేనమః॥

హరశంభో మహాదేవ విశ్వేశామరవల్లభ।
శివ శంకర సర్వాత్మ న్నీలకంఠ నమోస్తుతే॥

ఆకాశాదితి॥ ఇమే శ్లోకా స్స్పష్టార్థాః॥ ఇదానీం సంధ్యాకర్మనా ద్గుణ్యార్థం సకల భువనస్థ గోబ్రాహ్మణేభ్య శ్శుభం ప్రార్థయన్ పరి వరాన్వితస్య నామకీర్తనపురస్సరం న్యూనాద్భవాదయతే॥

---

యే- ఎవ్వారలు, మహాదేవ- మహదేవ అనియు, విరూపాక్ష- విరూపాక్ష అనియు, గంగాధర గంగాధర అనియు, మృడ, మృడ అనియు, అవ్యయ- అవ్యయుడా, అనియు, నిత్యం- ఎల్లప్పుడు, ఈరయంతి- పలుకు చుందురో, తే- వారు, కృతార్థాః- కృత కృత్యుల గుదురు॥ నసంశయః- ఇందు సంశయము లేదు॥

మృత్యుంజయాయ- మృత్యువును జయించిన వాడును, రుద్రాయ- సంసార దుఃఖమునుపోగొట్టు వాడును, నీలకంఠాయ- నల్లని మెడగల వాడును, అమృతేశాయ- మోక్షాధిపతియు, శర్వాయ- సర్వసంహార కారియు, మహాదేవాయ- దేవ తలలో గొప్ప వాడవునగు, తే- నీకొఱకు, నమః, నమస్కారము॥

హర- సకలపాతకములను హరించువాడా, శంభో- సుఖము నొసఁగువాడా, మహాదేవ- సకల దేవతలలో నధికుఁడా, విశ్వేశ-సకల- జగములకు, నీశ్వరుఁడా, అమర వల్లభ- దేవతాధిపతీ- శివ, మంగళప్రదుఁడా, శంకర- సుఖకరుఁడా, సర్వాత్మన్, సర్వాంతర్యామీ, నీలకంఠ- హాలాహలమును కంఠము నందిడుకొని జగములఁ బ్రోచిన వాఁడా, తే- నీకొఱకు, నమః- నమస్కారము, అస్తు- అగుగాక॥

మూ॥ చతుస్సాగర పర్యన్తం గోబ్రాహ్మణేభ్య శ్శుభం భవతు......ప్రవరాన్వితో ...... సగోత్రో ......శర్మా అహం భో అభివాదయే॥

చతురితి॥ చతుశ్శబ్ద స్సప్తసంఖ్యాయా అప్యుపలక్షణం, తథాచ, సప్తసాగర మధ్యేయాశ్చ గావః, యే బ్రాహ్మణా స్సన్తి, తాభ్యస్తేభ్యశ్చ శుభమస్త్విత్యర్థః॥ భో ఇతిసమ్బోధనార్థకం॥ అయి భగవతి, వాగ్దేవి, సంధ్యే, త్వామితి శేషః॥ అభివాదయే, నమస్కుర్వే ఇతి కేచిద్వ్యాచక్షన్తి, తదసంగతం, ఉత్తమే శిఖర ఇత్యత్రైవ సంధ్యాయాః ప్రస్థాపితత్వాత్॥ కింతు వృద్ధా న్యభివాదన మేవ కార్యమితి యుక్తం॥ తదుక్తం॥ నక్షత్రంచ తథా భూమిం ద్విజా నప్యభివాద యేత్॥ కనిష్ఠానపి వేదజ్ఞా న్సంధ్యా కాలేభివాదయేత్। వినా పుత్రంచ శిష్యంచ దాహి

---

సంధ్యోపాసనము సఫలమగుటకై లోకమువందున్న గోబ్రాహ్మణుల కొఱకు శుభమును గోరుచు, ప్రవరతోఁగూడ పేరుచెప్పి పెద్దలకు నభివాదనము చేయవలయును చతుఃపదము సప్తపదమునకు నుపలక్షణముగాన, చతుస్సాగర పర్యంతం- ఏడుసముద్రముల మధ్యనున్న, గోబ్రాహ్మణేభ్యః- గోవుల కొఱకు బ్రాహ్మణుల కొఱకును, శుభం- మేలు, భవతు- అగుగాక, ఈయభివాదనము సంధ్యనుద్దేశించియే అనికొందఱు చెప్పుచున్నారు॥ కాని, ఉత్తమేశిఖరే, అనుమంత్రముతోనె సంధ్యయొక్క ప్రస్థాపనము పూర్తి అయెఁగాన, అట్లు చెప్పఁగూడదు॥ పెద్దవారలను గూర్చి యనుటయే యుక్తమగును

సంధ్యాకాలమునందు, నక్షత్రమును, భూమిని, విప్రులను వందనము చేయవలయును పుత్రుఁడు, శిష్యుఁడు, అల్లుడు, దౌహిత్రుఁడు దప్ప వేదము జదివిన చిన్నవయస్సు గలవారలనుగూడ వందనము చేయనగును, అనియున్నది॥

త్రం మహితుః పఠిమితి॥ అభివాదన ప్రకార మాహ భగవా నాపస్తు బః॥ దక్షిణం బాహుం శ్రోత్రసమం ప్రసార్య బ్రాహ్మణో౽భివాదయీ తో౽రస్సమం రాజన్యో మధ్యసమం వైశ్య ఇతి॥

ఇతి సావిత్రీ సంధ్యాప్రకరణం.

---

అభివాదన మెట్లు చేయవలయుననిన,

కుడిచేతిని, చెవివరకు సాచి బ్రాహ్మణుడును, ఱొమ్మువరకు సాచి క్షత్రియుడును, నడుము వరకు సాచి వైశ్యుండును అభివాదనము చేయవలయునని ఆపస్తంబుడు చెప్పెను॥

సావిత్రీ సంధ్యా ప్రకరణము

ముగిసెను.



శైవప్రచారిణీ గ్రంథమాల— ౨౦

ధర్మసంగ్రహే,

# ఆహ్నికకాండః

## తృతీయ భాగః

ఇది

బ్ర. శ్రీ. ముదిగొండ నాగలింగ శాస్త్రిగారిచే
రచింపఁబడి,

బ్ర. శ్రీ. విద్వాన్. ముదిగొండ వీరేశలింగ శాస్త్రిగారిచే
ముద్రణాక్షర స్ఖాలిత్య రహితముగాఁబరిశోధింపఁబడి,

బ్ర. శ్రీ. కొడిమెల రాజలింగారాధ్యుల వారిచే

శైవప్రచారిణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

వరంగల్

౫౦౦

1928

వెల. 1—4—0

# రాజపోషకులు

బ్ర॥ శ్రీ॥ రా॥ శ్రీ ఇజ్జతాసార్ రాజా కంకుకూరి బాలసూర్య ప్రసాదరావు జమీందారుగారు. విశాఖపట్టణము.

# శాశ్వతాభిమానులు

బ్ర॥ శ్రీ॥ కామన్న రాజయ్యగారి కొమారుఁడు వీరరాజుగారు. దువ్వ.
మ॥ రా॥ కొమరవెల్లి కాశయ్య గారు. వరంగల్.
మ॥ రా॥ భూపతి రత్నంగారు వరంగల్
మ॥ రా॥ భూపతి రామన్న గారు. వరంగల్
మ॥ రా॥ నాగబండి కట్టమల్లయ్యగారు వరంగల్
మ॥ రా॥ కొండూరి వెంకటరాజబ్రబదర్స్ వరంగల్
మ॥ రా॥ కుంచం నాగయ్యగారు వరంగల్
మ॥ రా॥ అప్పనికాసయ్యగారు వరంగల్
బ్ర॥ శ్రీ॥ ముదిగొండ బాలకోటిలింగం గారు-మున్సబ్ హెడ్ క్లర్కు నరసరావుపేట

# శాశ్వతచందాదారులు

బ్ర॥ శ్రీ పతిపండితారాధ్యుల మల్లయ్య అయ్యవార్లంగారు మట్టెవాడ
బ్ర॥ ముదిగొండ రాజమాంబగారి మల్లయ్య అయ్యవార్లం గారు. వరంగల్
బ్ర॥ శ్రీ॥ శివదేవుని వీరేశలింగారాధ్యులవారు వరంగల్
మ॥రా॥ అద్వైదన్నగారి నారాయణ సింగుగారు వరంగల్
మ॥ రా॥ పెద్ది వీరయ్యగారు మట్టిముచ్చాల.
మ॥ రా॥ ములుగు కిష్టయ్యగారు సిద్దిపేట.
మ॥ రా॥ కొమరవెల్లి శివరాజంగారి అంతయ్య గారు ,,
మ॥ రా॥ భూపతి బుచ్చిరామయ్య గారు ముల్కనూరు
మ॥ రా॥ చిటిమల్లి భద్రయ్యగారు వెన్నంపల్లి
మ॥ రా॥ చిటిమల్లి నర్సయ్య గారు వెన్నంపల్లి

# విషయసూచికః



## ధర్మసంగ్రహే,

### ఆహ్నిక కాండే- తృతీయభాగః



స మా ప్త ము.



అథ శైవమత కుఠరీ [illegible]



తత్రప్రకారః సంహితాయాం, గోకర్ణాకృతి హస్తేన మాషమగ్నం జలం గృహీత్వా, ఓం హ్రాం ఆత్మతత్త్వాయ స్వాహా, ఓం హ్రీం విద్యాతత్త్వాయ స్వాహా, ఓం హ్రూం శివతత్త్వాయ స్వాహా, ఇత్యపః పీత్వా, ప్రత్యేకం పాణిం ప్రక్షాళ్య ఓష్ఠావంగుష్ఠమూలేన ఓం హ్రః అస్త్రాయ ఫట్। ఇతి ద్విః। పరిమృజ్య, హస్తతలేనాధోముఖం సకృత్పరిమృజ్య, అంగుష్ఠానామికాభ్యాం ముఖనాసాక్షి కర్ణవివరాణి హృదంసద్వయ శిరాంసి దక్షిణ వామ క్రమేణ సంస్పృశ్య నా దాచమనం భవతి॥ ఏవమాచమ్య, దేహస్యాంతర్గత మశుద్ధవాయుం రేచక ప్రాణాయామేన అస్త్రమంత్రేణోత్సార్య, బాహ్య వాయునోదరం పరిపూర్య, అకారోకార మకారాత్మకాభిరిడాసుషుమ్న పింగళ నాడీభిర్యథాక్రమం పూరకకుంభక రేచకైః ప్రాణాయామత్రయం కృత్వా, దేశ కాలౌ సంకీర్త్య,

---

## ఆచమనవిధి.

ఆవు చెవివోలె ముడుచఁబడిన చేతితో మినపగింజ మునుగునంత జలము దీసికొని, ఓం హ్రాం . . . స్వాహా అని మువ్మారు జలము పుచ్చుకొని- చేతులు కడిగికొని- ఓం హ్రః అస్త్రాయ ఫట్ అనుమంత్రము చదువుచు బొటనవ్రేలి మొదటి భాగముతో పెదవులను రెండుమార్లు తుడిచికొని- అరచేతితో ముఖముయొక్క- దిగువభాగము నొకమారు తుడిచికొని- అంగుష్ఠము- నాసిక- కన్నులు- చెవులు- హృదయము- భుజములు- శిరస్సు నను వానిని స్పృశింపఁగా నాచమన మగును॥ ఇట్లు లాచమనముచేసి.

## ప్రాణాయామ విధి.

శరీరములోని యపరిశుద్ధ వాయువును అస్త్ర మంత్రము చదువుచు లోపలి గాలిని, రేచకముతో వెడలచేసి- బాహ్యవాయువును పీల్చి- అకారోకార మకారరూపములుగా భావింపఁబడు ఇడాపింగళ సుషుమ్నలను నాడులలో పూరకము కుంభకము- రేచకము ననువానిని చేసిన ప్రాణాయామ మగును॥ ఇట్లు మువ్మారు ప్రాణాయామము చేసి.

## సంకల్పము.

దేశకాలముల నుచ్చరించి, ఏవం . . . ముపాసే అని సంకల్పముచేసి- గురువందనము గావించి

దురితక్షయ ద్వారా శ్రీపర
ఏవం గుణేత్యాది శుభతిథౌ మమోపాత్త
శివప్రీత్యర్థం ప్రాతశ్శైవీం సంధ్యా ముపాసే॥ ఓం గుం గురుభ్యో నమః
ఇతి ప్రణమ్య, హాం నేత్రాభ్యాం నమ ఇత్యంగుష్ఠానామికాభ్యాం
నేత్రయోః దివ్యముద్రాం ప్రవిన్యస్య, నమోంతమూలేన జలం నిరీక్ష్య
తేనైవ సంతాడ్య, వౌషడంత కవచేనాభ్యుక్ష్య, వౌషడంత హృదయే
నాంకుశముద్రయా బిందు స్థానాద్గంగాదీనామేకతమం తీర్థ మాకృ
ష్య, నమోంత హృదయే నోద్భవ ముద్రయా తీర్థం జలే నిక్షిప్య, మూ
లే నాభిమంత్ర్య, హుం ఫడంతాస్త్రేణ సంరక్ష్య, నమోంత కవచేనా
వకుంఠ్య, వౌషడంత శక్తి మంత్రేణ ధేను ముద్రయా మృతీ కుర్యాత్॥
ఏవం జల శుద్ధిం కృత్వా, తేన జలేన పంచ బ్రహ్మ షడంగ మంత్రై
ర్మార్జనం కుర్యాత్॥ అథాఘ మర్షణం యథా, ఆచమ్య జలం దక్షిణ
హస్తే గృహీత్వా, ఓం హాం అస్త్రాయనమ ఇత్యష్ట వారం మూలేన ద
శ వారంచ జపిత్వా, వామహస్తానామి కాంగుష్ఠాభ్యాం ఛోటి కయా

---

జలశుద్ధి.

హాం నేత్రాభ్యాం నమః అని నేత్రముల యందు దివ్యముద్ర నునిచి- నమశ్శి
వాయ నమః అని జలమును జూచి- ఈ మంత్రముతో నె గొట్టి- కవచాయ వౌషట్ అని
అభ్యుం క్షణముచేసి- హృదయాయ వౌషట్ అని అంకుశ ముద్రతో బిందు స్థానమునుం
డి గంగాదులలో నొక తీర్థమా నాకర్షించి నట్లు భావించి- హృదయాయ నమః అని ఉ
ద్భవ ముద్రతో నాతీర్థమును జలము నందునిచి, మూలమంత్రముతో మంత్రించి, అస్త్రా
య హుంఫట్ అని రక్షించి- కవచాయనమః అని యవ కుంఠనముచేసి- వౌషట్ అంత
మందుగల శక్తి మంత్రముతో ధేనుముద్ర బట్టి అమృతీ కరణము చేయవలయును॥ ఇట్లు జ
లశుద్ధిచేసి-

మార్జనము.

పంచ బ్రహ్మ మంత్రములను- ఓంహాం హృదయాయనమః మొదలగు షడంగ మం
త్రములను జదువుచు మార్జనము చేయవలయును॥

అఘమర్షణము॥



ఆచమనముచేసి- జలమును కుడిచేత గ్రహించి- ఓం హాం అస్త్రాయనమః అని రొ

తయోగే నాస్త్రమంత్రేణ త్రిశ్శిరోభ్యుక్ష్య, అవశిష్ట జలం వామహస్తే ఇ
డయా అంతర్గతం మత్వా తేనైవ నిశ్శేష కలుషం దగ్ధం విచింత్య, పిం
గళాయాం బహిర్గతం విభావ్య తజ్జలం దక్షిణకరే ధృత్వా తత్ర పాప
పురుషం విచింత్య, వామ భాగే, భూమౌ, వజ్ర శిలాం ధ్యాత్వా తత్ర
నిక్షిప్య పాపపురుషం చూర్ణితం భావయే దిత్యఘ మర్షణం॥ అథ గం
ధపుష్పాక్షతై రర్ఘ్య జలం సంపాద్య, ఓం శివాస్త్రాయ విద్మహే, కా
లానలాయ ధీమహి, తన్నో అస్త్రః ప్రచోదయాత్ ఇతి త్రిరర్ఘ్యం ద
త్వా, ప్రణవ పూర్వకం, భవం, మృడం, హరం, గణేశం, స్కందం, ఉ
మాంచ తర్పయిత్వా, పరమేశ్వర రూపాం సంధ్యాం ధ్యాయేత్॥ త్రి
శూలాక్ష ధరాం దక్షే, వామే సాభయ శక్తికాం। రౌద్రీం ధ్యాయే వృ
షాబ్జస్థాం త్రినేత్రాం చంద్రశేఖరాం॥ ఇతి ధ్యాత్వా పంచోప చారై
స్సంపూజ్య, ఓం శివగాయత్రీ మష్టోత్తర శత మష్టావింశతి వారం వా జ

---

నిమిది మార్గము- మూలమంత్రముతో పదిమార్లు-మంత్రించి- యెడమచేతి బొటన వ్రే
లు అనామిక ఈ రెండు వ్రేళ్లతో నాజలమును అస్త్రమంత్రము చదువుచు- మూమ్మారు
శిరమున జల్లుకొని- మిగిలిన జలమును ఎడమ చేతిలో నిడికొని- ఎడమ ముక్కున వాస
న చూచి- ఆజలము లోనికి పోయినట్లును- దానిచే పాపమంతయు గాలిపోయి- కుడిము
క్కు నుండి వెల్వడి నట్లును- భావించి- ఆజలమును కుడిచేత నిడుకొని- ఎడమ వైపున
నేలమీద వజ్రశిల యున్నట్లు ధ్యానించి, ఆజలమును నాశిలపై నునిచి, పాపపురుషుడును
పొడిపొడై పోయెనని భావింప వలయును॥ ఇదియే అఘమర్షణమగును॥

## అర్ఘ్య ప్రదానము.

గంధ పుష్పాక్షతలచే నర్ఘ్య జలమును సంపాదించి, ఓం శివాస్త్రాయ విద్మహే
కాలానలాయ ధీమహి। తన్నో అస్త్రః ప్రచోదయాత్॥ అని మూమ్మారు లర్ఘ్యము నొ
సగి ఓంభవం తర్పయామి అని మొదలుగా భవుని మృడుని, హరుని, గణేశుని, స్కందుని
ఉమను గూర్చి తర్పణము చేసి, ఆచమనము చేసి, సంధ్యను ధ్యానము చేయ వల
యు॥ త్రిశూల... ఖరాం॥ అని ధ్యానము చేసి పంచోప చారములచే పూజించి,
ఓంతన్మ హేశాయ విద్మహే వాగ్విశుద్ధాయ ధీమహి, తన్నశ్శివః ప్రచోదయాత్। అ

ప్త్వా, ఓం హాం శివాయ స్వాహా ఇత్యంజల్యా ఉదక ప్రదానేన జపం నివేద్య, ఉత్థాయ పంచ బ్రహ్మ మంత్రై రుపస్థానం కుర్యాత్॥ తతో దిగ్దేవతా నమస్కృత్య, స్వగోత్ర ముచ్చార్యాభి వాద్యాచమ్య కృతాం కర్మ పరమేశ్వరా యార్పయేత్॥

—* అథ సకలీ కరణ విధిః. *—

కరన్యాసాంగన్యాసరూపం సకలీకరణం। తచ్చ సృష్టి స్థితి సంహార రూపేణ త్రివిధం। తత్ర గృహస్థానాం కుటుంబినీనాంచ స్థితిన్యాస రూపం। బ్రహ్మచారిణాం సృష్టి న్యాసరూపం। యతి వన స్థానాం విధుర్వకాణాంచ సంహారన్యాస రూపం గ్రాహ్యం॥ తదుక్తం శివమహాపురాణే॥ న్యాసస్తు త్రివిధః ప్రోక్తః స్థిత్యుత్పత్తి లయ క్రమాత్ స్థితిన్యాసో గృహస్థానా ముత్పత్తి ర్బ్రహ్మ చారిణాం యతీనాం సంహృతిన్యాసో వనస్థానాం తథైవచ। సవవ భర్తృ హీనాయాః కుటంబిన్యాః

---

ను శివగాయత్రినినూటయెనిమిది మార్లు గాని, ఇరువది యెనిమిది మార్లు గాని, జపము చేసి, ఓంహాంశివాయ స్వాహా అని దోయిలితో నీరువిడుచుటచే జపము సమర్పించి, లేచి, పంచబ్రహ్మమంత్రముల తో ఉపస్థానము చేయవలయును॥ తరువాత దిగ్దేవతలకు నమస్కారము చేసి స్వగోత్రమును చెప్పి యభి వాదనము చేసి ఆచమనము చేసి యీశ్వరార్పణము సేయ వలయును. ఇతి శైవమడతురీ సంధ్యా॥

సకలీకరణము

కరన్యాసము, అంగన్యాసము చేరి సకలీకరణమని చెప్పఁబడును॥ అదియు, సృష్టిన్యాసము, స్థితిన్యాసము, సంహారన్యాసము, నని మూడు విధములగును॥ అందు గృహస్థులకు, ముత్తైదువులకును స్థితిన్యాసము గ్రాహ్యము॥ బ్రహ్మచారులకు సృష్టి న్యాసము॥ యతులకు, వనస్థులకు, పూర్వసువాసినులకు సంహారన్యాసము గ్రాహ్యము అని శివపురాణంబున గలదు॥ అంగుష్ఠము మొదలు కొని కనిష్ఠికవరకు చేయఁబడునది స్థితిన్యాసంబును, కుడిచేతి యంగుష్ఠము మొదలుకొని యెడమ చేతి యంగుష్ఠము వరకు చేయఁబడునది సృష్టిన్యాసంబును, ఎడమచేతి యంగుష్ఠము మొదలు కొని కుడిచేతి యంగుష్ఠము చేయఁబడునది సంహార న్యాసము నని శివమహాపురాణము నందే కలదు॥

స్థితిర్భవేత్। కన్యాయాః పున రుత్పత్తిర్న్యాక్ష్యే న్యాసస్య లక్షణం॥ అం. గుష్ఠాది కనిష్ఠాంతం స్థితి న్యాస ఉదాహృతః। దక్షిణాం గుష్ఠ మారభ్య వామాంగుష్ఠాంత మేవచ। ఉత్పత్తి న్యాస ఆఖ్యాతో విపరీతస్తు సంహృతిః ఇతి॥ అంగుష్ఠాది కనిష్ఠాంతం స్థితిన్యాసః। దక్షిణాంగుష్ఠ మారభ్య వామాంగుష్ఠాంతం సృష్టి న్యాసః తద్విపరీత స్సంహార న్యాసః॥ తత్ర స్థితి న్యాసో యథా॥ వామ కరతలాంతంచ మణి బంధా త్సమారభ్య దక్షిణ పాణినా హాం అస్త్రాయఫడితి ప్రతిమార్జనం, కరౌ చందనాది చర్చితౌ కృత్వా మార్జన మావృత్తేన మంత్రేణ ద్విః ప్రమృజ్య, తేనైవ మంత్రేణ దక్షిణ కరతలా త్పృష్ఠంచ వామకరేణ సకవారం ప్రమృజ్య, కరావా మణిబంధమస్త్ర తేజసా వ్యాప్తం సంచిన్త్య, సంపుటీకృత్యాంగుష్ఠ ద్వయమధ్యే అమృత రూపం శక్తిమండలం ధ్యాత్వా, తేనామృతేన తథా నయనద్వయం మాప్లావ్య, యోజితాంగుష్ఠద్వయ కర్ణికే

---

స్థితిన్యాసము.

ఎడమ చేతిమణి కట్టు మొదలు కొని ఆయరచేతికొనవరకు హాంఅస్త్రాయఫట్ అను మంత్రము చదువుచు, కుడిచేతితో నొకమారును రెండు చేతులకు మంచి గంధము రాచికొని యుక్లేయింకొక మారును, ఇట్లు రెండుదుమాఱ్లు తుడుచవలయును॥ అట్లే యెడమచేతితో ఆ మంత్రమునే చదువుచు కుడిచేతియరచేతిని, దానివెనుక భాగమును గూడ నొక మాఱు తుడువవలయును॥ తరువాత, మణికట్టువరకు రెండుచేతులను, అస్త్రము యొక్క తేజముచే, వ్యాపింపఁబడినవిగా భావించి రెండు చేతులను దొప్పగా గూర్చి, రెండు బొటన వ్రేళ్లనడుమను అమృత రూపమగు శక్తి మండలమును ధ్యానము చేసి, ఆయమృతముచేత రెండు కన్నులు నించి కొని, కూర్చంబడిన రెండు బొటని వ్రేళ్లను మిద్దెగల దోయిలి యను కమలము నందు హాం శివాసనాయనమః అని శివాసనమును న్యసించి, అందుహాంహః శివమూర్తయేనమః అని తేజోమయ మైన స్థిరవిద్య యను శివుని సూక్ష్మమూర్తిని న్యసింపవలయును॥

హాం ఈశాన మూర్ధాయనమః అని అంగుష్ఠ ములను తర్జని వ్రేళ్లచే న్యసించి, చూపుడు వ్రేలు మొదలు కొని చిటికెన వ్రేలివరకు నాల్గువ్రేళ్లమొదటను బొటన

కరసంపుటె కమలే హాం శివాసనాయ నమ ఇతి శివాసనం విన్యస్య హాం హః శివమూర్తయే నమ ఇతి తేజోమయీం స్థిర విద్యాం శివస్య సూక్ష్మమూర్తిం విన్యస్య, హ్రూం ఈశాన మూర్ధాయ నమ ఇత్యంగుష్ఠత ర్జనీభ్యాం విన్యస్య, తర్జన్యాది కనిష్ఠికాంత మంగుష్ఠాభ్యాం హేం తత్పురుష వక్త్రాయ నమ ఇత్యాదీన్ చతురో మంత్రాన్విన్యస్య, హాంహాం విద్యా దేహాయ నమ ఇత్యంగుష్ఠ కరతలయో రష్టత్రింశత్కళామయ సదాశివాత్మకం స్థూల విద్యా దేహం విన్యస్య నేత్రేభ్యో నమ ఇతి నేత్రం కరతలయో ర్విన్యస్య హాం హూం నమ ఇత్యం గుష్ఠ నామి కాభ్యాం సదా శివ దేహ వ్యాపకం శివ మావాహ యేత్॥ తతః కనిష్ఠి కాదిషు హాం హృదయాయ నమ ఇత్యాది నేత్రమంత్రవ్యతి రిక్తాన్ పంచమంత్రాన్ క్రమేణ విన్యస్య, వామ దక్షిణ కరా తదితర కరాభ్యాం కవచాయ నమ ఇత్యవకుంఠ్య, కరద్వయం సంయోజ్య, వౌషడంతమూలేన పరమీ కుర్యాత్॥ అవకుంఠన మభక్తే ష్వప్రకా శార్థం విఘ్నానామ ప్రాప్త్యర్థంచ కవచే నాచ్ఛాదనం॥ వ్యస్తానాం హృదయ శిరశ్శి

---

ఖ్రేశ్చచే, హేంతత్పురుష వక్త్రాయనమః, హుం అఘోరహృదయాయనమః హాంవామదేవ గుహ్యాయనమః,హం సద్యోజాత మూర్తయేనమః, అనునాలుగు మంత్రములు న్యసించి, హాంహాం విద్యాదేహాయ నమః అను మంత్రము చదువుచు, బొటన వ్రేళ్ళయందును,అఱ చేతుల యందును, అష్టత్రింశత్కళామయమైన సదాశివ రూపరుగు స్థూలవిద్యా దేహమును న్యసించి, నేత్రేభ్యోనమః అను మంత్రముతో నేత్రమును నరచేతుల యందు న్యసించి, హాంహూం నమః అను మంత్రము చదువుచు నంగుష్ఠము అనామికయను రెండు వ్రేళ్లచే సదాశివ దేహమును వ్యాపించియున్న శివుని నావాహనము సేయవలయును॥

తరువాత- చిటికెన వ్రేలు మొదలు కొని, యన్నివ్రేళ్ళయందును హాం హృదయాయనమః, హీం శిరసేస్వాహా- హూంశిఖాయై వషట్, హైంకవచాయహుం- హః అస్త్రాయ ఫట్ అనునైదు మంత్రములను క్రమముగా న్యసించి-ఎడమచేతిని కుడి చేతను-కుడిచేతిని ఎడమ చేయి చేతను-కవచాయనమః అనుమంత్రిముతో అవకుంఠనము సేసి, రెండు చేతులను జోడించి-నమశ్శివాయవౌషట్ యనుమంత్రిముతో పరమీకరణము సేయవలయు

* షాదీనాం కలానాంచ భిన్న భిన్న వర్ణానా మావాహిత పరమ శివ తేజ సాఽతిధవళత్వేన తద్వర్ణ తాప్తి భావనం పరమీకరణం॥

—* తతోఽంగ న్యాసంకుర్యాత్. *—

యథా, దక్షిణాంగుష్ఠానామికాభ్యాం హాం శివాసనాయ నమ ఇతి మధ్యే, హృదివా మూలాధారాత్సముద్భూతం శ్వేతం శివస్యాసన పంకజం విన్యస్య హాం హాం శివమూర్తయే నమ ఇతి నాభికం దా దివా హృదాదివా భ్రూమధ్య పర్యన్తం తేజోమయీం శివస్య సూక్ష్మమూర్తిం విన్యస్య ముష్టిం బధ్వా, అంగుష్ఠ యుక్త తర్జన్యాదిభి ర్వక్త్రే హృది, గుహ్యే, పాద యోశ్చ తత్పురుష మంత్రాదీన్ క్రమేణ విన్యస్య మధ్యాది బ్రహ్మరంధ్రాంతం హాం హాం విద్యా దేహాయ నమ ఇతి విద్యాదేహం విన్యస్య, నేత్ర మంత్రేణ, త్రిషు మధ్యమాంగుళిభి స్త్రిసృభిర్విన్యస్య, తస్మి న్నంగుష్ఠానామి కాభ్యాం హాం హాం శివాయ నమ ఇతి పరమ శివ మావాహయేత్॥

---

భక్తులు తాని వారలచే కనబడ కుండుటకును- విఘ్నములు రాకుండుటకును కవచమంత్రముచేత ఆచ్ఛాదనము చేయుట అవకుంఠన మగును॥ న్యసింపబడిన హృదయము శిరస్సు శిఖ మొదలగు వానిని పలుతెగలైన రంగులుగల కలలను అతిధవళమగు పరమశివుని తేజస్సుచేత ధవళవర్ణముగల వానిగా భావించుట పరమీకరణమగును॥

అంగ న్యాసము

ఇది యెట్లనిన- కుడిచేతి బొటన వ్రేలు- అనామికయును నీరెండు వ్రేళ్లచే-హాం శివాసనాయ నమః అనుమంత్రముతో మధ్యభాగమునందు గాని, హృదయమునందు గాని, మూలాధారమునుండి పుట్టి శివాసనమునకు యోగ్యమగు శ్వేతకమలమును న్యసించి, హాం హాం శివమూర్తయేనమః అనుమంత్రముతో నాభి కంఠము మొదలుకొని గాని, భ్రూమధ్యము వరకు తేజోరూపమగు శివుని సూక్ష్మమూర్తిని న్యసించి, పిడికిలిబట్టి బొటన వ్రేలితో, ఈశాన స్సర్వవిద్యానాం అను ఈశాన మంత్రమును శిరమున న్యసించి, అంగుష్ఠముతో గూడిన తర్జనితో ముఖము నందు తత్పురుష మంత్రమును అంగుష్ఠముతో గూడిన మధ్యమాంగుళితో హృదయము నందు అఘోర మంత్రమును అంగుష్ఠముతో గూడిన

తతో హృదయ శిర శ్శిఖా శ్శివ స్థానేషు హృదయ శిర శ్శిఖా స్వంగుష్ఠ కనిష్ఠి కానామికా మధ్యమాభి ర్విన్యస్య, కర్ణ ప్రావర ణాత్వే న స్తనమధ్యాంతం కవచం తర్జనీభ్యాం విన్యస్య, హస్త తలయో రస్త్ర మనామికాభ్యాం విన్యసేత్॥

సర్వేప్యేతే మంత్రా నమోంతాః, అస్త్ర మంత స్తు ఫడంతః॥ హుం ఫడంతాస్త్ర మంత్రేణ తాళ త్రయ పురస్సరం దిగ్బంధనం కృత్వా కవచే నావేష్ట్య వౌషడంత మూలేన మహా ముద్రాంచ ప్రదర్శయేత్॥ మస్తకాది పాదాంతం హస్తాభ్యాం సంస్పర్శనం మహా ముద్రా॥ తత శ్శివ సమాన రూపతా మాత్మన శ్చింతయేత్॥

ఇత్థం కృతాంగన్యాసో బద్ధ పట్ట శిరోవేష్టన మస్తక త్రాణకం కటకర గృహీతా స్త్రైః భీమ ణోథట ఇవ క్షుద్రాణా మప్ర ధృష్యో భవతీ త్యాశ్చర్యక మిదం. ఇతి సకలీ కరణం॥

---

అనామికతో గుహ్యమునందు వామదేవ మంత్రమును, అంగుష్ఠముతో గూడిన కనిష్ఠికతో పాదముల యందు సద్యోజాత మంత్రమును, న్యసించి, మధ్యభాగము మొదలుకొని బ్రహ్మరంధ్రము వరకు హాం హాం విద్యాదేహాయ నమః అను మంత్రముతో విద్యాదేహమును న్యసించి, నేత్రత్రయాయ వౌషట్ అను నేత్ర మంత్రముచేత హృదయము, శిరస్సు శిఖ యనుమూడు స్థానముల యందును ఐదిమి మూడు వ్రేళ్ల చేతను విద్యాదేహమును స్పృశించి, యందు, నంగుష్ఠానామికలచే హాంహాం శివాయనమః అనుమంత్రముతో పరమశివుని నావాహనము సేయవలయు॥ అనంతరము, హృదయము, శిరస్సు, శిఖ అను శివస్థానములు మూడిటి యందును హృదయ మంత్రమును శిరోమంత్రమును. శిఖా మంత్రమును అంగుష్ఠము, కనిష్ఠిక, మధ్యమ అను మూడు వ్రేళ్ళచే న్యసించి, కర్ణములు మొదలుకొని స్తన మధ్యము వరకు కవచ మంత్రమును చూపుడు వ్రేళ్ళచే న్యసించి, అరచేతుల యందు నామికలతో నస్త్రమంత్రమును న్యసింప వలయును॥ అస్త్రమంత్రము మాత్రము, అస్త్రాయ ఫట్ యని ఫట్ కారము చివరగలది॥ కడమ మంత్రము లన్నియు హృదయాయనమః అని మొదలుగా నమః పదమె చివరగలవి, అస్త్రాయ హుంఫట్ అనుమంత్రముతో ముమ్మారు తాళము చరచి, దిగ్బంధనము సేసి. కవచముతో చుట్టి, నమశ్శివాయ వౌషట్ అను మంత్రముతో మహాముద్రను జూపవలయు॥ శిరము మొదలుకొని పాదముల వరకు

## —॥ అథశ్రీ పంచాక్షరీ జప విధిః. ॥—

నను, సావిత్ర్యాః పారమేశ్వరత్వ నిర్ధారణేన, తస్యా ఏవ బ్రాహ్మణ్యాపాదకతయా గరీయస్త్వజ్ఞాపనేనచ తజ్జపేనైవ సకలేష్టసిద్ధేః న శైవపంచాక్షరీ జపావశ్యకతా ఇతి చేన్న సావిత్ర్యాస్తథాత్వేపి, శ్రు॥ వ్రత మేతి చ్ఛాంభవం తత్సమాచరే న్ముముక్షు ర్నపునర్భవాయేతి శ్రుతి విహిత మోక్షైక ఫల శాంభవ వ్రత నిత్య ప్రాప్తతయా శైవ పంచాక్షర్యా అసహాయ్యైవ భవ త్యత్యావశ్యకతా॥ యద్యపి, సకల వైదిక కర్మాధికార సంపాదకం ద్విజత్వం, తచ్చ, ద్వైజన్మనీ ద్విజాతీనాంమాతుస్స్వాగ్రేప్రథమం తయో॥ ద్వితీయం ఛందసాం మాతు ర్గ్రహణాద్విధివద్గురోరితి సావిత్రీ గ్రహణాత్సిధ్యతి॥ తథాపి, నతావతా విముక్తిస్సిధ్యతి ద్విజానాం॥ అన్యథా, వ్రత మేత చ్ఛాంభవ మితి విముక్తి ఫలక శాంభవ వ్రత విధే రానర్థక్యాత్॥ నను, సకల వేద సారా సావిత్రీ

---

చేతులతో తాకుట మహాముద్రయగు॥ తరువాత, తన్ను పరమేశ్వరుని తో సమానరూపునిగా భావింప వలయును॥ ఇట్లు కరన్యాసమును, అంగన్యాసమును జేసికొనిన వాడు శివ చ శస్త్రాదులచే భయంకరుండగు వీరభటుని వోలె క్షుద్ర భూతయులకును, విఘ్నములకును వశము కాకుండును॥ కాన ఇది అత్యావశ్యక మైనది. ఇది సకలీకరణము.

### శ్రీపంచాక్షరీ జపవిధి.

ప్ర॥ సావిత్రి పరమేశ్వర పరమని సిద్ధాంతము చేసితివిగదా? అటులేని తిరిగి పంచాక్షరి యేలదులరు?

ఉ॥ మోక్షము కోరువాడు శాంభవదీక్ష నొంద వలయునని శ్రుతి యంటున్నది॥ ఆదీక్ష యందు పంచాక్షరి యుపదేశ ముండి యున్నది॥ పంచాక్షర్యుపదేశములేక శాంభవ దీక్ష సంభవింపదు॥ శాంభవదీక్ష నొందకున్న మోక్షము దొరకదు॥ కావున పంచాక్ష ర్యుపదేశము ముఖ్యమే॥ సావిత్రి ద్విజత్వము నొసఁగునది గాన ముఖ్యమే కాని అది ముక్తి నొసఁగఁ జాలదు॥ అది ముక్తి నొసఁగఁ జాలునేని శ్రుతి ముక్తి గోరువానికి శాంభవ దీక్ష నేల విధించును॥

నముక్తిం కథం సాధయే దితి చేదత్ర న కేవల మస్మాభి రపరాద్ధం॥ స
ర్వైరపి తథాంగీ క్రియమాణత్వాత్, తద్యథా, తురీయాశ్రమే ప్రణ
వమేవ ప్రతిగృహ్య సావిత్రీ ముత్సృజద్భి స్స్వీకృత మముక్తిసాధ
నత్వం తదాశ్రమస్థైః తథా ష్టాక్షర్యాదికం ప్రాధాన్యేన ప్రతిగృహ్ణద్భి
శ్చాన్యైరితి యుక్తమేవ॥ నను, సావిత్ర్యా అపి పరమేశ్వర పరత్వసిద్ధ్యా
పరమేశ్వర పరా సావిత్రీ కథం నముక్తి ప్రదాత్రీ ఇతి చేదుచ్యతే॥
యద్యపి పరమేశ్వర ప్రతిపాదకా విద్యన్తే బహవో మంత్రాః తథాపి
సావిత్ర్యా ఏవ ద్విజత్వసాధనతాంగీ క్రియతే॥ అత్రచ, యథా, న
పారమేశ్వర సంకల్పా దన్యో హేతు రుపలభ్యతే, తథా తస్మా దేవ శై
వ్యాః పంచాక్షర్యా అపి ముక్తి సాధనతే త్యవివాదం। కించ, సూత
సంహితాయాం ముఖ్యశబ్ద జపతో మునీశ్వరాస్సద్య ఏవ పరమం సు
ఖం యయురితుక్త్యా శివనామ్నః పరమముఖ్యతయా ప్రసిద్ధ్యా తన్నాము

---

ప్ర॥ సకలవేద సారమగు గాయత్రి మంత్రము ముక్తినొసంగ జాలదా?

ఉ॥ గాయత్రి ముక్తి నొసంగ నేరదు అని సర్వమతస్థులు నంగీకరించిరి గాన మా
ది తప్ప కానేరదు- తురీయాశ్రమమునందు స్మార్తులు శిఖా సూత్రములతో గూడ గా
యత్రిని వదలి పెట్టుచున్నారు॥ రామానుజులు మొదలగువారు ముక్తికై నారాయణా
ష్టాక్షరమునె గ్రహించుచున్నారు॥ ఇట్టి గాయత్రి వలన ముక్తిలభింప నేరదనిదా
నికై యేము పంచాక్షరిని గ్రహించిన తప్పేమి?

ప్ర॥ గాయత్రి నిర్గుణ తత్త్వమును చెప్పదని యెంచి దీనిని స్మార్తులు తురీయాశ్ర
మమున విడువ వచ్చును॥ రామానుజాదులైనను గాయత్రి యెట్లును నారాయణ పరము
కాజాలదని యెంచి దీనిని ముఖ్యము చేయక నారాయణాష్టాక్షరమును గ్రహింప వచ్చు
ను॥ కాని మీరు గాయత్రి శివపరమేయని గట్టిగ సిద్ధాంతముచేసి యిదిగాదని ముక్తికై శై
వ పంచాక్షరిని గ్రహించుట యుక్తమగునా?

ఉ॥ పరమేశ్వరుని బోధించు మంత్రములు వేనవేలు గలవు అయినను గాయత్రి
యే ద్విజత్వము నొసంగును గాని కడమ మంత్రములొసంగ వనుటకు పరమేశ్వరు సంకల్ప
పై కారణాంతరము లేదు॥ అట్లే ముక్తినొసంగుటకును పంచాక్షరి కంటె నింకొక మంత్ర
ము సాధకము [illegible] కారణమగును॥ ఇదిగాక, సూత సంహి

ముఖ్యస్యైవ మంత్రస్య ముక్తి ప్రదత్వం సమ్మత మిత్యలం॥ నన్వస్యాశ్శి
వాగ మేష్వేవ విధానాత్కథం వైదికత్వ మితిచేత్ ఉచ్యతే॥ శ్రుతౌత
న్నమ ఇత్యుపాసీత॥ తత్ = శివ శబ్దితం బ్రహ్మ నమ ఇతి నమ శ్శబ్దపూ
ర్వక ముపాసీత ఇత్యనేన, ఓమితి హ్యగ్రే వ్యాహరేత్ నమ ఇతి పశ్చా
త్తత శ్శివా యేత్యక్షర త్రయ మితి జాబాలామ్నానేన శైవ షడక్షర
స్య విధి స్స్పష్టం నిగమాంతే ష్వామ్నాత ఇత్య స్యావైదికత్వ మవ్యా
హతం॥ తథా, ఋక్షుతు శివ నామ విధయో యథా ప్రబభ్రవే వృ
షభాయ శ్వితీచే మహో మహీం సుష్టుతి మీరయామి, నమస్యాక
ల్మలీకినం, నమోభి ర్గృణీమసి త్వేషం రుద్రస్య నామ॥ ఇదం పిత్రే మరు
తా ముచ్యతే వచస్స్వాదో స్స్వాదీయో రుద్రస్య వర్ధనం ఇమా రుద్రా
య స్థిర ధన్వనే గిరః ఇతి॥ తథా, ఏకశత సంఖ్యాశ్శాఖా భవంతి, తా
సుచ శ్రీరుద్రస్య నియమేన పాఠాత్, శతే శాఖాసు పఠితం హీదం
శతరుద్రీయ మామనంతి॥ తత్రహి శుక్ల కృష్ణ యజుషోః, గిరిశా చాభ

---

యాదు॥ పరమేశ్వర వాచక శబ్దములలో ముఖ్యములగు శబ్దములను జపము చేసినందున శీ
ఘ్రముగ ముక్తిని పొందిరని కలదుగాన ముఖ్యశబ్దములకే ముక్తి ప్రదత్వము కలదని తెలి
యుచున్నది॥ సర్వశబ్దములు పరమేశ్వర వాచకములైనను శంభు భర్గాది శబ్దములు ముఖ్య
వృత్తిచే పరమేశ్వరుని బోధించునవి గాన ముఖ్యములైనవి. శివశబ్దమైనను, పరమ ముఖ్యమైన
దిగాన దీనికి అతిశీఘ్రముగా ముక్తినొసఁగు శక్తి గలదని శైవ పురాణములు ముఖ్యము
గా గ్రహింపఁబడియె॥

ప్ర॥ ఈ మంత్రము శివాగమముల యందే కలదు గాన ఇది యెట్లు వైదికమగును?

ఉ॥ శివుని నమస్కార పూర్వకముగా నుపాసన చేయవలయునని వేదమునందె
విధికలదు॥ జాబాలము నందును, ఓం అని ముందు పలుక వలయును॥ తరువాత, నమః అని
యు, దాని కనంతరము శివాయ అనియు జేర్పవలయునని యున్నది॥ ఇది నారాయణా
ష్టాక్షరము వోలె ప్రాత్యక్షికములగు నుపనిషత్తు యందు లేక పోయెనా? ప్రత్యక్షము
గాఁ గన్పడుచున్నది గాన నిది వైదికమే యగును॥

ప్ర॥ ఋగ్వేదమునందు శివనామము నుచ్చరింప వలయునని విధికలదా?

ఉ॥ ఏనం= ఈ. రుద్రస్యనామ= రుద్రుని నామమును. నమోభిః = నమస్కా

వదామసీతి శ్రూయతే॥ తథా, తముష్టుహి యస్స్విషు స్సుధన్వా ఇతి, స్తుహి శ్రుతం గర్త సదం యువాన మిత్యాదికం, తథా, నానుసు రుద్ర సంహితాయా మనంతం శివ నామ భజన మహిమాభి వర్ణనం॥ త థా, ఆథర్వణే అథర్వ శిరశ్శిఖాదిషు యోవై రుద్రస్సభగవానితి, సప క స్సవకో రుద్ర స్సఈశాన స్సభగవాన్ సమహేశ్వర స్సమహాదేవఇ త్యాదికమపరిమితం ద్రష్టవ్యం॥ నిత్యత్వం యథా, ఆథర్వణ సంహితా సు ఏకాదశే కాండే ప్రథమానువాకే పంచమ షష్ఠ సప్తమాఖ్యేషు త్రిషు ఖండేషు ఏకత్రింశ న్మంత్రాత్మా రుద్రసంహితా తత్ర సప్త ద శోయంమంత్రః॥ సహస్రాక్షమతి పశ్యం పురస్తాత్, రుద్రమస్యన్తం బ హుధా విపశ్చిదం మోపారరామ జిహ్వయేయ మానమితి వ్యతిరేకే ణ శివ భజన విరామస్య అధర్మత్వం నిరూపయన్ ప్రకృతస్య నిత్య తాం నిరూప యామాస॥

---

రముతో-గృణీమసి= ఉచ్చరింతుము గాక॥ అనియు, దేవతలకు తండ్రియగు రుద్రుని క ద్దేశించి, మాటచెప్పఁ బడును॥ రుద్రునినామము రుచిగలవాని లోనికల్ల ఎక్కువరుచి క లది॥ మావాక్యములు రుద్రుని కొఱకు వినియోగింపఁ బడుగాక, అని మొదలుగాఁ గలవు॥

ప్ర॥ యజుర్వేదమువందు శివనామ విధికలదా?

ఉ॥ యజుర్వేదము నూటయొక్క శాఖలయందును రుద్రాధ్యాయ ముండియున్న ది॥ దానియందు॥ శివుఁడా, నీనామమును స్వచ్ఛముగాఁ జెప్పుదుము గాక యని యున్న ది॥ ఇట్లే- ఆశివునిసే స్తోత్రము చేయుమని పెక్కుమార్లు కలదు॥

ప్ర॥ సామమున, అథర్వణ మునను గలదా?

ఉ॥ సామవేదమున రుద్రాధ్యాయము నందును- అథర్వణమున-అథర్వశిఖాదులయం దును నధికముగా గలదు॥

ప్ర॥ శివనామ జపము నిత్యమని యెచట గలదు?

ఉ॥ అథర్వణ సంహితయందు రుద్రాధ్యాయముకలదు॥ అందు, రుద్రుని నామము ను నాలుకతో నెప్పుడు నుచ్చరించుచు నుపరమింపకుందుము గాక॥ ఇట్లు రుద్రనామో చ్చారణము నొకప్పుడు మానినను ప్రత్యవాయముగను విధించెంగాన, శివనామము జపము మని స్పష్టమైనది॥

నను, నేదం కర్మ సంసిద్ధికారి, ప్రమాదా త్కుర్వతాం కర్మ ప్రచ్యవేతాధ్వరేషు యత్। స్మరణాదేవ తద్విష్ణోః సంపూర్ణం స్యాదితి శ్రుతేః॥ యజ్ఞేషు విహీనం తత్సంపూర్ణం భవతీతి విజ్ఞాయత ఇతిస్మృతి కల్పాభ్యాం విష్ణునామ స్మరణస్యైవ కర్మ వ్యంగితా దోష నివృత్తి హేతుత్వేన, ప్రకృతస్య అతిథాత్వేన తిదేశాపర్యాకర్తృత్వ మితిచేత్ న శ్రుతిషు, స్విష్ట కృద్ధోమస్యైవ కర్మవ్యంగతా దోష నివృత్తి హేతుత్వ విధానాత్, ఏవ మయం మంత్రః॥ యదస్య కర్మ ణోత్యరీరిచం యద్వాన్యూన మిహాకరం॥ అగ్నిష్ట త్స్విష్ట కృద్విద్వాన్ సర్వం స్విష్టం సుహుతం కరోతు మే ఇతి, అతమంత్ర లింగాదేవ కర్మ న్యూనా తిరేకయోః ప్రాయశ్చిత్తం ప్రాతిస్వికం జ్ఞాతమజ్ఞాతంవా తత్ర రుద్ర నామ స్మరణ మేవ కర్తవ్యమితి జ్ఞాయతే। శ్రుతి విరుద్ధే స్మృతే రప్రామాణ్య నిర్ణయస్య శిష్ట సమ్మతత్వాత్, వికల్పాదేశ్చ తుల్య బల విషయ

---

ప్ర॥ యజ్ఞములయందు ప్రమాదము వలన లోపము సంభవించునెడ విష్ణునామము స్మరింప నాలోపము తొలంగునని స్మృతి కల్పముల యందు గలదు। దానిం బట్టి పలువురు విష్ణునామమునె స్మరించు చుందురు॥ అట్లు శివనామము కర్మలోపమును దొలగించునని యెచటకలదు?

ఉ॥ కర్మలోప పరిహారమునకై స్విష్ట కృద్ధోమము చేయవలయునని శ్రుతియందు గలదు. ఎట్లన, ఈకర్మమునందు చెప్పిన దానికన్న నధికముగ గాని తక్కువగాని నేనేది చేసితినో ఆలోపమును స్విష్ట కృత్తగునగ్ని పోగొట్టుగాక యని మంత్రార్థము। స్విష్టకృత్తు హోమమే శ్రుతి యందు కర్మలోప పరిహారమునకై విధింపఁబడియెను। స్విష్టకృత్తు అనగా రుద్రుఁడె అని నిర్ణయింపఁబడి యున్నది॥ స్విష్టకృద్ధోమము లేనిచోట రుద్రుని నామము నుచ్చరించుట యుక్తముగాని శ్రుతికి విరుద్ధముగా విష్ణునామస్మరణము చేయుట యుక్తము గాదు॥ శ్రుతి విరోధమునందు స్మృత్యాదుల కప్రామాణ్యము ప్రాప్తించుగాని వికల్పాదులు చెప్పఁగూడదు। కాఁబట్టి కర్మలోప పరిహారమునకై విష్ణునామ స్మరణము చేయవలయు ననుట వేదవిరుద్ధము॥

ప్ర॥ స్విష్టకృత్తు అగ్నియె కాని రుద్రుఁడు కాఁడు॥ స్విష్టకృద్ధోమము కర్మలోప పరిహారమునకై విధింపఁబడుగాక_ దానిచే శివనామమునకేమి లాభము కలిగెను?

త్వాత్, విప్రతిషిద్ధ ధర్మాణాం సమవాయే భూయసాం స్యాత్స్వ ధర్మ
త్వమితి జైమిన్యుక్తేః, రుద్రస్య స్విష్ట కృత్త్వస్య తా సర్వ శ్రుతి సమ్మ
తస్య స్మృతి బలానుమిత శ్రుత్యపేక్షయా ప్రాబల్య స్యావశ్య మంగీ
కార్య త్వాచ్చ॥

నను, స్విష్ట కృదగ్ని ర్నామ నరుద్ర ఇత్యనేన కిం భవత స్సిద్ధం
శివనామ మాహాత్మ్య మితి చేత్ ఉచ్యతే॥ రుద్రోఽగ్ని స్స్విష్ట కృత్ ఇ
తి బహుషు స్థలేషు రుద్రస్య స్విష్ట కృత్సంజ్ఞ కత్వాభిధానాత్, తథా,
యజుష్షుచ, దేవా వై యజ్ఞా ద్రుద్ర మంతరాయన్। స యజ్ఞ మవిధ్య
త్తం దేవా అభిసమ గచ్ఛంత కల్పతాం న ఇద మితి తేఽబ్రువన్ స్వి
ష్టం వై న ఇదంభవిష్యతియదిమంఆరాధయిష్యామఇతితత్స్విష్ట కృత స్స్వి
ష్ట కృత్త్వం॥ ఇతి॥ స్విష్ట కృతశ్చ వామ రుద్రస్య నిర్లజ్జ ముద్ఘుష్య యజ
నం కంఠరవేణ విహితం॥ యథా, యజుషాం బ్రాహ్మణేషు శ్రూయతే
ఉచ్చై స్స్విష్ట కృత ముత్సృజతి యథా ఽస్విష్టం విత్త్వా ప్రహాయ మితి
తాదృగేవ తత్। ఇత్యనేన సంభావిత న్యూనాతిరేక సమీకరణేన సు
ష్టుయాగం సంపాద్యాను గృహ్ణాతి పరమేశ్వరోఽయ మలజ్జ భజన తు

---

ఉ॥ స్విష్టకృత్తగు నగ్ని రుద్రుఁడే యని శ్రుతియందే కలదు॥ ఇదిగాక, దేవతలు
రుద్రుఁడు లేకుండ యజ్ఞమును చేసిరి— అతఁడు యజ్ఞమును వధించెను॥ అంత దేవతలు య
జ్ఞమును బాగుచేయు మని రుద్రుని ప్రార్థించిరి॥ ఈశ్వరు నారాధించినచో యజ్ఞము
బాగుపడునని యెంచిరి గాన స్విష్టకృత్తు అను పేరు రుద్రునకు వచ్చెనని యజుర్వేదమున
దు గలదు॥ దీనింబట్టి స్విష్టకృత్తు రుద్రుఁడే అని తెలియుచున్నది॥ ఇచట యద్రిష్ట
మున కగ్ని యనియె అర్థము చెప్పినచో అగ్ని లేకుండ యజ్ఞము చేసిరని గదా యర్థమగును॥
అగ్ని లేకుండ యజ్ఞము సేయుట అసంభవము. గాన నట్లు చెప్పఁ గూడదు॥ పోయినస
మ్మ దొరకి నప్పు డెంత పెద్దగా నఱచునో అంత బిగ్గరగా స్విష్టకృత్తును పలుక వలయు
నని వేదమునందె కలదు॥ పరమేశ్వరుని నిరభిమానముగా స్తోత్రము చేయుచో నర్థదే
డు సంభవించిన దోషములను దొలగించి యాగమును సంపూర్ణ ఫలము గావించునని
ధాభిప్రాయము॥ ఇట్లు స్విష్టకృత్తు రుద్రుఁడే యని యేర్పడినది. గాన కర్మలోప ప

ష్ట ఇతి శ్రుతే ర్హృదయం స్విష్ట కృత్సంజ్ఞక రుద్ర హోమస్యైవ ప్రాయశ్చిత్తత్వేన సిగిచు సిగదితలియా యస్య న ప్రాయశ్చిత్తం ప్రాతిస్వికం తస్యాపి శివ నామ భజన మేవానశ్యతిః కార్య మితి శ్రుతి హృదయ స్వారససిద్ధోర్థః॥ ఏతేన కర్మ సంసిద్ధి కారిత్వం శివనామ్న ఏవసిద్ధం॥ అత ఏవ- శివపురాణే, కైలాస సంహితాయాం॥ యత్పాద పద్మస్మరణాద్యస్య(చ్ఛ) నామ జపా దపి। న్యూనం కర్మ భ వేత్పూర్ణం తం వందే సాంబ మీశ్వర మిత్యుక్తం॥

నన్వమంగళ వృత్తత్వా దస్య రుద్రస్య తన్నామ భజనస్య కథం మాంగళ్యాపాదకత్వ మితిచే దుచ్యతే॥ ఏవ మక్షమాలికాయా ముపనిష ద్యామ్నాయతే, ఓం శంకార సర్వప్రదపవిత్రీమచ్చత్వారింశేక్షే ప్రతిష్ఠ ఓం వంకార సర్వాప్యాయనకర నిర్మల పంచ చత్వారింశే క్షే ప్రతిష్ఠ ఓం ఇంకార పుష్టిద అక్షోభకర తృతీయేక్షే ప్రతిష్ఠ అనేన శకారేకార వకారాకార సము దాయ రూపస్య శివ నామ్నోర్థఃప్రతిపాదితః॥ తథా, మంత్ర శాస్త్రేపి శవర్ణ స్య శుభప్రదత్వాం, వంబీజస్య అమృత బీజత్వంచ ప్రతిపాదితం॥ అథ వా సంత కల్యాణ గుణైక నిధిరీ

---

మునకై శివనామమునే స్మరింప వలయును॥ కావుననే- శివపురాణమునందు॥ఎద్దేవుని పాదపద్మములను స్మరించినను-ఎద్దేవుని దివ్యనామమును జపించినను కర్మలోపము తొలంగునో అట్టి సాంబశివుని వందనము చేయుచున్నాను- అని చెప్పి యున్నది॥

ప్ర॥ రుద్రుని చరిత్రము మంగళ కరము గాదని తెలియుచున్నది. ఇక నాదేవుని నామమెట్లు మంగళ కరమగును॥

ఉ॥ అక్షమాలి కోపనిషత్తునందు॥ శ అను వర్ణము- సర్వప్రదము-పవిత్రమునినియున్నది॥ వకారము సర్వాప్యాయన కరమనియు- నిర్మలమైనదనియు నున్నది॥ ఇకారము అక్షోభకరమనియు- పుష్టి ప్రదమనియు నున్నది॥ మఱియు- మంత్ర శాస్త్రమున- శవర్ణము శుభప్రదమనియు- వకారము అమృత బీజమనియు నున్నది॥ అనంత కల్యాణగుణరత్నాకరుడగు నీశ్వరుడు శివుడని చెప్ప బడునని వాయు సంహితలో యున్నది. శి

శ్వరః। శివ ఇత్యుచ్యతే సద్భిశ్శివ తత్త్వార్థ కోవిదైరితి వాయు సంహి
తాయా ముక్తం॥ అత ఏవ, భాగవతేపి॥ యద్వ్యక్షరం నామ గిరేరితం
నృణాం సకృత్ప్రసంగా దఘ మాశుహన్తి తత్। పవిత్ర కీర్తిం తమలం
ఘ్య శాసనం భవానహో ద్వేష్టి శివం శివేతర ఇతి, తత్రైవ॥ యస్యా
నవద్యం చరితం మనీషిణో గృణన్త్యవిద్యా పటలం బిభిత్సవః ఇత్యా
దినా-హసన్తి యస్యాచరితం హి దుర్భగాః ఇత్యాదినా చ శివస్య మంగళకర
త్వం తద్ద్వేషిణాం శివేతరత్వ దౌర్భాగ్యోత్పన్న త్వాదిక మపి ప్రతిపాదితమి
తి మాంగళ్యా పాదకత్వం సిద్ధమస్య॥

నను, రామ మంత్ర ఏవ తారక ఇతి జ్ఞాయతే తారకో నామ
తారయతీతి, తథాచ, కలిసంతరణోపనిషద్యామ్నాయతే॥ ద్వాప
రాన్తే నారదో బ్రహ్మాణం జగామ, కథం భగవన్ గాం పర్యటన్ క
లి సంసారం సంతరేయ మితి॥ సహోవాచ బ్రహ్మా, సాధు పృష్టోస్మి, స
ర్వ శ్రుతి రహస్యం గోప్యం తచ్ఛృణు, యేన కలి సంసారం తరిష్యసి భ
గవత ఆదిపురుషస్య నారాయణస్య నామోచ్చారణ మాత్రేణ నిర్ధూ
త కలి ర్భవతి॥ నారదః పునః పప్రచ్ఛ, నామ కిమితి సహోవాచ హ

---

వచును రెండక్షరములను నొక్కమారు పలుకునెడ సర్వపాపములనుతొలంగునని యు-పవి
త్రములగు చరిత్రలు గలవాఁడును- అలంఘ్యములగు శాసనములగల వాఁడునగు శివుని నమం
గళుఁడవు అగునీవు ద్వేషించుచున్నావనియు- మంగళ చరిత్రములు గల శివుని ద్వేషిం
చువారె యమంగళులనియు- దుర్భగులనియు భాగవతమునందె కలదుగాన శివనామము
మాంగళ్యా పాదకమనుటకు సందియము లేదు.

ప్ర. రామ మంత్రమే తారకమని తెలియుచున్నది. ఎట్లనిన- కలి సంతరణోపని
షత్తునందు హరే రామ అను మొదలుగా నున్నది. కాన- రామనామమే తారకమని
యంగీకరింప రాదా?

ఉ. ఆయుపనిషత్తునందె- ఇతి షోడశకం నామ్నాం కలికల్మష నాశనం హ
రే రామ అని మొదలగు పదునారు నామములను జపించునెడ కలికల్మషముల నశింప

రిణ్యగర్భః॥ హరే రామ హరే రామ రామ రామ హరే హరే। హ
రే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే॥ ఏతత్ షోడశకం నా
మ్నాం కలి కల్మష నాశనం। ఇతి శ్రుతేః రామ నామ్నైవ తారకం భ
వతీతి చేన్న రామ నామ ఫలశ్రుతేః, కలి కల్మష నాశకత్వ మాత్ర ప
రత్వాత్, యుక్తం చైతత్ ఉత్తమ శ్లోక నామ సంకీర్తనస్య కలికల్మ
ష తారకత్వం స్మృతం॥ కర్కోటకస్య నాగస్య దమయన్త్యా నలస్యచ
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశన మిత్యాదౌ॥ ఏవం, కలికల్మ
షాత్తారయతీతి తన్నిబంధ నైవాస్య తారకత్వ నిరుక్తిరపి రామ రహ
స్యాదౌ, ప్రకృతస్య తావత్, శివనామ్నః జాబాలేతు వేదాన్తే॥ అథ
హైనం బ్రహ్మచారిణ ఊచుః కిం జప్యే నామృతత్వం నో బ్రూహీతి
సహోవాచ యాజ్ఞవల్క్యః శతరుద్రీయేణేతి, ఏతాని హవా అమృతస్య
నామధేయాని, ఏతైర్హ వా అమృతో భవతి, ఇతి ముక్తి ఫలకత్వేనా
స్య సునిరూపితతయా, అథర్వశిఖాదౌ, తత్తారమితి, అథ కస్మాదుచ్య
తే తార మిత్యాదినా నమస్తారాయ నమశ్శంభవేచ ఇతి శతరుద్రీయే

---

చేయునని యున్నది. ఇది యుక్తమే యగును. కార్కోటకస్య నాగస్య అని మొదలు
గా నుత్తమ శ్లోకుల నామ కీర్తనమువల్ల కలి నశించునని యున్నది గదా? దీనిం బట్టి-
కలికల్మషముల నుండి తరింపఁ జేయుటచే రామనామమునకు తారక సంజ్ఞ వచ్చెను
గాని దానికి సంసారమునుండి తరింపఁజేయు శక్తి లేదు. సంసారమునుండి తరింపఁజేయు
శక్తి శివనామమునకే గలదుగాన శివనామమే తారకమగును. ఈయర్థము జాబాలమునం
దు గలదు. ఏ మంత్రమును జపము చేసిన ముక్తి లభించునో ఆమంత్రము నుపదేశింపు
మని బ్రహ్మచారులు యాజ్ఞవల్క్యునడిగిరి. శతరుద్రియము 'జపించునెడ ముక్తి గలుగు
నని యాజ్ఞవల్క్యుఁడు బదులు చెప్పెను. శతరుద్రీయము చేతనే యేల ముక్తి
గలుగుననిన- మాకు అమృతత్వము వలయుఁగదా? అమృతుని నామధేయముల జపించి
న ముక్తి గలుగుఁగాని మృతుని నామధేయముల జపించిన నెట్లు ముక్తి గలుగును? శతరు
ద్రీయము లోనే- సోమాయచ- రుద్రాయచ ఈ మొదలగు నామములన్నియు అమృత
పదవాచ్యుఁడగు పరమేశ్వరునివే, వీనిచేతనే గాని ముక్తి కలుగనేరదు. అని యున్నది-
అథర్వశిఖయందు॥ తత్తారం. అశివ నామమునకే తారకమని సంజ్ఞ కలదని యున్నది
రుద్రాధ్యాయము నందును- నమస్తారాయ నమశ్శంభవేచ అనుటచే శివనామమే తారకమ

శివనామ విశేషణ త్వేనైవాస్య నిరుక్తతయా బృహజ్జాబాలే, శ్రీశైవ షడక్షరస్యైవ తారక సంజ్ఞ కత్వాభ్యాసేనచ సంసార తారకత్వ మస్యైవేతి సిద్ధం॥

అత్ర కేచిత్, విశేషార్థ ప్రకాశికాయాం, నమ శ్శివాగ్ని బీజాయ హరాయ పరమాత్మనే। ఓమంత మంత్ర రూపాయ మూల పంచాక్షరాత్మనే ఇత్యుక్త్యా షడక్షరేణ ప్రణవాంతేనైవ భవితవ్యం॥ తథా, తత్రైవ, ఓంకార వదనా దేవీ వాయకార భుజద్వయా। శికార దేహ మధ్యాచ నమకార పదద్వయా॥ ఇతి వచనేనాపి తత్రైవ జ్ఞాయతే॥ ఏవ మేవ శివానుభవసూత్రేపి॥ మూలాధారే నకారాఖ్యా సంస్థితా పరమేశ్వరీ। స్వాధిష్ఠానే మకారాఖ్యా శాంభవీ పర్యవస్థితా। మణిపూరే మహాస్థానే శికారాఖ్యా మహేశ్వరీ। అనాహతే వకారాఖ్యా సదాశైవీ వ్యవస్థితా। విశుద్ధేతు యకారాఖ్యా సాక్షా ద్విశ్వేశ్వరీ స్థితా। ఆజ్ఞా చక్రే మహాదేవీ తారాఖ్యా సముపస్థితా। అచారాఖ్యా న

---

సి నిర్ణయింపఁ బడియెను. కాబట్టి తారకమను పేరు శివనామ మునకేగాని రామనామమునకు లేదు.

ప్ర. విశేషార్థ ప్రకాశిక యందు. ఓమంత మంత్రరూపాయ అనుటచే పంచాక్షరికి ప్రణవము చివరను ఉండవలయునని తెలియు చున్నది. ఓంకార వదనాదేవి అనువచనమును బట్టియు ప్రణవము చివరనే యుండ వలయునని యేర్పడు చున్నది. ఇటులే శివానుభవ సూత్రమునందును, మూలాధార స్థానమున నకారముండునని మొదలు పెట్టి చివరకు ఆజ్ఞా చక్రమునందు ప్రణవముండునని చెప్పిన వచన ములను బట్టియు ప్రణవము కొనకె యుండవలెనని యేర్పడు చున్నది. మతియు నందు- నకార మాచార లింగమని యారంభించి ప్రణవము మహాలింగ మనుట చేతను- ప్రణవము షష్ఠమని యారంభించి- నకారము ప్రథమమని చెప్పుటచేతను శ్రీపంచాక్షరీ మహా మంత్రమునకు చివరనే ప్రణవముండ వలయునని స్పష్టమగు చున్నది కాదా?

ఉ. సకలప్రమాణముల యందును పంచాక్షరికి ప్రణవము మొదటనే యుండునని చెప్పఁబడి యున్నది కాన దానింబట్టి మంత్రమునకు ప్రణవము చివర నుండ వలయు ననువాదము సర్వప్రమాణ విరుద్ధ మగుటంజేసి యది గ్రాహ్యముకాదు.

కారస్స్యాన్నకారో గురులింగకం। శికారశ్శివలింగం స్యాద్వకారశ్చరలింగకం। యకారస్స్యాత్ప్రసాదాఖ్యో మోంకారో మహదుచ్యతే॥ షష్ఠ బ్రహ్మ భవేత్తారో యకారః పంచమో భవేత్। చతుర్థం తు వకారస్స్యాచ్ఛికారస్తు తృతీయకం। ద్వితీయంతు మకారస్స్యాన్నకారః ప్రథమం భవేత్। ఏవం షడక్షరాణ్యేవ బ్రహ్మాణి క్రమశో విదురితి కథనేన చాంతిమ ఏవ ప్రణవ ఇతి భణాతి తన్న తథాంగీకారే బహుప్రమాణ వ్యాకులీ భావాత్, తస్మాదిమాన్యేవ వచనాని తదనుకూలతయా భవంతి యోజ్యాని॥ తద్యథా,

ఓమంత మంత్రరూపాయే త్యత్రాంత పదస్య సామీప్య మర్థః, ని॥ అంతోఽస్త్ర్యవసితే మృత్యౌ స్వరూపే నిశ్చయేంతిక ఇతి వైజయంతీ కథనాత్, ఆదిమోప్యంతి కస్థపవేతి ఓమంత మంత్ర రూప వచనం న ప్రణవాది పాఠం బాధత ఇతి న తేన వచనేన సర్వ ప్రమాణవిరుద్ధోఽర్థో భవతి వాచ్యః॥ తథా, ఓంకార వదనా దేవీతి వచన మపి షడక్ష

---

ప్ర. అట్లని- విశేషార్థ ప్రకాశిక అనుభవ సూత్రమునను గ్రంథములలోని వచనముల కేమిగతి.

ఉ. ఈవచనములకు ప్రమాణాంతర విరోధము లేకుండ నర్థము చేసికొన వలయును.

ప్ర. ఈవచనములనే ప్రధానము చేసికొని వీనికి విరోధము లేకుండ కడమ వచనములకే అర్థమేల చేసికొన కూడదు ?

ఉ॥ అట్లు చేయవీలులేదు. ఏలన- విశేషార్థ ప్రకాశిక- అనుభవ సూత్రము అనునీరెండు గ్రంథములను చేసినవారు మాయిదేవాచార్యు డొక్కండే యగు॥ ఒక్కని మాటను సర్వ ప్రమాణానుకూలముగా నర్థము చేయుట యుచితమగునుగాని సర్వప్రమాణములను ఒక్కనిమాట కనుకూలముగా నర్థము చేయుట న్యాయ్యము కాదు॥ అట్లుచేయనెంచినను తెరుక్కుంగల సకల ప్రమాణములకు నిట్టి యర్థము చేయు శక్యము గాదు॥

ప్ర. వీనికి మాత్రము ప్రణవము మొదటనే యుండ వలయునను నర్థమెట్లు కుదురును ?

ఉ. ఓమంతే మంత్రరూపాయ అనుచోట అంత పదమునకు సమీపమని యర్థము- ప్రణవము మొదట నున్నను దగ్గరనున్నదే యగును॥ ఈపద్ధమునః జెప్పిన నీవచనము ప్ర

గీ యంత్రలేఖన క్రమమేవ బోధయతి నతు మంత్రపాఠ క్రమమితి వ
క్తేనాపి తాదృశార్థప్రతిపత్తిః। నచ, విలిఖితే యన్త్రే అధస్తాత్ప్ర
భృతి వాచ్యమానాని మన్త్రాక్షరాణి ప్రణవావసానానీతి స్పష్టం జ్ఞా
యత ఇతి వాచ్యం, తథా యన్త్రే అధస్తాత్ప్రభృత్యేవ మంత్రాక్షరా
ణి పాఠ్యానీతి వచనాదర్శనేన తదనురోధేన ప్రణవాంతమన్త్ర పాఠా
ంగీకారస్యాయుక్తత్వాత్।

నన్వేవం మూలాధారే నకారాఖ్యా ఇత్యారభ్య ఆజ్ఞా చక్రే
మహాదేవీ తారాఖ్యా సముపస్థితా ఇతి ఆచార్యాఖ్యం నకారస్స్యా
దిత్యారభ్య, ఓంకారో మహదుచ్యత ఇతి, తథా, షష్ఠ బ్రహ్మ భవే
త్తార ఇత్యారభ్య, నకారః ప్రథమం భవేత్, ఏవం షడక్షరాణ్యేవ బ్ర
హ్మాణి క్రమశో విదురితి వచనైశ్చ నకారాదీని ప్రణవావసానాని షడ
క్షరాణి క్రమశః పాఠ్యానీతి స్పష్టం జ్ఞాయత ఇతి చేత్ న, మూలాధా
రే నకారాఖ్యా ఇత్యాది వచనానాం షట్చక్రోపాసనా పరత్వేన తా

---

మూలాంతేగమూలను విరోధింపదు। ఓంకార వదనాదేవీ అనువచన మైననో షడక్షరీ మం
త్రము వ్రాయు విధమును దెల్పునేగాని మంత్రము నిట్లు పఠింప వలయునని దెలుపుటకై ప్ర
వర్తించినది కాదు।

ప్ర॥ యంత్రము వ్రాసినమీద దిగువనుండి మీదికి చదువుచెడ ప్రణవము కొనకే
వచ్చును కాదా?

ఉ॥ యంత్రము వ్రాసిదాని దిగువనుండి మీదికే చదువ వలయునని యెచటను
న్నది? మీదినుంచి యేల చదువరాదు? కాబట్టి ఇది యంత్రోద్ధార వచనముగాని మం
త్రము యొక్క పాఠక్రమమును చెప్పు వచనము కానేరదు॥

ప్ర॥ అట్లైన మూలాధార స్థానమున నకార ముండునని యారంభించి కొనకు ఆ
జ్ఞా చక్రమున ప్రణవ ముండు ననియు నకారమాచార్య లింగమని యారంభించి చివరకు
ప్రణవము మహాలింగ మనియు ప్రణవము ఆఱవది యని యారంభించి నకారము ప్రథమ
మనియు చెప్పిన వచనముల కెట్టులర్థము చెప్ప వలయును?

ఉ॥ మూలాధారస్థానమున నకార ముండు నని మొదలగు వచనములు షట్చ

దృశ వచనైః మంత్ర పాఠ క్రమాబోధనాత్, ఇహ విచారస్య సంభవేన, అస్యా విద్యాయాః పంచాక్షరీత్యేవ సంజ్ఞా ప్రసిద్ధా, యథా, శివమహాపురాణే॥ సైషా పంచాక్షరీ విద్యా సర్వశ్రుతి శిరో గతా। ఇతి, తథా తత్రైవ॥ తథా వేదాశ్చ శాస్త్రాణి మంత్రే పంచాక్షరే స్థితా ఇతి॥ విశేషార్థ ప్రకాశికాయామపి, పంచాక్షరీ పరా విద్యా ఇతి, తాదృశ్యా అస్యాః ప్రణవేన సంబంధః వ్యాఖ్యావ్యాఖ్యేయ రూపతయేతి జ్ఞాయతే, యథా, శివపురాణే, ఓమిత్యేకాక్షరే మంత్రే స్థితః సర్వగతశ్శివః॥ ఈశానాద్యాని సూక్ష్మాణి బ్రహ్మాణ్యేకాక్షరాణితు। మంత్రే నమశ్శివాయేతి సంస్థితాని యథా క్రమమితి, తదను రోధేనైవ, ప్రణవస్య సూక్ష్మ ప్రణవ ఇతి సూక్ష్మ పంచాక్షర ఇతి, పంచాక్షర్యాశ్చ స్థూల ప్రణవ ఇతి స్థూల పంచాక్షర ఇతిచ సంజ్ఞే జాబాలాదిషు శ్రూయేతే తద్విస్తరస్తు మంత్రార్థ నిర్ణయే భవిష్యతి ఏతేన ప్రణవః పంచాక్షరీ సమసత్తాకావితి జ్ఞాయతే తస్మాత్ ననకారాది వత్ప్రణవ షడక్షర్యేకయవభూత ఇతి తత్సాదృశ్యేనైకార్ణతయా గ్రహీతుం యుజ్యత ఇతి

---

ములయందు నుపాసనచేయు విధమును దెలుపప్రవర్తించినవి గాని మంత్రపాఠక్రమమును దెలుప ప్రవర్తించినవి కావు॥ ఇచటనిది గ్రహింపవలయు. ఏమనిన- ఈవిద్యకు పంచాక్షరియనియే ప్రధానమగు సంజ్ఞకలదు శివ మహాపురాణాదులయందట్లై చెప్పఁబడియున్నది. ఈ విద్యకు ప్రణవముతో సంబంధము మూలవ్యాఖ్యాన రూపమైనది. ప్రణవముమూలము పంచాక్షరి అర్థమునని యెఱుంగునది॥ దాననె ప్రణవము సూక్ష్మప్రణవము- పంచాక్షరిస్థూల ప్రణవము ననియు- ప్రణవము సూక్ష్మ పంచాక్షరము- పంచాక్షరి స్థూల పంచాక్షరము ననియు జాబాలాదులయందు జెప్పఁబడు చున్నవి॥ వీనింబట్టి ప్రణవము పంచాక్షరితో సమ సత్తాకమైనదిగాని పంచాక్షర్యవయవములగు నకారాదులతో సమసత్తాకమైనది కానేరదు॥ కాన, నకారము వోలె ప్రణవంబు నొక యక్షరమని గ్రహింపఁ గూడదు॥

అయినను, షట్స్థలోపాసనా పరులగు పెద్దలు ఆఱు అను లెక్కసరి పడుటకై ప్రణవమును గూడ నొక వర్ణముగా గ్రహించిరి॥

ప్ర॥ ఇంత విరుద్ధముగా పెద్దలు ఎట్లు గ్రహించిరి..?

సిధ్యాణి తస్మా త్ప్రణవాయాః పంచాక్షర్యాః షడక్షరీతి వ్యవహారో గా
ణఏవ సమఖ్యాః తథాపి, షట్స్థలో పాసన పరైః ప్రాగ్భిః తదనురోధా
య షడ్వర్ణత్వమేవ గృహీతః తత్ర పంచాక్షరీ సమసత్తాకస్య ప్రణవ
స్య సర్వప్రకృతిభూత మహా లింగ వాచకత్వం తద్ధ్యాన భూతాజ్ఞా చ
క్రో పాస్యత్వంచ యుజ్యత ఇత్యాశయేనైవ షష్ఠ్య ముక్తం నమంత్ర
పాఠక్రమే షష్ఠత్వ మస్మన్మతం తేషాం అన్యథా, సర్వప్రమాణ వ్యా
కులీ భావాదితి, సర్వత్రాపి ప్రణవాదిత్వ మేవాస్యాః ప్రమితం తద్య
థా, జాబాలే, ఓమితి హ్యగ్రే వ్యాహరేత్, నమ ఇతి పశ్చాత్ తతః
శ్శివా యేత్యక్షర త్రయ మితి, తథా, శివపురాణే॥ ఇహోం నమశ్శి
వాయేతి మంత్రేణానేన సిద్ధయ ఇతి తథా, తత్రైవ, మంత్రం సుఖ
ముఖోచ్చార్య మశేషార్థ ప్రసిద్ధయే। ప్రాహోం నమశ్శివాయేతిస
ర్వజ్ఞ స్సర్వ దేహినా మితి, ఏవం, ఏతావద్ధి శివజ్ఞాన మేతావత్పరమం
పదం। యదోం నమశ్శివాయేతి శివ వాక్యం షడక్షరమితి, కించ, త
త్రైవ, కింతస్య బహుభి ర్మంత్రై శ్శాస్త్రైశ్చా బహువిస్తరైః। యస్యో

---

ఉ॥ పెద్దలు గ్రహించినది విరుద్ధముగాదు॥ ఏలనిన- మహాలింగము ప్రకృతి- దా
నియొక్క వికృతులే కడమయైన లింగములు అగుచును మహాలింగము నాఱు లింగము
లలో నొక దానినిగా గ్రహించినట్లె ప్రణవమును నొక్క వర్ణముగా గ్రహించిరి॥ ప్రణ
వంబును- ప్రణవ వాచ్యమగు మహాలింగంబును సత్తమమగు నాజ్ఞా చక్రంబున ధ్యా
నము చేయఁ దగినవను నూహతో పెద్దలు చెప్పిరిగాని మంత్రమునకు చిట్టచివరనే ప్రణవ
ముండ వలయునను నుద్దేశముతోఁ గాదు॥ ఇట్లు లంగీకరింప కుండినయెడ సర్వప్రమా
ణంబులును విరోధించును॥

ఎట్లనిన- జాబాలమునందు- ప్రణవమును ముందు చెప్పి- తరువాత నమః అనియు,
అనంతరము శివాయ అనియు నుచ్చరింప వలయునని యున్నది॥ శివపురాణము నందును,
ఓంనమశ్శివాయ అను మంత్రముచే సకల సిద్ధులు కలుగునని యీ మొదలగు పెక్కు చో
ట్ల మంత్రమునకు మొదటనే ప్రణవముండునని చెప్పఁబడి యున్నది॥ అట్లు- సూతసంహి
త యందును॥ 'మొదట ప్రణవము- రెండవది నకారము అని మొదలుగా ప్రణవము మం
త్రాది యందె యుండునని నిర్ణయింపఁ బడియెను॥

నమ శ్శివాయేతి మంత్రోయం హృది సంస్థితః తేనాధీతం శ్రుతం, తేనైవ
తేన సర్వ మనుష్ఠితం। యేనోం నమ శ్శివాయేతి మంత్రాభ్యాస స్థి
రీకృత ఇతి, తథా, సూత సంహితాయాం యజ్ఞ వైభవ ఖండే, షడక్ష
ర విచారాత్మకేఽష్టమేఽధ్యాయే॥ ప్రణవం ప్రథమా విద్యా ద్వితీయం
తు నకారకం। మకారం తత్పరం విద్యా చ్ఛికారంతు తతః పరం నకా
రం పంచమం విద్యా, ద్యకారం షష్ఠ మేవ చేతి, తథా, శైవ సిద్ధాంత
శిఖామణావపి॥ తథా పంచాక్షరో మంత్ర స్సంసార క్షయ కారకః। ఓం
కార పూర్వ మంత్రోయం పంచాక్షర మయః పరఇతి॥ అత్రయద్యపి
కేచిత్ ఓంకార పూర్వ మంత్ర ఇత్యత్ర ఓంకారా త్పూర్వ మంత్ర ఇ
తి తేన ప్రణవాం తత్వమాయాతీతి బ్రువతే, తథాపి, తత్రైవానుప
దం॥ మంత్ర స్యాస్యాది భూతేన ప్రణవేన మహామతే ప్రబోధ్యతే
మహాదేవః కేవల శ్చిత్సుఖాత్మక ఇతి వచనేన, తథా, ప్రకృత పరిచ్ఛే
దాంతేపి॥ కిమిహ బహుభి రుక్తైర్మంత్ర మేనం మహాత్మా ప్రణవ సహి
త మాదౌ యస్తు పంచాక్ష రాఖ్యం ఇతి వచనేన పరోక్తార్థో విపరీత

---

ప్ర॥ శైవపంచకమందు నెక్కడైన ప్రణవము మంత్రాది యందుండు నని కలదా?
ఉ॥ శైవపంచకము లోని సిద్ధాంత శిఖామణి యందును॥ ఓంకార పూర్వమంత్రః
అనుటచే మంత్రమునకు మొదటనే ప్రణవ ముండునని చెప్పఁబడి యున్నది॥

ప్ర॥ అచ్చట- ఓంకారాత్పూర్వ మంత్రః అను సమాసము చేసిన మంత్రము ఓం
కారము కంటె ముందె యుండునని యర్థమగును. దానింబట్టి మంత్రమునకు చివరనే ప్ర
ణవముండునని యేల గ్రహింపఁ గూడదు॥

ఉ॥ ఈయర్థము సకల ప్రమాణములకు విరుద్ధము గాన నట్లు గ్రహింపఁ గూడదు.
ప్ర॥ ప్రమాణాంతరములు విరోధింపనీ- శైవపంచకాభిప్రాయ మిదియే యని
యేల గ్రహింపరాదు॥

ఉ॥ శైవ పంచకాభిప్రాయము సకల ప్రమాణ విరుద్ధమనుట కేవలమయుక్తము.
అది గాక- ఓంకార పూర్వమంత్రః అనుచోట- మంత్రము ఓంకారము కంటె ముందు
ండు ననుట విపరీతార్థము॥ ఓమంత్రః అనిన సులభముగా దెలియునపుడు ఓంకార పూ
ర్వమంత్రః అనియేల వ్రాయవలయును? అది యట్లుండ నీయర్థము సిద్ధాంత శిఖామణిలో

ఏవేన స్పష్టమేవ। లోకేప్యాచార్యముఖోపదేశే ప్రణవాద్యా ఏవ పంచాక్షర్యా ఉపదిశ్యమానత్వేన తత్పక్షస్య లోకశాస్త్ర విరుద్ధత్వ మక్షత మేవ॥ అత్ర కేచిత్ - విశేషార్థ ప్రకాశికానుభవ సూత్రయోః పంచాక్షర్యాః ప్రణవాం తత్వ ప్రతీతేః ప్రతిపాదనాత్ మాయిదేవాచార్యస్య మతే పంచాక్షర్యాః ప్రణవాం తత్వమితి వదంతి తదసంగతం॥ సర్వప్రమాణ విరుద్ధ మాయిదేవాచార్యస్య మత మిత్యంగీకారాపేక్షయా తదీయానాం కేషాంచిద్వచసాం సర్వ ప్రమాణాను కూలార్థ పరత్వ వర్ణన స్యాచితత్వాత్ - మాయిదేవాచార్యస్యైవ అనుభవ సూత్రే॥ ఏవం షడక్షరాణ్యేవ బ్రహ్మణి క్రమశో విదురితి వచనానంతర మేవ॥ ఓంకారః పరిపూర్ణత్వా త్త్వచి సర్వత్ర వర్తతే నకారో రుధిరే స్థాతి మకారో మాంస సంచయే శికారో మేదసి స్థాతి వకారోఽస్థిషు తిష్ఠతి॥ యకార స్థాతి మజ్జాయాం శుక్లే స్థాతి షడాత్మక ఇతి తథా - తదనంతరాధికరణే॥ ఓమితి జగదఖిలా స్యాన్నమ ఇతి నమమేదమ

---

ని ఓంకారపూర్వ మంత్రః అను శ్లోకమున కనంతర మున్నశ్లోకములకును విరుద్ధమే॥

ప్ర॥ అదియెట్లు?

ఉ॥ ఈమంత్రమునకు ప్రణవము మొదట నుండు నని తరువాత శ్లోకముననె చెప్పబడి యున్నది॥ ఆపరిచ్ఛేదము యొక్క చివరనుగూడ - ప్రణవ సహితమాదా॥ అది యందు ప్రణవముతోగూడ యున్నది అనియు కలదు॥ దీనింబట్టి ఓంకారము కంటె మంత్రము ముందు నుండు ననుట విపరీతార్థమని తేలినది॥ ఇదిగాక - లోకమున - పరిశీలనమున నక్షరాభ్యాసమున గూడ ప్రణవాదిగానె యీమంత్రము ఉపదేశింపబడు చున్నది. ప్రణవము మంత్రాంత్యముననె యుండు నను వాదము సర్వలోక శాస్త్ర విరుద్ధమని తేల్లమైనది॥

ప్ర॥ విశేషార్థ ప్రకాశిక - అనుభవ సూత్రము ఈ రెంటి యందు పంచాక్షరి ప్రణవాంతమని తెలియుచున్నదిగాన మాయిదేవాచార్యుని మతమునందు పంచాక్షరికి [illegible] నే ప్రణవమని యేల అంగీకరింప రాదు?

ఉ॥ మాయి దేవాచార్యుని మతము సర్వశాస్త్ర విరుద్ధమని యంగీకరించుటకంటె విశేషార్థ ప్రకాశికాదుల లోని వచనములకు ప్రమాణాంతరానుకూలమగు వ్యర్థము

పి శివాయేతి। మంత్రం సమర్పకోఽయం షడక్షరో మంత్ర నాయకో జ
యతీత్యనేనచ పాఠ క్రమ స్స్పష్టీ కృత ఇత్యత్ర విపరీతార్థాను ధా
వనం యత్పరేషాం తత్తదీయం పాండిత్య వైపరీత్య మావేదయ తీత్య
లమస్థాన సంరంభేణ॥ పరతత్త్వ వాచకత్వం యథా॥ స్కాందే॥ బ్ర
హ్మోత్తరఖండే॥ అగస్త్యరామాదిభి రాదృతత్వా దముష్య మంత్ర
స్యచ వైదికత్వాత్॥ పరస్య తత్త్వస్యచ వాచకత్వా న్నమశ్శివాయేతి
సదా జపత్వ మితి॥

సర్వపాప హరత్వం యథా, శివ తత్త్వ సుధానిధౌ॥ నామ్నో
స్తి యావత్ శక్తిః పాప నిర్హరణే ద్విజ। తావత్పాపానికర్తుం వై శక్తః
కోవా కలౌయుగే ఇతి, భాగవతేపి॥ యద్వ్యక్షరం నామ గిరేరితం నృ
ణాం సకృత్ప్రసంగా దఘ మాశు హన్తి తదితి॥ శ్రు॥ యశ్చాండాలోపి
శివ ఇతి వాచం విసృజేత్తేన సహ సంవసేత్తేన సహ భుంజీత ఇతిస
ర్వవేద సారత్వం యథా, విద్యాసు శ్రుతి రుత్కృష్టా రుద్రైకాదశినీ

---

కల్పించుటే యుచితము॥ అట్లులొప్పకొనక- ఓమంత మంత్రరూపాయ యనుచోట ప్ర
ణవము చివరనే యుండునని యర్థము చెప్పనెడ- విరోధము వచ్చినప్పుడు నైక వచన
ములకే ప్రామాణ్య ముండునను పూర్వ మీమాంసా న్యాయమునుబట్టి మాయిదేవాచార్య
వచనములు కేవల మప్రమాణములే కావలసి వచ్చును! మాయి దేవాచార్యుఁడె అనుభ
వ సూత్రమునందు॥ ఓంకారము పరిపూర్ణ మైనదిగాన చర్మము నందంతట నుండును॥ న
కారము నెత్తురు నందును- మకారము మాంసమునందు నుండునని మొదలుగా మంత్రము
లోన ప్రణవమే మొదలని చెప్పియున్నాడు॥ ఇదిగాక- ఓం అనఁగా సకలమగు జగ
త్తు అనియు- నమః అనఁగా- నమమ= నాదిగాదు- శివాయ= శివునకే యనియు చె
ప్పుదు ప్రణవమే మొదట నుండునని నిరూపించెను॥

ప్ర॥ ఈ మంత్రము పరతత్త్వమును చెప్పు ననుటయెట్లు?

ఉ॥ ఈమంత్రము అగస్త్య మహాముని- శ్రీరామ చంద్రుఁడు మొదలగు వారి
చే ననుష్ఠానము చేయఁబడినది గావునను- వేదముల యందుఁ జెప్పఁబడి యున్నది గావు
నను- పరతత్త్వమును చెప్పునది గావునను నమశ్శివాయ అని యెల్లప్పుడు జపము చేయు
దుఅని స్కాందమున నున్నదిగాన నీమంత్రము పరతత్త్వవాచకమని స్పష్టమగు చున్నది

శ్రుతౌ। తత్ర పంచాక్షర స్తత్ర శివ ఇత్యక్షర ద్వయమితి॥ విముక్తిసా ధకత్వం యథా, సూత సంహితాయాం॥ షడక్షరం ప్రవక్ష్యామి స మాసేన సుశోభనం। యేన సంసార విచ్ఛిత్తి బ్రహ్మేంద్రాది విభూ తయ ఇతి॥ ఆజ్ఞా సిద్ధత్వం యథా, శివ పురాణే॥ ఆజ్ఞా సిద్ధ మసందిగ్ధ వాక్య మేతచ్ఛివాత్మకం। మంత్రం సుఖ ముఖోచ్చార్య మశేషార్థ ప్ర దాయకం। శ్రుణోఁ నమ శ్శివాయేతి మూల మంత్రంహి శైవక మితి॥

అథమంత్రార్థ నిర్ణయః

ఓం ఇతి బ్రహ్మ వాచకః, ఓమితి బ్రహ్మేత్యాది శ్రుతేః॥ హర స్సర్వస్య కారణా ద్విభుత్వాద్విష్ణు రుచ్యతే, స్సర్వజ్ఞ స్సర్వవిజ్ఞానా ద నాదోమితి స్మృతఇతి కూర్మవచనాచ్చ, అవతేష్టి లోపశ్చేతి సూత్రే

---

ప్ర॥ ఈమంత్రము సమస్త పాతకములఁ బోఁగొట్టు ననుట యెట్లు?

ఉ॥ శివతత్త్వ సుధానిధి యందు॥ శివనామ మెన్ని పాపములఁ బోఁగొట్టునో అన్ని పాపములు చేయువాఁడు కలియుగమున నే యుండడు అని కలదు॥ కలియుగ మున నే లేకున్న నింకే యుగమందు నుండును? ఇదిగాక- చండాలుఁ డైనను శివ అనిపలుకునేడ వానితోఁగలసి కూర్చుండ వచ్చును. భుజింప వచ్చును అనియు శ్రుతియే చెప్పుచున్నది॥ దీనింబట్టి శివనామము సకలపాప హారమని స్పష్టముగు చున్నది॥

ప్ర॥ ఈమంత్రము వేదసారమనుట యెట్లు?

ఉ॥ విద్యలలో నెల్లశ్రుతియు-శ్రుతులలో నెల్ల రుద్రాధ్యాయంబును- నందు పంచాక్షరియు- అందు శివయను రెండక్షరములును సత్కృష్టములనుటచే నీమంత్రము వేద సారమని తెలియుచున్నది॥

ప్ర॥ ఈ మంత్రము ముక్తి సాధనమనుట యెట్లు

ఉ॥ సూత సంహిత యందు॥ ఏ మంత్రముచే సంసార బంధము తొలంగునో అట్టి షడక్షరీమహా మంత్రమును చెప్పుచున్నా ననుటచే ముక్తి హేతువని తెలియు చున్నది॥

ప్ర॥ ఇది ఆజ్ఞాసిద్ధమని యెఱుఁగగలదు?

ఉ॥ శివపురాణమునందు॥ ఈమంత్రము ఆజ్ఞాసిద్ధమని కలదు॥

మంత్రార్థ నిర్ణయము

ఓం [illegible] తెలియు చున్నది

హోమయో శివ వేదశివాగమ సిద్ధయో స్సవ్యాప సవ్యాంగక పైత్ర్య
కియో రపి వ్యవస్థిత వికల్పస్య న్యాయ్యత్వాత్॥

అథ వేద విరుద్ధస్య శివాగమ విధే రగ్రాహ్యత్వా దభ్యుపగమేపి
వేద విరుద్ధత్వ నిర్ణయ ఏవహి తస్య తత్త్యాజ్యత్వ మభ్యుపగమనీయం॥ ప్ర
కృతే నవేద విరోధ గంధోపి॥ తథాహి శ్రుతిషు సర్వానుదిశ్య విహితః
పైత్ర్య కాంగిక మపసవ్యం, శైవాగమేషు తు శాంభవానుద్దిశ్య విహితః
తదప వాదతయా సవ్యమితి సామాన్య విశేష విధ్యో రాపాతతో వి
రోధ ప్రతీతా వపి శాస్త్ర సమన్వయవిదా మవిరోధస్య స్పష్టత్వాత్॥
అపిచ, నిర్వాణోప నిషది॥ పిత్ర్య కర్మ చానుత్తిష్ఠే దుప వీత్యే వేత్య
ప వీతాంగ కస్యాః పిత్ర్య కర్మణ శ్రుతి విహిత తయా స్మృతి విరోధస్యా
నా శంక నీయత్వాచ్చ॥ నను, బ్రహ్మ సూత్రస్య దేవ పిత్రాది కర్మా

---

ప్ర॥ ఆగమము నందు సవ్యముతో పితృ తర్పణము చేయవలయునని చెప్పినదే గ్ర
హించు నెడ, స్మృతి కల్పముల యందు నప సవ్యముతో చేయ నలయు నని చెప్పఁబడి
నది యేమగును?

ఉ॥ ఆవిధి శైవ దీక్ష నొందని వారల యెడ సార్థక మగును. కాన, బాధింపదు.

ప్ర॥ పితృ కర్మముల యందు నపసవ్యము విని యోగింప వలయునని వేదము నందే
కలదు. దానికి విరుద్ధమగు శివాగమ విధి వేద విరుద్ధ మైనది గాన నది యెట్లు గ్రాహ్య
మగును?

ఉ॥ శివాగమములు వేదములతో సమానములని విద్యాస్థాన నిర్ణయము నందు నిర్ణ
యింపఁ బడియెను గాన, ప్రొద్దుపొడవక ముందు హోమము చేయ వలయు నని యొకచో
టను, ప్రొద్దు పొడిచిన తరువాత హోమము చేయవలయునని వేరొకచోటను, ఇట్లు
వేదమునందె పరస్పర విరుద్ధముగానున్న విధులవలెనె పూర్వాచారమును బట్టి వ్యవస్థితవిక
ల్పము న్యాయ్య మగుగాని యొక విధి నంగీకరించి వేరొక విధిని విడుచుట న్యాయ్య
ము గాదు.

ఇట్లు గాక, వేద విరుద్ధమైన శివాగమ విధి గ్రాహ్యము కాదని యంగీకరించి
న శివాగమ విధి వేదవిరుద్ధమని నిర్ణయమైనప్పుడే గదా గ్రాహ్యము గాక పోవును ప్ర

గతయా సవ్యాపసవ్యాది భాగణార్థత్వేన పితృకర్మణ్యపసవ్య నిషేధే యజ్ఞోపవీత ధారణ నైరర్థక్య మాపద్యేతేతిచేన్న సవ్య నివీత ధారణ ద్వారా తద్ధారణస్య సార్థక్యాత్॥

అత్ర కేచిత్, అస్మత్పిత్రాణాం శివోపాసనయా శివసాయుజ్య ప్రాప్తి ద్వారా శివత్వ సిద్ధేస్తదీయ తర్పణేఽపసవ్య నిషేధేపి పితృలోకవాసినా మగ్నిష్వాత్తాదీనాం తథాత్వాభావేన తద్విషయ తర్పణే ప్రాచీనావీత మనిషిద్ధమేవేతి వదన్తి॥ ప్రమితం చైతత్ కారణోత్తరే। అపసవ్యం విధేయం స్యాదగ్నిష్వాత్తాది తర్పణే। పునస్తన్న విధేయం స్యాత్స్వపితౄణాంచ తర్పణే॥ ఇతి॥

అన్యేతు శివాగమేషు పితృ తర్పణ సామాన్యే ప్రాచీనావీతస్య

---

కృతము నందు శివాగమ విధికి వేద విరోధము లేనేలేదు. ఎట్లనగ శ్రుతులయందు సర్వ సాధారణముగా పితృకర్మములకు నపసవ్య మంగమని విధింపఁబడినది. శివాగమముల యందైననో శాంభవ దీక్షనొందిన వారలకు విశేష విధిగా సవ్యమే విధింపఁబడినది. సామాన్య విధికిని విశేష విధికిని విరోధము లేదను నది శాస్త్రజ్ఞులకు విశదమే కావున నద్దాని విషయమై చెప్పంబనిలేదు॥

నిర్వాణోపనిషత్తు నందు శాంభవ దీక్ష నొందిన వారల నుద్దేశించి యుపవీతియై పితృకర్మము నాచరింపవలయునని యుండుటచే నిదియు శ్రుతి విహితమే గాన నీ యాచరణము శంకాస్పదము కానేరదు.

ప్ర॥ బ్రహ్మసూత్రము దేవ పితృాది కర్మాంగముగా సవ్యాపసవ్యాది రూపముగా ధరింపనే ప్రవర్తించినది గాన పితృకర్మము నందు నపసవ్యమును నిషేధించు నెడ యజ్ఞసూత్ర ధారణము వ్యర్థము కాదా?

ఉ॥ అపసవ్యము లేకున్నను, దేవపితృ కార్యముల యందు సవ్యము గాను, మనుష్య కర్మల యందు నివీతము గాను, ధరించు చుండుటచే నది సార్థకమే యగుచున్నది.

ఇందు కొందఱు, మన పితరులు శివోపాసనచే శివ సాయుజ్య సిద్ధి ద్వారా శివత్వము నొందిరి గాన నట్టివారి తర్పణము నెడ నపసవ్యము నిషేధింపఁబడెను, పితృలోకము నందున్నట్టి యగ్నిష్వాత్త మొదలగు వారలట్టి వారు కానందున వారి నుద్దేశించి చేయు తర్పణము నందు నపసవ్యము యుక్తమే యందురు. [illegible] కారణోత్తరము

నిషిద్ధ తిథౌ తన్నిషేధస్య సామాన్యాత్ శేషత్వేన భస్మాపగమ్యైక ప్రాచీనావీతిం నేచ్ఛంతి. యథాచారం వ్యవస్థా॥

## దేవాదితర్పణం.

ఆచమ్య, ప్రాణానాయమ్య, ఏవంగుణ విశిష్టే శుభేఽభ్యుదయ ముహూర్తే, శ్రీమాన్, ... గోత్రః ... శర్మాహం మను ఉపాత్త దురితక్షయ ద్వారా శ్రీపరమేశ్వర ముద్దిశ్య శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం బ్రహ్మయజ్ఞాంగ దేవర్షి పితౄనుద్దిశ్య, దేవర్షి పితృ ప్రీత్యర్థం దేవర్షి పితృతర్పణం కరిష్యే॥

## దేవతర్పణం॥

బ్రహ్మతీర్థేన కుర్యాత్॥ పర శివం తర్పయామి॥ పర శివ పత్నీగ్ స్తర్పయామి॥ పరశివ పుత్రాగ్ స్తర్పయామి॥ పరశివ పార్షదాగ్ స్తర్పయామి॥ ఇష్ట లింగం తర్పయామి॥ ప్రాణ లింగం తర్పయామి॥ భావలింగం తర్పయామి॥ సద్యోజాతం తర్పయామి॥ వామదేవం తర్పయామి॥ అఘోరం తర్పయామి॥ తత్పురుషం తర్పయామి॥ ఈశానం తర్పయామి॥ బ్రహ్మాదయో యే దేవా స్తాన్దేవాగ్ స్తర్పయామి॥ సర్వాన్దేవాగ్ స్తర్పయామి॥ సర్వాన్దేవగణాగ్ స్తర్పయామి॥ సర్వా దేవ పత్నీ స్తర్పయామి॥ సర్వాన్దేవ పుత్రాగ్ స్తర్పయామి॥ సర్వాన్దేవ పౌత్రాగ్ స్తర్పయామి॥ భూర్దేవాగ్ స్తర్పయామి॥ భువర్దేవాగ్ స్తర్పయామి॥ సువర్దేవాగ్ స్తర్పయామి॥ భూర్భువస్సువర్దేవాగ్ స్తర్పయామి॥ అథ నివీతీ భూత్వా ఋషితీర్థేన ఋ

---

కందును నిషిద్ధమని ఒడియు న్నది॥ ఆయినను, మరి కొందఱు, శివాగమముల యందు ఉపసవ్యము నిషేధింపఁబడి యుండుటచే నీ నిషేధమును సామాన్యాపేక్షగనే యెంచి సర్వసాధారణముగాని పితృకర్మముల యందు ఉపసవ్యము ఖండించరు [illegible] న్యాచారమును బట్టి వ్యవస్థ నంగీకరింప వలయును॥

దేవాది తర్పణము.

గ్రంథోక్త విధిగా నాచరించునది॥

రా వృత్త్యా తర్పయేత్॥

కృష్ణ ద్వైపాయనాదయో యే ఋషయ స్తాన్ ఋషీగ్ స్త ర్పయామి (ద్విః)

సర్వా నృషీగ్ స్తర్పయామి॥ సర్వాన్ ఋషిగణాగ్ స్తర్ప యామి॥ సర్వా ఋషిపత్నీ స్తర్పయామి॥ సర్వాన్ ఋషి పుత్రాగ్ స్తర్పయామి॥ సర్వాన్ ఋషిపౌత్రాగ్ స్తర్పయామి॥ భూర్ ఋషీగ్ స్తర్పయామి॥ భువర్ ఋషీగ్ స్తర్పయామి॥ సువర్ ఋషీగ్ స్తర్ప యామి॥ భూర్భు వస్సువర్ ఋషీగ్ స్తర్పయామి॥ ప్రజాపతిం కాం డర్షిం తర్పయామి సోమం కాండర్షిం తర్పయామి॥ అగ్నిం కాండర్షిం తర్ప యామి॥ విశ్వాన్ దేవాన్ కాండర్షీగ్ స్తర్పయామి॥ సాగ్ంహితీ ర్దేవ తా ఉపనిషద స్తర్పయామి॥ యాజ్ఞికీ ర్దేవతా ఉపనిషద స్తర్పయామి॥ వారుణీ ర్దేవతా ఉపనిషద స్తర్పయామి॥ హవ్య వాహం కాండర్షిం త ర్పయామి॥ విశ్వాన్ దేవాన్ కాండర్షీగ్ స్తర్పయామి॥ బ్రహ్మాణగ్ స్వయం భువం తర్పయామి॥ అరుణాః కాండర్షిం తర్పయామి॥ విశ్వా న్దేవా న్కాండర్షీగ్ం స్తర్పయామి॥ అథ ఉపవీతీ పితృతీర్థేన త్రిరా వృ త్త్యా తర్పయేత్॥

సోమః పితృమాన్ యమో౽ంగి రస్వా నగ్నిష్వాత్తాగ్నిః కవ్యవా హనాదయో యే పితర స్తాన్పితౄగ్ స్తర్పయామి॥ త్రిః॥ సర్వాన్ పి తౄగ్ స్తర్పయామి॥ సర్వా స్పితృ గణాగ్ స్తర్పయామి॥ సర్వాః పితృ పత్నీ స్తర్పయామి॥ సర్వాన్ పితృ పుత్రాగ్ స్తర్పయామి॥ సర్వా న్పి తృ పౌత్రాగ్ స్తర్పయామి॥ భూః పితౄగ్ స్తర్పయామి॥ భువః పితౄగ్ స్తర్పయామి॥ సువః పితౄగ్ స్తర్పయామి॥ భూర్భు వస్సువః పితౄగ్ స్తర్పయామి॥ అనేన బ్రహ్మ యజ్ఞేన దేవర్షి పితృతర్పణేనచ భగవా న్సర్వాత్మక శ్రీపరమేశ్వర స్సుప్రీతో౽స్తు॥ ఇతి బ్రహ్మయజ్ఞ ప్రకరణం

అథ నిత్య పితృతర్పణం॥ తత్రోక్త యుక్తాస్త ఇమేధర్మ శాస్త్రే ష్వనుస్మృతాః॥ ఆదౌ పితా తథా మాతా సాపత్నీ మాతర స్తథా

మాతా మహః స్సపత్నీకాః ఆత్మ పత్న్యస్త్వనంతరం । పుత్రభ్రాతృ పి
తృవ్యాశ్చ మాతులాశ్చ సభార్యకాః । దుహితా భగినీ చైవ దౌహి
త్రో భాగినేయకః। పితృష్వసా మాతృష్వసా జామాతా భావుకస్సుష
షా। శ్వశుర స్స్యాల కశ్చైవ స్వామినో గురు రక్థిన ఇతి॥

ఆచమ్య ప్రాణానాయమ్య ఏవం గుణ విశిష్టే శుభేఽభ్యుదయ
ముహూర్తే శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం అస్మత్పితౄ నుద్దిశ్య అస్మత్పితృ
ప్రీత్యర్థం అస్మత్పితృ తర్పణం కరిష్యే ఇతి సంకల్ప్య పితరం...గోత్రం
... శర్మాణం స్వధానమ స్తర్పయామి ఇత్యాదినా పితృ తీర్థేన త్రిః త
ర్పయేత్॥ తతః। యేకేచాస్మత్కులే జాతా అపుత్రా గోత్రిణో గతాః।
తే గృహ్ణంతు మయా దత్తం సూత్ర నిష్పీడనోదక మిత్యుప వీత మ
ర్ద్ధీ కృత్వా నిష్పీడయేత్॥ ఇతి నిత్య పితృ తర్పణం॥

## అథవైశ్వదేవ ప్రకరణం,

పంచ మహా యజ్ఞ స్వరూప మాహ శ్రుతిః॥ దేవ యజ్ఞః పి
తృ యజ్ఞో భూత యజ్ఞో మనుష్య యజ్ఞో బ్రహ్మ యజ్ఞ ఇతి। యదగ్నౌ
జుహోత్యపి సమిధం తద్దేవ యజ్ఞ స్సంతిష్ఠతే। యత్పితృభ్య స్స్వధా
కరోత్యప్యప స్తత్పితృ యజ్ఞ స్సంతిష్ఠతే। యద్భూతేభ్యో బలిం హర
తి తద్భూత యజ్ఞ స్సంతిష్ఠతే। యద్బ్రాహ్మణేభ్యోఽన్నం దదాతి త
న్మనుష్య యజ్ఞ స్సంతిష్ఠతే॥ యత్స్వాధ్యాయ మధీయీత ఏకామప్యృ
చం యజుస్సామవా తద్బ్రహ్మ యజ్ఞ స్సంతిష్ఠత ఇతి॥ యమః॥ పంచ
సూనా గృహస్థస్య వర్తంతేఽహరహ స్సదా। ఖండనీ పేషణీ చుల్లీ జల
కుంభ ఉపస్కరః। ఏతాభిర్వ్యాహర న్విప్రః బధ్యతే వై ముహుర్ముహుః

---

వైశ్వదేవవిధి.

పంచ మహా యజ్ఞముల స్వరూపమును శ్రుతి యిట్లు చెప్పెను॥ దేవయజ్ఞము, పి
తృయజ్ఞము, భూతయజ్ఞము, మనుష్యయజ్ఞము, బ్రహ్మయజ్ఞము అని యైదు. వీనిలో, అ
గ్నియందు సమిధలను హోమము చేయుట దేవయజ్ఞము॥ పితృదేవతలకు తర్పణము చే
యుట పితృయజ్ఞము॥ భూతములకు బలిని సంగుట భూతయజ్ఞము. బ్రాహ్మణులకు న

ఏతాసాం పావనార్థాయ పంచ సూనాః ప్రకీర్తితాః। వ్యాసోపి। శాలాగ్నౌ లౌకికే వాఽథ జలే భూమ్యామథాపివా। వైశ్వదేవస్తుకర్తవ్యో దేవయజ్ఞ స్సవై స్మృత ఇతి॥ అత్రాంగిరాః॥ శాలాగ్నౌతు పచే దన్నం గృహ్యాగ్నౌ హోమ ఏవచ। ప్రాత ర్హోమంతు నిర్వృత్య సముద్ధృత్య హుతాశనాత్। శేషం మహానసే కృత్వా తత్ర పాకం సమాచరేత్॥ తమగ్నిం పున రాహృత్య శాలాగ్నావై వినిక్షిపేత్। తతోఽస్మిన్ వైశ్వ దేవాది కర్మ కుర్యా దతంద్రిత ఇతి॥ వ్యాసోపి॥ యదిస్యా ల్లౌకికే పాక స్తతోన్నం తత్ర హూయతే। శాలాగ్నౌ తత్ర చేదన్నం విధిరేష సనాతనః। దేవేభ్య స్తుహుతా దన్నా చ్ఛేషా ద్భూత బలిం హరేత్॥ భూత యజ్ఞ స్సవిజ్ఞేయో భూతిద స్సర్వ దేహినాం॥ తచ్చకాలద్వయేపి కర్తవ్య మిత్యాహ కాత్యాయనః॥ సాయం ప్రాత ర్వైశ్వ దేవః కర్తవ్యో బలికర్మచ। అనశ్నతాపి సతత మన్యథా కిల్బిషీ భవేదితి॥

## అవిభక్త వైశ్వదేవం

సాగ్ని రేకోహ్యేక పాకాశ్చాః పుత్ర భ్రాతాదయో యది। నపృథ వైశ్వ దేవాస్స్యుః స్వపాకా న్నిర్వపేద్యది। ఏకం భవే ద్విభక్తానాం తదేవ స్యాత్పృథ క్పృథక్॥ ఇతి॥

---

ఉట మనుష్య యజ్ఞము॥ వేదము చదువుట బ్రహ్మ యజ్ఞము॥

రోలు, తిరుగలి, పొయ్యి, నీటికడవ, చీపురు వనూ నైదిటి చేతను నిత్యము. గృహస్థునకు జీవహింస సంభవించు చున్నది॥ ఈదోషము శమించుటకై వైశ్వదేవము విధింపబడియెను॥

తాను భుజింప కున్నను సాయంకాలమునను, ప్రాతః కాలమునను వైశ్వదేవమును, భూత బలిని చేయవలయు॥

## అవి భక్త వైశ్వ దేవము.

ఏక పాకము నందు భుజించు వారిలో నొక్కరు వైశ్వ దేవము చేసిన చాలును గాని ప్రతివారును చేయం బని లేదు॥

## అనగ్నిక వైశ్వదేవం

సాయణీయే॥ సాగ్నికః పితృ యజ్ఞాంతే బలికర్మ సమాచరేత్। అనగ్ని ర్హుత శేషాత్తు బలిం కాక బలిం హరే దితి॥ సంగ్రహే ॥ హుత్వా వ్యాహృతిభి శ్చాన్నం హుత్వా శాకల కాదిభిః। భూతేభ్యశ్చ బలిం దద్యాదన్న మగ్నావత్వ నగ్నిమాన్। అనగ్నికస్తు యోవిప్రో అన్నం వ్యాహృతి పూర్వకం। హుత్వా శాకల మంత్రైశ్చ శిష్టం కాక బలిం హరేత్ । అన్నం వ్యాహృతిభి ర్హుత్వా హుత్వా మంత్రైశ్చ శాకలైః ప్రజాపతే ర్హవి ర్హుత్వా పూజయే దతిథీం స్తత ఇతి॥

నను వైశ్వ దేవం శైవే నసంగచ్ఛతే। తథాహి॥ ఈశ్వర నివేదనా త్పురస్తాత్క్రియమాణే వైశ్వదేవ శేషస్య తన్నివేద నానర్హత్వేన నివేదనా నంతరం క్రియమాణేచ నివేదిత శేషస్య వైశ్వ దేవా నర్హత్వే నచ ఉభయథాచ దోషా దితి చేన్న ॥ వైశ్వ దేవార్థ మోదన ముద్ధృత్య పురస్తా న్నివేదనం నిర్వర్త్య వైశ్వ దేవార్థం పృథగుద్ధృతే నౌదనేన వైశ్వ దేవే క్రియమాణే బాధకా భావాత్॥ ఆజ్య సంస్కారే నాన్య శేషత్వ దోషాప్రసక్తేః॥

తథా వైద్యనాథ దీక్షితీయే॥ వైశ్వ దేవస్య పూజానంతర భా

---

### అనగ్నిక వైశ్వదేవము.

నిత్యాగ్ని కలవాఁడు పితృయజ్ఞాంతమునందు భూత బలిని చేయ వలయు॥ అగ్ని లేనివాఁడు వైశ్వదేవ శేషముతో భూత బలిని కాక బలిని చేయవలయు॥

ప్ర॥ వైశ్వదేవము శైవము నందు కూడదు॥ ఏలన, ఈశ్వర నివేదన మైన తరువాత నివేదిత శేషము వైశ్వదేవమునకు కూడదు॥ ముందు చేయునెడ వైశ్వదేవ శేషము ఈశ్వర నివేదనమునకు కూడదు॥ కావున, శైవము నందు వైశ్వదేవ మెట్లు కూడును?

ఉ॥ వైశ్వ దేవమునకై ముందుగా నన్నము వేరుగా దీసి యునిచి, తొలుత నీశ్వర నివేదనమునే చేసి తొలుత వైశ్వదేవమునకై దీసిన యన్నముతో వైశ్వదేవము చేయునెడ నిందు బాధయేమియును లేదు॥ ఆజ్యసంస్కారము చేసి నందున నన్య శేషత్వ దోషము సంక్రమింపదు॥ కావునే, వైద్యనాథ దీక్షితీయమునను పూజచేసిన తరువాత వైశ్వదేవము చేయవలయునని చెప్పి, హోమముచేయుటకు మిగిలినయన్నముతో నైవేద్య

విశ్వ ముక్త్వా। యత్తు శౌనక వచనం హుత శేషేణ పృథగన్నేన నా
కుర్యాత్। నాన్యస్య శేషేణ వైశ్వదేవం కుర్యాదితి। తద్వైశ్వ దేవా
ర్థ ముద్ధృత్య తచ్ఛేషేణ నివేదనం కుర్యాది త్యేవం పరం। ఉద్ధృత్య వై
శ్వ దేవార్థం దేవస్య ప్రాఙ్నివేద యేదితి స్మరణాదితి। ఏవం పరాశర
మాధవీయేపి॥ వైశ్వదేవస్య దేవ పూజానంతర భావిత్వం వ్యవస్థాప
యద్భి రయమేవార్థో వ్యక్తీ కృతః॥

అథవా పృథ క్పాకేన కుర్యాత్। తదుక్తం వ్యాసేన॥ నైవే
ద్యార్థం పృథగ్భాండే పత్నీస్నాత్వా పచేద్గృహే। వైశ్వ దేవార్థ మన్య
స్మిన్ వ్యంజనాని పృథ గ్పృథగితి।

నను పృథక్పాకేన వైశ్వదేవే క్రియమాణే నివేదనా ద్యుపయు
క్తాన్న శుద్ధిర్న స్యాదితి చేన్న నివేదనాయ వైశ్వదేవ సంపాద్య మా
నా న్నశుద్ధే రనపేక్షణాత్। అన్యైరపి వైశ్వదేవా త్పురస్తా ద్దేవ నివేద
నస్య క్రియమాణ తయా పృథ గ్వైశ్వదేవార్థ ముద్ధృతి మాత్రేణ
పురస్తా త్క్రియమాణ నివేదనోప యుక్తాన్నశుద్ధే రసంభవాచ్చ।

---

హుతశేషాన్నముతో నైనను వైశ్వదేవము చేయవలయును గాని అన్యశేషముతో వైశ్వ
దేవము చేయఁ గూడదనుశౌనకవచనము ననూదించి, ఈవచనమునకు వైశ్వదేవ మునకై
వేరుగా దీసి యునిచియె వైశ్వదేవము చేయవలయునని యభిప్రాయమని చెప్పఁబడియెను
వైశ్వదేవమునకై వేరుగాఁ దీసియునిచి యాశ్వాన్నమును ముందుగా నివేదనమె చేయవలయు
నని స్మృతి వచనంబు నుదాహరింపఁ బడియెను॥ ఈవిధముననె పరాశర మాధవీయమునం
దును దేవపూజ చేసినతరువాతనె వైశ్వదేవము చేయవలయు ననుటచేనట్లె చేయవలయు
నను నర్థమే యేర్పడు చున్నది॥

అట్లు గానిచో పృథక్పాకముచే వైశ్వదేవము చేసికొన వలయును। దేవునకు నివే
దనమునకై వేరుగను, వైశ్వదేవమునకై వేరుగను పాకము చేయవలయునని వ్యాసుఁడు చె
ప్పియుండెను॥

ప్ర॥ పృథ క్పాకముతో వైశ్వ దేవము చేయునెడ నివేదనమునకై చేసినపాకము
నకుశుద్ధి యెట్లు కలుగును?

నచ ఈశ్వర నివేదనార్థం వైశ్వదేవ ప్రయుక్తాన్నశుద్ధేరనావశ్యకత్వే పృథక్ పరిహారార్థం తస్యా ఆవశ్యకత్వేన పృథక్పాకేన వైశ్వదేవే క్రియమాణే కర్మలోప పరిహారే పృథక్ పరిహారోపయుక్తాన్నశుద్ధి ర్నస్యాదితి వాచ్యం వైశ్వదేవస్య పురుషార్థస్యైవాభ్యుపేతత్వాత్। తథాహి। పరాశర మాధవీయే। యద్యపి సాయం ప్రాతస్సిద్ధస్య హవిష్యస్య జుహుయాదితి వచనా ద్వైశ్వదేవ స్యాన్నసంస్కారతా ప్రతీయతే తథాపి పురుషార్థత్వమేవాభ్యుపేయం। తానేతాన హరహః కుర్వీతేతి వాక్య శేషేతదవగమాత్ ॥

నచోభయార్థత్వం శంకనీయం పరస్పర విరోధాత్। అన్నసంస్కారత్వే హ్యన్నస్య ప్రాధాన్యం వైశ్వదేవస్య గుణతా పురుషార్థత్వేతు తద్విపర్యయః। తథాచ సత్యేకస్యైవ యుగపత్ప్రాధాన్యం గుణత్వంచ విరుధ్యేయాతాం తస్మాన్నాన్న సంస్కారత్వేనమాభూత్పురుషార్థత్వ మితిచేన్న॥ మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం

---

ఉ॥ నివేదనమునకై వైశ్వదేవమువల్లఁ గలుగు నన్నశుద్ధి యపేక్షింపఁబడదు॥ ఏకపాకమున వైశ్వదేవము చేయువారైనను వైశ్వదేవము కన్న ముందుగానె నివేదనము చేయుచున్నారు. వైశ్వదేవమునకై వేరుగా నన్నము దీసినంతనె ముందుగాఁ జేయు నివేదనమున కుపయోగించు నన్నము శుద్ధమగునా? కాదు॥ కావున, నివేదనమునకై వైశ్వదేవ ప్రయుక్తమగు నన్నశుద్ధి యనవసరము॥

ప్ర॥ ఈశ్వర నివేదనమునకై వైశ్వదేవ ప్రయుక్తమగు నన్నశుద్ధి యనావశ్యకమైనను భోజనమునకై యది యావశ్యకమే యయి యున్నది పృథక్పాకముతో వైశ్వదేవము చేయునెడ కర్మలోపము పరిహరింపఁబడినను నివేదితాన్నమె భుజింపఁ దలఁచినగాని భోజనమునకై యుపయోగించు నన్నమునకు శుద్ధి యెట్లు పొసఁగును?

ఉ॥ వైశ్వదేవము అన్నసంస్కారార్థమా? లేక పురుషార్థమా? అని యాలోచింపఁగ పురుషార్థమే గాని అన్నసంస్కారార్థము కానేరదని మాధవాచార్యులవారు పరాశర మాధవీయమందు నిర్ణయించి యున్నారు॥ ఇది అన్నసంస్కారార్థమే యగునెడ తాను భుజించు పాకమునకు వైశ్వదేవ ప్రయుక్తాన్నశుద్ధి యావశ్యకమే యయి యుండును. అట్లుగాక, పురుషార్థమె అయినందున పృథక్పాకముతో వైశ్వదేవము చేసినను చాలును

క్రియతే తదుదితి మనునా పురుషార్థత్వ స్మరణాత్॥ యత్తు సిద్ధస్య హవిష్యస్య జుహుయా నిత్యాదామ్నాతం। తదన్యథా ప్యుపపద్యతే। తత్ర జుహుయాదిత్యుత్పత్తివిధిః సిద్ధస్య హవిష్యస్యేతి వినియోగ విధిః॥ తానేతానహరహః కుర్వీతేత్యధికారః॥ కించ అన్న సంస్కార పక్షే ప్రతిపాక మావృత్తిః ప్రసజ్యేత ప్రతి ప్రధానం గుణావృత్తిరితి న్యాయాత్॥ తస్మాత్పురుషార్థత్వ మేవ న్యాయ్యం॥ అత ఏవ గృహ్య పరిశిష్టేఽభిహితం॥ ప్రోషితోప్యాత్మ సంస్కారం కుర్యాదేవం విచారయన్నితి॥ గోభిలోపి॥ యద్యేకస్మిన్ కాలే వ్రీహియవౌ పచేయాతాం, తదన్యతరస్య హుత్వా కృతం మన్యేత యద్యేకస్మిన్ కాలే పునః పునరన్నం పచ్యేత సకృదేవ బలిం కుర్వీత యద్యేకస్మిన్ కాలే బహుధాన్నం పచ్యతే గృహపతికాన్మహానసాదేవైతం బలిం కుర్వీతేతి॥ అయమర్థః॥ నానాద్రవ్యాన్న పాకే పునః పునః పాకేపి బహూనామవిభక్తానాం భ్రాత్రాదీనాం పృథక్పృథక్పాకే ప్యేకస్మాదేవ ద్రవ్యాత్సకృదేవ గృహపతి పాకాదేవ హోతవ్యమితి॥ ఏవం వైశ్వదేవ స్యాన్న సంస్కారకత్వాసిద్ధౌ పృథక్పాకేన క్రియమాణేపి తస్మిన్ పురుషార్థ ప్రాపకత్వాత్ తస్యాన్న సంస్కారకతా ముపపద్య

---

మన్వాదులు వైశ్వదేవము పురుషార్థమే యని నిర్ణయించి యున్నారు. ఈ పూర్వవిరోధము వలన నుభయార్థమునుం గూడదు॥ ఇది, అన్న సంస్కారార్థమే యగునేని అన్నిమార్లు పాకము చేసిన, అన్నిమార్లు వైశ్వదేవము చేయవలసి వచ్చును. అనేక పాకములు చేసికొనినను ఒక్కపాకమున వైశ్వదేవము చేసినం జాలునని ధర్మశాస్త్రకర్తలు నిర్ణయించి యున్నారు. దీనిం బట్టి వైశ్వదేవము అన్న సంస్కారార్థమై ప్రవర్తించినది కాదు. యది పురుషార్థమే యనియు స్పష్టమైనది గావున, పృథక్పాకములో జేసినను పురుషార్థ సిద్ధి కభ్యంతరము లేదు గావున భోజనమునకై వైశ్వదేవ ప్రయుక్తాన్న శుద్ధి యనావశ్యకమే యగును॥

ఇంక, వైశ్వదేవ మన్న సంస్కారమునకని చెప్పి యేక పాకమునందే వైశ్వదేవము చేసినను, దానియందు నుపయోగింపని వ్యంజనాదులకు శుద్ధి యెట్లు పొసంగును? కావున సాయంప్రాతర్వైశ్వదేవము నాదినమున చేయుటనో ఏకజలమున సిద్ధమగు పాకము చేయుటచే నక్కడను పదార్థములకును వైశ్వదేవ ప్రయుక్తాన్నశుద్ధి కలుగ నున్నదని యంగీకరింపక తప్ప

ఏక పాకేన వైశ్వదేవే క్రియమాణేపి వ్యంజనానాం తత్రానుపయుక్తానాం సమానాహిక జలాది సంబంధేన వైశ్వదేవప్రయుక్త శుద్ధ్యభ్యుపగమస్యావశ్యకత్వేన తేనైవ సంబంధేన పృథక్పాకస్యాపి నివేదనాభ్యవహారాద్యుపయుక్త, సర్వవిధి పాకశుద్ధే స్సంభావితత్వాత్॥

పిత్రా రాధనాదిషు పృథక్పాకే నైవాస్య నిర్వర్త, నీయత్వేన ఏతాదృశసంబంధే నైవ సర్వపాక శుద్ధ్యభ్యుపగమ స్యావర్జనీయత్వాచ్చ॥

ఇను చంద్రికాయాం॥ యదా శ్రాద్ధం పితృభ్యస్తు దాతుమిచ్ఛతి మానవః। వైశ్వదేవం తతః కుర్యాత్ నివృత్తే శ్రాద్ధకర్మణి। ప్రతి వాసరికో హోమ శ్శ్రాద్ధాదౌ క్రియతే యది। దేవా హవ్యం న గృహ్ణంతి కవ్యంచ పితర స్తథా। ఇతి వచనేన పృథక్పాకేనాపి శ్రాద్ధ కర్మణః పురస్తా ద్వైశ్వ దేవాచరణస్య నిషిద్ధత్వేన శ్రాద్ధ సమాప్త్యనంతరం శ్రాద్ధమధ్యేపి వికిరహూప బలిహరణానంతరమగ్నౌకరణానంతరం వా వైశ్వదేవానుష్ఠానం బలిహరణంచ కర్తవ్యమితి వైద్యనాథదీక్షితీయే

---

దః॥ వేరుపాకములో వైశ్వదేవము చేసినను అట్టిసంబంధముతో భిన్నపాకములకును శుద్ధిసంభవించుచున్న దిఇదిగాక పైతృకాదుల యందు॥ పృథక్పాకములో వైశ్వదేవము చేయక తప్పదు॥ అప్పుడైన నిట్టి సంబంధముతోనె సర్వపాక శుద్ధి యంగీకరింపక తీరదు॥

ప్ర॥ శ్రాద్ధము పెట్టిన తరువాతనె వైశ్వదేవము చేయవలయు॥ అట్లుగాక, శ్రాద్ధమునకు ముందె వైశ్వదేవము చేయునెడ దేవతలు హవ్యమును- పితరులు కవ్యమును గ్రహింపరు అనుటచే పృథక్పాకముచె నైనను శ్రాద్ధమున కంటె ముందు వైశ్వదేవము చేయం గూడదు గన, శ్రాద్ధ సమాప్తియయిన తరువాతనో శ్రాద్ధము నడుమ వికిరము చేసిన తరువాతనో? అగ్నౌకరణము చేసిన తరువాతనో వైశ్వదేవమును భూతబలిని చేయవలయు నని వైద్యనాథ దీక్షితీయమున చెప్పం బడియున్నది య్యొ॥ పొసంగును॥

ఉ॥ శ్రాద్ధశేషములో వైశ్వదేవము చేయునెడ న్యాశ్రాద్ధము రాత్రులకే చేయుగాని పితరులకు చెంద నెగదని పైతృకసిరయు, పితరుల కై వైశ్వదేవము కొఱకు

జిష్ణు సిర్ణీత మితి చేత్ ఉచ్యతే। పితృపాకా త్సముద్ధృత్య వైశ్వదేవం కరోతి యః ఆసు రంత ద్భవే చ్ఛ్రాద్ధం పిత్ర్యాశా నోపతిష్ఠ తీతి పైఠీనసినా॥ పితర్థం నిర్వాపే త్పాకం వైశ్వదేవార్థ మేవచ వైశ్వదేవం న పితర్థం నదద్యా వైశ్వదేవిక మితి లోకాక్షిణాచ నిషిద్ధత్వేన శ్రాద్ధ శేషేణ వైశ్వదేవకరణ మయుక్తం॥

అత ఏవ నిర్ణయ సింధౌ॥ సాగ్నేః పృథక్పాకేన సర్వత్రాపి దా వైశ్వదేవ ఇత్యుక్తం॥ తస్మా త్పృథక్పాకేనాపి వైశ్వదేవకరణ మదూషిత మేవేతి సిద్ధం॥

## అథ నిత్య వైశ్వదేవ ప్రయోగః.

ఆచమ్య ప్రాణా నాయమ్య ఏవంగుణ విశిష్టే శుభేఽభ్యుదయ ముహూర్తే శ్రీమాన్ గోత్రః శర్మాభిధేయోఽహం మమోపాత్త మితి క్షయ ద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం అన్న సంస్కార ద్వారా ఆత్మ సంస్కారార్థం పంచ సూనా పనుత్తయేన గృహే సిద్ధే నాన్నేన ప్రాత ర్వైశ్వ దేవం కరిష్యే॥ ఇతి సంకల్ప్య॥

గృహపాకాత్ హవిష్యం అహవిష్యంచ పృథగాదాయ అగ్న్యావధి శ్రిత్య ఉదగుద్వాస్య అద్భిః ప్రోక్ష్య హవిష్యం ద్విధాకృత్వా అభిఘార్య భూర్భువస్సు వరో మిత్యగ్ని మిద్ధ్వా ధ్యాత్వా ప్రాఙ్ముఖాగ్నే మమ అభిముఖో భవ సుముఖోభవ సుప్రసన్నో భవ వరదోభవ యథోక్త జిహ్వాయాం హవి ర్గృహాణ॥ ఇత్యభిముఖీ కృత్య గాయత్ర్యా సోదకేన పాణినా

---

ను వెవ్వేరుగ నె పాకము చ్చేయవలయు గాని ఒక్కదానికి చేసినపాకము వేరొక్కదానికి నుపయోగింపఁ గూడదని లోకాక్షియుఁ జెప్పియుండుటచే శ్రాద్ధశేషముతో వైశ్వదేవము కూడదుగాన పృథక్పాకము చేయక తప్పదు॥

దాననె, నిర్ణయ సింధువు నందు నిత్యాగ్ని హోత్రి అన్నికర్మముల యందు పృథక్పాకముతో మాత్రమే వైశ్వదేవము చేయవలయునని చెప్పఁబడియెను॥

నిత్య వైశ్వదేవ ప్రయోగము గ్రంథముఁ జెప్పఁబడియెను॥ అవిధమున జేయవలయు

ప్రదక్షిణ మగ్నిం పరిసమూహ్యాలంకృత్య అదితేను మన్యస్వ అనుమతే౽ నుమన్యస్వ సరస్వతేను మన్యస్వ దేవ సవితః ప్రసువ॥ ఇతి పూర్వ పరిషేచనం కృత్వా హవిష్య ప్రథమభాగా దాదాయ ఔపాసనే పచనేవా వహ్నౌ శాద్యైః ప్రతిమన్త్రగ్ హస్తేన జుహుయాత్ ॥ అగ్నయే స్వాహా॥ అగ్నయ ఇదం॥ విశ్వేభ్యో దేవేభ్య స్స్వాహా విశ్వేభ్యో దేవేభ్య ఇదం ॥ ధ్రువాయ భూమాయ స్వాహా॥ ధ్రువాయ భూమాయేదం॥ ధ్రువ క్షితయే స్వాహా ధ్రువ క్షిత య ఇదం॥ అచ్యుత క్షితయే స్వాహా అచ్యుతి క్షితయ ఇదం॥ అగ్నయే స్విష్టకృతేస్వాహా। అగ్నయే స్విష్టకృత ఇదం॥ అదితే౽న్వ మగ్గ్స్థాః॥ అను మతే౽న్వ మగ్గ్స్థాః॥ సరస్వ తే౽న్వమగ్గ్స్థాః॥ దేవ సవిత ః ప్రాసావీః ॥ ఇత్యుత్తర పరిషేచనం కృత్వా అహవిష్యం కించిదాదాయ ఉదీచీ నముష్ణం భస్మాపోహ్య॥ తూష్ణీం॥ స్వాహా॥ ప్రజాపతయ ఇదం॥ ఇతి హుత్వా॥ అథ హవిష్య ప్రథమ భాగం అహవిష్యేణ సంయోజ్య బలీన్ హరేత్ ॥ సతి సూన స్యం స్పష్టేన కార్యాః॥

బలీనాం తస్య తస్య దేశే సగ్గ్స్కారో హస్తేన. పరిమృజ్యా వోక్ష్య న్యస్య పశ్చాత్పరిషేచనం॥ తూష్ణీం సమంతం పరిషేచనం కుర్యాత్॥ ఏవం బలీనాం దేశే దేశే సమ వేతానాగ్ సకృ త్సకృదంతే పరిషేచనం॥ హస్తేన పరిమృజ్యా వోక్ష్య ధర్మాయ స్వాహా। ధర్మాయేదం॥ హస్తేన పరిమృజ్యా వోక్ష్య అధర్మాయ స్వాహా అధర్మా యేదం॥ ఇత్యుదగప వర్గం నిధాయ। అంతే ద్వయో స్సకృత్పరిషిచ్య పరిమృజ్యా వోక్ష్య అద్భ్య స్స్వాహా। అద్భ్య ఇదం॥ పరిషిచ్య పరిమృజ్యా వోక్ష్య ఓషధి వనస్పతిభ్య స్స్వాహా॥ ఓషధి వనస్పతిభ్య ఇదం॥ పరిమృజ్యా వోక్ష్య రక్షో దేవజనేభ్య స్స్వాహా॥ రక్షో దేవజనేభ్య ఇదం ద్వయో॥ పరిషిచ్య పరిమృజ్యా వోక్ష్య గృహేభ్య స్స్వాహా। గృహేభ్య ఇదం॥ పరిమృజ్యా వోక్ష్యఅవసానేభ్య స్స్వాహా ।అవసానేభ్య ఇదం। పరిమృజ్యా వోక్ష్య అవసాన పతిభ్య స్స్వాహా । అవసాన పతిభ్య ఇదం పరిమృజ్యా వోక్ష్య సర్వభూతేభ్య స్స్వాహా। సర్వభూతేభ్య. ఇదం। ప

కృత్వా పరిషిచ్య పరిమృజ్య ప్రోక్ష్య॥ కామాయ స్వాహా కామాయేదం॥ పరిషిచ్య పరిమృజ్య ప్రోక్ష్య అంతరిక్షాయ స్వాహా అంతరిక్షాయేదం॥ పరిషిచ్య పరిమృజ్య ప్రోక్ష్య యదేజతి జగతి యచ్చ చేష్టతి నామ్నో భాగోయం నామ్నే స్వాహా॥ వాయవ ఇదం॥ పరిషిచ్య పరిమృజ్య ప్రోక్ష్య పృథివ్యై స్వాహా పృథివ్యా ఇదం॥ పరిమృజ్య ప్రోక్ష్య అంతరిక్షాయ స్వాహా అంతరిక్షాయేదం॥ పరిషిచ్య దివే స్వాహా దివఇదం॥ పరిమృజ్య ప్రోక్ష్య॥ సూర్యాయ స్వాహా॥ సూర్యాయేదం॥ చంద్రమసే స్వాహా చంద్రమస ఇదం॥ పరిమృజ్య ప్రోక్ష్య నక్షత్రేభ్యస్స్వాహా నక్షత్రేభ్య ఇదం॥ పరిమృజ్య ప్రోక్ష్య ఇంద్రాయ స్వాహా ఇంద్రాయేదం॥ పరిమృజ్య ప్రోక్ష్య॥ బృహస్పతయే స్వాహా, బృహస్పతయ ఇదం॥ పరిమృజ్య ప్రోక్ష్య ప్రజాపతయే స్వాహా॥ ప్రజాపతయ ఇదం॥ పరిమృజ్య ప్రోక్ష్య॥ బ్రహ్మణే స్వాహా బ్రహ్మణ ఇదం॥ సకృత్పరిషిచ్య॥ పరిమృజ్య ప్రోక్ష్య॥ స్వధా పితృభ్యః స్వాహా, పితృభ్య ఇదం॥ అప ఉపస్పృశ్య॥ పరిమృజ్య ప్రోక్ష్య॥ నమో రుద్రాయ పశుపతయే స్వాహా॥ రుద్రాయపశుపతయ ఇదం॥ అప ఉపస్పృశ్య॥ పరిషిచ్య॥

## దేవయజ్ఞః.

ఆచమ్య ప్రాణానాయమ్య, శ్రీపరమేశ్వరప్రీత్యర్థం దేవయజ్ఞేనయక్ష్యే॥

విద్యుదసి విద్యమే పాప్మా నమృతా త్సత్య ముపైమి॥ అప ఉపస్పృశ్య॥ అదితేఽనుమన్యస్వ॥ అనుమతేఽనుమన్యస్వ॥ సరస్వతేఽనుమన్యస్వ॥ దేవ సవితః ప్రసువ॥ ఇతి పూర్వ పరిషేచనం కృత్వా, (ద్వితీయ భాగా దాదాయ) దేవేభ్య స్స్వాహా, దేవేభ్య ఇదం॥ అదితేఽన్వమగ్గ్‌స్థాః, అనుమతేఽన్వమగ్గ్‌స్థాః, సరస్వతేఽన్వమగ్గ్‌స్థాః దేవసవితః ప్రాసావీః॥ ఇత్యుత్తర పరిషేచనం కృత్వా॥ వృష్టి రసివృశ్చమే పాప్మా నమృతా త్సత్య ముపాగాం॥ అప ఉపస్పృశ్య॥

## పితృయజ్ఞః.

ఆచమ్య, ప్రాణానాయమ్య, దేశకాలౌ సంకీర్త్య, శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం పితృయజ్ఞేన యక్ష్యే॥

విద్యుదసి విద్యమే పాప్మానమృతాత్సత్యముపైమి॥ అప ఉ
పస్పృశ్య॥ అగ్నే ర్దక్షిణతో భూమౌ సమ్మృజ్య॥ అవోక్ష్య॥ ద్వితీయ
భాగా దాదాయ॥

పితృభ్య స్స్వధాస్తు, పితృభ్య ఇదం॥ పరిషిచ్య॥ వృష్టి రసి వృ
శ్చమే పాప్మానమృతాత్సత్య ముపాగాం॥ అప ఉపస్పృశ్య॥

భూతయజ్ఞః

అప ఉపస్పృశ్య ఆచమ్య॥ ప్రాణానాయమ్య, దేశకాలౌ సం
కీర్త్య, శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం భూత యజ్ఞేన యక్ష్యే, ఇతి సంకల్ప్య
విద్యుదసి విద్యమే పాప్మానమృతాత్సత్యముపైమి॥ అప ఉప స్పృశ్య
అగ్నే రుత్తరతో భూమౌ సమ్మృజ్య॥ అవోక్ష్య, ద్వితీయ భాగా దా
దాయ॥ భూతేభ్యో నమః, భూతేభ్య ఇదం॥ ప్రదక్షిణం పరిషిచ్య, వృ
ష్టి రసి వృశ్చమే పాప్మానమృతాత్సత్య ముపాగాం॥ అప ఉపస్పృశ్య॥

మనుష్యయజ్ఞః

ఆచమ్య, ప్రాణానాయమ్య, శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం మనుష్యయ
జ్ఞేన యక్ష్యే॥ ఇతి సంకల్ప్య, నివీతీ భూత్వా॥ విద్యుదసి విద్యమే పా
ప్మానమృతాత్సత్య ముపైమి। అప ఉపస్పృశ్య॥ అదితేఽను మన్యస్వ
అనుమతేఽను మన్యస్వ, సరస్వతేఽను మన్యస్వ॥ దేవ సవితః ప్రసువ
ద్వితీయ భాగా దాదాయ॥

మనుష్యేభ్యో హంతా॥ మనుష్యేభ్య ఇదం॥ అదితేన్వ మగ్గ్
స్థాః, అనుమతేఽన్వమగ్గ్స్థాః సరస్వతేఽన్వమగ్గ్స్థాః॥ దేవ సవితః ప్రా
సావీః॥ ఇత్యుత్తర పరిషేచనం కృత్వా, వృష్టి రసి వృశ్చమే పాప్మా
మృతాత్సత్య ముపాగాం॥ అప ఉపస్పృశ్య॥

బ్రహ్మయజ్ఞః.

ఉపవీతీ, ఆచమ్య, ప్రాణానాయమ్య, శ్రీపరమేశ్వర ప్రీత్య
ర్థం బ్రహ్మయజ్ఞేన యక్ష్యే॥ ఇతి సంకల్ప్య॥ విద్యుదసి విద్య మే పాప్మా
నమృతాత్సత్య ముపైమి। అప ఉపస్పృశ్య॥ ప్రజాపతేర్బలేర్దక్షిణతః
మృజ్య అవోక్ష్య॥ ద్వితీయ భాగా దాదాయ॥ ప్రజాపతయే స్వాహా

జా పతయ ఇదం॥ ప్రదక్షిణాం పరిషిచ్య॥ వృష్టిరసి వృశ్చమే పాప్మానమృతా త్సత్య ముపాగాం అప ఉపస్పృశ్య॥

## అగ్ర దానం.

ఆచమ్య, ప్రాణానాయమ్య, శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం అగ్రదానం కరిష్య ఇతి సంకల్ప్య అదితేఽను మన్యస్వ,అనుమతేఽనుమన్యస్వ, సరస్వతేఽనుమన్యస్వ దేవ సవితః ప్రసువ। ద్వితీయభాగాదాదాయ పరమేష్ఠినే స్వాహా, పరమేష్ఠిన ఇదం॥ యథా కూప శ్శతధార స్సహస్రధారో అక్షితః ఏవామే అస్తు ధాన్యగ్ంసహస్రధార మక్షితం ధన ధాన్యై స్వాహా॥ అగ్నయే స్విష్టకృత ఇదం అదితేఽన్వ మగ్గ్స్థాః, అనుమతేఽన్వమగ్గ్స్థాః సరస్వతేఽన్వ మగ్గ్స్థాః దేవ సవితః ప్రాసావీః

## శ్వానబలి విధానం.

సర్వ భాగాన్న శేష మాదాయ శ్వానాహి శ్యామ శబలా వైవస్వత కులోద్భవా। తాభ్యాం బలిం ప్రదాస్యామి రక్షతాం పథి సర్వదా॥ ఇంద్ర వారుణ వాయవ్యా యామ్యా యే నైరృత్యోద్భవాః వాయసాః ప్రతి గృహ్ణన్తు భూమౌ పిండం మయార్పితం శ్వపతిత శ్వపచ వాయ సేభ్యః క్రిమిభ్య ఇదం॥ ఇతి దేవతీర్థేన నివేశన ద్వార దేశే దద్యాత్ ॥

## భూత బలిః.

యే భూతాః ప్రచరన్తి దివా నక్తం బలి మిచ్ఛన్తో వితుదస్య ప్రేష్యాః। తేభ్యో బలిం పుష్టికామో హరామి మయి పుష్టిం పుష్టి పతి ర్దధాతు స్వాహా॥ యే రుద్రా రౌద్ర కర్మాణో రుద్ర స్థాన నివాసినః సౌమ్యా శ్చైవ తు యే కేచి త్సౌమ్య స్థాని నివాసినః మాతరో రుద్ర ముఖ్యాశ్చ గణానా మధి పాశ్చయే। విఘ్న భూతాస్త థా చాన్యే దిగ్వి దిక్షు వ్యవస్థితాః। సర్వే సుప్రీత మనసః ప్రతి గృహ్ణన్త్విమం బలిం। సిద్ధిం విశంతు నః క్షిప్రం భయేభ్యః పాంతు నిత్యశో ఇతి బలిం దత్వా, పాదౌ ప్రక్షాళ్య, ఆచమ్య, శివాగ్న్యాంతికం గత్వా॥

### స్వస్తి

శ్రద్ధాం మేధాం యశః ప్రజ్ఞాం విద్యాం బుద్ధిం శ్రియం బలం ఆయుష్యం తేజ ఆరోగ్యం దేహి మే హవ్యవాహన। యస్య స్మృత్యా చ నామోక్త్యా తపః పూజా క్రియాదిషు। న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే మహేశ్వరం। మంత్ర హీనం క్రియా హీనం భక్తిహీనం మహేశ్వర। యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తు తే॥ ఇతి పార్థివ సంహార ముద్రయా మూలమంత్రేణచ శివాగ్నిం ప్రాణ లింగే నివేశ్య గోత్ర నామోచ్చారణ పురస్సర మభివాదనం కుర్యాత్॥

### వైశ్వ దేవస్య నిత్యత్వం

అన్నాభావే ప్రవాసేచ తండులా నోషధీస్తు వా। పయో దధి ఘృతం వాపి కందమూల ఫలాదివా। యోజయే ద్దేవయజ్ఞాదౌ జలం వాప్యస్తు వా జలే। మంత్రా వృత్త్యాథవా కుర్యా ద్వైశ్వ దేవం యథా విధి॥

### నిత్యా రాధనం.

తదుక్తం కాత్యాయనేన॥ అధ్యాపనం బ్రహ్మ యజ్ఞః పితృ యజ్ఞస్తు తర్పణం। హోమో దైవో బలిర్భౌతో నృయజ్ఞో ఽతిథి పూజనం। శ్రాద్ధం వా పితృ యజ్ఞ స్స్యాత్పిత్ర్యో బలి రథాపి వేతి॥ శ్రాద్ధం చా నిత్య పితా రాధనం॥ తదుక్తం ఏకంతు భోజయే ద్విప్రం పిత్రా నుద్దిశ్య

---

#### వైశ్వ దేవమునకు నిత్యత్వము.

పాకము చేయనప్పుడు గాని ప్రవాసము నందు గాని, బియ్యము నో ఓషధుల నో పాలు, పెరుగు, నేయి యను వానిలో కందమూల ఫలములనో జలమునో విని యోగించి గాని మంత్రా వృత్తిచే గాని వైశ్వదేవమును నిత్యము చేయవలయును॥

#### నిత్యారాధనవిధి.

గురించి కాత్యాయనుడు॥ వేదము చెప్పుట బ్రహ్మయజ్ఞము. పితృ తర్పణము చేయుట పితృయజ్ఞము. హోమము చేయుట దేవయజ్ఞము. భూత బలి నిచ్చుట భూతయజ్ఞము. అతిథి పూజచేయుట మనుష్య యజ్ఞము. శ్రాద్ధ మైనను పితృయజ్ఞమే యగును.

సత్తమః। నిత్య శ్రాద్ధం తదుద్దిష్టం పితృ యజ్ఞో గతి ప్రద ఇతి ॥ ఏవం మార్కండేయేనాపి॥ కుర్యాద హరహః శ్రాద్ధ మన్నాద్యేనోదకేనవా పితౄ నుద్దిశ్య విప్రాంస్తు భోజయే ద్విప్ర మేవవేతి॥ నిత్యారాధన ప్రకార ఉత్తరలలితే నిరూపితః నిత్య మారాధనం వక్ష్యే మర్ఘ్యా వాహన వర్జితం! బ్రహ్మ చర్యాది నియమో విశ్వేదేవాశ్చ రక్షకం పైతృకే తు త్యజే న్నిత్యే భోజ్య మన్నం ప్రకల్పయేత్। శక్త్యాతు దక్షిణాం దత్వా నమస్కారై ర్విసర్జయేత్ ఏకమప్యాశయే న్నిత్యం పితృ భక్త్యాన్వహం గృహీతి॥ కాత్యాయనేనా త్రానుకల్పః కథితః॥ ఏకమప్యాశయే న్నిత్యం పితృ యజ్ఞార్థ సిద్ధయే॥ అత్రైవం నాస్తి చేదన్యో భోక్తా భోజ్య మథాపి వా। అభ్యుద్ధృత్య యథా శక్తి కించి దన్నం యథా విధి। పితృభ్య ఇద మిత్యుక్త్వా స్వధా కార ముదాహరేత్॥ తచ్చాస్మై బ్రాహ్మణా యేతి దత్వా భుంజీత నాగ్యత ఇతి। ఉద్ధృత మన్నం బ్రాహ్మణాయ దద్యాత్ ఏతే దేవ యజ్ఞ భూత యజ్ఞ పితృయజ్ఞా వైశ్వ దేవ శబ్దే నోచ్యన్తే।

---

చెప్పెను। శ్రాద్ధమునగా నిత్యమగు పితారాధనము॥ ప్రతి దినము పితరుల నుద్దేశించి యొక్కనికి నన్నము పెట్టుట నిత్య శ్రాద్ధమనియు నిది పితృ యజ్ఞ మనియుం జెప్పం బడి యున్నది॥ నిత్యారాధన విధి ఉత్తర లలితము నందు గలదు॥ నిత్యారాధనము నందు అర్ఘ్యము అవాహనము, బ్రహ్మచర్యాది నియమము, విశ్వేదేవ సంరక్షక స్థానములును లేవు॥ భుజింపం జేసి శక్తి కొలది దక్షిణ నొసంగి నమస్కరించి యనుప వలయు॥ ఈసందర్భమున కాత్యాయనుడు వేరొక విధానమును దెలిపెను॥ ఎట్లనిన, పితృయజ్ఞము సిద్ధింపనొక్కని నైన భుజింపం జేయు వలయు॥ భోక్త గాని భోజ్యముగాని లభింప కున్న యెడ, కొంచె మన్నము తీసి, పితృభ్య ఇదం అని స్వధా కారముతో త్యాగము చేసి బ్రాహ్మణునకు నొసంగ వలయు॥ నని చెప్పెను॥ దేవయజ్ఞము, భూత యజ్ఞము పితృ యజ్ఞము నను మూడును వైశ్వ దేవశబ్దముచే చెప్ప బడును॥

## అతిథి పూజనం

ఆతిథ్యస్య మనుష్య యజ్ఞత్వం కాత్యాయనే నోక్తం॥ అధ్యాపనం బ్రహ్మ యజ్ఞః పితృ యజ్ఞస్తు తర్పణం। హోమో దైవో బలిర్భౌతో నృయజ్ఞో తిథి పూజన మితి॥ శ్రుతిరపి॥ యద్బ్రాహ్మణే భ్యోన్నం దదాతి తన్మనుష్య యజ్ఞస్సంతిష్ఠత ఇతి॥ అతిథి స్వరూప ముక్తం పరాశరేణ॥ ఇష్టోవా యదివా ద్వేష్యో మూర్ఖః పండిత ఏవవా। సంప్రాప్తే వైశ్వదేవాన్తే సోతిథి స్స్వర్గ సంక్రమః। దూరాధ్వోప గతం శ్రాంతం వైశ్వదేవ ఉపస్థితం। అతిథిం తం విజానీయా న్నాతిథిః పూర్వ మాగత ఇత్యాదినా॥

అతిథి పూజనం సమాప్తం॥

---

### అతిథి పూజా విధి.

అతిథి పూజయే మనుష్య యజ్ఞమని కాత్యాయనుఁడు చెప్పెను॥ బ్రాహ్మణులకన్నమిడుటయే మనుష్య యజ్ఞమని శ్రుతియుఁ జెప్పుచున్నది॥ అతిథి స్వరూపమును పరాశరుఁ డిట్లు తెలిపెను॥ హితుడు గాని, విరోధిగాని, పండితుఁడు గాని మూర్ఖుఁడుగాని వైశ్వదేవావసాన కాలమునకు వచ్చిన వాఁడు అతిథి యగును॥ దూరము నుండి నడచి శ్రాంతుఁడుగా వచ్చిన వాఁడె యతిథి యగుగాని యంతకుఁ బూర్వము వచ్చిన వాఁడు కాఁడు మొదలుగఁ జెప్పి యుండెను॥

అతిథిపూజావిధిముగిసెను.



సత్తమః। నిత్య శ్రాద్ధం తదుద్దిష్టం పితృ యజ్ఞో గతి ప్రద ఇతి ॥ ఏవం మార్కండేయేనాపి॥ కుర్యాద హరహః శ్రాద్ధ మన్నా ద్యేనోదకేనవా పితౄ నుద్దిశ్య విప్రాంస్తు భోజయే ద్విప్ర మేవవేతి॥ నిత్యారాధన ప్రకార ఉత్తరలలితే నిరూపితః నిత్య మారాధనం వక్ష్యే మ్యర్ఘ్యా వాహన వర్జితం। బ్రహ్మ చర్యాది నియమో విశ్వేదేవాశ్చ రక్షకం పైతృకే తు త్యజే న్నిత్యే భోజ్య మన్నం ప్రకల్పయేత్। శక్త్యాతు దక్షిణాం దత్వా నమస్కారై ర్విసర్జయేత్ ఏకమప్యాశయే న్నిత్యం పితృ భక్త్యాన్వహం గృహీతి॥ కాత్యాయనేనా ప్యత్రానుకల్పః కథితః॥ ఏకమప్యాశయే న్నిత్యం పితృ యజ్ఞార్థ సిద్ధయే॥ అదైవం నాస్తి చేదన్యో భోక్తా భోజ్య మథాపి వా। అభ్యుద్ధృత్య యథా శక్తి కించి దన్నం యథా విధి। పితృభ్య ఇద మిత్యుక్త్వా స్వధా కార ముదాహరేత్ ॥ తచ్చాస్మై బ్రాహ్మణా యేతి దత్వా భుంజీత నాగ్నిత ఇతి॥ ఉద్ధృత మన్నం బ్రాహ్మణాయ దద్యాత్ ఏతే దేవ యజ్ఞ భూత యజ్ఞ పితృయజ్ఞా వైశ్వ దేవ శబ్దే నోచ్యన్తే॥

---

చెప్పెను॥ శ్రాద్ధమునుగా నిత్యమగు పితా రాధనము॥ ప్రతి దినము పితరుల నుద్దేశించి యొక్కనికి అన్నము పెట్టుట నిత్య శ్రాద్ధమనియు నిది పితృ యజ్ఞ మనియుఁ జెప్పఁ బడి యున్నది॥ నిత్యారాధన విధి ఉత్తర లలితము నందు గలదు॥ నిత్యారాధనము నందు అర్ఘ్యము ఆవాహనము, బ్రహ్మచర్యాది నియమము, విశ్వేదేవ సంరక్షక స్థానములును లేవు॥ భుజింపఁ జేసి శక్తికొలది దక్షిణ నొసఁగి నమస్కరించి యనుప వలయు॥ ఈసందర్భమున కాత్యాయనుఁడు వేరొక విధానమును దెలిపెను॥ ఎట్లనిన, పితృయజ్ఞము సిద్ధింపనొక్కని నైన భుజింపఁ జేయ వలయు॥ భోక్త గాని భోజ్యముగాని లభింప కున్న యెడ, కొంచె మన్నము తీసి, పితృభ్య ఇదం అని స్వధా కారముతో త్యాగము చేసి బ్రాహ్మణునకు నొసఁగ వలయు॥ నని చెప్పెను॥ దేవయజ్ఞము, భూత యజ్ఞము పితృ యజ్ఞము నను మూడును వైశ్వ దేవశబ్దముచే చెప్ప బడును॥

## అతిథి పూజనం

ఆతిథ్యస్య మనుష్య యజ్ఞత్వం కాత్యాయనే నోక్తం। అధ్యాప
నం బ్రహ్మ యజ్ఞః పితృ యజ్ఞస్తు తర్పణం। హోమో దైవో బలిర్భౌ
తో॰ నృయజ్ఞో తిథి పూజన మితి॥ శ్రుతిరపి॥ యద్బ్రాహ్మణే భ్యోఽన్నం ద
దాతి తన్మనుష్య యజ్ఞస్సంతిష్ఠతఇతి॥ అతిథి స్వరూప ముక్తం పరా
శరేణ॥ ఇష్టోవా యదివా ద్వేష్యో మూర్ఖః పండిత ఏవవా। సంప్రాప్తో
వైశ్వదేవాన్తే సోఽతిథి స్వర్గ సంక్రమః॥ దూరాధ్వోప గతంశ్రాంతం
వైశ్వదేవ ఉపస్థితం। అతిథిం తం విజానీయా న్నాతిథిః పూర్వ మాగత
ఇత్యాదినా॥

అతిథి పూజనం సమాప్తం॥

---

### అతిథి పూజా విధి.

అతిథి పూజయే మనుష్య యజ్ఞమని కాత్యాయనుఁడు చెప్పెను॥ బ్రాహ్మణుఁ
డన్నమిడుటయే మనుష్య యజ్ఞమని శ్రుతియుఁ జెప్పుచున్నది॥ అతిథి స్వరూపమును ప
రాశరుఁ డిట్లు తెలిపెను॥ హితుడు గాని, విరోధిగాని,పండితుఁడు గాని మూర్ఖుఁడుగా
వైశ్వదేవావసాన కాలమునకు వచ్చిన వాఁడు అతిథి యగును॥ దూరము నుండి నడచి శ్రాం
త్తగా వచ్చిన వాఁడె యతిథి యగుగాని యంతకుఁ బూర్వము వచ్చిన వాఁడు కాఁ
డని మొదలుగఁ జెప్పి యుండెను॥

అతిథిపూజావిధిముగిసెను.



శైవపరిచారిణీ గ్రంథమాల — ౨౧

ధర్మసంగ్రహే,

# ఆహ్నికకాండః

## చతుర్థ భాగః

ఇది

బ్ర. శ్రీ. ముదిగొండ నాగలింగ శాస్త్రిగారిచే
రచింపఁబడి,

బ్ర. శ్రీ. విద్వాన్. ముదిగొండ వీరేశలింగ శాస్త్రిగారిచే
ముద్రణాక్షర స్ఖాలిత్య రహితముగాఁ బరిశోధింపఁబడి,

బ్ర. శ్రీ. కొడిమేల రాజలింగారాధ్యుల వారిచే

శైవప్రచారిణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

వరంగల్

౭౧౦౦

1928

వెల. 1—4—0

# రాజపోషకులు

బ్రా॥ శ్రీ॥ రా॥ శ్రీ ఇజ్జతాసార్ రాజా కంకుమూరి బాలసూర్య ప్రసాదరావు జమీందారుగారు. విశాఖపట్టణము.

# శాశ్వతాభిమానులు

బ్రా॥ శ్రీ॥ కామున్న రాజయ్యగారి కొమారుఁడు వీరరాజుగారు. దువ్వ.

మ॥ రా॥ కొమరవెల్లి శాశయ్య గారు. వరంగల్.

మ॥ రా॥ భూపతి రత్నంగారు వరంగల్

మ॥ రా॥ భూపతి రామన్న గారు. వరంగల్

మ॥ రా॥ నాగబండి కట్టమల్లయ్యగారు వరంగల్

మ॥ రా॥ కొండూరి వెంకటరాజంబ్రదర్సు వరంగల్

మ॥ రా॥ కుంచం నాగయ్యగారు వరంగల్

మ॥ రా॥ అప్పనిరామయ్యగారు వరంగల్

బ్రా॥ శ్రీ॥ ముదిగొండ బాలకోటిలింగం గారు-మున్సబ్ హెడ్ క్లర్కు నరసరావుపేట

# శాశ్వతచందాదారులు

బ్రా॥ శ్రీ పతిపండితారాధ్యుల మల్లయ్య అయ్యవార్లంగారు మట్టెవాడ

బ్రా॥ ముదిగొండ రాజమాంబగారి మల్లయ్య అయ్యవార్లం గారు వరంగల్

బ్రా॥ శ్రీ॥ శివదేవుని వీరేశలింగా రాధ్యులవారు వరంగల్

మ॥ రా॥ అల్వైదన్నుగారి నారాయణ సింగుగారు వరంగల్

మ॥ రా॥ పెద్ది వీరయ్యగారు మట్టిముచ్చాల.

మ॥ రా॥ ములుగు కిష్టయ్యగారు సిద్దిపేట.

మ॥ రా॥ కొమరవెల్లి శివరాజంగారి అంతయ్య గారు "

మ॥ రా॥ భూపతి బుచ్చిరామయ్య గారు ములుకనూరు

మ॥ రా॥ చిటిమల్లి భద్రయ్యగారు వెన్నంపల్లి

మ॥ రా॥ చిటిమల్లి నరసయ్య గారు వెన్నంపల్లి

శ్రీమేధా దక్షిణా మూర్తయే నమః.

# పీఠిక.

శ్లో|| ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా । లోకేధ
ర్మిష్ఠం ప్రజా ఉపసర్పంతి । ధర్మేణ పా
పమపనుదతి । ధర్మే సర్వం ప్రతిష్ఠితం ।
తస్మాద్ధర్మం పరమం వదంతి॥

నారాయణోపనిషత్.

శైవమత జనులారా!

ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థములలో ధర్మము మొదటిది. ప్రపంచ మంతయు ధర్మము మీదనే యాధారపడి యున్నది. కృతయుగమున, ధర్మము నాల్గుపాదము లుండి యధర్మ మస్తినాస్తి విచికిత్సా హేతువుగను, త్రేతాయుగమున మూడు పాదములు ధర్మమును నొకపాద మధర్మమును, ద్వాపరయుగమున రెండుపాదములు ధర్మమును రెండు పాదము లధర్మమును, గలియుగమున నొక పాదము ధర్మమును, మూడు పాదము లధర్మమును నుండునని ధర్మజ్ఞులు వచించిరి.

శ్రీహర్ష మహాకవియు,తన నైషధకావ్యమున "పదైశ్చతుర్భిస్సుకృతేస్థిరీకృతే" అను శ్లోకమునం దీయాశయమునే వెల్లడించెను. ధర్మాత్ముల బ్రజలెల్లరు సేవించునది. తాము చేసినపాపారణ్యము నుధ్వంసము సేయుటకు ధర్మమే దావాగ్ని. సమస్తము ధర్మగర్భితమై యుండుట చేతనే, "తస్మాద్ధర్మం పరమం వదంతి" యనుశ్రుతి ధర్మమునుత్తమోత్తమముగ నిరూపించుచున్నది.

"అథాతో ధర్మజిజ్ఞాసా" యను సూత్రముతో జైమిని మహర్షి పూర్వమీమాంసా శాస్త్రమును నారంభించి ధర్మమునందలి సము

త్కృష్టత్వమును వ్యక్తీకరించెను.

"వేదోఖిలో ధర్మమూల" మ్మని మనువు తనహృదయము నంద లి యభిప్రాయమును మనుస్మృతియందు స్పష్టముగా నుడివెను. కావు న నట్టి ధర్మాచరణమునకు గడంగుట ప్రతిజనునికి నవసరము.

ధర్మశాస్త్రములు.

వేదములు, ఉపనిషత్తులు, ఆగమములు, ఆగమశిఖలు స్మృతులు ధర్మవిషయములను ముఖ్యముగ బోధించుచున్నవి. ఇవియన్నియు సం స్కృత భాషయందే యున్నవి. వర్ణాశ్రమ ధర్మముల నాచరించుటకు గాని, దెలుసుకొనుటకు గాని, కలివశమున మానవుల కుత్సాహము జ నింపకున్నది.

ఎవరేనియొకని ధర్మములం దెలిసికొన వలెనని తలంపున్న నున ట్టిగ్రంథములు సంస్కృత వాఙ్మయమున నుండుటచే వారితలంపులు వ్యర్థములగుచున్నవి. అట్టికొఱంతను దీర్చుటకై యీధర్మ సంగ్రహ మను నిబంధన గ్రంథము వ్రాయం బడినది.

ఇది ధర్మ సంగ్రహ మైనను, ఆవసరములగు ధర్మము లన్నియు నిందు విపులముగ జర్చింపం బడక యుండలేదు. ధర్మ జిజ్ఞాసు వులకు నీధర్మ సంగ్రహ మత్యుపకారముగ నుండక పోదు. ఆంధ్ర సారస్వత మున ధర్మము లన్నియు దేటతెల్లముగ నిందు బొందుపరచుటచే, నీ గ్రంథము సర్వజన శ్లాఘాపాత్రమని మాతలంపు.

ధర్మసంగ్రహము

ఈధర్మ సంగ్రహమున—వర్ణాశ్రమ ధర్మకాండము, ఆహ్నికకాం డము— ప్రాయశ్చిత్త కాండము— ధ్యానయోగ కాండము— అంత్యేష్టి కాండము—ఆశౌచ కాండము— యనియారు కాండములు గలవు. ఈష ట్కాండలలో నీయాహ్నిక కాండమే గొప్పది.

ఇందు, ఉషః కాలమున నిద్రనుండి లేచినది మొదలుకొని రా త్రిశయనించు వరకు శైవులు చేయవలసిన కృత్యములును, తగినవి

మాణ సామగ్రిలో వ్రాయ బడినవి. కాబట్టి ప్రతి శైవుని కరకమలములం దును నీగ్రంథరత్నముండుట ముఖ్యము.

విశేషాంశములు.

ఇందు విశేషాంశము లనేకములు గలవు. అందులో స్థాలీపులాక న్యాయముగాఁ గొన్నిటినిట పేర్కొందును. భస్మ ధరించక సంధ్యావందనాదులు చేయఁగూడదు. భస్మముతో నూర్ధ్వపుండ్రము బెట్టఁగూడదు. రెండును ధరించుట శాస్త్రవిరుద్ధము. శివకేశవులకు భేదమేగాని యభేదము లేదు.

శివ నామముల తోడనే సంధ్యా వందనాదులు చేయవలెను. గాయత్రీమంత్రము శివుని బోధించును. తారక మంత్రము పంచాక్షరియే. ప్రణవ రహితముగా స్త్రీశూద్రులకును, ప్రణవ సహితముగ ద్విజులకును బంచాక్షరి యుపదేశింప వలెను ప్రణవము ఆదియందే పంచాక్షరికి యుండ వలయును దివ్యాదివ్య భేదమును దెలిసి కొని పితృతర్పణ మాచరింప వలెను వైశ్వదేవము పృథక్పాకముతోఁ జేయవలెను.

బ్రహ్మవిష్ణువుల కలహశాంతికై యావిర్భవించిన జ్యోతిర్లింగమే శైవులచే బూజింపఁ బడుచున్నది. సశక్తికలింగారాధనమే శ్రేష్ఠము. శివదీక్షితు లెల్లరకు శివలింగారాధనము కర్తవ్యము. అశుచి సమయములందును శివపూజ చేయవచ్చును. శివనిర్మాల్యము శివభక్తుల కెల్లరకు గ్రాహ్యమే.

“అశూన్యం లింగమస్తక”మ్మనుటచే నివేదనము కంటె పూర్వము నిర్మాల్యమైన పత్రపుష్పాదులు సశేషముగా దీసి నివేదనము చేయ వలయును. భోజనము కంటె పూర్వమే ఉత్తర నీరాజనాదిక మొసంగవలెను. అధికార భేదము ననుసరించి యర్చనా భేదము కలదు,

గ్రహణ సమయ మందును నక్తవ్రతులకు భోజనము గలదు. సూర్యు డస్తమించి నపుడు గ్రహణముపట్టినచో మోక్షానంతరమే నక్తవ్రతి భుజింపవచ్చును. [illegible] లేదు, రా

డవ జామున చంద్ర గ్రహణము కలిగినచో మొదటి యామము నం
దే భుజింప వచ్చును.

ఉపాసకుడెట్లనఁగ, శివోహం భావనతో శివుని నుపాసింప వ
లెను. జీవునకి శివునకు శరీరి శరీర భావము గలదు. సుకృతదుష్కృత
ములు శివునికే యర్పింప వలయు. కర్మఫల దాతయు, కర్మఫల భోక్త
యు, నగు వాడు శివుడే. ఆశివుడే నేననుటచే శివుని శరీరమని యర్థము.

ఎవని శరీర రక్షణము వానికి ముఖ్యమైనటుల శివునికిగూడ తన
శరీర రక్షణము కర్తవ్యమై యుండును. ఆశివుడే నేననుటయే యాత్మ ని
వేదనము.

ఇంకను నీవిధముగ ననేక విశేషాంశము లిందు బొందు పరచబ
డినవి. ఇట్టి యుత్తమ గ్రంథమును నేర్చి కూర్చిన గ్రంథకర్తృ చారిత్ర
మును సంగ్రహము గానైనను గుర్తెరుంగుట మతాభి మానులకు ము
ఖ్యము.

చరిత్రము.

ఈ ధర్మసంగ్రహమును రచించిన శ్రీ॥ లోకారాధ్యులగు ము
దిగొండ నాగలింగ శాస్త్రిగారు. వీరు స్వధర్మ నిరతులు. సుప్రసిద్ధప
ండిత చక్రవర్తులు. నిరంతర శివానంద రసాస్వాద పరతంత్రులు. గ్రంథ
రచనా కౌశలాగ్రేసరులు. వీరిలేఖిని జంకుగొంకు లేనిది. వీరిబుద్ధి నిశా
తకరవాలము వోలె నతి తీక్ష్ణమైనది.

వీరియూహలన నన్యసాధారణములు. వీరి భావము లతి గంభీర
ములు. వీరికటాక్షములు దయా రసపూరితములు. వీరి భాషణము
సర్వజన హృదయానంద కరములు. వాగ్వాదము నందే గాక ప్రతిశా
వాదము నందు గూడ నత్యంత సమర్థులు.

జనన కాలము.

వీరు స్వస్తి. శ్రీవిజయాభ్యుదయ శాలివాహన శకవర్షములు
౧౭౯౮ సంవత్సరము 1876 సం॥లకు సరియైన ధాతునామ సం॥ చైత్ర

శు॥ ఇందు వారమున [ఘటికా విఘటికాః ౮-౧౯ పుష్యమి 33-౧౮] సూర్యోదయాది ౧౫-౨౨౪ గడియలకు కర్కాటక లగ్నమున జననమొందెను.

| | | | |
|---|---|---|---|
| రబు రా | | శు కు | |
| శ | రాశిమండలి | | చం ల |
| | | | |
| | గు | | కే |

గోత్రాదికము

వీరిగోత్రము భారద్వాజ గోత్రము. సూత్రమాపస్తంబ సూత్రము శాఖ యజుశ్శాఖ వంశము ఉద్భటారాధ్య [విశ్వారాధ్య] వంశము. ఇంటి పేరు ముదిగొండ వారు.

నివాసము

వీరి స్వగ్రామము తాడికొండ. ఇయ్యది యాంధ్ర రాష్ట్రమునందలి గుంటూరు మండలమున, శ్రీకృష్ణ వేణీ మహానదికి దక్షిణముగను మూడు క్రోశుల దూరమునను, మంగళాద్రికి పశ్చిమదిశను మూడు క్రోశుల దూరమందును నున్నది. వీరి పూర్వులకు సుమారు పదితరముల నుండి సీతాడికొండయే వాసస్థానము. వీరికి గూడ నలువది వత్సరముల వయస్సు వచ్చువరకు కనునదియే నివాస స్థానముగా నుండెను. తరువాత వీరికి తెనాలిపురము వాసస్థానముగా నున్నది.

జనన్యాది నామములు

వీరి జనయిత్రీ నామధేయము జ్వాలాంబిక, జనకుడు అఘోరప

ణియయ్య వారు. వీరు శివారాధన తత్పరు కేసాకలఘోర మంత్రోపాసకులు

వీరి పితామహుడు నాగలింగావధానిగారు వేదమునందు మిక్కిలి నిష్ఠులు పితామహి నామము వీరలక్ష్మమ్మ. కౌండిన్య గోత్రుడైన ములుగుముక్తి లింగారాధ్యులు వీరికి మేనమామ. వీరి మాతామహుడు వీరభద్రారాధ్యులు. మాతామహి సుందరమ్మగారు. వీరి జ్యేష్ఠభ్రాత, నాగమల్లయ్య అయ్యవారు. వీరాగమశాస్త్రము సంగముంచి పాండిత్యము నార్జించిరి. పల్నాదేశములందు శివప్రతిష్ఠ-దేవీ ప్రతిష్ఠ మొదలగునవి చేయించిరి. కనిష్ఠభ్రాత రామలింగ శాస్త్రిగారు. వీరుభయ భాషా పండితులు. సరసమగు కవితాశక్తి వీరికి గలదు.

## గురువులు.

వీరికతురాఖ్యాన కర్తయగు నాదిగురువు పమిడి ముక్కల వాస్తవ్యులైన మల్లంపల్లి వీరేశలింగారాధ్యులవారు. వీరే దీక్షాగురువులై విలసిల్లిరి.

అక్కసప్రెగడ శేషమూర్తి గారు వీరికి వ్రాయను చదువను నేర్పినవారు. ముదిగొండ నందయారాధ్యులవారు కావ్యారంభ గురువులు ఇవటూరి లింగయ్య శాస్త్రులవారును ముదిగొండ చంద్రమౌళి శాస్త్రులగారును, కావ్య గురువులు. శ్రీకాళహస్తి నగరవాస్తవ్యులైన బ్రహ్మశ్రీ శ్రీనివాస శాస్త్రుర్లవారు వీరికి వ్యాకరణాధ్యాపకులు.

శ్రీపంచనదక్షేత్రప్రాంత నదుక్కావేరీ గ్రామ వాస్తవ్యులును శ్రీచిదంబర నగరప్రచారిత బ్రహ్మవిద్యాదిప్రతిష్ఠాధిపతులునునగు సమయ పంచానన పాంచజన్య శ్రీశ్రీ శ్రీనివాస దీక్షితులవారు వేదాన్తాది శాస్త్ర గురువులు.

## శాస్త్రపరీక్ష.

దుర్ముఖి సం॥ శరన్నవరాత్ర మహోత్సవ సమయమున శ్రీరామ నాథపుర సంస్థానము సందు ప్రస్తావ్యశాస్త్రమున

తులై తత్సంస్థానాధిపతుల వలన బహుమానములు గ్రహించి యుండిరి.

### విజయములు.

శార్వరి సం॥ శ్రావణమాసమున చెన్నపురియందు, ఆత్మకూరు సంస్థాన విద్వాంసులును, బాలసరస్వతి తర్కతీర్థేత్యాది బిరుదాంకితులును నగు బ్రహ్మశ్రీ శ్రీనివాసాచార్యులు మున్నగు ననేక వైష్ణవపండితులతో వీరు శైవవైష్ణవ మతచర్చ జరిపి శివుడు జగత్కారణ మనుటయే వేదసమ్మత మనిసిద్ధాంతము గావించి ఆత్మకూరు సంస్థానాధీశ్వరుల వలన సమ్మానము గ్రహించి విజయసూచకముగా శ్రౌత శైవ ప్రకాశిక యను మాసపత్రిక నారంభించిరి.

ఆమరుసటి సంవత్సరమున చెన్ననగరమునందె, భిషజ్మణి ఇత్యాది బిరుదాంకితులైన శ్రీ పండిత వి. గోపాలాచార్యులవారు జరిపిన వైష్ణవ సభయందు పెక్కురు వైష్ణవ పండితులతో జర్చించి, భస్మరుద్రాక్షాది శైవచిహ్నములె వైదికము లనియు నూర్ధ్వపుండ్రాదులు తాంత్రికము లనియు వీరిచే సిద్ధాంతము గావింపఁ బడియెను.

ఆవత్సరముననే, నైజాం యిలాకా వరంగల్ నగర ప్రాంతమైన వేణువంక గ్రామమున దొరవారి యెదుట, కాంచీ నగర వాస్తవ్యులైన శ్రీ, కందాళ్ల వరదాచార్యులవారు మున్నగు పండితులతోఁ జర్చించి శివాధిక్యము వీరిచే సిద్ధాంతీకరింపఁ బడియెను.

### శైవ మహాసభాధ్యక్షత్వము.

శ్రీ రాజమహేంద్ర నగరమున జరిగిన శైవమహాసభ యందు సభ్యుల యానతి వలన వీరిచే సభాధ్యక్షత వహింపఁ బడియెను.

### సాహిత్యపరిషత్సమ్మానము.

శ్రీ రౌద్రి నామసం॥ చైత్రశుద్ధ పూర్ణిమలకు బెజవాడ నగరమున, రామమోహన పుస్తక భాండాగారము నందు జరిగిన పరిషన్నవమ వార్షిక సభయందు ఆంధ్రభాషా ప్రశంసను పద్యరూపముగా వినిపించి యధ్యక్షులగు శ్రీ నోరి సుబ్రహ్మణ్య శాస్త్రుల వారి వలనను, స

భ్యుల వలనను వీరిచే సమ్మానము గ్రహింపఁ బడియెను.

ఉద్యోగము.

గుంటూరు మండలములోని తెనాలి నగరమున నున్న సం స్కృత కలాశాల యందు, పింగళ సంవత్సరము మొదలుకొని పదునెనిమిది సంవత్సరములు సాహిత్యోపాధ్యాయ పదవి వీరిచే వహింపఁ బడియెను.

అధ్యాపనము.

దీనికి ముందు పరీధావి సం॥ మొదలుకొని తాడికొండ గ్రామమున బ్ర, శ్రీ, తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి మొదలగు ఏడుగురు వీరివద్ద వ్యాకరణ శాస్త్రము నభ్యసించి కృతార్థులైరి,

పత్రికలు.

శార్వరి సం॥ శ్రావణ మాసము మొదలుకొని చెన్నపురియందు శ్రీశైవ ప్రకాశిక యనుమాస పత్రిక యారంభించి నాలుగు సంవత్సరములు వీరిచే ప్రచారము గావింపం బడియెను.

దుందుభి సం॥ ఆశ్వయుజ శుద్ధవిజయ దశమి మొదలుకొని వీరిచే శైవరహస్య బోధిని యను ద్విమాస పత్రిక యారంభించి ప్రచురింపఁ బడుచు. ప్రభవ సం॥ శ్రావణ మాసము మొదలుకొని శ్రీదేవిడీ సంస్థానాధిపతులైన ఇజ్జత్ తౌసార్, రాజాకందుకూరు బాలసూర్య ప్రసాదరావు బహద్దరు వారి సాహాయ్యము వలన మాసపత్రికగా మార్చబడి శైవ మత ప్రాశస్త్యము పెక్కువిధముల ప్రకటింప బడుచున్నది.

వీరురచించిన గ్రంథములు.

1 రత్నాకర ప్రాప్తి మాహాత్మ్యచండ మార్తాండము సంస్కృతము ఇయ్యది, తిరువళ్ళిక్కేని ఉల్లూరు. శ్రీ రామ సుబ్రహ్మణ్య శాస్త్రిగారి శిష్యులను రచించిన భస్మరుద్రాక్ష ధారణ దూషణ రూపమైన చంద్రికయను గ్రంథమునకు ఖండన గ్రంథము ఇది గ్రంథాంతరమున ముద్రితమై, ద్రావిడ దేశమున ప్రచారము నొంది యున్నది.

2 వ్యాసపథము సంస్కృతము.

ఇది, వైయాసిక బ్రహ్మమీమాంసా శాస్త్రము శ్రీకంఠా చార్య సమ్మతమైన శివాద్వైతమునే బోధించును గాని మతాంతరము నెఱ మాత్రము బోధింప దను నర్థము మీమాంసా సూత్ర విమర్శనమువలన నితర భాష్య సిద్ధాంతములను ఖండించి సిద్ధాంతీకరింపఁబడియున్నది. అముద్రితము.

3 లింగ ధారణ సర్వస్వము. సంస్కృతము.

శివ లింగధారణము సర్వవేద సమ్మతమని యిందు సిద్ధాంతము సేయఁబడియెను. అముద్రితము,

4 దారుకావన విహారము.

ఆంధ్రకావ్యము. గద్య పద్యాత్మకము. అముద్రితము

5 కాదంబరి. వచన కావ్యము,

ముద్రితము. భట్ట బాణ విరచితమైన కాదంబరికి నాంధ్రీకరణము.

6 విద్యాస్థానవినిర్ణయము. సంస్కృతము సాంధ్రము.

ఇది శివాగమాదుల ప్రామాణ్యము సమ్యగముగాఁ జర్చించి నిర్ణయింపఁ బడియెను. ఇయ్యది, వరంగల్ నగరమున, శైవప్రచారిణీ పత్రికాధి పతులగు బ్రహ్మశ్రీ. కొడిమెల. రాజలింగా రాధ్యుల వారిచే ముద్రిత మైనది.

7. శైవ సిద్ధాంత సంగ్రహము

సంస్కృతము. ఆంధ్రటీకా సహితము. ముద్రితము

8 ధర్మ సంగ్రహము.

శైవ నిబంధన గ్రంథము. సంస్కృతము. సాంధ్రము

ఇందు నాలు కాండములు గలవు అవి యేవన

1. వర్ణాశ్రమ ధర్మ కాండము.

ఇది తాడికొండ గ్రామ వాస్తవ్యులగు బ్ర॥ శ్రీ॥ ముదిగొండ నాగమల్లికార్జునయ్య గారిచే ముద్రింపఁబడుచున్నది.

2. ఆహ్నిక కాండము.

ఇది వరంగల్ నగర వాస్తవ్యులైన బ్రహ్మశ్రీ కొడిమేల రాజ లింగారాధ్యుల వారిచే ముద్రితము.

3. ప్రాయశ్చిత్త కాండము. ఇయ్యది కేసల్లి తాలూకా పెదపులివర్రు గ్రామ వాసులైన బ్ర॥ శ్రీ॥ కాళహస్తి లింగమయ్య వారిచే ముద్రితమగుచున్నది.

4. ధ్యానయోగ కాండము.

అముద్రితము.

5. అంత్యేష్టి కాండము.

6. ఆశౌచ కాండము.

ఈ రెండును నిజాం రాష్ట్రమున సిద్దిపేట గ్రామ వాస్తవ్యులైన భక్తాగ్రేసరులచే ముద్రితములు.

9. ఆర్యధర్మ ప్రత్యక్ష ఫలబోధిని. ఆంధ్రము.

ఇందు, స్నాన సంధ్యాది సకల ధర్మములకును వైద్య శాస్త్రమును బట్టి ఆరోగ్యరూపమగు ప్రత్యక్ష ఫలము గలదని బూజువు బడి యున్నది. ముద్రితము.

10. విషుర మహానీతి.
ఆంధ్ర వచనము. ముద్రితము.

—* వీరిచేనాంధ్రీకృతములైన
శైవసిద్ధాంత గ్రంథములు *—

1. చతుర్వేద తాత్పర్య సంగ్రహము.
శ్రీహరదత్తాచార్య కృతము. ముద్రితము.
2. బ్రహ్మతర్కస్తవము. ముద్రితము.
3. రామాయణ తాత్పర్య సంగ్రహము. ముద్రితము.
4. భారత తాత్పర్య సంగ్రహము. ముద్రితము.
5. పంచరత్నస్తుతి. ముద్రితము.
6. శివకర్ణామృతము. ముద్రితము.
శ్రీఅప్పయ్య దీక్షిత కృతములు.

---

* శివాగమములు. *

7. వాతులోత్తరము. ముద్రితము.
8. మకుటోత్తరము.
అయ్యావారి, ఏలూరు నగర ప్రాంత పోణంగి గ్రామ వాస్తవ్యులైన బ్రహ్మశ్రీ శివలంక తాయన్నగారిచే ముద్రితము.
9. చంద్రజ్ఞానము. ముద్రితము.

---

—* వీరిచేనాంధ్రీకృతములైన
యితరగ్రంథములు *—

1. జ్ఞానవాసిష్ఠము.

960 పేజీల గ్రంథము. ముద్రితము.

2. సర్వవేదాంత సిద్ధాంతసార సంగ్రహము.

శ్రీశంకరాచార్య విరచితము. ప్రతిపద టీకా తాత్పర్య సహితము. ముద్రితము.

3. తత్త్వోపదేశము.

శ్రీశంకరాచార్య విరచితము. ముద్రితము.

4. కలివిడంబనము.

శ్రీనీలకంఠ దీక్షిత కృతము. ముద్రితము.

5. సౌభాగ్యలక్ష్మి.

ఇందు లక్ష్మీస్తోత్రములు చాలగలవు. ముద్రితము.

* వీరిచే సంకలితగ్రంథములు. *

6. సుభాషితమణి కంఠహారము. ముద్రితము.

7. ఆహ్నిక విధి. ముద్రితము.

8. ఆబ్దికవిధి.

* సంస్కృతోపన్యాసములు. *

ఆంధ్ర తాత్పర్య సహితములు.

1. శివపవకారణం. ముద్రితము.
2. శాంతాన్యేవ శైవదివ్యాని. ముద్రితము.
3. శాంతమేవహి కారణం లింగస్య. ముద్రితము.
4. శిష్టాస్సర్వే శివం ప్రపన్నాః. ముద్రితము.
5. ప్రౌఢావివాహనిరసనం. అముద్రితము.

—* ఆంధ్రోపన్యాసములు. *—

1. వైదికవర్ణ నిర్ణయము. ముద్రితము.
2. శివోత్కర్ష దర్శిని. ముద్రితము.
3. ఆంజనేయ స్వరూప నిరూపణము. ముద్రితము.
4. బసవేశ్వర భూషణము. ముద్రితము.
5. షట్కాలశివపూజ. ముద్రితము.
6. శైవమత మాహాత్మ్యోత్కర్షము. ముద్రితము.
7. శైవగణార్చన. ముద్రితము.
8. దీక్షాకాల నిర్ణయము. ముద్రితము.
9. శైవసూత్రభాష్య నిర్ణయము. ముద్రితము.
10. శివలింగ స్వరూపము. మొదలైనవి ముద్రితము.

—* విమర్శనములు. *—

1. దుహితృదౌహిత్రవిషయశ్రాద్ధాధికారపరిష్కారము. ముద్రితము
2. భాష్యమీమాంస. ముద్రితము.
3. కలిసంరంభ వారణము. ముద్రితము.
4. బసవపురాణ పీఠికా విమర్శనము, మొదలైనవి ముద్రితము.

---

పీఠిక.

—* 1. ప్రథమ వర్షదశకము. *—

మొదటి పదిసంవత్సరముల కాలము బాల్య దశతో గడచెను.

—* 2. ద్వితీయ వర్షదశకము. *—

బ్రహ్మచర్యమున శ్రీకాళహస్తి నదుకా వేరి మొదలగు ప్ర

దేశముల యందు శాస్త్రాధ్యయనముతో గడచెను.

* 3. తృతీయ వర్ష దశకము. *

ఇందు, గార్హస్థ్య పరిగ్రహము. రుద్రాక్ష మాహాత్మ్యచండ మార్తాండము, శైవసిద్ధాంత సంగ్రహము, చెన్నపురి యందు శైవ సిద్ధాంత ప్రచార మూలమున శ్రౌతశైవ ప్రకాశికా ప్రచారము గావింప బడియెను.

—* 4. చతుర్థవర్ష దశకము. *—

జ్ఞానవాసిష్ఠము సర్వవేదాన్త సిద్ధాంత సంగ్రహము కాదంబరి వ్యాసపథము, మొదలగు గ్రంథముల విరచనంబును, తాడికొండ గ్రామమున శాస్త్రాధ్యాపనంబును గావింపం బడియెను.

—* 5 పంచమ వర్ష దశకము *—

ఈదశమున, తెనాలిపురమున సంస్కృత కలాశాలలో ప్రాధ్యాపకపదవి గ్రహింపబడి ధర్మసంగ్రహము, ఆర్యధర్మప్రత్యూష ఫలబోధిని, ఈ గ్రంథముల విరచనంబును, శైవరహస్య బోధిని పత్రికా ప్రచారంబును గావింపఁబడియెను,

—* 6. షష్ఠ వర్ష దశకము. *—

శైవ రహస్యబోధిని పత్రికా ప్రచారణంబును, శ్రీకంఠాచార్య విజయంబను సంస్కృత కావ్యవిరచనంబును గావింపఁ బడుచున్నవి.

శాస్త్రిగారింకను మతగ్రంథముల పరిశీలించి మతగ్రంథముల విశేషముగా రచింపఁ గోరెదము.

—* పాఠభేదము *—

గాయత్రీ ధ్యానశ్లోకమున—"గాయత్రీం వరదాభయాం కుశకశాశ్శుభ్రం కపాలం గదాం శంఖం చక్ర మథారవింద యుగళం హస్తైర్వహంతీం భజే" అని యీ గ్రంథమున వ్రాయఁబడినది. కాని, "గాయత్రీం వరదాభయాంకుశకశాశ్శూలం కపాలం గదాం శంఖం చక్ర మథారవింద ముకుళం హస్తై ర్వహంతీం భజే" అని పాఠభేదము గన్పట్టుచున్నది. "శుభ్రం అరవిందయుగళం" అను స్థలము లందు "శూలం అరవింద ముకుళం" అనియుండుటయే సమంజస మని నా యభిప్రాయము.

—* ఉపసంహారము *—

ఇట్టి యుత్తమ మగు గ్రంథరచన యందు శాస్త్రిగారు చిర కాలము నుండి పరిశ్రమ చేసి యుండిరి. ఒక్కొక మంత్రమునకు నొక్కొకయర్థము సంప్రదాయముగా ప్రమాణ గ్రంథంబుల వెదకి సేకరించి వ్రాయుట నలెననిన సామాన్య విషయము గాదు.

శ్రు॥ త్రిసుపర్ణ మయాచితం బ్రాహ్మణాయ దద్యాత్ । త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః ఇత్యాది శ్రుత్యర్థములఁ జదివినచో నే సహృదయుని మానస కమలము వికసింపదు?

శాస్త్రిగారు మతవిషయమునఁ జేయుచున్న కృషి యెంతయు ప్రశంసనీయము. శాస్త్రిగారి గ్రంథముల చూచిన వారికి వారి కృతి భాషా పుణ్యము గోచరింపక పోదు. మతవిషయమున చేయవలసిన పనులనేకము లున్నవి.

శివాగమము లింకను సంపూర్తిగఁ సంపాదింపఁ బడలేదు. శైవ పండిత కృతములగు గ్రంథ రాజము లన్వేషింపఁబడలేదు. శైవమతసంబంధముగల పండితుల యొక్కయు, రాజుల యొక్కయు, అగ్రహారముల యొక్కయు గురుకులముల యొక్కయు, మఠముల యొక్కయు శాసన పరిశీలనాదికము జరుపఁబడి యుండలేదు.

దేశాంతరమందు నారాధ్యుల మతముచెప్పఁ గొనువారికిని, ఆంధ్ర దేశారాధ్యులకును గలభేదములు గనుగొనఁబడలేదు. శిథిలములగు గ్రంథముల విషయమై ప్రచారము జరుపఁబడలేదు. శైవమతశాస్త్రము లోకారాధ్యత్వము ప్రపంచమున నెల్లరకు బోధింపఁబడలేదు. కాశ్మీరాది దేశములందు గల శైవ మతమునకును ఆంధ్ర దేశమందలి శైవ మతమునకు గల పరస్పర భేదములు విమర్శింపఁబడలేదు. ఇట్టులే చేయవలసిన కార్యములనేకములు గలవు. మతాభిమానులగు ధనవంతులు తగినధన సహాయముచేసి పైవిషయములందు శ్రద్ధవహించుట భావ్యము.

అత్యుత్తమమగు ధర్మసంగ్రహము నందలి నిత్యాహ్నిక కాండము తమ శైవప్రచారిణీ గ్రంథమాల యందు ముద్రింపించిన త్రిలోకగురు చెన్నమల్లికార్జున పండిత వంశస్థులును శైవప్రచారిణీ ప్రతికాధిపతులును నగు లోకారాధ్యులగు కొడిసేల రాజలింగారాధ్యుల వారి కృతియు నభినందనీయములు.

ఇట్టి యుత్తమగ్రంథరత్నమును రచించిన శ్రీలోకారాధ్యులగు ముదిగొండ నాగలింగ శాస్త్రిగారి కనేక ధన్యవాదములొసఁగుచు, ప రమేశ్వరానుగ్రహమున నేటికియ్యది ముద్రింపఁబడినందులకు నా సర్వేశ్వరుని కనేక నమస్కారము లాచరించుచు నింతటితో విరమించుచున్నాడ.

ఇట్లు,

బుధజనవిధేయుఁడు,

వరంగల్ విద్వాన్ ముదిగొండ వీరేశలింగ శాస్త్రి

4-6-29 శైవప్రచారిణీ సంస్కృత విద్యాశాల.



# విషయసూచిక.

## ధర్మసంగ్రహే,

## ఆహ్నికకాండే- చతుర్థభాగః.

—[౦]—



సమాప్తము.

## శివపూజా విధిః

క్రియాసారే॥ శివారాధన మేవం ప్రశంసితం॥ యథా, బ్రహ్మకైవర్తే॥ వ్యాపార మన్యం సకలం విహాయ లింగేపద స్సాంబ శివో౽నవద్యః। పుష్పప్రహారైః పరిపూజనీయః ఫలేప్సుభి శ్చారు ముముక్షుభి ర్వా॥ యే సాంబ మీశం నసమర్చయంతి విమోహితా స్తే విషయై రనేకైః। శ్వసంతి తే మృత్యు వశే౽నవద్యే లగ్నా గజేన్ద్రా ఇవ కర్దమేషు॥ సత్యం సదా వచ్మి హితం హి వచ్మి సారం పునర్వచ్మి నచార్థ వాదం। అసార సంసార ఇదం హి సారం శివార్చనం లింగవరే౽నవద్యే॥ ఏవం సగోచ్చైర్లపితం మదీయం వచో నశృణ్వన్తి హి యే విమూఢాః। తదర్థ మేతే నరకాగ్నయస్తు సంధుక్షితో దీప్త శిఖా జ్వలంతి॥ నాయాతి యావ న్మరణం నాయాతి యావచ్చ జరా హి శీఘ్రం నశ్యంతి యావ ద్వపుషీంద్రియాణి తావచ్ఛివో౽ర్చ్య స్సహసా నవద్యః॥ తథా శివతత్వ సుధా నిధౌ॥ లింగస్య దర్శనాత్పాపం క్షయం గచ్ఛతి వై ద్విజ॥ అర్చయిత్వా తు యో లింగం స్తుతిం కుర్యాత్తు భక్తితః॥ స్నానమాత్రో౽పి గచ్ఛేత్స రుద్ర లోకం హి మానవ ఇత్యాదిక ముక్తం ద్రష్టవ్యం॥

---

### శివపూజా విధి.

బ్రహ్మకైవర్తమునందు॥ భోగము గాని, మోక్షము గాని, కోరినవారు సకలవ్యాపారములను వదలిపెట్టి పుష్పములచే పరమేశ్వరుని లింగము నందు బూజింప వలయును॥ విషయములచే విమోహమునొందినవారై పరమేశ్వరుని పూజ చేయని జనులు బురదలో గూరుకొని పోయిన యేనుంగులవలె మృత్యుముఖమునఁబడి యూపిరి విడుచుచుందురు॥

నిజము చెప్పుచున్నాను॥ హితము చెప్పుచున్నాను॥ వేదసారము చెప్పుచున్నాను॥ ఏమనిన అసారమగు నీ సంసారమునందు లింగమున శివుని పూజించుటయే ముఖ్యము గాని యింకొకటి ముఖ్యము గాదు॥ ఈ చెప్పినది యర్థవాదము గాదు॥ ఈ విధముగ నే బిగ్గరగా జెప్పిన వాక్యము నేమూఢులు వినరో వారికొఱకే నరకాగ్నులు మండుచున్నవి॥ మరణము వచ్చునంతవఱకు ముదిమి వచ్చునంతవఱకు, అవయములు శిథిలములు గానంతవఱకు శీఘ్రముగా శివపూజ [illegible] సారమునందు నలుసు

నను, అవయవ విశేష వాచకోహి లింగశబ్దః, తతశ్చానేన బోధ్యతే నావయవీ॥ కించ. శివలింగ మభ్యర్చ్యం, శివలింగాయ నమ ఇత్యాదౌ యది శివలింగ శబ్ద ద్వితీయం ధర్మివాచకం తర్హి తస్యోభయస్యాపి విశేష వచనతయా సామానాధి. కరణ్యం న ప్రసజ్యేత। అవయవ విశేషవాచకం లింగ మితి పక్షే శివస్య లింగ మితి యుజ్యతే షష్ఠీ సమాసః తదా తదిదమవయవ విశేష మేవాభిదధ్యాత్। యద్యేవ మభిదధ్యాత్ తర్హి పరిష్కృతేస్య హేయతయా అప్రధానతయా అకారణతయాచ నిఖిలస్య భవతి తదసర్వ్యం॥ ఇతి॥ చేత్ ఉచ్యతే॥

కృష్ణ శబ్దోహి గుణవచన ఇతిన సర్వస్య కార్ష్ణ్య మేవాభిదధాతి గుణః। హరిశబ్దోహి కపివాచక ఇతి నసర్వత్ర కపిమేవాభిదధాతి పరంతు కృష్ణశబ్దో గుణిన మభిదధాతి విష్ణుం, తథా హరి శబ్దో వివక్షయా విష్ణుమపి॥ తతశ్చైక రూపస్యశబ్దస్యైక పదార్థ ఇతి ననియమః। లింగపదంహి లీయతే గమ్యతే యస్మిన్ యత స్సర్వం చరా చరం। యస్మిన్ లీయతే, యతశ్చ గమ్యతే ప్రపంచ ఇత్యేవయువార్థేన కారణ వాచకం సముదాయార్థేన పంచ సూత్రో పలక్షితే మహేశితు ర్మూర్తి, విశేషే రూఢం వ్యవహారేణ లోక వేదయోరితి నాస్యావయవ విశేష వాచకత్వ లంకావకాశః॥ శివలింగ మభ్యర్చ్య మిత్యాదౌ శివ

---

లింగమును చూడగనే పాపమంతయు నశించును. లింగమును బూజించి భక్తితో స్తోత్రము చేయువాడు దేవతలచే కొనియాడఁబడుచు రుద్రలోకమునకుఁ బోవునని మొదలుగా శివతత్త్వ సుధానిధి యందుఁగలదు.

ప్ర॥ లోకము నందులింగశబ్దము అవయవ విశేషమును చెప్పుచున్నది దానంజేసి యాశబ్దము అవయవిని చెప్పునది కాదని తెలియుచున్నది. ఇంతియు. శివలింగ మనుచోట శివశబ్దము ధర్మివాచక మగును. దానివలె లింగశబ్దంబును ధర్మివాచక మీ యగుసేని విశేష వాచకములగు రెంటికిని సామానాధి కరణ్యము కుదరకపోవును. లింగపదము అవయవ విశేషవాచక మగునెడ శివునియొక్క లింగమని షష్ఠీసమాసము కుదురుచున్నది. దీనింబట్టి లింగపద మవయవమునె చెప్పునది. అనియొప్పుకొందుము. అదియే నిజమగునేని యా యవయవము హేయమైనదియు అప్రధాన మైనదియు నగును గాన నది పూజనీయ

...శ్నంస్తు భక్షేత్సకృత్। ఇతి। స్మృత్యర్థసారే। భోజనే కేశ కీటాదిదూ
షితే। తావన్మాత్రం సముద్ధృత్య, జలం భస్మవా క్షిప్త్వా భుంజీయాది
తి। యత్తు గౌతమేనోక్తం నిత్యమభోజ్యం కేశ కీటావపన్నమితి త
త్కేశ కీటాదిభి స్పృష్టం యత్పక్వం తద్విషయం।

### భక్ష్యాభక్ష్యనిర్ణయః.

వ్యాసః। అభక్ష్యస్య నివృత్త్యాతు విశుద్ధం హృదయం భవేత్
ఆహార శుద్ధ్యా చిత్తస్య విశుద్ధిర్భవతి స్వతః। ఇతి। అపరార్కే। జాతిదు
ష్టం క్రియాదుష్టం కాలాశ్రయ విదూషితం సంసర్గహేతు దుష్టంచసు
హృల్లేఖం స్వభావతః। జాతిదుష్టాదీనాముదాహరణం యథా। స్మృ
త్యర్థసారే। లశునం గృంజనంచైవ పలాండుం కవకాదిచ। వార్తాకనా
ళికాలాబుహ్యాద్యేయా జ్ఞానదూషితం। సభక్ష్యమే క్రియయా దుష్టం
యద్దుష్టం పతితాదిభిః। కాలదుష్టం తు విజ్ఞేయమన్నం పాక్తం ద్వ్యహస్థి
తం దధి భక్ష్యం వికారంచ మధువర్జం తదిష్యతే। సురాలశునసం
స్పృష్టం పీయూషాది సమన్వితం సంసర్గాద్దుష్యతే తద్ధి శూద్రో

---

కరంబగును. భోజ్యవస్తువుల యందు వెంట్రుకలు పురుగులు చేరునెడ నచ్చటి కొంత భా
గమును దీసివైచి, జలము భస్మమును జల్లి, భుజింపవచ్చును। కేశములు, పురుగులు మొ॥
వానితో జేరియుండిన వస్తువులను విడువవలయును।

### భక్ష్యాభక్ష్య నిర్ణయము.

నిషిద్ధ వస్తువులను భుజింపకున్నయెడ మనస్సు నిర్మలమగును। ఆహారము నిర్మ
లమైనదైనయెడ మనస్సు నిర్మలమగును।

జాతి దుష్టము, క్రియాదుష్టము, కాలదుష్టము, ఆశ్రయదూషితము, సంసర్గదుష్టమును
తే దుష్టము సుహృల్లేఖము-రసదుష్టము ననువానిని భుజింపగూడదు। వీనిలో నీరుల్లి వెల్లుల్లి
తెల్లవంకాయ గుమ్మడి యాపకాయ, మద్యమాంసములు మొదలగునవి జాతిదుష్టములు.

పతితులు, దీక్షాంతితులు తాకిన వస్తువులు, వస్త్రపూతము గాని నీరు, మొదల
గునవి క్రియాదుష్టములు।

చాలసేపుకు నవ్వల వండిన పదార్థము మొదలైనవి కాలదుష్టములు।
... మున్నగువాని సంసర్గ గలవి సంసర్గదుష్టములు పిల్లి మొదలయినవి మూర్తిన
పదార్థములు [illegible] దుష్టములు [illegible] నీరు, రాగిపాత్రలో

క్షీరం చాలక్షీకో భవేత్సదా॥ అపరాహ్ణే॥ దివా కపిత్థచ్ఛాయాయాం
తథా రాత్రౌ శమీషు చ। ధాత్రీఫలేషు సప్తమ్యాం నిత్యలక్ష్మీర్వ్యసతే
సదా। స్మృత్యంతరే॥ ఆమలక్యాః ఫలం చైవ జంబీరం తింత్రిణీ ఫలం
ప్రజ్ఞాంతరాత్ లక్ష్మీకామః సదైతి ద్వర్జయేన్నిశి॥ నారికేళోదకం కాం
స్యే పానపాత్రే స్థితం మధు। తామ్రపాత్రే స్థితం గవ్యం మద్యతుల్యం
ఘృతం వినా। అపి ప్రస్థాన సమయే రాత్రౌ దధి న భక్షయేత్। మధు
ప్రదానంచ సర్వమిత్యాపి శేషతః ఇతి॥

భక్ష్యాభక్ష్యాః భృగుః॥ శేషైస్తు కారవల్ల్యాది సర్వం గ్రాహ్యం
వివర్జితం। కందం పిండకృతం చైవ శ్రుకకందం తథైవచ। మహాకం
దాది కందంచ ఆహారేచ్ఛ విచక్షణః। సహకార ప్రభేదంచ తథైవ ప
నసప్వాయం। కదళ్యాదిషు భేదాంచ గృహ్ణీయాత్తు ప్రయత్నతః। కూ
ష్మాండోర్వారుకం చైవ సింహీం వ్యాఘ్రీం తథైవచ। కర్కోటకాది
సం గ్రాహ్యం కళింజాది వివర్జయేదితి। సగవః అగస్త్యం శకటం శాకం

---

గూడదు. కంచుపాత్రలో టెంకాయనీళ్ళు రాగిపాత్రలో నుంచిన తేనెయు, రాగి
పాత్రలో నున్న పాలు నేతితో తుల్యము లగును. మధుపర్క సమయము నందు గాక ప్ర
యాణ సమయము మొదలైన రాత్రి కాలము నందు పెరుగు పుచ్చుకొనగూడదు. ఇం
క భక్షింపదగిన వస్తువు లెట్లనగా,

అన్ని విధములైన కాకర కాయలును త్రుంచకంద మహాకంద మొదలగు దుంపలు,
మామిడికాయలు నన్ని ప్రభేదములవి, రెండు విధములైన పనస కాయలును - అరటి కాయ
లును - గుమ్మడి కాయలును - దోస కాయలును, నల్ల కాకర మున్నగు వానిని భుజింపవ
చ్చును. గంజాయి మొదలగు వానిని భక్షింపగూడదు. అవిశ అడవిచేమ బ్రాహ్మణులకు
ముఖ్యముగ వర్జ్యము. మామిడికాయలు అల్లము దోసపండ్లు టెంకాయలు వెలగపండ్లు రేగు
పండ్లు ద్రాక్ష నేరేడుపండ్లు ఖర్జూరపుపండ్లు మాదీఫలములు దానిమ్మపండ్లు వీని భ
క్షింప నగును. మొలకలు జీలకఱ్ఱ మిరియాలు ఆవాలు లవంగములు మినుములు పెస
లు నను వానిని భుజింపనగును. నల్లవస్త్రము తూనవు. గేదెపాలు ఆవుపాలు గ్రహింపవ
ను.

శస్త్రము అధికరణము పుష్పమాలికలు గంధము తైలము ఔషధము మొదలుగా
నన్నిటిని పంచి [illegible]

నిశీపుర స్తాద్యామ త్రితయే భోజన నిషేధా త్పరస్తాచ్చ మహానిశీథేత
న్నిషేధస్య జాగరూకత్వా చ్చేతి చేదుచ్యతే, ద్వితీయ యామే చంద్రో
ప రాగ సంప్రాప్తౌ ప్రథమ యామే భోజనం నక్త వ్రతినాం విహితం
రిథాహి, కారణోత్త రే॥ సోమోపరాగే పౌరస్త్యస్త్యాజ్యో యామస్తు భో
జనే। తత్పూర్వ కృత్యే తే కాలో నిత్య నక్తోప సేవినా మితి॥ తస్మాచ్చం
ద్ర గ్రహేతు యామాం స్త్రీనితి వచనస్య నక్తవ్రతి వ్యతిరిక్త విష
యత్వం స్ఫుటం॥

నచ, సోమోపరాగే యామా త్పురస్తా దేవ భోజనం శాస్త్రాం
తరా సమ్మత మితి వాచ్యం శ్లో॥ సాయాహ్నే గ్రహణం చేత్స్యాదప
రాహ్ణే నభోజనం। అపరాహ్ణే నమధ్యాహ్నే మధ్యాహ్నే నతుసం
గవే। భుంజీత సంగవే చేత్స్యాన్న పూర్వం భోజన క్రియేతి సూర్యోప

---

ద్రగ్రహణ కాలమునకు ముందు మూడు జాముల లోపల భోజనము సేయరాదని కలదు
గదా? అట్లైన గ్రహణము విడిచిన తరువాత మహానిశీథ కాలము గాన నప్పుడును భో
జనము గూడదుగదా? అట్టి యెడ వారెప్పుడు భుజింతురు?

ఉ॥ రాత్రి రెండవ జామునందు చంద్రగ్రహణము సంభవించు నెడ ప్రథమ
యామము నందు వారు భుజింపవచ్చును. నిత్యనక్త వ్రతులు చంద్రగ్రహణమునకు ముందు
నొక్క జాము వదలిపెట్టి దానికి ముందు భుజింపవలయునని కారణోత్తరమున గలదు గా
న నది బాధకము గాదు.

ప్ర॥ చంద్రగ్రహణమునందు నొక్క జామునకు ముందే భోజనము సేయుట ఇతర
ములైన ధర్మశాస్త్రములచే బాధితము గాదా?

ఉ॥ బాధకము గాదు. ఏలన సాయంకాలమునందు గ్రహణము పట్టునెడ నపరా
హ్ణ కాలమున భోజనము గూడదనియు, అపరాహ్ణమునందు బట్టునెడ మధ్యాహ్నము
నందు భోజనము గూడదనియు మొదలుగా సూర్య గ్రహణ సమయమునకు ముందు
నొక్క జాము సేపు విడిచి పెట్టి భోజనము సేయవచ్చునని మార్కండేయుడు కథించియు
న్నాడు. ఇట్లుండ నిత్యనక్త వ్రతము గలవారు చంద్రగ్రహణమునకు ముందు నొక్క
జాము సేపు వదలి పెట్టి భోజనము సేయుట యెట్లు విరుద్ధ మగును? ఏమియు విరుద్ధము
గాదు

ప్ర॥ సూర్యగ్రహణమునకు ముందు నొక్క జాము సేపు వదలి పెట్టి దానికి ముం

రాగ ఏవ యామా త్సరస్తాద్భోజనానుమతే ర్మార్కండేయేన ప్రస
దర్శితత్వేన సోమోపరాగే తదంగీకారస్యావిరుద్ధత్వాత్॥ నాపి తా
దృశవచనం బాలవృద్ధాతురవిషయత్వేన నిర్ణీతం నిర్ణయసింధావి
తి వాచ్యం, తద్వచనం బాలవృద్ధాది విషయమితి మార్కండేయే
నానుక్తత్వేన బాలవృద్ధాదివిషయ ఇవ శక్తజనవిషయేపి త
న్న్యాయాంగీకారస్య యుక్తత్వాత్॥ తస్మాద్యథోక్తమేవ సాధు॥

## మాంస భక్షణ నిషేధః

హైద్యః నాఖీయే॥ యజ్ఞ వ్యతిరిక్తే సర్వకర్మణి కలౌ ప్రాణివ
ధో మాంసభక్షణంచ నిషిద్ధం॥ యజ్ఞార్థం పశువధే మాంసభక్షణేచ
నదోష ఇత్యాహ మనుః॥ యజ్ఞార్థం పశవస్సృష్టాః స్వయమేవ స్వ
యంభువా। యజ్ఞోహి భూత్యై సర్వస్య తస్మాద్యజ్ఞే వధోఽవధః॥ ఓ
షధ్యః పశవో వృక్షాః తిర్యంచః పక్షిణస్తథా। యజ్ఞార్థం నిధనంప్రా

---

ను భోజనము సేయవచ్చునని మార్కండేయుడు విధించినది బాలవృద్ధాదివిషయమని
నిర్ణయసింధువునందు నిర్ణయింపఁబడియున్నది. ఇట్లుండ శక్తవ్రతము గలవారును గ్ర
హణము జాము సేపు వఱకు వచ్చునని గాఁ భుజించుట యెట్లు?

ఉ॥ మార్కండేయుఁడు తాను చెప్పినది బాలవృద్ధాదివిషయమని చెప్పియుం
డలేదు. అట్లు చెప్పకున్నను బాలవృద్ధాదుల యెడ నావచనము వినియోగింపఁ బడును
న్నది. అట్లయినను, ఆన్యాయము నిత్యశక్తవ్రతుల విషయమునను నంగీకరించుట యుచి
తముగాదా! శక్తవ్రతవిషయమున నట్లు ఆచరించుట దివ్యాగమ విహితముగాను శా
స్త్రవిరుద్ధముగాదు గాన నిరాక్షేపము గ్రహించునది.

## మాంస భక్షణ నిషేధము.

యజ్ఞముకన్న నితరము లైనసమయముల యందు కలియుగమున ప్రాణివధము
మాంసభక్షణంబును నిషిద్ధములై యున్నవి॥ పశువులు యజ్ఞము నుద్దేశించియే బ్రహ్మదే
వునిచే సృజింపఁబడియెగాన నందు పశువులను వధించుట వలన దోషము లేదనియు
ఓషధులు పశువులు మొదలగునవి యజ్ఞము నందు చంపఁబడినవై స్వర్గమును పొందునని
యును మనువు చెప్పెను॥ వచనము ప్రాణులను జంపకున్నచో మాంసము దొరకనేరదు

ష్టాః। పాపఘ్నవం త్యుచ్ఛిష్టం పునః॥ యజ్ఞాయాజని మాంసస్య త్యేష దైవో విధి స్స్మృతః। అతోఽన్యథా ప్రవృత్తిస్తు రాక్షసో విధి రుచ్యత ఇతి। నాకృత్వా ప్రాణినాం హింసాం మాంస ముత్పద్యతే క్వచిత్। నచ ప్రాణి వధా త్స్వర్గ స్తస్మా న్మాంసంచ వర్జయేత్। అనుమంతా విశసి తా నిహంతా క్రయ విక్రయీ। సంస్కర్తా చోపహర్తాచ ఖాదక శ్చేతి ఘాతినః॥ మాంస వర్జనే ఫల మాహ సఏవ॥ వర్షే వర్షేఽశ్వమేధేన యోయజేతశతం సమాః। మాంసానిచనఖాదేద్యస్తయోః పుణ్యఫలం సమం। ఫల మూలాశనై ర్మేధ్యై అశ్న న్వన్యాని భోజనైః। సయత్ఫల మవాప్నోతి తన్మాంస పరివర్జనాదితి॥

బోధాయనః॥ అమృతాపి ధానమ సీత్యుపరి ష్టాదపః పీత్వా చామ్యోఽభిమృశతి ప్రాణానాం గ్రంథిరసీతి పునరాచమ్య దక్షిణ పాదాంగుష్ఠే పాణినా విశ్రావయతి, అంగుష్ఠ మాత్రః పురుషోఽంగుష్ఠంచ సమాశ్రితః ఇతి మను మంత్రేణ మూర్ధ్వ హస్తం సమాచరేత్॥ శ్రద్ధాయాం ప్రాణే నివిశ్యా మృతం హుతం ప్రాణ మన్నే నాప్యాయస్వ। శ్రద్ధాయా మపానే శ్రద్ధాయాం వ్యానే। శ్రద్ధాయా ముదానే, శ్రద్ధాయాం సమానే నివిశ్యేతి యథా విహిత మనుషం

---

ప్రాణులను జంపునెడ స్వర్గము లభింపనేరదు గావునఁ, మాంస భక్షణము సేయఁగూడదు పశువుల జంప నంగీకరించిన వాఁడు, చంపిన వాఁడు కోసినవాఁడు, అమ్మినవాఁడుకొనినవాఁడు వండినవాఁడు, భుజించిన వాఁడును చేర ప్రాణి వధ దోషమును పొందెదరు॥ ప్రతి సంవత్సరము నశ్వమేధ యాగమును నూరేండ్లు చేసినవాఁడును, మాంసమును భుజింపని వాఁడును సమానమైన పుణ్యఫలము నొందుదురు॥ వనము నందు కందమూల ఫలముల భక్షించు వాఁడేమి ఫలము నొందునో మాంసాహారము పరిత్యజించిన వాఁడునా పుణ్య ఫలము నొందుననియు మనువే చెప్పి యున్నాఁడు॥

భోజనావసానము నందు, అమృతా పిధానమసి యని జలము గ్రహించి, యాచమనము చేసి ప్రాణానాం గ్రంథిరసి, యనుమంత్రము పఠించి నాభిదేశము దాకి, తిరిగి యాచమనము చేసి కుడికాలి బొటనవ్రేలిమీద, అంగుష్ఠమాత్రః పురుషః అనుమంత్రము చదువుచు కుడిచేతితో నుదకము గారఁజేయుచు పైనెత్తవలయును. తరువాత,

గః। బ్రాహ్మణే ఆత్మానం యోజయేత్। న్యాసోపి। తత స్తృప్తస్సన్ అ
మృతాపి ధానమసీ త్యపః ప్రాశ్య తిష్ఠ న్నర్ధం స్నానాగ వస్త్రత్వా విధివ
దాచమే దితి। దేవలః। భుక్త్వోచ్ఛిష్టం సమాదాయ సర్వస్మా త్కించి
దాచమన్। ఉచ్ఛిష్ట భాగధే యేభ్య స్సోదకం నిర్వపే ద్భువి। మార్కం
డేయః। ఉత్తరాపోశనా త్పూర్వం స్వహస్తం క్షాళయే ద్ద్విజః। అర్ధం త్య
జతి గండూష మర్ధం త్యజతి భూతలే। ప్రీణాతి పితర స్సర్వే యాంశ్చా
న్యా భూమి దేవతాః। గండూషార్ధ త్యాగ మన్త్ర మాహ సనవః। రౌర
వే పుణ్యనిలయే పద్మార్బుద నివాసినాం। అర్థినా ముదకం దత్త మక్ష
య్య ముపతిష్ఠతు। ఉత్తరాపోశనా త్పశ్చా త్పాత్రం హస్తే న్నసం
స్పృశేత్। యది స్పృశతి మోహేన సచేలస్నాన మాచరేత్। అపశ్చి
త్యా తతః పశ్చా ద్గండూషాన్ షోడశాచరేత్। విప్రస్య దక్షిణే భాగే
దేవా స్తిష్ఠన్తి యత్నతః। తస్మాదేవ గండూషా న్వామ భాగే విసర్జ
యేత్। శాండిల్యః। మాషాది చూర్ణై ర్మృద్భిర్వా ప్రక్షాళ్య కరయో
ర్ద్వయం। ప్రక్షాళ్య జాను పాదౌచ కాష్ఠై ర్దంతా న్విశోధయేత్। దే
వలః। తస్మి న్నాచమనం కుర్యాత్ యత్ర భాండే౽ధభుక్తవాన్। య

---

శ్రద్ధాయాం అనుమంత్రము చదివి, పదపేళ్ళను వంపుదన్నం గూర్పవలయు। నని బోధా
యనుఁడు చెప్పెను.

ఉత్తరాపోశనము పట్టకముందు చేయిగడుగఁ గూడదు. ఉత్తరాపోశనము గొంతె
బుచ్చుకొని మిగిలిన దానిని క్రిందనే అనుమంత్రము చదువుచు విడువ వలయును. ఉత్తరా
పోశనము బట్టిన తరువాత విస్తరిని తిరిగి తాకగూడదు। అచ్చట నుండి లేచి పదునారుమార్లు
పుక్కిలించి వేయ వలయును।

బ్రాహ్మణుని కుడివైపునను దేవతలుందురు గాన కూర్చుండి పుక్కిలించి జలము
నెడమ వైపునను విడువ వలయును. సెనగపిండి మొదలగు వానిచే చేతులు బాగుగఁ గడిగి
కొని, పాదములను గూడఁగడిగి కొని పుడకలతో దంతములను శోధింప వలయును. అని
శాండిల్యుఁడు చెప్పెను. భుజించినచోటనె యుత్తరాపోశనము చేయ వలయును. ఉత్త
రాపోశనము గ్రహింపక లేచెదు నెడల నప్పుడె స్నానము చేయవలయును. నీరు పుక్కి
లించి వేయునప్పుడు చూపుడు వ్రేలు నోరి లోనుంచకు కొనఁగూడదు.

కృశో వపుః। భుక్త్వా రాజవదాసీత గత్వా శతపదం శనైః। యోగ రత్నాకరే॥ భుక్త్వోపవిశత స్తుందం శయానస్య బలం భవేత్। ఆయుశ్చంక్రమమాణస్య మృత్యుర్ధావతి ధావతః॥ వ్యాసః॥ భుక్త్వాపై సుఖమాస్థాయ తదన్నం పరిణామయేత్। ఇతిహాస పురాణాభ్యాం షష్ఠ సప్తమకౌ నయేత్॥ అష్టమే లోకయాత్రాతు బహిః సంధ్యాం తతః పరం॥ యాజ్ఞవల్క్యః॥ అతిథిం శ్రోత్రియం తృప్తం మాసీమాంతః మనువ్రజేత్। అహశ్శేషం సహాసీత శిష్టైరిష్టైశ్చబంధుభిః॥ అత్రిః॥ దివా స్వాపం నకుర్వీత గచ్ఛేన్నైవ దివా స్త్రియం। ఆయుః క్షయకరీ నిద్రా దివా స్త్రీ పుణ్యనాశినీ॥

తాంబూలభక్షణం

భుక్త్వాచైవ సుఖాసీనః తాంబూలేనాస్య శోధనం। చూర్ణామలక ధాతూనామేకేనాథ విశోధనం॥ సుపూగంచ సుపత్రంచ చూర్ణేన చ సమన్వితం। ప్రదద్యాద్ద్విజ దేవేభ్య స్తాంబూలం చర్వయేద్ద్విజః। ఏక పూగం సుఖారోగ్యం ద్విపూగం నిష్ఫలం భవేత్। అతిశ్రే

---

లయను॥ అట్లు భుజించి ఇతిహాసపురాణములతో ఆఱవది యేడవదియగు భాగములను గడుప వలయును॥ ఎనిమిదవ భాగమున లోకవ్యవహారము చూచికొన వలయును॥ భుజించి తృప్తి నొందిన శ్రోత్రియుఁడైన యతిథిని పొలిమేర వఱకు ననుప వలయును॥ శిష్యులతోను, ఇష్టబంధువులతోను మిగిలిన పగటి కాలమును గడుప వలయును॥ పవలు నిద్రింపఁ గూడదు. పవలు సంభోగము కూడదు పవలు నిద్రించునెడ నాయువు క్షీణించును. పగటి కాలమున సంభోగము పుణ్యమును బోగొట్టును॥

తాంబూలభక్షణము.

భుజించి, సుఖముగాఁ గూర్చుండి, తాంబూలము భక్షింప వలయును॥ మంచిపోకలు, మంచియాకులు, సున్నము ననువానితోఁ గూడిన తాంబూలమును విప్రులకు దేవతలకు నొసఁగి తాను గ్రహింప వలయును॥ ఒక్కపోకను వేసికొను నెడ సుఖము నారోగ్యంబును గలుగును॥ రెండు పోకలు గ్రహించు నెడ నిష్ఫలము॥ మూఁడుపోకలు భక్షింపుట శ్రేష్ఠము॥ ఆకు మొదటి భాగము చివరభాగంబును వ్యాధికరములు॥ సున్నపాకు ఆయు

ష్టం। త్రిపూగంతు జర్ధకం నైవ దుష్యతి। పర్ణమూలే భవే ద్వ్యాధిః ప
ర్ణాగ్రే వ్యాధి సంభవః। చూర్ణపర్ణం హరత్యాయు స్సిరా బుద్ధి వినా
శినీ। తస్మా దగ్రంచ మూలంచ సిరాంచైవ విశేషతః। చూర్ణ పర్ణం
వర్జయిత్వా తాంబూలం ఖాదయే న్నరః। అఖండితంచ క్రముకం పర్ణం
చాప్రక్షాళితం తథా అశోధితం తదా చూర్ణం భక్షయ స్సర్వ దోష
భాక్। అదత్వాయ ముఖే పర్ణం పూగా న్ఖాదతి యో నరః। సప్త జన్మ
దరిద్రస్స్యాత్ నరకేషు నిమజ్జతి॥ ప్రాతః కాలే ఫలాధిక్యం చూర్ణం
మధ్యం దినేధికం। సాయం పర్ణస్య చాధిక్యం త్రిధా తాంబూల భ
క్షణం॥ భావాటః॥ తాంబూలం కటు తిక్త ముష్ణ మధురం క్షారం క
షాయాన్వితం వాతఘ్నం క్రిమినాశనం కఫహరం దేహాగ్ని సందీప
నం స్త్రీసంభాషణ భూషణం రుచికరం శోకస్య విచ్ఛేదనం తాంబూ
లస్యచ మ్యేత్రయో దశ గుణాః స్వర్గేపి తే దుర్లభాః॥

## సాయంకాల కృత్యం॥

సూర్యేస్తశిఖరం ప్రాప్తే పాదశౌచ క్రియాన్వితః। బహిస్సం

---

యుంవు నపహరించును॥ ఆకుయానెలు బద్ధిగించెను మును॥ కా, ఆకు మొదలు, కొన, కూనెలు
తొలగించి, తాంబూలము గ్రహింపవలయు॥ కత్తిరింపని పోకయు, కడుగని తమలపా
కు, రాళ్ళులేకుండునట్లు వడబోయని సున్నము భక్షించునెడ సర్వదోషములు సం
భవించును॥ ముందట ఆకు నోటనిడుకొనియే పోకలు నమలవలయును॥

ప్రాతః కాలమున పోకలెక్కువగానుండు నట్లును, మధ్యాహ్న కాలమున సున్న
ముక్కువగానుండు నట్లును సాయంకాలమున నాకులెక్కువగాను తాంబూలము భక్షిం
పవలయును॥

తాంబూలమునందు కారము చేదు ఉప్పు, తీపి, వగరు ననురసంబులు, ఉష్ణవీర్యంబు
ను, గలదు. గాన నిది వాతమును, కఫమును పోగొట్టును క్రిములను నశింపజేయును, జఠరా
గ్నిఁ బెంపుచేయును. స్త్రీతో భాషించునప్పుడలంకారముగా నుండును. రుచిగలిగించును దుః
ఖమును పోగొట్టును॥ ఇట్లు దీనియందుగల పదుమూడు గుణంబులు స్వర్గమునందును లభింపవు॥

## సాయంకాల కృత్యము

సూర్యుండస్తమయము నొందుచుండగ కుడిగాళ్లు చేతులును సంధ్యావందన మాచ

ధ్యా ముపాసీత కుశతార్ల స్సమాహితః॥ అన్యత్ సంధ్యా గంధాన ... శా మైథున మేనచ। పునాతి స్సమలం స్వాన్నం బహిః స్సంధ్యా హ్యుపాసితా॥ బోధాయనః॥ మేరు కాంచన దానాని వాజపేయ శతానిచ। కన్యా కోటి ప్రదానంచ సమమేం సాయ మాహుతేః॥ శాండిల్యః॥ అన్యైః ప్రభూతైః ర్దేవేశం వివిధైః స్పథగర్పయేత్। సంధ్యయో రుభయోః కర్యా త్పూజాం సర్వోప చారకైః॥ నక్తం కుటుంబికోశ్నీయాత్ హిత పథ్యం సుతృప్తిమత్॥ ఇతి॥ సాయంకాలే ప్రదోషేచ గాయత్రీ జప సంకోచ మాచరంతి కేచిత్॥ తత్ర మూలం మృగ్యం॥ స్మృతి రత్నే॥ ప్రణవ వ్యాహృతీనాంచ గాయత్ర్యా శ్శిరస స్తథా। నిత్య నైమిత్తి కేషు ప్రతేయజ్ఞ వ్రతే తథా। దేవతార్చన మంత్రాణాం నాన ధ్యాయ స్మృత స్సదా। ఋఘ్వేద్యోక్తే సౌరాణాం శ్రాద్ధ మంత్రాణాం పైతృకాణాంచ నైత్యకే। జప హోమాది కార్యేషు నానధ్యాయో నకామ్యకే॥ ఇతి॥

## దీపవిధిః.

రవే రస్తం సమారభ్య యావ త్సూర్యోదయో భవేత్। య

---

తీరిప కలదు॥ ఏటియందు సంధ్యను పాసించువాడు వెయ్యిగోవములు వశించును. మేరుపర్వతము తో తుల్యమైన బంగారము దానము చేసినను, నూరువాజపేయములు, కోటికన్యాదానములు చేసినను సాయంకాలము సేయు నగ్న్యుపాసనకు సమానములు గావు॥ సాయంకాలమున సంధ్యను అగ్న్యుపాసనము చేసికొని పరమేశ్వరుని పూజింపవలయు॥ అట్లుపూజించి, హితముగాను, పథ్యముగాను తృప్తిగా భుజింపవలయు॥ ప్రదోషకాలమున కొందఱు గాయత్రిని జపింపరు. అది ప్రామాణికము గాదు. ఏలన, ప్రణవము, వ్యాహృతులు, గాయత్రి, గాయత్రి, శిరము, వాని నిత్యనైమిత్తి కాదుల యందును దేవతార్చన మంత్రములకును, సూర్యదేవతాకములు, రుద్రదేవతాకములు, పితృదేవతాకములు నగు మంత్రములకును ననధ్యాయము లేదని చెప్పబడియున్నది.

దీపవిధి.

సూర్యాస్తమించినది మొదలుకొని తిరిగి సూర్యోదయము వరకు దీపము నిలిపి

స్యతిష్ఠే ద్గృహే దీప స్తస్య నాస్తి దరిద్రతా।

సాయమపి యనాధికారం మహాపూజాదిక మనుతిష్ఠేత్। సాయమాగతోఽతిథి ర్విశేషేణ సమర్చ్యః। తదుక్తం। దివా తిథౌతు విముఖే గతే యత్పాతకం నృప తదేవాష్ట గుణం పుంసాం, సూర్యేఽస్తే విముఖే గతే ఇతి। విష్ణు పురాణే। పునః పాక ముపాదాయ సాయ మప్యవనిప తే। వైశ్వ దేవ నిమిత్తం వై పత్న్యా సార్థం బలిం హరేత్। ఇతి శౌనకః। నిశాయాః ప్రథమే యామే జపయజ్ఞాచ్చ నాదికం। బ్రహ్మహత్యాపి తత్రైవ వర్జయిత్వాపి భోజనం। దక్షః। ప్రదోష పశ్చిమౌ యామౌ వేదాభ్యాసేన యోజయేత్। యామ ద్వయం శయానస్తు బ్రహ్మ భూయాయకల్పత ఇతి।

శయనవిధిః.

ఆచారసారే। శుచిం దేశం వివిక్తంతు గోమయే నోప లేపయేత్। ప్రాగుద క్ప్రవణే చైవ సంవిశేత్తు యథా బుధః। ప్రాక్శిరాస్తు స్వపన్నిత్యం తథా వై దక్షిణా శిరాః। ఉదక్శిరా న స్వపేత్తు తథా ప్రత్యక్శిరానచ। మహాదేవ గృహే వాపి మాతృ వేశ్మని నస్వపేత్ । నయక్షే

---

యింటి యందు దీపముండునో వానికి దారిద్ర్యము ముండదు। సాయం కాలమునను మహాపూజాదులలో నేదేనొకటి యాచరింప వలయును।

అతిథి నాదరింప కుండు నెడ పగటి పూట కంటె రాత్రి పూటనని మిదిమడుం గులుపాపము కలుగు గాన రాత్రి కాలమున నతిథిని ముఖ్యముగా నాదరింప వలయును। సాయం కాలమునను పునః పాకముతో వైశ్వ దేవము చేసి నక్తంబలి నాచరింప వలయును। రాత్రియొక్క జపయజ్ఞము మొదలగు వానిని రాత్రి ప్రథమ యామమునందే చేయ వలయును। రెండు జాములు కొ— మొదటిజాము, చివరజాము వేదాభ్యాసముతో గడప వలయును. రెండు జాములు మాత్రమె నిద్రింప వలయును. ఇట్లు చేయువానికి మోక్షము లభించును।

శయన విధి.

శుచియగు విజన తమయింటి యందు, తూర్పుదెసను గాని, ఉత్తరపుదెసను గానిపవిత్రమగు విజన ప్రదేశము నందు గోమయముతో నలికి యచట శయ్యనేర్పరుచుకొని, తూర్పుతలగా గాని దక్షిణపుతలగ్గాగాని పండుకొన వలయును। పడమరతలగాను ఉత్తరపుతలగాను పండు

షం కృత్వా ఉదక పూర్ణ ఘటాని మంగళోపేత ఆత్మాభి రుచిరా
మనః ప హతాం సుత్రామాణమితి పఠన్ శయ్యా మధిష్ఠాయ రా
త్రిసూక్తం జపిత్వా శంభుం నమస్కృత్య సర్వాప సర్ప భద్రంతే
ఇతి శ్లోకం జపిత్వా ఇష్టదేవతాం నమస్కృత్య సమాధి మాస్థా యా
న్యాంశ్చ వైదికాన్ మంత్రాన్ సావిత్రీం జపిత్వా మంగళాంశితిం శంఖాం
శ్చ త్రివణాం దక్షిణా శిరా స్స్వపేత్॥

రత్నాకర్యాం॥ మాంగళ్యే పూర్ణ కుంభంతు శిరస్థానే నిధాయ
తు। వైదికై ర్గారుడై ర్మంత్రై రక్షాం కృత్వా స్వపేన్నిశి॥ జరత్కా
రో జరత్కార్వాం సముత్పన్నో మహా యశాః। అస్తీకః సత్య సం
ధో మాం పన్నగేభ్యోభి రక్షతు। నర్మదాయై నమస్తుభ్యం నర్మదాయై
నమో నమః। నమోస్తు నర్మదే తుభ్యం త్రాహిమాం విష సర్పతః॥

సంభోగ విధిః.

ధర్మ ప్రవృత్తౌ॥ ఋతు మత్యాంతు భార్యాయాం తత్ర సంగా

---

యందు తూర్పు తలగాను, మామగారి యింటి యందు దక్షిణపు తలగాను, పరస్థలము
నందు పీలును బట్టి పడమర తలగానైనను పండుకొన వచ్చునుగాని యుత్తరపు తలగా నె
ప్పటను కూడదు॥ కాళ్ళు కడిగికొని ఆత్మరక్షచేసికొని జలపూర్ణ కలశమును శిర
ము వైపున నిడికొని సుత్రామాణం అను మంత్రము జదువుచు శయ్యనధిష్ఠించి రాత్రిసూ
క్తము జపించి, శివుని నమస్కరించి, సర్వాప సర్ప, అను శ్లోకము జపించి, ఇష్టదేవత
ను దలంచుకొని, ధ్యానించి, ఇతర వైదిక మంత్రములను సావిత్రిని జపించి, మంగళ క
రములగు శంఖము మొదలగు వానిని గాంచి దక్షిణపు తలగా పండుకొన వలయును॥
　　పండుకొను నప్పుడు జరత్కారో, అని మొదలగు శ్లోకములను గూడ జపవ
లయును॥ జరత్కారుని వలన జరత్కారువను దాని యందుఁ బుట్టినవాఁడును, మహాకీర్తి
యు, సత్య సంధుండును నగు అస్తీకుఁడు నన్ను పాముల నుండి రక్షించు గాక, నర్మదా
నీకు నమస్కారము చేయుచున్నాను. నీవు నన్ను సర్పవిషము నుండి రక్షింపుము, అని
యీ శ్లోకముల యర్థము.

సంభోగవిధి.

భార్యయు ఋతుస్నాత యైన తరువాత సంగమము నాచరింపవలయును॥ గర్భాధా

దికం చరేత్। అనృతుమత్యాంతు భార్యాయాం నసంగమిష్టే చవా। గర్భాధానాంగభూతం యత్కర్మ కుర్యాద్ద్వివైవహి। రాత్రౌకుర్యాద్ద్వి ధానేవగర్భే బీజస్య రోపణం। మూత్రాదికం తతః కృత్వా యోనింప్రక్షాళయే ద్ద్విజః। పూర్వరాత్రే వ్యతీతేతు సంగచ్ఛే ద్రతిమందిరం। పాదౌ ప్రక్షాళయేత్పూర్వం పశ్చా చ్ఛయ్యాం సమావిశేత్। మృదుశయ్యాం స్థితశ్చైతే రక్తశయ్యాం పరిత్యజేత్। ఉపానహౌ వేణుదండ ముదకపాత్రం తథైవచ। తాంబూలాదీని సర్వాణి సమీపే స్థాపయే ద్బుధః। కుంకుమం చాంజనం చైవ తథా హారిత సింధురేః ధౌతవస్త్రంచ తాంబూలం సంయోగేతు శుభావహం। భర్తుః పాదౌ నమస్కృత్య పశ్చా చ్ఛయ్యాం సమావిశేత్। సానారీ సుఖమాప్నోతి నభవేద్దుఃఖభాగినీ। స్వపేత్ స్త్రీ ప్రాక్శిరః కృత్వా ప్రత్యక్ శ్చాపదౌ ప్రసారయేత్। తాంబూలచర్వణం కుర్యాత్సకామో భార్యయా సహ। తాంబూలేన ముఖం పూర్ణం కుంకుమాది సమన్వితం। పతి మాహ్లాద సంయుక్తం కృత్వా యోగం సమాచరేత్। దీపే నష్టేను య

---

నాంగమగు స్మార్త కర్మమునవలు దీర్చుకొని (గాత్రి) కాలమున సమాగమము నొనరింపవలయును. పాదప్రక్షాళనము చేసికొని, మెత్తనిశయ్య మీద పండుకొనవలయును. పాదరక్షలు, వెదురుకఱ్ఱ, ఉదకపాత్రము, తాంబూలము మొదలగువాని శయ్యను సమీపమున నుంచవలయును. కుంకుమము, కాటుక, పసుపు, సిందూరము, తెల్లని వస్త్రము తాంబూలము ననునివి సంయోగకాలమున శుభకరములగును. భార్య భర్తయొక్క పాదములకు నమస్కారము చేసి తరువాత శయనమున నధిష్ఠించి తూర్పుతల గాపుడు కొనవలయును. దంపతులు కుంకుమపువ్వు మొదలగు వస్తువులతో గూడ తాంబూలము వేసికొని పరస్పరానురాగము గలవారై యానందముతో గలియవలయును. దీపము లేనప్పుడు సమాగమము కూడదు. ఇట్లు, ఋతుకాలమునందు భార్యతో సమాగమము గావించువాడు ఉత్తమగతి నొందును. ఇట్టి సంగమమువలన గలిగిన పుత్రుడు పితరులకు స్వర్గము నొసంగగలుడు. ఋతుస్నాతయైన భార్యను తానారోగ్యవంతుఁడై దగ్గఱనున్నప్పుడు కలియకుండు నెడ వానికి భ్రూణహత్యాదోషము కలుగును. ఋతుస్నానము చేసిన భార్య భర్తను గూడకుండు నెడ నరకము నొందును. ఈ కామయజ్ఞము గృహస్థులకే విహితమైనది.

స్సంగరం కరోతి మనుజో యది। యావజ్జన్మ దరిద్రత్వం సంప్రాప్తే ర్నాత్ర సంశయః॥ ఋతుకాలాభి గామీతు ప్రాప్నోతి పరమాం గతిం। స త్కులః ప్రభవే త్పుత్రః పితౄణాం స్వర్గదో భవేత్॥ ఋతుస్నాతాం తు యో భార్యాం సన్నిధౌ నోపగచ్ఛతి। ఘోరాయాం భ్రూణ హత్యాయాం పితృభి స్సహ మజ్జతి॥ ఋతు స్నాతాతు యానారీ పతిం నైవోప విన్దతి। తాదృశం నరకం ఘోరం విధవాచ పునః పునః। కామ యజ్ఞ మితి ప్రావాః గృహిణా మేవ సర్వగా। అనేన లభతే పుత్రం సంసారార్ణవ తారకం। తావుభా వశుచీ స్యాతాం దంపతీ మైథునం గతౌ॥ శయనా దుత్థితా నారీ శుచి స్స్యాదశుచిః పుమాన్। ఋతౌతు గర్భకం కృత్వా స్నానం మైథుని నస్స్మృతం॥ అనృతౌతు యదాగచ్ఛే చ్ఛౌచం మూత్ర పురీష వత్॥ ఇతి॥

## ఫలశ్రుతిః.

మనుః॥ వేదోదిత స్వకర్మాణి యథా కుర్యా దతంద్రితః। తథా కుర్వ న్యథా శక్తి ప్రాప్నోతి పరమాం గతి మితి॥ వ్యాసః॥ ఇత్యేత దఖిలే నోక్త మహన్యహని వై మయా। బ్రాహ్మణానాం కృత్యజాత మపవర్గ ఫల ప్రదం। నాస్తిక్యా దథ వాలస్యాత్ బ్రాహ్మణో నకరోతియః॥

---

దీనిని ననుష్ఠించు వారు సంసారము నుండి తరింపఁ జేయఁ జాలుపుత్రుని బడయుదురు॥ సంయోగము నాచరించిన దంపతు లపవిత్రులగుదురు. అయినను స్త్రీ పరుండి లేవగనె పవిత్రురాలగును. పురుషుండంత మాత్రమున పవిత్రత నొందఁడు. ఋతుకాలము న భార్యను గలిసినప్పుడు స్నానము చేసిననె పురుషుఁడు పవిత్రుఁడగును॥ తక్కు కాలము నందు మూత్రపురీషముల విడిచినప్పుడు చేసికొని నట్లు శౌచము నాచరింప వలయు॥

## ఫలశ్రుతి.

వేదము నందు తననరా శ్రమములకుపవిహితము లైనధర్మముల నాచరించు వాఁడు శ్రే...మగతి నొందునని మనువు చెప్పెను॥ నేనుచెప్పిన యాహ్నికవిధి ననుష్ఠించిన వారు ముక్తి నొందుదురు నాస్తిక్యము వలనగాని, ఆలసతవలనగాని యాచరింపని ద్విజుఁడు నరకము నొందునని వ్యాసుఁడు చెప్పెను॥ నేనుచెప్పిన యాహ్నిక విధి నను ష్ఠించిన వారు ....

సయాతి నరకాన్ఘోరాన్ కాక యోనిషు జాయతే॥ ఇతి॥ మకుటోత్తరే
ఉక్తం మయా కృత్య జాత మాహ్నికం ముక్తిప్రదం। యేనరా నానుతి
ష్ఠన్తి తేయాన్తి నరకాన్ప్రభూతానితి॥

ఇతి

శ్రీ నాగలింగారాధ్య విరచితే- ధర్మసంగ్రహే

ఆహ్నిక ధర్మకాండో నామ ద్వితీయః

పరిచ్ఛేదః పరమేశ్వరకృపయా

సంపూర్తి మగమత్.

శివం.

---

ముక్తి నొందుదురు. ఆచరింపని వారు నరకముల నొందుదురని పరమేశ్వరుడు చెప్పె
మకుటోత్తరమను దివ్యాగమమున గలదు.

ఇది.

ధర్మ సంగ్రహమున- ఆహ్నిక కాండము

అను- రెండవభాగము

ముగిసెను.

శివము.





